# భారతీయ సంస్కృతిలో స్త్రీ

కత్తి పద్మారావు

లోకాయత ప్రచురణలు

# భారతీయ సంస్కృతిలో స్త్రీ

లోకాయత ప్రచురణలు నెం. 24

ప్రథమ ముద్రణ : 1993 జూన్



రచయిత :

కత్తి పద్మారావు

కవర్ పేజి : శ్యామ్ మోహన్

సాదా ప్రతి రూ. 35-00

మేలు ప్రతి రూ. 70-00

కాపీలకు :

కె. చార్వాకుడు
లోకాయత ప్రచురణలు
లుంబినివనం
అంబేడ్కర్ కాలనీ
పొన్నూరు - 522 124
గుంటూరు జిల్లా

ముద్రణ : సృజన ప్రింటర్స్ - పొన్నూరు

# ముందుమాట

ఆర్యులు భారతదేశానికి రాకముందు ఆది భారతీయుల సంస్కృతి మాతృస్వామికమైనది. ఆర్యులు పితృస్వామిక సంస్కృతిని భారతదేశానికి వలసతెచ్చారు. ఆనాటి నుండి స్త్రీమీద పురుషపెత్తనం ప్రారంభమైంది. ఆపెత్తనం మానవతారహితంగా అన్నిరంగాల్లో అన్నిదిశలుగా సాగుతుంది.

జంతుప్రపంచంలో ఎక్కడా పురుషాధిపత్య సమాజాలు లేవు. ఒక్క మానవ సమాజంలోనే ఒకానొక చారిత్రిక పరిస్థితుల్లో పురుషాధిపత్య వ్యవస్థలు రూపొందాయి. అందునా భారతసమాజంలో ఈ అణచివేత కర్కశంగా సాగింది.

ఈ భారతసమాజ స్వరూప స్వభావాన్నంతటిని మనంపరిశీలించటం వలన పురుషాధిపత్య భారత సంస్కృతిని, దాని పునాదిని కూల్చగల్గుతాం. ఈవ్యవస్థను అర్థంచేసుకొని స్త్రీ విముక్తికి శాస్త్రీయంగా పోరాడగలుగుతారు.

ఈపురుషాధిపత్యాన్ని నిర్మూలించడంద్వారా తప్ప మనం కోల్పోయిన మానవ విలువలను సాధించలేము. కులాధిపత్య, వర్గాధిపత్య, పురుషాధిపత్య భారత సమాజానికి వ్యతిరేకంగా పోరాడేశక్తులకు హిందూ వ్యవస్థ వేళ్ళు ఎంతలోతుగా అల్లుకున్నాయో ఈ గ్రంథం ఒక అవగాహనను కలిగిస్తుంది.

ఈ గ్రంథం వ్రాయడానికి ఒక దశాబ్దం పట్టింది. ఈ గ్రంథరచన వల్ల నాకు భారతసమాజాన్ని లోతుగా అధ్యయనం చేయటానికి అవకాశం కలిగింది. ఈ గ్రంథరచనకు ప్రధానంగా కన్నెమెరా లైబ్రరీ (మద్రాసు), రీజనల్ లైబ్రరీ (గుంటూరు), వేంకటేశ్వర యూనివర్శిటీ లైబ్రరీ (తిరుపతి), ఆంధ్రాయూనివర్శిటీ లైబ్రరీ (విశాఖపట్టణం) శ్రీభావనారాయణస్వామి గ్రంథాలయం (పొన్నూరు), తిరుపతి ఓరియంటల్ కాలేజి మాజీ ప్రిన్సిపాల్ శ్రీడి.నాగసిద్ధారెడ్డిగారి పర్సనల్ లైబ్రరీ లోని గ్రంథాలు నాకు ఉపకరించాయి.

# విషయసూచిక

# అంకితం



నాకు జన్మనిచ్చి
నాకు స్ఫూర్తినిచ్చి
నన్ను వెన్నంటి ఈనాటికివున్న

**మా అమ్మ**

మాణిక్యమ్మకు—

# చరిత్ర రచనలో – స్త్రీ

మానవ చరిత్రకే పునాదియైన స్త్రీకి చరిత్ర రచనా ప్రణాళికలోనే స్థానం లేకుండా పోయింది. చరిత్రకారుడు కేవలం సంఘటనల సముచ్చయకర్తగానే చాలా కాలం కొనసాగుతూ వచ్చాడు. చరిత్రకారునికి సమాజ పరిశీలన పట్ల, సామాజిక మార్పుపట్ల బాధ్యత లేదనే వాదమే చాలా కాలం చెల్లుతూ వచ్చింది.

ముఖ్యంగా భారతదేశ చరిత్ర రచనను ప్రారంభించిన వలసవాదులు భారతదేశ ఆధ్యాత్మిక సంస్కృతిని పరిశీలన లేకుండా ఒక ప్రక్క స్తుతిస్తూ, మరొక ప్రక్క భారతదేశ ఉపరితలాన్ని పాలకవర్గాలకు అనుకూలంగా మలిచే రీతిలో వ్యాఖ్యానించారు. పాశ్చాత్య చరిత్రకారులు సంస్కృత సంస్కృతిని ఆకాశానికెత్తారు. రొమిల్లా థాపర్ అన్నట్లుగా "సంస్కృతం చదివిన వాళ్ళు ఆర్య భాషలు మాట్లాడే ప్రజల సంస్కృతిపై గొప్ప ఉత్సాహం కనబరిచారు. ఇండో-యూరోపియన్లు ఆదిమ జన్మభూమి ఒకటేనని; ఆర్య, గ్రీకు సంస్కృతుల ప్రాచీన జనకులు ఒకరేననీ వీరు సిద్ధాంతం చేశారు. ఆర్యులను ఆయా భాషలు మాట్లాడిన ప్రజలుగా కాకుండా, ఒక జాతిగా భావించారు. భారతదేశంలో జీవించిన ఆర్యసంస్కృతికి, ఐరోపాలో వర్ధిల్లిన గ్రీకు సంస్కృతికి మధ్య సంబంధం కలపాలని ప్రయత్నించారు. వైదిక యుగాన్ని ఆకాశానికెత్తారు. ఆయా కాలాల్లో వచ్చిన ఘర్షణలను మభ్య పెట్టారు. గొప్ప విషయాలను నొక్కి చెప్పారు. వేదాలు గొప్పవనీ, వాటికి సంబంధించిన వన్నీ గొప్పవనీ సాంప్రదాయక హిందువులు ఎలాగూ నమ్ముతారు. కనుక వారి దృక్పథానికి ఇది సరిగ్గా సరిపోతుంది."[1] వైదిక సంస్కృతీ వైభవస్తుతిని పాశ్చాత్యులు ప్రారంభించారు. ఈ విధంగా చరిత్ర రచనలో పితృ

---

1 చరిత్ర రచనలో మతతత్వం- 6వ పేజి

స్వామిక తత్వం చోటు చేసుకున్నది. స్త్రీని అణగ ద్రొక్కే విధానానికీ, అలంకారికంగా వర్ణించే పద్ధతికి, స్త్రీని భోగ వస్తువుగా వర్ణించే రీతికి చరిత్రకారులు పట్టం గట్టినట్లు మనకు అవగతనువుతూ వుంది. చరిత్ర రచనకు ఆధారాలైన సాహిత్య సరమైన వేదాలు, ధర్మశాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు అన్నీ భారతదేశంలో పితృస్వామిక ఆధిపత్య పూర్ణములై స్త్రీని అణగ ద్రొక్కేవిగా ఉన్నప్పుడు వాటిని ఆధారం చేసుకున్న చరిత్ర రచనలో నామమాత్రంగా చోటుచేసుకున్న స్త్రీ ఆ దృక్పథంతోనే చిత్రించ బడింది. పురావస్తు ఆధారాలలో రాచరికపు కోటలు, దేవాలయల మీద చెక్కిన బూతు బొమ్మలు, చిత్రవిచిత్ర భంగిమల్లో శిల్పించిన స్త్రీ ప్రతిమలు, భవనాలు, నాణాలు స్మారక చిహ్నాలు, మట్టిపాత్రలు, రాతి పనిముట్లు, బొమ్మలు, లోహ పరికరాలు వీటన్నిటిలో స్త్రీకి సంబంధించిన సరైన సమాచారం తక్కువ. దొరికిన వాటిలో స్త్రీని భోగ వస్తువుగా చూపినవే ఎక్కువ. స్త్రీని ఆనాటి సామాజిక వ్యవస్థకు ప్రతీకగా చూపించేవి తక్కువ. ఈ దృష్టితో చూసినప్పుడు మాక్స్‌ముల్లర్, మిల్ వంటి పాశ్చాత్య చరిత్రకారులు మొత్తం భారతీయ సామాజిక వ్యవస్థకే అన్యాయం చేశారు. ఇక స్త్రీ విషయంలో వారి ఉపేక్షా భావం వర్ణించడానికే వీలులేనట్టిది. అదే పద్ధతిలో రచన సాగించిన భారతీయ చారిత్రక రచయితలను గురించి ప్రసిద్ధచరిత్రకారుడు బిపిన్ చంద్రపాల్ ఇలా అంటున్నారు—

"19 వ శతాబ్ది మధ్య కాలం నుంచి పలువురు భారతీయ చరిత్రకారులు రంగంలో ప్రవేశించారు. ఈ అగ్రగాములు విషయ పరిజ్ఞానంలో లోతులు ముట్టిన వాళ్ళు, విషయ సేకరణలో గొప్ప సూక్ష్మబుద్ధిగలవారు చారిత్రకాధారాల పరిశీలనలో చారిత్రక వివరాల ధృవీకరణలో ఉన్నత ప్రమాణాలు కలిగిన వాళ్ళు. వలస విద్యా విధానంలో అక్షరాలు దిద్దుకుని బలవత్తరమైన వలస సంస్కృతీ ప్రభావానికి గాఢంగా గురయిన ఈ చరిత్రకారుల్లో చాలమంది అదే సమయంలో సమకాలీన జాతీయోద్యమం చేత కూడా ప్రభావితులయ్యారు. వాళ్ళలో చాలా మంది సామ్రాజ్యవాద చరిత్రకారుల అడుగుజాడల్లో నడిచారు."[1]

---

1 చరిత్ర అంటే ఏమిటి ? - పీఠిక

అందువల్లనే భారత చరిత్రకారులు కూడా భారత దేశాన్ని మత పరమైన యుగ విభజనతోనే అంగీకరిస్తూ, భారతదేశ సామాజిక ఆర్థిక పరిస్థితులు, పరిణామాల విషయంలో ఉపేక్ష వహించారు. జాతీయవాదు లైన రచయితలు కూడా గతాన్ని ఆకాశానికెత్తారు. భరత భూమిని 'వేదభూమ'ని 'పుణ్య భూమ'ని కీర్తించటం తప్ప సామాజిక వ్యవస్థ మీద పరిశీలనా దృష్టిగానీ, స్త్రీయొక్క సామాజిక సాంస్కృతిక స్థితిని చిత్రించటం కూడా చరిత్రకారుని బాధ్యతని కానీ గుర్తించిన వారు వీరిలో తక్కువ. ఒకపక్క సామ్రాజ్య వాదాన్ని వ్యతిరేకించిన జాతీయవాదు లైన కె. పి. జైస్వాల్, పి. యన్. బెనర్జి, బి. కె. సర్కార్, యు. యన్. ఘోషాల్, డి. ఆర్. భండార్కర్ వంటి చరిత్రకారులు కూడా స్త్రీకి సంబంధించిన అసమానతలను వివరించే విషయంలో సరైన అవగాహన కలిగి లేరు. గత వైభవ ప్రాభవాలకు దివిటీ పట్టడం మీదవున్న దీక్ష వీరికి సామాజిక అసమానతల మీద కానీ, స్త్రీ వ్యక్తిత్వ నిరూపణ మీద కానీ లేదు.

అగ్రవర్ణ ఆధిపత్యం, కులతత్వ సమర్ధనం, అస్పృశ్యతను నిరసించక పోవడం, స్త్రీ బానిసత్వ సమర్ధనం ఆనాటి చరిత్రలో మనకు అవి భాజ్యంగా కనిపిస్తున్న అంశాలు. భారతదేశ పాలక వర్గాల చరిత్రలో పాలక వర్గాలకు ఊడిగం చేసే భావ సంచయమే ఎక్కువగా ఆనాడు చోటు చేసుకుంది.

మాతృస్వామిక చరిత్రను రూపొందించడంలో ఎన్నో ఆటుపోటులకు గురియై గొప్ప పరిశోధనను గావించిన బ్రిఫాల్ట్ తన ప్రసిద్ధమైన పరిశీలనాత్మక గ్రంథం "ది మదర్స్" కు ముందు మాట వ్రాస్తూ .... భారత దేశంలోనే కాకుండా అసలు మొత్తం ప్రపంచ వ్యాప్తమైన స్త్రీ విషయ పరిశీలనలోను, స్త్రీకి సంబంధిచిన చరిత్రలోను సామాజిక శాస్త్రంలోనూ పక్షపాత వైఖరి ఉన్నట్లు వ్యాఖ్యానించాగు.

"మానవ సామాజికాభివృద్ధిలో ప్రాథమికమైన ప్రభావాన్ని చూపించిన స్త్రీ మూర్తిని గురించి ఎందుకు నిర్లక్ష్యం చేశారో అనూహ్యంగా ఉంది.

"స్త్రీ యొక్క ప్రాకృతికమైన భావోద్వేగాలు పురుషుల కంటే సమాజాన్ని ఎక్కువ ప్రభావితం చేస్తున్న విషయాలను పరిశోధించినపుడు నేను చాలా ఆశ్చర్య చకితుడ్ని అయ్యాను. అందుకే నేను మాతృస్వామిక సిద్ధాంతపు వెలుగులో సామాజిక పరిణామం మొత్తాన్ని మానవ సంస్థను సాంప్రదాయాలను పరిశీలించాను.

"చరిత్రకారులు మరింతగా స్త్రీ విషయంలో ఉపేక్షా భావాన్ని వహించారు. వారు తమ పితృస్వామిక వాదానికి సరైన ఉపపత్తులను కూడా చూపలేక పోయారు. అనేక సందర్భాలలో వారు వాస్తవాలను వక్రీకరించారు.

"పరిణామ వాదులు మానవ శాస్త్ర ఊహాగాన పరిధి నుండి బయటకు వెళ్ళి జంతు ప్రపంచం లోకి చూస్తే పితృస్వామిక వ్యవస్థయొక్క ఆధారాలు అందులో ఏమీలేవు. (To the evolutionist who goes deyond anthropological speculation, it cannot but appear notably that no trace of patriaichel organrsation is to be found in animal world) మానవ సమాజ ఉత్పత్తి జంతు ప్రపంచం నుండే అభివృద్ధి చెందిందనే విశ్వాసం కూడా మాతృస్వామిక మయినదే. ఈ దృక్పథంతో ప్రాచీన ప్రాథమిక సామాజిక లక్షణాల ఆధారంగా సామాజిక మానవ శాస్త్ర సమస్యలను తిరిగి పరిశీలించ వలసిన అవసరం ఏర్పడింది. పురుషుని యొక్క స్పందన - ప్రతి స్పందనల సమన్వయాన్ని ఈ దృక్పథంతో చర్చించాను. స్త్రీల మానసిక దృక్పథాలను అభిరుచులను తృప్తికరంగా చర్చించ వలసిన ఆవశ్యకత చరిత్రకారులకు ఉంది. సామాజిక మానవ శాస్త్రం, సామాజిక సంప్రదాయాల చరిత్ర ఇంతకు ముందు పితృస్వామిక అహంకారం నుండి పరిశీలింప బడినవి. స్త్రీలకు సంబంధించిన విషయాలను కొందరు నాశనం చేశారు.

"పితృస్వామికతకు చరిత్రలో ఉన్న వైవిధ్యాన్ని ఉపేక్ష చేయడానికి వీలులేదు. వాటి వైరుధ్యాలకు కారణాలను నిగ్గు తేల్చడంలోనే చరిత్రకారుల బాధ్యత ఇంకా స్పష్టం కావలసి ఉంది."

"మాతృస్వామిక వ్యవస్థను పరిపూర్ణంగా చర్చించాలంటే మొత్తం సామాజిక వ్యవస్థను పూర్ణంగా దృశీకృతం చేసుకోవాలి. ఏ భాగాన్ని మనం వొదిలినా విషయానికి అంగవైకల్యం కలుగుతుంది."

రాబర్ట్ బ్రిఫాల్ట్ వ్యాఖ్యానం శాస్త్రీయమైనది. తన సుదీర్ఘ పరిశీలనా ప్రయాణంలో తాను గడించిన అనుభవాల సారం నుంచి సామాజక చరిత్రలో స్త్రీకి జరిగిన అన్యాయానికి దర్పణం పట్టడం జరిగింది.

అయితే ప్రపంచంలో అభివృద్ధి చెందుతున్న ఉన్నత భావాలు, భౌతిక భావాలు, భౌతిక వాదం, గతి తార్కిక భౌతిక వాదం, హేతువాదం, మానవతావాదం, మనస్తత్వ శాస్త్రాలు చరిత్రలో అనివార్యమైన మార్పును తీసుకు వచ్చాయి. వాటి ప్రభావం భారతదేశ చరిత్ర రచన మీద కూడా పడింది. సాంఘిక దృక్పథంతో భారతదేశాన్ని పరిశీలించిన సాంఘిక చరిత్ర నిర్మాత డా॥ బి.ఆర్. అంబేద్కర్, ఆ తరువాత వాస్తవ చరిత్ర దృక్పథం నుండి సమాజాన్ని విశ్లేషించిన సాంఘిక చరిత్రకారులు ఎందరో సామాజిక విశ్లేషణలో మార్పు తీసుకువచ్చారు.

సమాజాన్ని పరిశీలించడమంటే పాలక వర్గాలను పరిశీలించడమే నన్న భావం సన్నగిల్లింది.

స్వతంత్ర పోరాట కాలంలో జరిగిన అనేకమైన పరిణామాలు నూతన చరిత్ర కారులను ప్రభావితం చేశాయి. ప్రపంచ చారిత్రక అవగాహన, భారతీయ సామాజిక వ్యవస్థపై సరైన దృక్పథం, గతి తార్కిక భౌతికవాద విశ్లేషణ చరిత్రకారులను పీడిత వర్గాల వైపు మలిచాయి.

ఆధునిక చరిత్రకు కొత్త పునాదులు సమకూర్చిన డి. డి. కొశాంబి చారిత్రక పరిశీలనలోనూ, రచనలోనూ గతితార్కిక భౌతిక వాదాన్ని సమన్వయించాడు. ఎ. జె. సయ్యద్, కొశాంబి చారిత్రక పరిశీలనా పద్ధతిని విశ్లేషిస్తూ.... "It was however with Kosambi's "An Introduction to the study of Indian History (1956), that historians

focussed their attention more keenly on modes of production at a given level of development to understand the relations of production economic, social and political while keeping his approach firmly with in the Marxist tradition of social analysis, Kosambi developed a new approach and introduced new perspectives to the understanding of Indian History a fundamental change both in content and methodology. It was through his rejection of the mechanical application of Historical Materialism that Kosambi saved his contemporary Marxist scholars from becoming a prey to Vulgar Marxism"[1]

భారతదేశ చారిత్రక రచనలో కోశాంబి ప్రవేశ పెట్టిన గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథంతో కూడిన రచనా పద్ధతికి మార్క్స్, ఏంగెల్స్ మూల పురుషులు. వారు వారికి ముందు రచించబడిన భౌతిక దృక్పథంతో కూడిన మోర్గన్ జీవశాస్త్రానికి డార్విన్ పరిణామ సిద్ధాంతం ఎంత ముఖ్యమో ఆర్థిక శాస్త్రానికి మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతము ఎంత ముఖ్యమో నాగరిక ప్రపంచంలో కనిపించే తండ్రి పరంపర గణాలకు పూర్వం తల్లి పరంపర గణాలు ఉండేవని మోర్గాన్ కనిపెట్టిన విషయం కూడా అంతే ముఖ్యము. (మోర్గాన్ రాసిన ప్రాచీన సమాజంకు ఏంగెల్స్ పీఠిక నుండి) "ప్రాచీన సమాజం" అనే పుస్తకాన్ని చారిత్రక భౌతికవాద దృక్పథంతో విశ్లేషించారు. "కుటుంబం, వ్యక్తిగత ఆస్థి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక" అనే గ్రంథాన్ని మార్క్స్ రాసుకున్న నోట్సు ఆధారంగా ఏంగెల్స్ వ్రాస్తూ ఉపోద్ఘాతములో ఈ విధంగా వివరించారు.

"భౌతికవాద దృక్పథం ప్రకారం చెప్పాలంటే మిగిలినదాని మాట ఎలావున్నా తక్షణం జీవితంయొక్క ఉత్పత్తి క్రమమే చరిత్రను నడిపిస్తుంది. ఈ ఉత్పత్తి క్రమం ద్వివిధం. ఒకటి జీవితావసరము అయిన

---

1) "D. D. Kosambi on History and Society : Problems of Interpretation "Department of history university of Bombay Publication. Edited by A, J. Syed, (Preface Page 1, 2)

ఆహారం, బట్టలు, ఇళ్లు, అవసరములైన పనిముట్లు మొదలయిన వస్తువుల ఉత్పత్తి రెండోది. ప్రజోత్పత్తి, జాతియొక్క విస్తృతి, ఒక చారిత్రిక దశలో ఒక దేశంలో వున్న సామాజిక వ్యవస్థ. ఈ ద్వివిధ ఉత్పత్తి క్రమాన్ని బట్టి ఉంటుంది. పని పద్ధతులు అభివృద్ధి పొందనప్పుడు మొత్తం ఉత్పత్తి తక్కువగానే వుంటుంది. అంటే సమాజంలోని సంపద తక్కువగా వుంటుంది. ఈ దశలోని సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుష సంబంధాలు ప్రాబల్యం అధికంగావున్నా, ఈ సామాజిక వ్యవస్థ లోపలనే మానవుని శ్రమ చేయగల ఉత్పత్తి క్రమంగా పెరుగుతుంది. దానితోపాటు వ్యక్తి గత ఆస్తి, మార్పిడి, ఐశ్వర్యంలో హెచ్చు తగ్గులు, ఇతరుల శ్రమ శక్తిని ఉపయోగించుకో గల అవకాశాలు ఎక్కువవుతాయి. వర్గ వైరుధ్యాలకు పునాది ఏర్పడుతుంది. సమాజంలో తల ఎత్తిన నూతన శక్తులు కొన్ని తరాల సమాజ వ్యవస్థను నూతన పరిస్థితులకు అనుగుణంగా చక్కదిద్దేందుకు ప్రయత్నం చేస్తాయి. కాని ఆ రెంటికీ పొసగదు. దానితో పూర్తి విప్లవం వచ్చేస్తుంది. నూతనంగా సమాజంలో వృద్ధి పొందిన వర్గాల ఘర్షణలో స్త్రీ పురుష సంబంధాల మీద ఆధారపడివున్న సమాజం విస్తృతంగా పెరిగి పోయింది. దాని స్థానములో రాజ్యాలుగా ఏర్పడిన నూతన సమాజం ఆవిర్భవిస్తుంది. ఈ నూతన సమాజంలోని యూనిట్లు స్త్రీ పురుష సంబంధాల మీద ఏర్పడిన సమూహాలు కాదు, ప్రాంతీయ జన సమూహాలు. ఈ సమాజం కుటుంబ వ్యవస్థపై ఆధారపడి ఉంటుంది. ఈనాటి వరకూ మనకు లభిస్తున్న లిఖిత చరిత్ర—వర్గ వైరుధ్యాల పోరాటాల చరిత్ర. ఆ వర్గ వైరుధ్యాలూ పోరాటాలూ ఈ నూతన సమాజంలో యధేచ్ఛగా పరిణితి పొందుతాయి.

లిఖిత చరిత్రకు వెనుకనున్న ఆదిమ చరిత్రలోని ప్రధానాంశాలను కనిపెట్టి, మోర్గాన్ వాటిని క్రమరూపంలో పెట్టాడు. ప్రాచీన గ్రీకు రోమన్, జర్మన్, చరిత్రలో అపరిష్కృతంగా మిగిలిపోయిన అతి ముఖ్యములైన సమస్యలకు సమాధానాన్ని ఆయన ఉత్తర అమెరికాలోని ఇండియన్ తెగల దాంపత్య ముఠాల జీవిత పద్ధతుల్లో కనుక్కొన్నాడు. అదే ఆయన గొప్పతనం. అయన ఒకరోజు పాటు కూర్చొని వ్రాసేసిన పుస్తకం కాదిది. 40ఏళ్ళ పాటు తీవ్రకృషిచేసి విషయాలన్నిటినీ

కరతలామలకం చేసుకొని వ్రాసిన పుస్తకమది. మన రోజుల్లో వెలువడిన ఉత్తమ పుస్తకాల్లో అదొకటి అనడానికి కారణం ఇదే."

చరిత్రను వర్గ దృక్పథంతో విశ్లేషించే పద్ధతిలోనే వ్యవస్థయొక్క వాస్తవ స్వరూపం, దానితో స్త్రీకి ఉన్న స్థానం పరిస్ఫుటమైనాయి.

చరిత్రను మార్క్సిజం దృక్పథం నుండి వ్రాయటం ప్రారంభమైన తర్వాత చరిత్ర పరికరాలు కూడా మారినాయి. ఉత్పత్తి శక్తుల ఉత్పత్తి సంబంధాలపై చారిత్రకుడి దృష్టి చొచ్చుకు పోయింది. భారతదేశ చారిత్రక రచనా క్రమంలో వచ్చిన ఈ మార్పు భారతదేశంలో స్త్రీ స్థానాన్ని నిర్ణయించడంలో కూడా గణనీయమైన మార్పుకు దారితీసింది. డి.డి. కొశాంబి, ఆర్. యస్. శర్మ, ఇర్ఫాన్ హబీబ్, రొమిల్లా థాపర్ వంటి చరిత్రకారులు సమాజ గర్భంలోకి చొచ్చుకొనిపోయి సామాజిక సమస్యలను, సంబంధాలను వైరుధ్యాలను, సంఘర్షణలను, శాస్త్రీయమైన పద్ధతిలో అవగాహన చేసుకొని ఆక్రమంలోనే స్త్రీకి సంబంధించిన విషయ విశ్లేషణను చేశారు. ఈ పద్ధతిలో భౌతికవాద తత్వశాస్త్రాన్ని రచించిన దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ భారతదేశంలో స్త్రీకి సంబంధించి ఎంతో పరిశోధనతో కూడిన సమాచారాన్ని లోకానికి అందించారు. సామాజిక వ్యవస్థలోతుల్లోకి వెళ్ళి సాంఘిక ఆర్థిక రాజకీయరంగా లన్నిటిని పరిశీలించి డా॥ బి. ఆర్. అంబేడ్కర్ స్త్రీ చరిత్ర నిర్మాణంలో అద్వితీయ కృషిగావించి వీరందరికి మార్గదర్శకుడయ్యాడు. స్త్రీని ప్రధాన కేంద్రంగా చేసుకొని భౌతిక దృక్పథంతో సాగిస్తున్న ఈ నాటి చారిత్రక, తాత్విక, ఆర్థిక పరిశీలన శాస్త్రీయమైనది. దీనికి భిన్నమైన పితృస్వామిక భావవాద పాలకవర్గ దృక్పథంతో కూడిన చరిత్ర మరొక ప్రక్క సాగుతూనే ఉంది. అయితే ఆ చరిత్రను అధిగమించి తరతరాల చరిత్రలో స్త్రీ స్థానాన్ని శాస్త్రీయ పద్ధతినుంచి నిరూపిస్తూ భారత సామాజిక వ్యవస్థలో మాతృస్వామికతకు ఉన్న ప్రాధాన్యాన్ని వివరిస్తూ యింకా లోతైన అధ్యయనంతో చారిత్రక రచన సాగవలసి ఉన్నది. సమకాలీన సమాజంలో భూస్వామ్య సంస్కృతిలో అస్పృశ్యతకు, వెట్టిచాకిరికి గురౌతున్న దళిత స్త్రీ, తరతరాల గణవ్యవస్థల, మాతృస్వామిక వ్యవస్థల

సంస్కృతుల్లోనే జీవిస్తున్న గిరిజన స్త్రీ, పెట్టుబడిదారీ సంస్కృతీ బంధాలలో చిక్కుకున్న మధ్య తరగతి స్త్రీ అనేక వృత్తుల్లో వ్యయ ప్రయాసలతో కూడిన శారీరక శ్రమలో సరైన వేతనం పొందలేని బడుగుర్గాల స్త్రీ మొత్తంగా పీడిత వర్గం స్త్రీల యొక్క ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక మానసిక స్వరూప స్వభావాలను నిరూపించే ఆధునిక చారిత్రక పరిశోధనా రంగం ఇంకా సుసంపన్నం కావలసి ఉంది.

పితృస్వామిక సంస్కృతిలో తీవ్రమైన అణచివేతకు అసమానతకు గురైన అగ్రవర్ణ స్త్రీ భావ బానిసత్వాన్ని వదిలించి, శాస్త్రీయ దృక్పథములో స్త్రీ చైతన్యాన్ని అభివృద్ధి చేసే పద్ధతిని పటిష్ఠం చేస్తూ, మొత్తం మానవ జాతి చరిత్రలో స్త్రీ వ్యక్తిత్వాన్ని సరైన పద్ధతిలో నిరూపించే దృక్పథం ముందుకు రావాలి. ఈ పరిశోధనల వెలుగు స్త్రీ విముక్తి ఉద్యమ విజయాన్ని మరింత కాంతివంతం చేస్తుంది.

భారతీయ సంస్కృతిగా చెప్పబడుతున్న వైదిక హిందూ బ్రాహ్మణ సంస్కృతుల్లో స్త్రీ ఏ విధంగా అణచివేయబడింది, ఆర్యులు రాకముందు భారత ఉప ఖండంలో స్త్రీ ఏ విధంగా మాతృస్వామిక సంస్కృతిలో విలసిల్లింది, ఆ తరువాత యుగాల్లో స్త్రీల అణచివేత, ఆ తరువాత కాలాల్లో స్త్రీల సంస్కరణ తిరుగుబాటు ఉద్యమాల చారిత్రక అవగాహన మనకు స్త్రీల చరిత్రలో నూతన దృక్పథాన్ని రూపొందిస్తుంది. అదిగో సాగిపోదాం.



# ఆదిమ సమాజంలో స్త్రీల సామర్థ్యం

నాగరిక సమాజంలో స్త్రీకి అబలత్వాన్ని ఆపాదించడం జరిగింది. ఆటవిక దశలో స్త్రీ అన్ని రంగాల్లోను పురుషుని కేమాత్రం తీసిపోలేదు. శారీరక శక్తిలోను, సామర్థ్యంలోను, చొరవలోను, ధైర్య సాహసాల్లోను ఓర్పులోను, నేర్పులోను స్త్రీ సమ తూకం కలిగి ఉండేది.

సామాజిక అభివృద్ధి క్రమంలోనే స్త్రీ పురుషుల మధ్య తేడాలను సృష్టించి శారీరక, మానసిక స్థితులలో వైరుధ్యాలను సృష్టించి శ్రమ విభజనలో స్త్రీని న్యూనత పరచడానికి పురుషసమాజం ప్రయత్నించింది. అందువల్లనే స్త్రీల పనులను ప్రత్యేకంగా కేటాయించడానికి ప్రయత్నించ డము జరిగింది.

శారీరక నిర్మాణ శాస్త్రంలో స్త్రీ అబలత్వ మేమీ పేర్కొన బడలేదు. జంతు ప్రపంచంలో స్త్రీ జాతులకంటే పురుష జాతులే బలహీనమైనవి. వెన్నెముక లేని జంతువుల్లో కూడా స్త్రీ యొక్కువ పరిమాణం కలిగినట్టిది.

సూక్ష్మ జలచరాల్లో మగవి చిన్నవిగా ఉండి కొన్నిసార్లు ఆడక్రిములను అంటి పెట్టుకొని జీవించే పరాన్న భుక్కులుగా ఉంటాయి.

( "Among cirrhipeds the male is sometimes a small parasite on the body of the Female. [1]

సాలీడులో ఆడదాని కంటే మగవి సర్వదా చాలా చిన్నది. కొన్ని సార్లు మగదాని కంటే ఆడుది మరీ పెద్దదిగా ఉంటుంది. అన్ని సూక్ష్మ జీవుల్లోకూడా సామాన్యంగా మగవి ఆడవాటి కంటే చిన్నవిగా ఉంటాయి.

---

1) G. Smith "Crustacea" Cambridge Natural History vol. iv p. 99,

quoted "The Mothers" volume I page : 442.

(Among spiders the male is always much smaller than the fimale often in an extreme degree. with all kinds of insects the males are commonly smaller than the females.) [1]

దోమల్లొనైతే మనకు కనిపించేవి ఆడవే. దోమల్లో మగవి చాలా స్వల్ప కాలం జీవిస్తాయి. లవి మనకు దృగ్గోచరం కావుకూడా. చేపల్లో కూడా ఒక జాతి చేపలలో (teleosteous) ఆడదే మగదాని కంటే పెద్దది. (In all teleosteous fishes the female is larger than male.) [2]

డార్విన్ జంతు జాలంలో ఒక సందర్భములో కూడా ఆడదానికంటే మగదానిని పెద్దదిగా చూడలేదని తెలిపాడు. (స్మిత్ సోనియన్ పేపర్స్లో) సిప్రినొ డాంట్ చేపలలో మగవి ఆడవాటిలో సగము సైజుకూడా ఉండవు, ఆడవి మగవాటిని కూడా మింగి వేయడం జరుగుతుంది, సామాన్యంగా ఆడ పాములన్ని మగ పాముల కంటే పెద్దవి అన్నాడు.

వార్డు వ్రాసిన అవర్ బెటర్ హావ్స్ (Our Better Halves) అనే గ్రంధములో "బల్లులు, తొండలు వంటి ప్రాకే జంతువులలో ఆడవాటి కంటే మగవి చిన్నవి. అయితే పక్షుల్లో పెక్కు రకాలు ఆడవాటి కంటే మగవి పెద్దవిగా ఉంటాయి. కోకిల వంటి పక్షులు ఆడవి మగవి సమానంగా ఉంటాయి. కాకుల వంటి జాతుల్లో ఆడవి మగవాటి కంటే పెద్దవిగా ఉంటాయి" అని పేర్కొన బడింది."

పాలిచ్చు జంతువుల్లో మగవి ఆడవాటి కంటే సాధారణంగా పెద్దవిగా ఉంటాయి. అయితే A. T. బరన్స్. "ది వండర్ ల్యాండ్ ఆఫ్ ది ఈస్టర్న్ కాంగో" అనే గ్రంధములో (P. 152) ఒకాపి (Okapi) అనే జిరాఫీ జాతి ఆఫ్రికన్ జంతువు మాత్రం మగదాని కంటే ఆడది పెద్దదిగా ఉంటుందని పేర్కొన్నాడు. [3] పాలిచ్చు జంతువులలో ఆడవి దీర్ఘకాలము గర్భవతులుగా ఉండటం దీర్ఘ కాలం శిశు సంరక్షణలో పాలిస్తూ

---

1) C. Darwin, the descent of man, vol, I P 338 quotd-Ibid.

2) A. C. L. G. Gunther, Introduction to the study of the Fishes") (P 656) quoted Ibid.

3) Ibid. P. 443)

ఉండటము వలన అవి కొంత బలహీన పడుతున్నాయి. అయితే వాటి సామర్థ్యం మగవాటి కంటే ఏ విషయములోను తక్కువ కాదు. శిశు సంరక్షణలో అవి చాలా అప్రమత్తంగా కూడా వుంటాయి. పాలిచ్చు జంతువులలో ఆడవి చాలా చురుకుగాను, తెలివిగాను వుంటాయి.

మాంస భక్షకజంతువుల్లో ఆడవి మగవాటికంటే వీరంగా ఎదుర్కొంటాయని వేటగాళ్ళకు బాగా తెలిసిన విషయము. ఆడ సింహము మగ సింహము కంటే నూరు శాతం ఎక్కువ అపాయకరమైనది అని "రైన్స్ ఫోర్డ్" పేర్కొన్నాడు. ("A Lioness is a hundred percent more dangerous thana lion")[1] మాంస భక్ష జంతువుల్లో మగవి సామాన్యంగా మనుష్యులను చంపడానికి ప్రయత్నించవు.

సామాన్యంగా అదే జాతిలోని ఆడవి పరిణామంలో మగవాటి కంటే చిన్నవిగా ఉంటాయి. అయితే ఈ విషయంలో జాతికి జాతికి మధ్య అంతరాలు ఉన్నాయి. అనేక జాతుల్లో శారీరకంగా మగవాటి కంటే అంగ సౌష్టవంలో మిన్నగాను, కొన్నిసార్లు సమానంగాను ఉండటం జరుగుతుంది. (Fritsch) ఫ్రిట్చ్ అనే రచయిత బుష్మన్ జాతుల్లో సాధారణంగా స్త్రీలు పురుషుల కంటే నాలుగు సెంటిమీటర్లు పొడవుగా వున్నట్లు పేర్కొన్నాడు.

కాంగోలో ఆడంబేల జాతుల్లో పురుషుల కంటే స్త్రీలు బలిష్టంగా ప్రకాశవంతంగాను ఉంటారని హెచ్. హెచ్. జాన్స్టన్ పేర్కొన్నాడు. 'జా హామి' అనే ఆఫ్రికా జాతిలో స్త్రీలు నిడివిగా కండ పుష్టిగా వెడల్పుగా ఉంటారని,పురుషులే నున్నితంగా వక్షోజ సహితులై గుండ్రని మోపేయి కాళ్ళతో స్త్రీల వలె కనిపిస్తారని ఎ. బి. ఎలిస్ చెప్పాడు.

(The women are generally tall, muscular and broad and the man smooth, full breasted, round limbed and effeminate — Looking") 2

---

1) W. S. Rains ford, 'The land of the lion', P. 101
quoted Ibid P. 443.

2) A. B- Ellis, The Ewe-speaking peoples of the gold Coast P. 184. partly adopting the words of Burton, Ibid P. 443

అశాంటి జాతి స్త్రీలు పురుషుల కంటే శక్తివంతంగా రూపొందుతారు. వాడైటా జాతి స్త్రీలు ఆరోగ్యవంతమైన కండరాలు కలిగి ఉంటారు. సొమాల్ జాతి స్త్రీలు శారీరక శక్తిలోను, దృఢత్వంలోను పురుషుల కంటే మిన్నగా ఉంటారు. కికియూ జాతి స్త్రీలు అవలీలగా మోసే బరువుని, ఈ జాతుల మీద పరిశీలన చేసిన ఆరడుగుల ఎత్తు బలంగల పాశ్చాత్యుడు, కట్టెల మోపును ఎత్తటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఆ జాతి పురుషుల పరిస్థితి అంతకంటే మెరుగుకాదు." [1]

పశ్చిమాఫ్రికాలోని క్రూ జాతిలోని స్త్రీలు గట్టిగా బలంగా ఉండి ఎంత బరువునైనా అవలీలగా మోసుకు పోగలిగేలా ఉంటారు. పెద్ద నీళ్ళ కుండను గాని, 100 పౌండ్ల బరువు కట్టెల మోపుగాని నెత్తిన పెట్టుకొని అప్పుడప్పుడు చంటి పాపలను వీపున తగిలించుకొని ఒక్కసారి కూడా ఆ బరువును సర్దుకోవటానికి ప్రయత్నించ కుండా మైళ్ళ తరబడి నిలకడగా తొణక కుండా నడవగలరు.

(The Kru women are robust and strong and capable of carrying immensely heavy burdens on their heads. Every evening they may be seen trudging home with large water - pots or a bundle of wood of a hundred pounds weight on their heads and perhaps a child slung on their backs. They can in this way walk for miles without raising their hand to steady or adjust their heavy burden.") [2] డా॥ మజుందార్ "ఇండియూ తెగలలో పురుషులు సోమరులుగాను స్త్రీలు నిరంతర శ్రామికులుగాను ఉంటారు. పురుషులు బలహీనులు సోమరులు పనికిమాలిన వారుగా ఉంటారని" తన సాంఘిక 'సంస్కరణ' అనే వ్యాసంలో పేర్కొన్నాడు.

---

1) W. S. and K. R. Routledge, with a prehistorie people the AKikuyu P. 104.
quoted Ibid : 444.

2) J, Wilson western Africa, P. 126
quotcd Ibid : 444

గినియా తీరప్రాంత స్త్రీలు వంద పౌన్ల సెత్తి బరువుతో ఆగకుండా పరుగెత్త గలరు. హాలెండ్ దేశ పురుషులు ఒక పౌన్ను బరువు కూడా నెత్తిన పెట్టుకోకుండానే ఆ వేగాన్ని అందుకో లేక పోయారని డబ్ల్యు. బాస్‌మన్ వివరించాడు.[1] హోండరస్ స్త్రీలు ఎత్తే బరువులను మగ వాళ్ళు ఎత్త లేక పోయారని 'వెస్‌ఫికోస్సీ' తెలిపాడు.[2] భారత దేశంలో దళిత జాతులకు సంబంధించిన స్త్రీలు వ్యవసాయ పనుల్లోను, కట్టెలు మోయడంలోను పురుషుల కంటే సామర్థ్యం కలిగియున్నారు. నేత నేసే స్త్రీలు కూడా పురుషుల కంటే నాణ్యతలోను, సామర్థ్యంలోను అగ్ర భాగాన ఉన్నారు.

సాధారణంగా చెప్పాలంటే, నాగరిక ప్రజల కంటే అనాగరిక తెగలు, సంస్కృతి ఇంకా బాగా పరిఢ విల్లని కాలంనాటి ప్రజలలో స్త్రీ పురుష భేదాలు అంత ఎక్కువగా ఏమీ కనిపించేవి కావు. చరిత్రకు పూర్వం నాటి అస్థి పంజరంలో లింగ భేదం నిర్ణయించడం కొన్ని సార్లు కష్టంగా ఉండేది. ఎందు కంటే ఆడవారిలో ఉండే ఎముకలు మగవారి లాగానే పెద్దగా ఉండేవి. కండరాల కూర్పు స్పష్టంగా కనబడుతూ ఉండేవి. ఆధునిక ఐరోప దేశస్థుల కంటే పొత్తి కడుపు చుట్టూ వుండే అస్థి పంజరం ఆకారము కొలతలలో వ్యత్యాసం చాలా తక్కువగా కనిపించేది.

(Speaking generally the physical differences between the Sexes are far less pronounced in primitive races and in the lower phases of culture than among civilised people. In prehistoric skeletons the determination of sex is of ten difficult and doubtful the bones, are as massive in the female as in the male. The muscular attachments are nearly as pronounced, and the diffe-

---

1) The Seheduied tribes G. S. Ghurye, P. 60 (1959)

2) W. Bosman "A new description of the coast of Guimece in pinkurton voyages and travels. vol, XVI P. 479
I bid : 444

3) A. Vespucci, Quattuor Nargationes in M. F. of Navarrate, cole eion cleviagcs. vol ii P : 284. I bid : 445

rneces in the shape and dimensions of the pelvis are much less marked rhan among modern Europeans)[1] కెప్టన్ కూర్ కింగ్‌జార్జి సౌండ్ ఇలెండ్‌లో పురుషులు స్త్రీలు ఎత్తులలోను, రంగులలోను, రూపంలోనూ ఒకే విధముగా వున్నారని స్త్రీ పురుషులను వేరువేరుగా గుర్తించడము కష్టమని వివరించారు.[2]

ఆదిలో పురుషుల భేదం శారీరక నిర్మాణంలో కూడాలేదు. రానురాను వచ్చిన చారిత్రక సాంఘిక పరిణామాల్లోను, సమాజ ఉత్పత్తి క్రమములో స్త్రీ పురుషుల భాగస్వామ్యములోను వచ్చిన మార్పు వలన స్త్రీ పురుష వివక్షత పెరుగుతూ వచ్చింది. అది పితృస్వామిక వ్యవస్థలో ఆధిపత్యాధికారాల్లో వచ్చిన పురుష గుత్తస్వామ్యం నుండి మరింత వికృత రూపం దాల్చినట్లు అనేక పరిశీలనలవలన మనకు సువ్యక్తమౌతున్నది"

ఆదిమ సమాజంలో స్త్రీ అనేక సందర్భాల్లో పురుషుని కంటే ఆధిక్యతలో వుందని ఈ పరిశోధన మనకు రుజువు చేస్తుంది.

## వేటలో స్త్రీ

వేటకు మగవాడే పోవడమనేది చారిత్రిక దశలోనే చూస్తున్నాము. మగవాడే వేటకు పోవడమనేది ఆడవారి అసమర్థత నుంచి యేర్పడలేదు. ఆడవారు వేట ఆడగలరు. బ్రిటీషు కొలంబియాలో స్త్రీలు మగవారితో సమానంగా వేటాడేవారని యస్. యస్. యాలిసన్ పేర్కొన్నాడు. (In British Columbia the women used to hunt and were ''nearly as good hunters as the men'')[3] ఎస్కిమో జాతి స్త్రీలు పెళ్ళి చేసుకోవటానికి నిరాకరించి, వారే స్వయంగా గృహాలు నిర్మించుకొని వారే వేటాడి బ్రతికే వారని డబ్ల్యు. హెచ్. డాల్ వివరించాడు. నికరాగో స్త్రీలు పరుగెత్తగలరు. ఈదగలరు. విల్లంబు

---

1) H. Sehaaffhausen Anthropological studies Ibid : 446

2) J. Cook Vayage to pasific ocean, vol II P, 303 Ibid 446

3) S. S. Allison Account of the Similkamen Indias of British columbia - Journal of the Anthropological Institute xxi P. 307. I bid ; 447.

లతో వేటాడగలరు. ఫ్యూజియన్ స్త్రీలు వారే వేటలో ముందుండే వారు. టిబెటన్ స్త్రీలు వడిసెలతో దూరంగావున్న వాటినికూడా సూటిగా కొట్ట గలరు. వెస్ట్ ఆఫ్రికన్ స్త్రీలు మగవారు లేకుండానే విల్లంబులు ధరించి వేటకు వెళ్ళేవారు.

(In west Africa, the women formerly used to carry bows and arrows and to go out hunting without men)[1] ' బోర్నియాలో వుండే హిల్‌దాయెక్స్ అనే తెగ స్త్రీలు బల్లాలను, వేట కుక్కలను వెంట బెట్టుకొని వేటకు వెళ్ళేవారు. టాస్మానియా స్త్రీలు కుటుంబానికి కావలసిన ఆహారాన్ని మొత్తాన్ని వేటద్వారా వారే సేకరించేవారు. కొన్ని తెగలలో వేటను స్త్రీలే చేసేవారు. టాస్మానియా, చెంచాల. ఫిజియన్ జాతుల్లో వేటను స్త్రీలే నిర్వహించేవారు. ఫ్యూజియన్ స్త్రీలు సముద్రంలోకి వెళ్ళి చేపలు పట్టేవారు. ఆ బోటులు కేవలం స్త్రీలే వుపయోగించేవారు. వారు మాత్రమే సముద్రంలోకి వెళ్ళి పెద్ద ఎత్తున చేపలు పట్టేవారు. ఆడవారు మాత్రమే ఆ జాతుల్లో ఈదగలిగేవారు.

స్త్రీ తనను తాను పోషించుకో లేదు. కాబట్టి వృత్తి విభజనరాలేదు. ఒరవాక్స్ అనే జాతిలో భర్తలు చనిపోయిన స్త్రీలు ఒక సమూహంగా ఏర్పడి ఆత్మస్థైర్యముతో అన్ని పనులను స్వయంగా నెరపుకో గలుగు తున్నారు. ఈ వృత్తులను తామే స్వంతం చేసుకోవాలనే మగవారి అహంకృతి నుండే వృత్తులు మగవారి స్వంతం చేయబడినాయి. మగ వారు మాత్రమే చేయదగిన పనులు మగవారికి గౌరవ ప్రదమైన పనులుగా కాలక్రమేణ కేటాయించబడుతూ రావటం వలన స్త్రీలకు న్యూనత కలిగించే పనులను కేటాయించటమనే వృత్తి విభజన అమల్లోకి వచ్చింది.

కొన్ని పనులు అలవాటు ప్రకారం మగవారి మీద పడ్డాయి. కాల క్రమేణా అవి మగవారుచేసే పనులుగా వ్యవహారంలోకి రావడం వాటినే మగవారు న్యూనత చెందకుండా గొప్పపనులు అనుకొని చేపట్టటం జరిగింది.

---

1) Adventures of Andrew Battel in Pinkerton, Voyages and travels, vol xvi P. 334 Ibid : 448

అలాగే ఆడవారి మీద పడిన పనులు ఆటవిక జాతికిచెందిన అనేక తెగలు ఆడవారిని తక్కువగా చూసేవారు. దానితో ఆడవారి మీద పడిన పనులు నీచమైన పనులు అని భావించేవారు.

"Certain tasks falling habitually to the lot of the men, these have little by little come to regard them as manly, as the only forms of labour which they could undertake without derogation - in short as 'noble' occupations - where as those tasks which have devolved upon the women, whom several savages regard as inferior beings, have come to be looked upon as inferior tasks." [1]

వృత్తులను నిర్వహించడంలో ఆదిమ సమాజంలో స్త్రీ పురుషులిద్దరు సామర్ధ్యాన్ని సమంగా కలిగి వుండేవారు. కాలక్రమంలో పురుషుడు గౌరవ ప్రదమైన పనులను తన సొంతం చేసుకొని అధిపత్యాన్ని వహించి స్త్రీ సామర్ధ్యాన్ని వమ్ము చేయడానికి, స్త్రీని కొన్నిపనులకే పరిమితం చేయడానికి ప్రయత్నం జరిగింది. అందువలన వాస్తవమైన సామర్ధ్యాన్ని చారిత్రక గతుల్లోనికి వెళ్ళి ధృవీకృతం చేసుకో వలసిన ఆవశ్యకత మన ముందుకు వచ్చింది.

## యుద్ధంలో స్త్రీలు

స్త్రీలు కూడా వివిధ జాతుల్లో యుద్ధ సామర్ధ్యం కలిగి వున్నట్లు చరిత్ర మనకు చాటి చెబుతుంది. ఆస్ట్రేలియా స్త్రీలు వారిని వారు రక్షించుకొనే సామర్ధ్యం కలిగి యుద్ధంలో పురుషులతో సమాన సామర్ధ్యంతో మిక్కుటమైన వీరంతో పోరాడారు. [2] యుద్ధ సంకేత నాదం మ్రోగడంతోనే ఆస్ట్రేలియా స్త్రీలు నిద్దరలో వుండికూడా లేచి ఆయుధం తీసుకొని పురుషులతో సమానంగా పరుగుతీస్తూ యుద్ధంలో చురుకుగా పాల్గొనేవారు. [3]

---

1) Annales du Musee du Congo Belge. Ethnologie et Anthropologie Serie III, volu II P. 23. Ibid : 450

2) A. W. Howtit, Kamilaroi and Kurnai P. 147 quoted Ibid : 451

3) J. Morgan, "The Life and Adventures of William Buckley. P. 43 Ibid : 451.

యుద్ధంలో పురుషుడు తీవ్రస్థాయిలో పోరాడుతున్నప్పుడు స్త్రీలు కూడా ఆయుధాలు తీసుకొని పెడబొబ్బలు పెడుతూ ఒకరిపైన ఒకరు పడి బీభత్సకాండ నిర్వహించేవారు. [1]

బోర్నియోలో స్త్రీలు పురుషులతో పాటు యుద్ధంలో పాల్గొనడం సహజం. స్త్రీలు యుద్ధంలో పాల్గొనడమే కాదు, పురుషులను నడిపించేవారు కూడా. [2] (In Borneo, it was quite common for women to fight by the side of the men, and even to lead them into battle.) బోర్నియోలో డయాక్స్ అనే కొండజాతి స్త్రీలు పురుషులు యుద్ధానికి వెళ్ళినప్పుడు గ్రామాల్లో వుండి స్త్రీలు గ్రామ రక్షణ చేసేవారు.

బురు ( Buru ) అనే ద్వీపంలో స్త్రీలు పురుషులతో పాటు తీవ్రస్థాయిలో యుద్ధంలో పాల్గొనేవారు. కెరోలినా ద్వీపంలో స్త్రీలు తమ దేశ రక్షణ కోసం యుద్ధంలో పాల్గొనడమే కాకుండా సైన్యంలో ఒక భాగంగా ఏర్పడేవారు. [3] (In the Coroline Islands "the women take a share in the war' not only to defend their country against the enemy but also to attack, and the Squadon they form, through in small numbers a part of the military forces) [4] లాడ్‌రోమ్స్ ద్వీపములో స్త్రీ సైన్యాధిపతుల నాయకత్వంలో స్త్రీలు యుద్ధం చేసేవారు. ఫిజి ద్వీపంలో స్త్రీలు యుద్ధ రంగంలో పడివున్న శత్రువుల శరీరాలను దంతాలతో చీల్చి వారి రక్తాన్ని తాగేవారు. వారి పిల్లలను తీసుకుపోయి శత్రు శరీరాలను తన్నడం మోదడంతో పాటు వారిని శత్రు శరీరాల పైన కవాతు చేయించేవారు.[5]

---

1) E. Thorne, The Queen of the colonies P. 134 Ibid 451

2) Ibid Page : 451

3) J. Talton, Voyage of captain G. Castleton to priaman in 1612, In Astleys New collection of voyages and Travels vol. i P. 172. Ibid P. 451

4) O. Von Kotzebue, A New Voyage round the world vol. i PP [illegible] Sq. Ibid : 451

5) Williams Fiji and the Fijians vol i P. 177 Ibid P 453

In Fiji during a battle women would rush upon a fallen foe, tear his body open with their teeth, and drink his blood, and led their children over the battle field, teaching them to Kick and tread upon the bodies of enemies [1]

మొరాకోలో బర్బర్ జాతి స్త్రీలు గుఱ్ఱపుస్వారి చేస్తూ తుపాకులతో యుద్ధం కూడా చేసేవారు. [2]

అరబ్ స్త్రీలు యుద్ధంలో నిలబడటమే కాకుండా క్షతగాత్రులను చంపేవారు. కొంతమంది స్త్రీలు యుద్ధనైపుణ్యాన్ని కలిగియుండి విజయానికి తోడ్పడేవారు. జాంజిబార్‌లో సుల్తాన్ 6 వేల మంది స్త్రీ సైనికులను కలిగివుండేవాడు. (The Sultan of Zan Zibar had an army of six thousand female soldiers.) [3]

దహోమిజాతిలో యుద్ధ భూమిలో స్త్రీలు విశ్వాస పాత్రంగాను ధైర్యముగాను నిలబడేవారు. సైనికులంతా ఛీలిల్లి పారిపోయినా స్త్రీలు ధైర్యం సడలకుండా నిలబడేవారు. ఆఫ్రికా జాతిలో స్త్రీలు సైనికులకు శిక్షణ ఇచ్చేటప్పుడు అతికష్టమైన రీతిలో ముళ్ళ పొదల్లోంచి దూసుకుపోతూ రక్తం కారుతున్నా, కండలు చీల్చుకొని వ్రేలాడుతున్నా నవ్వుతూ యుద్ధంచేసే సామర్థ్యాన్ని అలవర్చేవారు. వారు ముళ్ళను యుద్ధము చేసేటప్పుడు శిరస్సుకు నడుముకు కట్టుకొని శత్రు దుర్భేద్యంగా, భీకరంగా వుండేవారు. [4]

బర్టన్‌జాతి స్త్రీలు రోమన్ సైన్యం పైన పోరాడినప్పుడు రక్షక కవచాలను ధరించి గొడ్డళ్ళతోనూ, ఆయుధాలతోనూ పోరాడటంలో పాల్గొనే

---

1) Id A. Voyage of Discovery into the south sea. Vol : III P. 171 Ibid : 451

2) M. de Segonzac voyages au Maroc. P. 136 Ibid P. 454.

3. Duarte Barbosa Viaggi in G. B. Ramusio Navig aiiont et. Viaggi, vol i, fol 288. Ibid P. 454

4) J. Duncan Travels in Western Africa in 1845 and 1846 vol. I. P. 240. quoted ibid 455:

వారు. లొంగి పోవలసిన దుస్థితి వచ్చినప్పుడు వారి పసి పాపలను చంపి ఒకరిని ఒకరు చంపుకొని, చెట్లకు ఉరి పోసుకొని చనిపోయేవారు. కాని లొంగిపోయేవారు కాదు.[1] యుద్ధ జాతుల్లో స్త్రీలు ప్రసవ వేదనను అనుభవించడంలో ధైర్యాన్ని చూపేవారు. నాగరిక జాతులలాగా మూల గడం అరవటం వలన పిరికి పిల్లలు పుడతారనే వీరి భావన. ప్రసవించేటప్పుడు మరణిస్తే ఆ మరణాన్ని వీర మరణంగా భావించడమే కాకుండా ధైర్యోత్తేజానికి వారి చర్మాన్ని ధరించేవారు.[2] దక్షిణ అమెరికాలోని ఆటవిక జాతుల్లో పిల్లల్ని కనేటప్పుడు స్త్రీ మూలిగితే ఆ పసి కందును చంపేవారు. (If among South American tribes, the mother uttered a groan, the child was usually Killed.)[3]

భారత దేశములో హైదరాబాదు నవాబు ఆఫ్రికా స్త్రీలను రక్షక భటులుగా నియమించుకున్నాడు. (And so did the Nizam of Hyderabad Kept a body guard of female archers)[4] మహారాష్ట్రలోను దక్షిణ భారతంలో స్త్రీలు అనేక సందర్భాల్లో యుద్ధంలో పాల్గొన్నారు. ప్రథమ స్వాతంత్ర సమర కాలంలో ఝాన్సీలక్ష్మి వీరోచితంగా పోరాడినది. భారతదేశంలో అనేక తెగలకు సంబంధించిన స్త్రీలు పోరాటాలలో తమవీరోచితమైన సామర్థ్యాన్ని చరిత్రపుటల్లో రక్తాక్షరాలతో లిఖించారు.

---

1) Plutach Vila Marii XIX Florus, Epitomae i : 38 quoted Page : 458.

2. E. Seler Codex Fejeruary Mayer P. 207 quored Page Ibid : 459.

3) J, F, Lafitau, Moeurs des sauvages ameriquains vol· i. p. 592 Ibid ; 459.

4) H. Schaaffhausen Anthropologischen Studien P : 661. quoted : 456.

# మాతృస్వామ్య వ్యవస్థలో - స్త్రీ

స్త్రీ వ్యక్తిత్వం పునాదిగా నడచిన వ్యవస్థను మాతృస్వామ్యవ్యవస్థ అని పిలిచారు. ఆదిమ సామాజిక రూపాల్లో ఇది అత్యున్నతమైన వ్యవస్థ. సామాజిక భావాన్ని సహజంగానే కలిగిన స్త్రీ, సమాజ రూపాలను అనేక యుగాల్లో నిర్ణయించి, నిర్మించి, వాటి పరిణామాలకు మూల శక్తిగా నిలిచింది.

ప్రజలు గుంపులుగా, గణాలుగా, తెగలుగా రూపొందడంలో కాలానుగుణంగా వాటి రూపాలు మార్చుకోవడంలో స్త్రీ గణనీయమైన పాత్ర వహించింది. ఆ తరువాత వచ్చిన ప్రతి సామాజిక వ్యవస్థకు తానే నాయకత్వం వహించింది. పితృస్వామిక వ్యవస్థ ఆధిపత్యానికి వచ్చేవరకూ స్త్రీదే అన్ని వ్యవస్థలలోను ప్రధాన పాత్రగా కొనసాగింది.

మాతృస్వామిక వ్యవస్థ స్త్రీ పెత్తనం కొనసాగిన వ్యవస్థ అని కొంతమంది తప్పుడు అర్థము ఇస్తున్నారు. నిజానికి పితృస్వామ్య వ్యవస్థలో పురుష పెత్తనం నిరాఘాటంగా సాగిందికాని, మాతృస్వామ్య వ్యవస్థలో అలా జరగలేదు. అక్కడ స్త్రీ సమాజ నిర్వాహకురాలుగా ఉందే గాని, పురుషుణ్ణి న్యూనత పరచలేదు. మాతృస్వామ్య వ్యవస్థ సజీవంగా కొనసాగిన కాలంలో ఒక వ్యక్తిపై మరొక వ్యక్తి పెత్తనము చేసే భావమే లేదు.

మానవులందరూ ఉమ్మడి శ్రమద్వారా ఉమ్మడి సంపద ఉమ్మడి సమాజాన్ని ముందుకు తీసుకుపోయారు. ఈ శ్రమైక శక్తిలో స్త్రీ తన వంతు పాత్రను అధికంగా నిర్వహించింది.

"శ్రమ" మానవ సమాజ అభివృద్ధి క్రమానికి మూలమైనది. పరిణామ క్రమములో "స్త్రీ శ్రమ" చాలా ప్రధాన స్థానాన్ని వహించింది. అసలు వ్యవస్థే మాతృస్వామ్యంతో ప్రారంభమైంది. తల్లితనముతో వ్యవస్థకు మూల స్థానం ఏర్పాటయ్యింది. ప్రకృతిలోని ప్రతిజీవి

మాతృత్వంతోనే ముడిపడి ఉంది. మానవ శ్రమ సమాజాన్ని ముందుకు నడిపిన అన్ని దశల్లో స్త్రీయే కీలక పాత్ర వహించింది. ఆహారోత్పత్తిలో మనుష్యుని ప్రాధాన్యత, చారిత్రక్యాలు వర్ణిస్తూ మోర్గాన్ "భూమిమీద మనుష్యుని ఆధిక్యత ఈ విషయంలో (ఆహారోత్పత్తిలో) అతనికున్న చాతుర్యం మీదనే ఆధారపడి ఉంది. ఆహారోత్పత్తిని పూర్తిగా తన స్వాధీనంలో పెట్టుకో గలిగిన ప్రాణి ఒక్క మానవుడే. జీవనాధార వస్తువుల విస్తరణ మానవ జాతి అభివృద్ధిలో వచ్చిన ప్రధాన యుగాలుగా కొంచెం ఇంచుమించుగా కలిసిఉన్నాయన వచ్చును."[1]

అయితే ఈ ఆహార సేకరణ ఆహారం ఉత్పత్తికి ప్రధానంగా అన్ని యుగాల్లోను స్త్రీయే ఆధిపత్యం వహించింది.

మానవజాతియొక్క శైశవ దశలో తన సంతానాన్ని కాపాడుకోవటానికి గాను కాయలు, దుంపలు, పళ్ళు సేకరించి పెట్టే ఆహార సేకరణలో కూడా తల్లే ప్రధాన పాత్ర వహించింది.

ఇప్పటికీ ఆహార సేకరణ దశలో ఉన్న జాతుల్లో మాతృస్వామ్యం అమలులో ఉన్నది. నిప్పు ఉపయోగాన్ని తెలుసుకున్న కాలంలో జలచరాలయిన చేపలు, పీతలు, నత్తలు తినే కాలంలోను ఆహార సేకరణకు నదీతీర ప్రాంతాల్లో ప్రయాణించి నదీతీర ప్రాంత నాగరికతలను రూపొందించే కాలంలో కూడా స్త్రీ శ్రమయే ప్రధాన స్థానాన్ని వహించింది. వేటాడే దశలో వేటాడి తెచ్చిన మాంసాన్ని వండవలసిన అవసరాన్ని గూడా స్త్రీయే ముందుగా గమనించి ఉంటుంది. శరీరాన్ని కప్పుకోవాలననే ఆలోచన, కట్టుకోవటానికి చెట్టు బెరడును ఉపయోగించాలనే ఆలోచన స్త్రీకే వచ్చి ఉంటుంది.

ప్రసవ కాలంలో ఒకచోట కొంతకాలం నివసించ వలసిన అవసరమును గుర్తించి స్త్రీయే "గూడు"కు సంబంధించిన ఆలోచన చేసి ఉం

1) కుటుంబము — వ్యక్తిగత ఆస్తి రాజ్యాంగ పుట్టుక
— ఫ్రెడరిక్ ఏంగెల్స్

టుంది. వండుకోవటానికి పాత్రలు కావాలనే ఆలోచన ఆ పాత్రలు కొయ్యవైనప్పుడు కాలిపోతాయనే ఆలోచనకలిగి వాటికి మట్టిపూత పూయా లనే ఆలోచన ప్రధానంగా స్త్రీయే చేసి ఉంటుంది.

పశువుల్ని మచ్చికచేసి పెంచడం దగ్గర నుండి పురుష ప్రాధా న్యత ప్రారంభమై ఉంటుంది. అయినప్పటికీ ఏదశలో కూడా స్త్రీయే ప్రధానమైన స్థానాన్ని వహించింది.

అయితే ఒకటి మాత్రం మనం ప్రధానంగా గమనించ వలసిన అవసరం ఉంది. స్త్రీ స్వామ్యం ఉన్న కాలంలో వర్గ సమాజం దోపిడి సమాజం పునాదులు బలపడ లేదనేది మనకు సువ్యక్తం అవుతోంది. ఉత్పత్తి ప్రారంభమైన తరువాతే వర్గ సమాజానికి పునాదులు ఏర్ప డ్డాయి. రాతి యుగంలో కూడా మానవ గణాలకు స్త్రీయే నాయకత్వం వహించిందని, వేటలో కూడా స్త్రీయే అగ్రస్థానం అని రాహుల్ సాంకృ త్యాయన్ తన ప్రసిద్ధమైన చారిత్రాత్మక నవల "ఓల్గా సే గంగ" లో ఇలా వర్ణించాడు.

—"అందరికన్నా ముందు బలిష్టమైన శరీరం గల ఒక స్త్రీఉంది. వయస్సు నలభై యాభైకి మధ్య ఉంటుంది. నగ్నమైన ఆమె కుడి భుజాన్ని చూస్తేనే ఆమె చాలా బలిష్టయని తెలిసి పోతుంది. ఆమె కురులు, ముఖము, అంగ ప్రత్యంగాలు ఆ గుహల్లో మనం చూసిన యువతుల వలెనే ఉన్నాయి. కాని కొంచెం పెద్దవిగామాత్రంవున్నాయి. ఆమె ఎడమ చేతిలో మూడు గజాల పొడుగైన వాడి భూర్జ వృక్షపు కర్ర ఉంది. ఒక పదునైన రాతి గొడ్డలి తోలుతో పేనిన త్రాడుతో ఆమె కుడి చేతిలోని కర్ర పిడికి కట్టబడి వుంది. ఆమె వెనుక నలుగురు పురుషులు, ఇద్దరు స్త్రీలు నడుస్తున్నారు."

ఈ వర్ణన మనకు రాతియుగం నాటి సంచార జాతి స్త్రీ గణ నాయ కురాలిదని తెలియజేస్తూ వుంది. ఈ వ్యవస్థలో తల్లే నాయకురాలిగా వుం డేది. పాతరాతి యుగం వరకు కూడా స్త్రీయే ఆహార సేకరణ పంపిణీని సాగించింది. మానవ అభివృద్ధి చరిత్రలో స్త్రీ ప్రధాన నిర్మాత. ఆమె కృషి, ఆలోచన, విశాలత, సమిష్టి భావం మానవ సమాజంలో వ్యవస్థా

నిర్మాణానికి దోహదం చేసింది. అందుకే రాతియుగం వరకు స్త్రీలే సమాజంలో అన్ని రంగాలలోను ముందంజలో వున్నారు. ప్రపంచం లోని అన్ని తెగలలోను అప్పటివరకు 'తల్లే' రకరకాల దేవతలుగా అన్ని ప్రాంతాల్లో అన్ని తెగల్లో అనేక పేర్లతో పిలువబడ్డది. తెలుగు మాట్లాడే ప్రజలలో గంగమ్మ, పోతమ్మ, అంకాళమ్మ, నూకాలమ్మ, కాలుబాయి (నల్లటి తల్లి) లాడుబాయి (ప్రియమైన తల్లి) అంబాబాయి (అమ్మ తల్లి) మొదలగు దేవతలు. ఈ దేవతలను గురించి మనము పరిశీలిస్తే ప్రతి సమాజంలోను వీరి ఆవిర్భావం మనకు గోచరిస్తూనే ఉంటుంది.

ప్రసిద్ధ చరిత్రకారుడు డి. డి. కోశాంబి అన్నట్లు ఈ దేవతల ఆరాధనలో కూడా స్త్రీకే ప్రధానమైన స్థానం ఉండేది. ఆరాధనా పద్ధతిపై ఈ విధానం అన్నది వారి స్వతంత్రతను ఆధిపత్యాన్ని చాటి చెబుతున్నది. దేవీప్రసాద్ చటోపాధ్యాయ తన లోకాయత గ్రంథంలో కూడా ఈ విషయాన్ని స్పష్టం చేశారు.

స్త్రీలే మొట్టమొదట వ్యవసాయాన్ని కనిపెట్టారు. ఆదిమ ఆటవిక సమాజంలో పంటలను పండించి సంపదను సృష్టించింది స్త్రీలే. వ్యవసాయానికి మూలమవడం వల్లనే స్త్రీలకు సాంఘిక గౌరవం వచ్చింది. తాత్విక ఆలోచనలో కూడా స్త్రీయే ప్రధాన సానాన్ని పొందింది. స్త్రీనే ప్రకృతిగా భావించారు. ఆరాధించారు. సృష్టికి స్త్రీ మూలమని గుర్తించారు. వ్యవసాయాలు పునాదిగా గల జాతులన్నీ స్త్రీనే ప్రధానంగా గౌరవించాయి. లోకాయతుల వంటి భౌతిక వాదులు స్త్రీకి అత్యంత ప్రాధాన్యం ఇచ్చారు. స్త్రీనే పంట దేవతగా భావించారు. స్త్రీమూర్తికి సంకేతంగా కొన్ని మొక్కలను ఎన్నిక చేసి పూజించారు. వ్యవసాయ కేంద్రంగా కలిగిన జాతులన్నీ మాతృస్వామ్యమే పునాదిగా కలిగి ఉన్నాయి. పశు పోషణ, పాలన ముఖ్యంగా కలిగిన జాతులన్నీ పితృస్వామికం ప్రధానంగా కలిగినవిగా ఉన్నాయి. ఆయా కాలాల్లో ఆయా దేశాల్లో వ్యవసాయం ప్రధానంగా కలిగిన జాతుల సంప్రదాయాలను, సంస్కృతులను, ఆచారాలను, అధికారాలను, ఆధిపత్యాలను పరిశీలించి నట్లయితే మాతృస్వామికతే ప్రధానంగా వున్నట్లు తెలియుచున్నది.

భారతదేశానికి ఆర్యగణాలు రాక పూర్వం మాతృస్వామిక వ్యవస్థే అమలులో వుండేది. సింధూ నాగరికత కాలంలో కూడా మాతృస్వామిక నాగరికత అమలులో వున్నట్లు చరిత్ర నిరూపిస్తూవుంది.

అర్యగణాలు భారతదేశం వచ్చాక అంతకు ముందున్న స్వయం ప్రతిపత్తి కలిగిన మాతృస్వామిక దేవతలు పితృదేవుళ్ళకు భార్యలుగా మాతలుగా రూపాంతరం చెందారు. సంస్కృత నామాలు ధరించి గౌరి, చండి, దుర్గ, పార్వతులుగా రూపొందించటం జరిగింది. ఇదంతా పశు పాలక గణాలు వ్యవసాయక గణాల మీద విజయం పొందడం. సాంకర్యం పొందడం మొదలుగా గలిగిన అనేక మార్పుల వల్ల జరిగిన పరిణామం.

ఏదిఏమైనా ఆర్యగణాల రాకతో భారతదేశ మాతృస్వామిక సంస్కృతి రూపాంతరం చెందడం, పతనం అవ్వడం ప్రారంభమయ్యింది. అయితే ఆర్యులకు ముందుగా ఉన్నత సంస్కృతిని రూపొందించుకున్న సింధూ నాగరికతలో అనార్యులు స్త్రీ మూర్తినే ఆరాధించారు.

భారతదేశంలో ఈనాటికి ఆర్య సంస్కృతికి దూరంగావున్న గిరిజనుల్లో, దళితుల్లో "స్వామిని" కత్వమే మిగిలివున్నది. ఈనాటికి డోంచి, బుడబుక్కల, గదబ, గంగ, గొల్ల, ఈడిగ, ఇత్యాది జాతుల ప్రజలు గ్రామ దేవతలను పూజిస్తున్నారు.

మాతృస్వామికం పునాదిగా కలిగిన జాతుల మీద ఎన్ని పితృస్వామిక దాడులు జరిగినా వారి మాతృస్వామికత అంతరించ లేదు. పైగా మాతృస్వామిక ఆచారసంప్రదాయాలను తన సంప్రదాయాల్లో సంలీనం చేసుకోకపోతే మనలేని పరిస్థితికి పితృస్వామిక సమాజం నెట్టబడింది.

భారతదేశ చరిత్రలో మాతృస్వామిక వ్యవస్థా గణాలమీద పితృస్వామిక గణాలు చేసిన దాడులు, విజయాలు, ఓటములు, సంకరములు దోపిడీలే ప్రధానమైనట్టివి. అందులో భారతదేశం తరపున మాతృస్వామ్య సంస్కృతికి నాయకత్వం వహించిన స్త్రీలదే ప్రధాన పాత్ర.

భారతదేశ చరిత్రలో అత్యంత ప్రాధాన్యత వహించిన సింధూ నాగరికత కాలం భారత స్త్రీ మాతృస్వామిక సంస్కృతికి చివరి యుగం. అప్పటివరకు సాగిన ఆటవిక, అనాగరిక యుగాల్లోను, పాత కొత్త రాతి యుగాల్లోను, లోహ యుగాల్లోను, భారతదేశంలో ఏదో ఒక స్థాయిలో

మాతృస్వామ్య వ్యవస్థ కొనసాగింది. మానవ సమాజ రూపకల్పనకు పరిణామానికి సజీవ శక్తులు రూపొందాయి. స్త్రీ ప్రధాన శక్తిగా కొన సాగిన ఈ పరిణామాల్లో — భారతదేశం ఉజ్వలంగా భాసించింది. నదీ నాగరికతను, వ్యవసాయ సంస్కృతిని రూపొందించుకొని నగర సంస్కృతిని కూడా అద్భుతంగా శిల్పించుకో గలిగింది. సింధూ నాగరికత ప్రపంచదేశాల్లో ఉజ్వలంగా కొనసాగిన నాగరికతల్లో ఒకటిగా భాసిల్లింది. అట్టి సింధూ నాగరికతలో స్త్రీ వికాసాన్ని, అనాగరికత మీద ఆర్యుల దాడిని పరిశీలిస్తే కాని భారతీయ సంస్కృతిలో స్త్రీ ప్రధాన పరిణామం మనకు అవగతం కాదు. ○

# సింధూ నాగరికతలో స్త్రీ

క్రీ॥ శ॥ 1920 వరకు చరిత్రకారులు ఆర్య సంస్కృతి ఈ దేశానికి తలమానికం అని తలంచారు. కాని కనింగ్‌హామ్ (Conneing Hom) మార్షల్ (Marshal) ఆర్. డి. బెనర్జి (R. D. Benarge) అను పురావస్తు పరిశోధకుల అన్వేషణ ఫలితంగా బయటపడిన హరప్పా ; మొహంజదారో సంస్కృతులు మనదేశ నాగరికత నొక వేయి సంవత్సరాలు వెనుకకు తీసుకుపోయాయి. పంజాబులోని మాంటు గోమారి జిల్లాలో సింధూనది శాఖయైన రావీనది తీరంలో త్రవ్వకాల వలన బయట పడిన హరప్పా నగరము దీనికి దక్షిణాన సింధూ రాష్ట్రములో లార్కానా జిల్లాలోని దోక్రి (Dokri) కి ఏడు మైళ్ళ దూరంలో ఉన్న మహంజదారో నగరములను బట్టి కొంతకాలము వరకు చరిత్రకారులు సింధూ నాగరికతయే భారత దేశమునకు ప్రాచీన నాగరికతగా భావించారు.

కాని ఆ తరువాత రాజస్థాన్‌లోని రూపన్ బికవేరుల వద్ద, ఉత్తర ప్రదేశ్‌లోని అలహాబాద్ అయోధ్యల వద్ద, అస్సాంలోని షిల్లాంగ్ గాహ తిల వద్ద, మధ్యప్రదేశ్‌లోని నర్మదానదీ లోయలో, మహారాష్ట్రలోని పూనా వద్ద, బళ్ళారి ప్రాంతంలోను — హరప్పా మొహింజదారో నగరములలో లభించిన శిలాసంపదే లభించినది. కాబట్టి ఆర్యుల రాకముందు ఉండిన సింధూలోయ నాగరికతయే యావద్భారత దేశ నాగరికతగా చరిత్రకారులు భావించారు.

అందువల్లనే సర్ జాన్ మార్షల్ ఇలా అంటున్నాడు. "ఒకటి స్పష్టంగా చెప్పవచ్చు. హరప్పా, మొహింజదారో నగరాలలో కనిపించే నాగరికత యాదృచ్ఛికంగా ఏర్పడ్డది కాదు. భారత దేశంలో ఎన్నో శతాబ్దాలుగా వేరూరిన నాగరికత ఇది. పర్షియా. మెస పొటేమియా, ఈజిప్టులలో వలెనే అతి ప్రాచీనమైన నాగరికతా కేంద్రాలలో 'భారతదేశం' ఒకటి అని స్పష్టంగా చెప్పవచ్చు. కొన్ని విషయాలలో ఈ నాగరికత మెసపొటేమియా ఈజిప్టులకంటే ఉన్నత స్థాయిలో ఉంది."

హరప్పా మొహింజదారో నగరాలు క్రీ॥ పూ॥ 3000 నుండి 2000, మధ్య కాలంలో నున్నట్లుగా పెక్కురు చరిత్రకారులు భావిస్తున్నారు. అనాటికి పురపాలక వ్యవస్థ వున్నట్లుగా అర్థమవుతుంది. ఆ నగరాలలో కనిపిస్తున్న పెద్ద పెద్ద వీధులు, ఇరు ప్రక్కల పెద్ద మురుగు కాల్వలు స్నానా గారములు, పెద్ద పెద్ద భవనములు, నాట్య శాలలు, దేవతా మూర్తులు, మనోహరా భరణములు, వస్తు సముదాయములు, ప్రత్తి దారముతో నేసిన బట్టలు. అనాటి భారతీయ నాగరికతను వేనోళ్ళ చాటు చున్నాయి. అంతేగాక 2000 లకు పైగా దొరికిన అనాటి సీల్స్ (Seals) ను బట్టి అనాడు లిపి కూడా వున్నట్లు తెలుస్తున్నది. ఈ లిపి చదవబడి నట్లయితే ఇంకా కొన్ని విషయాలు తెలియడానికి వీలున్నది.

అయితే ఈ దొరికిన ఆధారములను బట్టి మనకు అనాటి ఆచారాలు, సాంప్రదాయాలు, సామాజిక విధానాలు, ఆర్థిక సామర్థ్యాలు స్పష్టంగా తెలియుడం లేదు. అందువలన అనాటి స్త్రీనిగురించి మనము తెలుసుకోవా లంటే సాధ్యం కావడం కష్టం. అయితే అనాడు స్త్రీ దేవతామూర్తులు ఆరాధింపబడటము చేత స్త్రీకి విలువ వున్నట్లుగా భావించ వచ్చును. అనాటి స్త్రీలు ధరించిన ఆభరణముల ఆధారముగా వారి నాగరికతను కొంత ఊహించవచ్చు.

హరప్పా, మొహింజదారోలలో విశేషంగా దొరికిన స్త్రీల ఆభరణ ములను గురించి పి. థామస్ “Indian women through the ages”లో వివరించారు.

అనాటికి దొరుకుచున్న లోహములలో విలువైన రాళ్ళను కూర్చి ఆభ రణాలుగా తీర్చి దిద్ది అలంకరించుకొనేవారు. తలకిరుపైపుల బంగారము, వెండి, రాగి, పింగాణి, గవ్వలతోటి తయారుచేసిన ఆభరణాలను ధరించే వారు. తలకు బిళ్ళపాగా పెట్టేవారు. నుదుట భాగానికి ఒక అందమైన పట్టీ ధరించేవారు. బంగారు, వెండి, రాగి. పింగాణీతో చేసిన కర్ణా భరణాలు అలంకరించేవారు. కళాత్మకంగా నిర్మించిన కంఠ హారమును వ్రేలాడునట్లు అలంకరించేవారు. బంగారము, వెండి, రాగి, కంచు, పింగాణీ గవ్వలు మరియు కుండ పెంకులతో తయారు చేసిన కంకణాలను గాజులను ధరించేవారు.

కురువింద రత్నములు, సూర్యకాంత మణులు, వజ్రములు పొదిగి చక్కని పనితనము సాంకేతిక నిపుణత్వము గల వడ్డాణాలను ధరించేవారు.

అంతేకాక స్త్రీలు సౌందర్య పోషణ కోసం వహించిన శ్రద్ధ అక్కడ లభించిన ముస్తాబు బరిణెల వలన తెలుస్తుంది. వీటిని దంతాలతో, లోహముతో, శిలతో, మట్టితో చేసేవారు. వారు మనోహరమైన మైపూతలతో సింగారించుకొనేవారు. కన్నులకు కాటుకను రచించుకొనేవారు. అధరాలకు రంగువేసే పరికరాలు, అలంకరణ కవసరమైన మేజాలు, కంచు అద్దాలు, దంతపు దువ్వెనలు వారు ఉపయోగించారు. అంతేకాక స్త్రీలు వినోదానికి బంతులను, చదరంగపు పాచికలను వాడినట్లు తెలుస్తుంది.

మరియు ముఖ్యంగా వీరి వస్త్రాలంకరణలో విశేషం, అంతరీయము; ఉత్తరీయమును ధరించి ఉత్తరీయమును ఉపవీతంగా చేసుకొనుటలో వున్నది. వీరి శిరోలంకరణ జడలతో, ముడులతో అందంగా ఉండేది.

ఆభరణ వస్త్ర మైపూత ధారణ వలన ఆనాటి స్త్రీలు కడు నాగరికులుగా. సౌందర్య పోషకులుగా, కళాపతులుగా మనకు కనిపిస్తున్నారు.

ఆ కాలంలో నూలు వస్త్రాలు, ఉన్ని వస్త్రాలు ముఖ్యమైన వాణిజ్యంగా ఉందని కోశాంబి[1] పేర్కొన్నారు. ఈ ఎగుమతుల మారకంగా ఆయా దేశాల నుండి దిగుమతులు చేసుకొనేవారు. అందులో ముఖ్యంగా వెండిని దిగుమతి చేసుకొనేవారు. ఈ ఎగుమతులకు దిగుమతులకు మూలమైన వస్త్ర పరిశ్రమ స్త్రీ ఆధ్వర్యంలో నడుస్తూ ఉండేది.

దీనివలన ప్రపంచంలో ప్రాచీన నాగరికులైన సుమేరియన్లు, అస్సీరియన్లు, ఈజిప్షియన్లు, గ్రీకులు, రోమనుల వలె భారతీయ స్త్రీ కూడా అత్యున్నత నాగరికతలో విలసిల్లిందని తెలుసుకోవచ్చు. అంతే

(1 An Introduction to the study of Indian history. Page 60
– D. D. Kosambi

కాక అనాటి శిల్పకళలో స్త్రీకి మహోన్నత స్థానం ఇవ్వడం జరిగింది. ప్రాచీన భారతీయ నాగరికతలో స్త్రీ సూది దారముల వంటి వస్తువుల దగ్గర నుండి మనోజ్ఞమైన ఆభరణాలు, వస్త్రాలు వాడుకొని సౌందర్య వతిగా ఉండటయే గాక పూజ్య భావాన్ని గౌరవ స్థానాన్ని పొందివున్న దని ఊహించవచ్చు. అయితే ఆనాడు దొరికిన చారిత్రక సామాగ్రిని బట్టి సామాజిక విధానాలు, ఆచారాలు, వివాహాలు ఇవన్ని తెలుసుకోవ డానికి వీలులేకుండా ఉంది.

వ్యవసాయ సంస్కృతిని రూపొందించిన స్త్రీలు సింధూ నాగరికత విలసిల్లడానికి మూలమైన వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి ఎంతో కృషి చేశారు.

ఆర్కియాలజీ డిపార్ట్మెంటు మాజీ డైరెక్టర్ జనరల్ 'మాధో స్వరూప్ వాట్స్' అభిప్రాయం ప్రకారం సింధూ నాగరికతా ప్రజలు మాతృదేవత లేక ప్రకృతి దేవతలను ఆరాధించే వారని అందుకై గర్భిణీ స్త్రీ లేక పిల్లలు గల స్త్రీల ఆకృతులను ఉపయోగించేవారని తెలుస్తోంది.

"The generally accepted view is that they represent the 'Grate Mother or Nature goddess,' whose worship, under various names and forms is still very common in India. The presence of a fertility cult among these people is also represented by figurines of pregnant women and of women with children."[1]

డి. డి. కోశాంబి కూడా సింధూ నాగరికతలోని 'అమ్మ దేవతల' గురించి ఇలా వివరించారు.

"సింధూ లోయలోని కోటదిబ్బ మెసపొటేమియా జిగ్గరాట్కు మరో రూపం మాత్రమే. దీనికి తగినట్లు, సింధూ నగరాలకన్న ముందు కాలా నికి చెందిన గ్రామాలలో మాతృదేవతల మట్టి బొమ్మలు దొరికాయి. బొమ్మలు చిన్నగా ఉన్నా, పిట్ట తలకాయలతో భయంకరంగా చిత్రించారు.

---

1) Indus Valley Civilization (an essay in 'The Cultural Heritaze of India vol I) - Page 122

ఇవి పిల్లలు ఆడుకొనే బొమ్మలు కావు. జనన, మృత్యువులను అదుపుచేసే దేవతలు. ఈ దేవతల తరఫున వీరి మానవ ప్రతినిధులే వాస్తవంగా అన్ని కార్యక్రమాలు నిర్వహించేవారు. అందువల్ల మాతృ దేవతలకు పెద్ద పెద్ద విగ్రహాలు చెక్కాల్సిన అవసరం రాలేదు."[1]

పై వివరాల వల్ల సింధూ నాగరికతలో మాతృస్వామిక వ్యవస్థ బలంగా వుండేదని మనకు స్పష్టంగా అర్ధమౌతుంది.

సింధూ నాగరికతలో స్నానవాటికలు ప్రసిద్ధంగా విలసిల్లాయి. వీటి ప్రభావం తరువాత ఆర్యుల సంస్కృతి మీద కూడా కనిపిస్తుంది. ఆ తరువాత దేవాలయాలకు అనుబంధంగా ఉమ్మడి స్నాన ఘట్టాలుగా రూపొందాయి. ఈ పుష్కరాల వద్ద అప్సరసలు లేదా జల దేవతలు వుంటారని ఆనాడు నమ్మేవారు. ఈ స్నాన ఘట్టాల నిర్మాణంలో ఉమ్మడిగా స్త్రీలు స్నానం చేసే ఆచారంతోపాటు సంస్కృతిలో స్త్రీ ప్రాధాన్యత స్త్రీ ఉమ్మడి తత్వానికి సంబంధించిన సంస్కృతీ రూపం మనకు దృగ్గోచరమవుతుంది.

'Indus - Valley Civilization' అనే గ్రంథంలో సర్ జాన్‌మార్షల్ ఇలా పేర్కొన్నారు. మాతృ భావన వీరి మత పరిణామ క్రమంలో అనాటికే రూపుదిద్దుకొని వున్నదని చెప్పటానికి మొహంజదారో హరప్పాలలో దొరికిన ఫలకాలు బలమైన ఋజువు.

ప్రాచీన భారతీయులు స్త్రీ మూర్తిని (ప్రకృతి మాతగా) ఆరాధించినట్టు సింధూ లోయలో దొరికిన స్త్రీ మూర్తుల విగ్రహాలను బట్టి తెలుస్తుంది. ఇటువంటి ప్రతిమలే మెసపొటోమియా, పశ్చిమాసియా,ఆసియా, మైనరాసియా, పాలస్తీనాలలో కూడా లభించాయి. అందుచేత స్త్రీమూర్తి ఆరాధన సింధూలోయ నుంచి - నైలు నది వరకు వ్యాపించినట్టు మనసు భావించవచ్చు.[2]

---

1) భారత చరిత్ర—పరిచయ వ్యాసాలు—కోశాంబి—పేజి 62

2) ఈ విధమైన మాతృ ఆరాధన వేద ఋక్కుల్లో ఎక్కడా కనబడదు. వారు పూజించినది వరుణుడు, ఇంద్రుడు, పృథ్వి, ఆకాశము, వాయువు, మరుత్తులు మొదలయిన దేవతలనే కాని స్త్రీమూర్తిని కాదు.

అనార్య సంస్కృతి వున్న పల్లెపట్టుల్లో (భారతదేశం) ఇప్పటికీ స్త్రీమూర్తినే గ్రామ దేవతగా పూజిస్తున్నారు. 'అంకమ్మ, పోలేరమ్మ పెద్దమ్మ, పోతపాటెమ్మ, మహాలక్ష్మమ్మ, మహంకాళమ్మ' మొదలగు వారు ప్రసిద్ధి చెందిన గ్రామ దేవతలు. ఆర్య సంస్కృతికి లోబడక ఇప్పటికీ ఈ దేవతలను పూజించే అనార్య తెగలలో మాతృస్వామ్య సంస్కృతి ఇంకా బలంగానే వుంది.

అందువలన జాన్‌మార్షల్ —"మాతృస్వామ్య వ్యవస్థ ఉండడం వల్లనే గ్రామ దేవతలు అవతరించారని ఊహించటం సబబు" అని అన్నారు. ఆర్యులు ఈ దేశానికి రాకముందు మాతృస్వామ్య వ్యవస్థ ఇక్కడ బలంగా నెలకొని ఉందని, స్త్రీకి గౌరవం నాగరికత వుండేదని దీనిని బట్టి తెలుస్తోంది.

ఆర్యులు స్త్రీమూర్తికి గౌరవం ఇవ్వకపోగా బృహదారణ్యకోపనిషత్తులో స్త్రీ మర్మాంగమును యజ్ఞ వేదికగా, అచటి బహిశ్చర్యమును రోమాదులను యజ్ఞ సంబంధమైన వివరణలతో మహా పవిత్రమైన విషయాలుగా భావించ వలసిందిగా ప్రచారం చేశారు. ఇప్పటికీ ఈ భగ పూజలు (అలంపురం) కొనసాగుతున్నాయి.

మొత్తంగా సింధూ నాగరికత ఆర్యేతరమైన ప్రాచీన భారతీయ నాగరికత. ఈ నాగరికతలో స్త్రీ మాతృస్వామ్య సంస్కృతిలో వ్యక్తిత్వంతో ఆత్మగౌరవంతో విలసిల్లింది.

నదీ నాగరికతలకు మూలశక్తి అయిన స్త్రీ సింధూనది కేంద్రంగా సాగిన వ్యవసాయ సంస్కృతికి పట్టుగొమ్మగా వ్యవహరించింది. నగరాలు రూప కల్పనలోను ఉమ్మడి సమాజ రూపాన్ని కొనసాగించడంలోనూ ఈ కాలంలో స్త్రీ బలమైనపాత్ర నిర్వహించ గలిగింది. సింధూ నాగరికత నాడు కొనసాగిన 'మాతృస్వామిక లక్షణాలు' ఈనాడు ఆదిమ తెగలలో, నిమ్న జాతుల్లో కొనసాగుతూనే ఉన్నాయి.

భరతభూమిలో నదీ నాగరికత, దాని పునాది మీద నుండి రూపొందిన వ్యవసాయ నగర సంస్కృతులలో ఆర్యుల రాక తరువాత యెన్నో మార్పులు వచ్చాయి. సింధూ నగర సంస్కృతిని ధ్వంసం చేసిన ఆర్యులను, వారి చరిత్రకు, సంస్కృతికి మూల భూతమైన వేదాలను పరిశీలిస్తే కాని భారతదేశంలో మాతృస్వామిక సంస్కృతి మీద పడిన తీవ్రమైన అణచివేతకు, పితృస్వామ్య సంస్కృతి ఆవిర్భావానికి మూలం తెలియదు. అందుకే వేదాలను పరిశీలించి పితృస్వామ్య సంస్కృతి ఎక్కడ, ఎప్పుడు రూపొందిందో పరిశీలిద్దాం.

✕

# వేదాలు - స్త్రీ

ఆధునిక పరిశోధనల వలన క్రీ॥ పూ॥ 1500 నుండి 500 సం॥ల మధ్యకాలంలో వేదాలు, వేదాంగాలు కూర్చబడినట్లు చెప్పబడుతున్నది.[1] ఆ కాలం వేదకాలం (Vedic Period) గా పరిగణింప బడుతున్నది. వేద ఋషి ప్రోక్తమైన ఋక్కులలో చెప్పబడిన ప్రమాణాలను బట్టి ఆనాడు సంఘంలో స్త్రీ స్థితి గతులను తెలిసి కొనుటకు కొంత అవకాశం కలుగుతున్నది.

సృష్టి కార్యంలో ప్రధాన పాత్ర వహిస్తున్న స్త్రీలకు వేద కాలములో ఏ మాత్రం ప్రాధాన్యత లేదు. "వేద కాలంలో స్త్రీ సంతతికంటే పురుష సంతతియే ఎక్కువ సంతోష దాయకంగా నుండెడిదని"[2] ఋక్కులను బట్టి తెలుస్తున్నది.

పురుష సంతతే కావాలనే కోరికలు వేదాల్లో చాలా ఉన్నాయి. కానీ స్త్రీ సంతతి కావాలనే కోరిక ఋగ్వేదంలో ఎక్కడా లేదు. పుత్ర సంతతి కలగడమే ఆనాడు స్త్రీత్వంగా భావించ బడింది. అందువల్లనే —

"యనో అగ్నే మతయే మావీరతాయై రరభః

(ఋగ్వేద సంహిత 3-16-5)

"ఓ అగ్నీ నీవు మమ్ములను అపుత్రతకు విషయ భూతులనుగా చేయకుము"—అను ప్రార్థనా మంత్రాల్లో కూడా పుత్ర సంతతి కావాలనే కోరికలే నిండివున్నాయి.

---

1) ఈ కాల నిర్ణయంలో చాలా వాదోప వాదాలున్నాయి.
"Dr. P. V. Kane క్రీ॥ పూ॥ 4000-1000 అని, Wintermitz క్రీ॥ పూ॥ 2000-750 అనీ, Keith క్రీ॥ పూ॥ 1200-350 అని, Macdonald క్రీ॥ పూ॥ 1300-800 అని చెప్పియున్నారు.
(Marriage and Family in India - K. M. Kapadia, History of Sanskrit Literature - Keith)
వేదకాలపు స్త్రీలు — 13 వ పేజి

[1] కీర్తిని పొందటానికి, సంపదను పెంపొందించటానికి యాజమాన్యతను నెరపడానికి పురుషుడు అర్హుడనీ, స్త్రీ అనర్హురాలనీ వారు భావించారు. పురుష సంతతిని మహా భాగ్యంగా భావించినవారు స్త్రీ సంతతిని గూర్చి తలంచనైనా తలంచలేదు. అంతేగాక ఆనాడు జీవిత లక్ష్యమే పుత్ర సంతతిగా భావించ బడింది.

"దేవానాం పత్నీరు శీతర వస్తునః
ప్రావస్తు నస్తుజయే వా జసాంతయే"
(ఋగ్వేద సంహిత 5-46-7)

(దేవ పత్నులు బలవంతులగు పుత్రుల కొరకు మమ్ములను రక్షింతురు గాక)

చివరకు వైవాహిక మంత్రాల్లో కూడా పుత్ర పౌత్రులనే కోరడం జరిగింది కానీ, పుత్రికలను కోరడం జరుగలేదు. దీన్ని బట్టి చూస్తే ఆనాడు పుత్ర సంతతకి యిచ్చిన విలువ స్త్రీ సంతతికి యివ్వలేదని తెలుస్తుంది.

రేడియోల్లోను, వేదికల మీదను స్త్రీ వేదకాలంలో స్వేచ్ఛగా వుందనే, సౌభాగ్యంతో వర్ధిల్లిందనీ, ఈనాడు పాశ్చాత్య సంస్కృతి సంపర్కం వల్ల చెడిపోయిందని, మన హిందూ మతాచార్యులు బోధిస్తున్నారు. ఇది ఎంత వరకు సత్యమో పరిశీలిస్తే తెలుస్తుంది. సమాజానికి. సామాజిక ప్రగతికి ఎవరయితే ఆధారమో ఆ స్త్రీకి విలువ లేకుండా అణగ ద్రొక్కిన నాటినుండే మన సంస్కృతి అణగారి పోవడం ప్రారంభించింది. దాన్ని ఉద్ధరించడానికి ఎందరో సంస్కర్తలు కృషి చేశారుగాని అదినామమాత్రం గానే జరిగింది.

## వేదకాలం - స్త్రీ విద్య

ఋగ్వేదంలో ఉన్న 1028 సూక్తాలలో 23 సూక్తాలు మాత్రమే స్త్రీలు ఋషులుగా ఉన్నారను విషయం తెలుపుతున్నాయి. వీరిలో

---

1) "ఉషస్తమస్యాం యశసం సువీరం
దాసప్రవర్గం రయమశ్వ యుధ్యం (ఋగ్వేద సంహిత 1-92-8)

మానవాంగనలై, బ్రహ్మవాదినులై వారివారి పేరులతో వున్న సూక్తాలకు నిజమైన కర్త్రిణులు అయినవారు ఋగ్వేదంలో 9 లేక 10 మంది కనిపిస్తున్నారు. వారు విశ్వవాద, అపాల, ఘోష, ఘోధ, లోపాముద్ర, శశ్వతి, రోమశ, గార్గి, మైత్రేయి మున్నగువారు."[1] వీరిలో 'వాన్' అనే ఆమెను గూడా చేర్చవచ్చును. అంతేగాదు. యజుర్వేదంలోను, అథర్వణ వేదంలోను, బ్రాహ్మణాలలోను కనిపించే మాటలను మనము పరిశీలించి నట్లయితే అవి ఇంచుమించుగా అన్నీ పురుషుడు పఠించినప్పుడు సార్ధకమౌతాయేగాని, స్త్రీలు పఠిస్తే సార్థకాలు కావు అని చెప్పబడినట్లు తెలుస్తుంది."[2]

కానీ ఋగ్వేదంలో స్త్రీ ప్రోక్తాలైన కొన్ని శ్లోకాలు కనిపిస్తున్నాయి. స్త్రీలు పఠించుటకు వీలగు కొన్ని మంత్రాలు కనిపిస్తున్నాయి. పూర్తిగా వేదాలు స్త్రీలందరికీ, అన్ని సమయాలందు నిషిద్ధమని చెప్పటానికి వీలు లేదు. ముఖ్యంగా గార్గి, మైత్రేయి. శాస్త్ర చర్చలలో పాల్గొన్నట్లుగా తెలుస్తున్నది. సృష్టిని గూర్చి గార్గి యాజ్ఞవల్క్యుని ప్రశ్న పరంపరలతో తర్కించగా... యాజ్ఞ వల్క్యుడు "ఓ గార్గీ! హద్దుమీరి అడుగవలదు. అట్లడుగుదువే నీ తల పగులును" అని శాసించినట్లుగా కనిపిస్తుంది. తాత్విక చర్చలలో పాల్గొని ప్రశ్నించడానికి స్త్రీలకు హక్కు వుందని గార్గి, మైత్రేయి రుజువు చేస్తున్నారు. కాని ఆ అవకాశాన్ని ఉపయోగించు కున్నవారి సంఖ్య వెళ్లమీద లెక్కించవచ్చును. ఇక సామాజికమైన సామాన్య స్త్రీకి విద్యా గంధం ఇసుమంతయినా లేకుండా చేసిన పురుషుడు ప్రకృతిని తన కనుకూలంగా మలుచు కొనడంతో పాటు స్త్రీని కూడా బానిసగా చేసుకున్నాడు.

ఆనాడు గురుకులంలో స్త్రీకి విద్య నేర్చుకొనే అవకాశం లేదు.[3] "సోదరుని లేక తండ్రి సహాయంతో కన్యగా ఉన్న కాలంలోనే విద్య

---

1) అఖిల భారత కవయిత్రులు - సంకలనం - ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

2) స్త్రీ వేదాధ్యయనానికి అనర్హురాలుగా వేదవేదాంగాలన్నీ ఘోషించాయి.

3) ఆనాటి విద్యలు "గురుకులం" లోనే సాధ్యములు.

నేర్చుకోవాలి. కాని గృహ ధర్మాలకు సంబంధించిన విద్యలు తప్ప తార్కికమైన. శాస్త్రీయమైన విద్యలు వారికి బోధించేవారు కాదు. ఐనా గురుకులాల్లోనే ఈ విద్యలు నేర్చుకోవటానికి సాధ్యమౌతుంది గానీ, గృహాల్లో వీలు గాదు.

స్త్రీలు తాత్వికమైన శాస్త్రీయమైన విద్యను గడించక పోవడం చేత పురుషులు శాస్త్రాన్ని తమ గుప్పెట్లో పెట్టుకొని తమ పురుషాధిక్యతను కొనసాగించారు. వారు నిర్మించుకొన్న శాసనాలను ఎదిరించడానికి స్త్రీలకు విద్యా బలం లేకపోవడం వల్ల బానిసలు కావలసి వచ్చింది.

## వేదకాలపు స్త్రీ - వివాహము

మాతృస్వామ్య వ్యవస్థను నాశనం చేసి పితృస్వామ్యం రాజ్య మేలుతున్న కాలమది. బహు భర్తృత్వం,[1] బహు భార్యాత్వం[2] రెండు ఏక కాలంలో మనుగడ సాగించిన కాలమది.

కొందరు స్త్రీలు అవివాహితలుగా పితృగృహమున జీవిస్తూ కన్యలు గానే కాలం గడుపుతూ ఎట్టకేలకు వివాహితలయ్యేవారు.[3] కొందరు బ్రహ్మచారిణులై బ్రహ్మవాదినులుగా జీవితం గడిపేవారు.[4]

---

1) Marriage and Family in India - Page 57, 58

2) ఉతహమస్మినం జయా పత్యాయే శ్లోక ఉత్తమః (ఋగ్వేద సంహిత 10-159-3) నేను సవతులను జయించు దాన నగుచున్నాను. కావున భర్తయందు నా యశస్సు ఉత్తమమైనది.

3) ఆ రోజుల్లో 'సమన' అనే ఉత్సవం జరుగుతుండేది. దానిలో ప్రజలు విరివిగా పాల్గొంటూ ఉండేవారు. గాయకులు పాటలు పాడేవారు. విలుకాండ్రు తన నైపుణ్యాన్ని ప్రదర్శించే వారు. గుఱ్ఱపు స్వారీ కూడా జరుగుతుండేది. యువతీ యువకులు తమ జీవిత భాగస్వాము లను ఎన్నుకొంటూ ఉండేవారు. ఈ ఉత్సవం తెల్లవార్లు జరుగు తూనే వుండేది.

"అయుజురశ్చిద్ధ దఘోయువం భగోగః "—ఋగ్వేద సంహిత - 10-393 అశ్వినీ దేవతలారా మీరు పితృ గృహములో జీవించుచున్న స్త్రీని, రూప వతిని చేసి ఆమెకు పతినిచ్చితిరి. (60 సం॥ల ప్రాయంలో వివాహం చేసు కున్న స్త్రీ గాథ)

4) ఋగ్వేదం-243వ పేజి, ప్రథమ మండలం, 122వ సూక్తం, 5 శ్లోకం

అవివాహితలైన కన్యలను యమునికి ఇచ్చి వివాహం చేసే వారు.[1] పురుషుడు అనేక మంది భార్యలను చేసుకొనుట అనాడు స్పష్టంగా కనిపిస్తుంది. వేదాలలో పెక్కుచోట్ల సవతుల పోరును[2] గురించి చెప్పబడి ఉండుట వలన ఈ ఆచారం చాలా ఎక్కువగా కూడా వున్నట్లు మనకు తెలుస్తుంది. ఇద్దరు, ముగ్గురు కాక యాబది మంది వరకు భార్యలున్నట్లు మనకు ఈ క్రింది ఋక్కుల వలన తెలుస్తున్నది.

"ఆదాన్మే పౌరుకుత్స్యః పంచాశతం త్రసదస్యుర్వధూనాం"
ఋగ్వేద సంహిత - 8-19-36.

(పురుకుత్స కుమారుడగు త్రసదస్యుడు నాకు యాబదిమంది భార్యలను ఇచ్చి యున్నాడు.) అయినప్పటికీ బాల్య వివాహాలు ఆచారంగా లేవు. జీవిత భాగస్వామిని యెన్నుకొనడానికి పూర్తిగా స్వాతంత్ర్యం వుంది. వరకట్నం, కన్యాశుల్కం అంగీకరించ బడ్డాయి. కర్మ కాండలలో పుత్రుడు ప్రధానంగా చేయబడటం వలన అతని పుట్టుకకు ప్రాధాన్యత నివ్వడం జరిగింది. అయినప్పటికీ స్త్రీలు స్వతంత్రంగానే వున్నారు. కానీ ఆనాటి గ్రీకు స్త్రీలకున్నంత స్వేచ్ఛ లేదు.

## వేదకాలపు స్త్రీ - ధనము

ఆనాడు స్త్రీకి 'దాయ' భాగమున్నట్లుగా కన్పించుట లేదు. సోదరులు లేని స్త్రీకి మాత్రం తండ్రి ఆస్తి సంక్రమించేది. స్త్రీలు పితృ ఖర్మలు చేయుటకు అనర్హులు. అందువలన ఆమె బాధ్యతను ఆమెభర్త నిర్వహించేవాడు. భర్త లేనప్పుడు తండ్రి ఆస్థిలో ఆమెకు భాగంలేదు. వితంతువుకు భర్త ఆస్తిలో భాగం పొందుటకు అర్హత వున్నట్లు తెలుస్తున్నది.

---

1.) Women in the Vedic age — Page. 44. By Sakuntala Rao Sastry.

2.) సమ్మాతపంత్యభితస్సపత్నీరివ పార్శ్వవః - ఋగ్వేద సంహిత 1-105-81

(సవతులు భర్తను పీడించునట్లు నన్నీ పార్శ్వపుటెముకలు పీడించుచున్నవి.)

"జాయేవ పత్య ఉశతీసువాసా
ఉషాహ్రేవ నిరిణీతే అప్సః" (ఋగ్వేదసంహిత, I-124-7)
(వితంతువు తన ధనమును పొందుటకు న్యాయస్థానమునకు వెళ్ళునట్లు ఉషోదేవత ఆకాశము పైకి వెళ్ళు చున్నది.)

అయితే స్త్రీ - చర్మపు పనులు, లోహపు పనులు. చాపలునేయుట మొదలగు పనులు చేస్తున్నట్లుగా చెప్పబడినది. ఈ విధంగా సేవచేసి ధనాన్ని సంపాదించే స్త్రీలు స్వల్ప సంఖ్యలోనే వున్నారు. ఆనాడు స్త్రీలు రాజాస్థానంలో సేవకురాండ్రుగా కూడా ఉన్నారు.

బంధుమిత్రులు యిచ్చే నగలు, కట్నాలు, కానుకలు మున్నగు ధనమే వేదకాలం నాటి స్త్రీల యొక్క ఆస్తిలో ప్రధానమైనది. ఎక్కడ చూచినా స్త్రీలు ఆభరణాలతో భూషితులైనట్లే కనిపిస్తున్నది.[1] ఈ ఆభరణాలు తరచుగా వివాహ సమయాల్లో పుట్టింటివారు పెడుతున్నవే.

కుమార్తె తన తండ్రి ఆస్తిలోని భాగం ఆశించేది కాదని, వస్త్రాలంకారాదులనే తండ్రి నుండి కోరుతుండేదని చెప్పడానికి చాలా ఆధారాలు ఉన్నాయి.

## వేదకాలపు స్త్రీ - కర్మకాండ

ఋగ్వేదాన్ని బట్టి చూస్తే సోదరులు లేని కన్యను మాత్రమే 'పుత్రిక' అని పిలిచేవారు.[2] ఆ కన్యకు సోదరులు లేని కారణం చేత పితృ కర్మలు చేయడానికి అధికారికంగా అవకాశం ఇవ్వబడింది. ఈమెకు వివాహం అయినప్పటికి ఈ హక్కును ఆమె కలిగి వుండేది.

---

1) "సుసంకాశా మాతృమృష్టేవ యోషావిస్తన్వం కృణుషే దృశేకమ్।
భద్రాత్వం భాషోవితరం వ్యుచ్ఛన తత్తే అన్యా ఉషసోన శాస్త్రా॥"

ఓ ఉషో దేవతా! తల్లిచే అలంకరింప బడిన స్త్రీ వలె మిగుల ప్రకాశించు చున్న నీవు నా దేహమును సర్వజన ధర్మమునకు సుఖమగునట్లు ప్రకాశింప జేయుచున్నావు, కనుక అందరిచే స్తుతింపబడి అంధకారమును పోగొట్టుము. మరియు ఆ చీకటినణగించు పని ఇతర ఉషస్సులు చేయజాలవు.

2) Women in the Vedic age, Page - 4

యజ్ఞయాగాదులు భార్యా భర్తలిరువురును కలిసే చేసేవారు. ప్రత్యేకంగా పురుషుడుగాని, ప్రత్యేకంగా స్త్రీగాని చేసేవారు కాదు.[1] స్త్రీకి భర్తతోపాటు కర్మ చేయటానికే కాక, కర్మ ఫలం అనుభవించటానికి కూడా అర్హత ఉన్నట్లుగా తెలుస్తున్నది. మొత్తం మీద స్త్రీకి గృహ సంబంధమైన కర్మ కాండల విషయంలో ప్రాధాన్యత ఇవ్వబడినట్లు కొన్ని మంత్రాలు చెప్తున్నాయి.

## వేదకాలపు స్త్రీ – పునర్వివాహం

ఆ రోజుల్లో భర్త చనిపోయినప్పుడు భర్త శవం ప్రక్కన భార్యను పరుండబెట్టి ఈ మంత్రాన్ని చదివేవారు.

"ఉదీర్ష్వ నార్యభి జీవలోకం
గతానుయే తము పశేష ఏహి ।
హస్తాగ్రాభస్య నిధి షోస్తవేదం
పత్యుర్జ నిత్యమని సంబ భూవ ॥"

("ఓ నారీ! చనిపోయిన నీ భర్త యొద్ద పరుండి యున్నావు. ఇచట నుండి లెమ్ము. బ్రతికియున్న వారి కడకు రమ్ము. నీ పాణిని గ్రహించి నిన్ను మరల వివాహము చేసికొన గోరుచున్న పతితో నీ భార్యాత్వమును పొందుము.")

పై శ్లోకమును బట్టి వేదకాలంలో పునర్వివాహములు అంగీకరింపబడినవి. సాధారణంగా భర్త సోదరుని మాత్రమే వివాహ మాడటం జరిగేది. అంతేగాక విధవగానే యుండి తన పుత్రులతోకలిసె భర్తృగృహ మందుండటం కూడా అంగీకరింపబడు తుండేది. పుత్రులు లేని పక్షంలో భర్త సోదరునితో నియోగము చేసుకొనుటకు అవకాశమున్నది,

---

1. "విల్యాత స్త్రీధునా!"
(ఓ ఇంద్రుడా! నిన్ను ప్రేమించి దంపతులు యజ్ఞము చేయుచున్నారు.)

# వేదకాలపు స్త్రీ — స్వేచ్ఛ

ఆ కాలంలో వేద ధర్మాన్ని ఎదిరించటానికి స్త్రీకి స్వేచ్ఛ లేదు. స్త్రీల హృదయాలను తోడేళ్ళ హృదయాలతో సమానంగా భావించి అవమానించటం జరిగింది.[1] స్త్రీలను శాశించడానికి వీలులేని చంచల స్వభావలగా కూడా తలంచారు.[2] స్త్రీలు స్నేహపాత్రులు కారనియు తెలుపబడింది.[3] గొడ్రాలైన స్త్రీని యమునికి బలివ్వమని కూడా ఉన్నది.[4]

అధర్వణ వేదంలో (7-38-4), మైత్రేయ సంహితలో (3-63) స్త్రీలు పాచికలతోను, మద్యంతోను పోల్చబడినారు. స్త్రీ మానవ సమాజానికి దుఃఖకారణంగా భావింప బడింది. అంతేగాక శని దేవతగా కూడా వర్ణింప బడింది.

ఆ రోజుల్లో 'వరుణ ప్రఘాస' అనే వ్రతం ఒకటి వుండేది. భార్య భర్తకు ఎంత విశ్వాస పాత్రురాలో చెప్పించడం దీనిలోని నియమం. తన కెంతమంది ప్రియులున్నారో అన్ని దర్భలను క్రింద పడవేయాలి. ఆ తరువాతనే ఆమె వ్రతంలో పాల్గొనడానికి అర్హురాలు.

ఆ రోజుల్లో జరిగే రాజసూయ యజ్ఞంలో ఒక అశ్వాన్ని వదిలేవారు. ఆ అశ్వం తిరిగి వచ్చిన తరువాత దానితల ఖండించి ఆ శవం ప్రక్కన పట్టపు రాణిని పరుండబెట్టి ఒక పవిత్ర వస్త్రం కప్పేవారు.

---

1) సాలావృకాణాం హృదయాన్యేతా (ఋగ్వేద సంహిత - 10-95-15)
స్త్రీల హృదయములు తోడేళ్ళ హృదయములే.

2) స్త్రియాయశ్వాసం మనః (ఋగ్వేద సంహిత - 4-33-1)
స్త్రీల మనస్సు శాసించుటకు వీలు లేనిది.

3) న వైస్త్రైణాని సఖ్యాని సన్తి (ఋగ్వేద సంహిత - 10-95-15)
స్త్రీలతో స్నేహమనునది ఉండకూడదు.

4) యా మా యా సూం
గొడ్రాలిని యముని కొఱకు చంపవలెను.

అయితే ఆ రోజులలో స్త్రీలు యుద్ధాలలో పాల్గొనేవారని, సారధ్యం వహించేవారని, విల్లంబులు వేసేవారని తెలుస్తున్నది. చిత్రలేఖనం, సంగీతం, నాట్యం కూడా స్త్రీలు అభ్యసించేవారని కొన్ని ఋక్కులను బట్టి అవగతమవుతున్నది.

## దస్యస్త్రీలు

ఆర్యులు హరప్పా, మొహంజదారో వాసులతో భయంకర పోరాటాలు చేశారు. సింధూజాతి నగరాలను, సంస్కృతిని ధ్వంసం చేశారు. ఆర్యులు ఆ తరువాత కొండజాతుల పైన, భారత దేశంలోని వివిధ తెగల పైన యుద్ధం చేశారు.

ఆర్యులు తమ విరోధులందరిని సింధూజాతి వారని, కొండజాతి వారని, కృష్ణ యోనులని, దాసులని, దస్యులని అన్నారు.

దస్యుల్లో పురుషులతో బాటు స్త్రీలు కూడా యుద్ధం చేశారు. ఆర్యులు తమ స్త్రీలకు ఆయుధాలు ఇచ్చేవారు కాదు. దస్యులు స్త్రీలను ఆయుధంగా చేసుకొని యుద్ధం చేసినట్లు ఋగ్వేదంలో చెప్పబడింది. ఇంద్రుడు "దస్యుల 'అబలా సైన్యం' నన్నేమి చేస్తుంది"—అని అనడాన్ని బట్టి ఆర్యులు స్త్రీలను అబలలుగా భావించారు. 'అబలా' శబ్దం మొట్టమొదటగా ఋగ్వేదం 5-30-9 వ సూక్తంలో వాడినట్లు రాహుల్ సాంకృత్యాయన్ పేర్కొన్నారు.

ఆర్యులను ఎదిరించి పోరాడిన దస్య వీరులు చమురి, ధుని, పిప్రి, శంబర, శుష్ణ [1] పృషా శిప్రిడ, [2] మేయువ, వృత్ర [3] అశున, వ్యంశ, రుధిక్ర [4] బల్బూతుడు, వశ, అశ్వప్రతుర్రుడు [5] ప్రధానులు. వీరితో కలిసి స్త్రీలు యుద్ధాల్లో పాల్గొన్నారు.

---

1) ఋగ్వేదం - 6-18-8
2) ఋగ్వేదం - 7-99-4
3) ఋగ్వేదం - 1-103-8
4) ఋగ్వేదం - 2-14-5
5) ఋగ్వేదం - 8-46-32

ఆర్యులతో పోరాడిన దస్యు వీరులను రాక్షసులుగా వర్ణించారు. వారి స్త్రీలను కూడా రాక్షసులగానే ప్రచారం చేశారు. శంబరాసురుడని, వృత్రాసురుడని వైదిక వాఙ్మయంలో వాడ తూవచ్చారు. శంబరుడు అతని జాతివారు ఆర్యులతో 40 సంవత్సరములు అవిశ్రాంతంగా పోరాడారు. ఆ యుద్ధంలో లక్షలాది సంఖ్యలో దస్యులు మరణించారు. వారిలో స్త్రీలు పెక్కు సంఖ్యలో వున్నారు. ఆర్య స్త్రీలు చాలా తక్కువ సమయాల్లో మాత్రమే ఆయుధాలు పట్టారు. ఆర్యులు స్త్రీల యుద్ధ కౌశలాన్ని నిరసించారు.

## ఋషికలు

"ఋక్కులను రచించిన పురుషులను ఋషులని, స్త్రీలను ఋషికలని అన్నారు. ఋషికల సంఖ్య ఋగ్వేదంలో రెండు డజనుల కంటే తక్కువేమీ లేదు. కానీ పరిశీలించి చూస్తే వారిలో చాలామంది మానవులు కాదని, కల్పితమని తోస్తుంది. ఘోషా, విశ్వవారాలను మాత్రం చారిత్రిక ఋషికలుగా విశ్వసిస్తున్నారు. ఋషికల పేరుతో ఋగ్వేదంలో సంగ్రహింపబడిన ఋక్కులను రచించినవారు రచయిత్రులని చెప్పుట కష్టం. అయితే ఈ ఋక్కుల వలన ఆర్య స్త్రీల జీవితాన్ని గురించిన అనేక విషయాలు తప్పక తెలుస్తాయి. ఈ కల్పితమైన అకల్పితమైన ఋషికల సూక్తాలు కొన్ని దిగువ యివ్వబడినాయి."[1]

**అదితి** :— ఋగ్వేదంలోని 10వ మండలంలోని 72వ సూక్తం బృహస్పతి లేక అదితి రచించినట్లు చెప్పుతారు. అదితిని దక్షపుత్రిక అన్నారు. ఈమెకు ఎనిమిండుగురు కుమారులు కలిగినట్లు, వాటిని తీసుకొని దేవతల వద్దకు వెళ్ళినట్లు చెప్పబడింది. మిత్ర. వరుణ, ధాత. ఆర్యమా, అంశ, భగ, వివస్వాన్, ఆదిత్య వీరు అదితి పుత్రులు,

**ఇంద్ర మాతలు** :— (10-15-3) సూక్తంలో "కర్మరతులైన ఇంద్రమాతలు ఇంద్రుడు పుట్టినప్పుడు సువీర్యాన్ని గ్రహిస్తూ దగ్గరకు వచ్చారని" చెప్పబడింది.

---

1. ఋగ్వేద ఆర్యులు — 228 వ పేజీ

ఇంద్రాణి :— (10-145) సవతిపై ఆగ్రహమున్న స్త్రీగా యీ సూక్తాల్లో వర్ణింపబడింది. (10-86). యీ సూక్తాల్లో అగ్నికి అధిక గౌరవమిస్తున్నందుకు ఇంద్రాణి సహించ లేక ఇంద్రుని అధిక్షేపిస్తున్నట్లు వర్ణించ బడింది.

ఊర్వశి :— అప్సరసగా వర్ణింప బడింది. ఊర్వశీ పురూరవుల ప్రేమ కథను వారే రచించుకొన్నట్లుగా (10-95) సూక్తం చెబుతుంది. తనను విడిచి పోతున్న ఊర్వశిని పురూరవుడు తనను విడిచి పోవద్దని బ్రతిమాలుతాడు. కాని ఊర్వశి అతను చెప్పేది ఏమీ వినిపించుకోకుండా "స్త్రీలలో ప్రేమ వుండదు. వారి హృదయాలు తోడేళ్ళ వంటివి" అనేస్తుంది. (10-95-15) వశిష్ఠుడు ఈ ఋక్కులను రచించి ఉండవచ్చునని రాహుల్ భావించారు.

ఘోష :— కక్షీవానుని కుమార్తె. అశ్వనీ కుమారులిద్దరినీ స్తుతిస్తూ 'ఘోష' రెండు సూక్తాలను రచించింది. (10-39-40) ఈమె రాజకుమార్తె. చక్కని రచన చేస్తుంది. ఏ ఋషికి తీసిపోని శైలిలో రాస్తుంది. ఆమె రచించిన రెండవ సూక్తంలో అశ్వనీ కుమారులకు తన కోరిక నెరిగించి వరము అడుగుతుంది. "యువకుడు యువతి ఇంట్లో ఎట్లు ఉంటాడో నాకు తెలయదు. మీరే ఆ యువకునికి తెలపండి, భార్యయందు ప్రేమ కలవాడును, పరాక్రమము కలవాడును యువకుడును అయిన వాని ఇంటికి నేను వెళ్ళాలనుకుంటున్నాను. ఓ అశ్వనీ కుమారులారా! నా యీకోర్కెను నెరవేర్చండి,"

సప్తసింధూలోని ఆర్యకన్యలకుండే కోరిక ఘోష సూక్తం ద్వారా తెలుస్తుంది. ఆరోగ్యవంతుడు, వీరుడు అయిన భర్తను వారు కోరుకుంటున్నారు.

జుహూ :— ఈమె బ్రహ్మ వాదినిగా చెప్పబడింది. ఈమె రచించిన సూక్తాల వలన (10-109) ఈమె భర్త బృహస్పతియని, ఆతడు ఈమెను వదిలివేయగా ఆతనికి నచ్చచెప్పి దేవతలు ఈమెను అతనికి కలిపారని అర్ధమవుతుంది. ఈ పేరు కల్పించ బడిందని రాహుల్ భావించారు.

ఇలాగే 'దక్షిణ' అనే పేరున కూడా పదవ మండలంలో సూక్తాలున్నాయి. "దానం చేసినవారు ఉన్నతమైన ద్యోలోకమునకు వెళతారు. అశ్వములను దానము చేసినవారు సూర్యునితో పాటు వుంటారు. బంగారాన్ని యిచ్చినవారు అమరత్వాన్ని పొందుతారు. వస్త్రములను ఇచ్చినవారు సోమునిచేత ఆయుష్షును పొందుతారు" అని ఆమె పేర్కొంది. ఇంకా దానాన్ని గురించి ఈమె చెప్పింది.

యమావైవస్వతి :— ఈ పేరు మీదకూడా సూక్తాలున్నాయి. ఇది కూడా కల్పిత నామమేనని పరిశోధకులు భావిస్తున్నారు. వివస్వాన్ పుత్రియైన 'యమి' తన అన్న అయిన 'యముని' ప్రేమించింది. వారి రువురి సంవాదాన్ని పరిశీలిస్తే మనకు ఆనాటి పరిస్థితి అర్థమవుతుంది.(10.10)

యమి : విశాల సముద్రమును చేరిన ఈ స్థానమందు సఖినై నిన్ను సఖునిగా కోరుతున్నాను. విధాతను యెక్కువగా ధ్యానించి భూమిపైన తండ్రి సంతానమును వుంచాడు.

యముడు : నేను సఖుడనై ఈ సఖ్యతను కోరను. ఎందుకంటే నీవు నా సోదరివి. ఇందులకు తగవు. విశాల ఆకాశాన్ని ధరించు పరమ దేవులయొక్క వీర మహా పుత్రులు నలుపైపుల నుంచి మనలను చూస్తున్నారు.

యమి : ఇది మానవులకు ఉచితం కాకపోయినా ఆ అసురులు దీన్ని కోరుతున్నారు. నా విషయంలో నీవు మనస్సు ఉంచుము. మనకు జన్మించే పుత్రుని కనుటకు నా శరీరమందు ప్రవేశింపుము.

యముడు : మనం పూర్వమెప్పుడు ఇటువంటిది చేయలేదు. సత్యవాదులమైన మనం అబద్ధం ఎట్లు ఆడగలం? జల గంధర్వులు, జల యోష (స్త్రీ) అదే మన పరమ సంబంధం. మన బంధుత్వం.

యమి : యమునిపట్ల యమి అయిన నాకు కోరికవుంది. ఒక స్థానమందు జంటగా నిద్రించుటకుగాను వచ్చాను. భర్త కొరకు భార్యవలె నేను నా శరీరాన్ని బహిరంగ పరుస్తాను. రథంయొక్క పెద్ద చక్రంవలె మనమిద్దరం ప్రేమించుకొందాం.

యముడు : భగినులు అభగినులయ్యే కాలం మున్ముందు తప్పక వస్తుంది. మరియొక వృషభముయొక్క బాహువును ఆలింగనం చేసుకొనుము. ఓ సుభగా! నేను కాకుండా మరియొకరిని పతిగా చేసికొనుము.

యమి : అన్న ఉండగా చెల్లెలు అనాథ అయితే ఆ సోదరుడు ఎందుకు? దుఃఖపడే ఆ చెల్లెలు ఎందుకు? కామమునకులోనై నేను ఇదంతా చెప్తున్నాను. నీ శరీరంతో నా శరీరాన్ని తృప్తి పరుచుము.

యముడు : నేను శరీరంతో నీ శరీరాన్ని ముట్టుకోను. చెల్లెలితో సంపర్కాన్ని పాపమన్నారు. నాకు భిన్నమైన వానితో నీవు ఆనందించుము. ఓ సుభగా, నీ సోదరుడు ఇట్లు ఆచరించ తలచుట లేదు.

యమి : ఓ యముడా, నేను నీ మనస్సును, హృదయాన్ని అర్థం చేసుకొనలేక ఉన్నాను. వృక్షాన్ని తీగవలె లేక తాడువలె కలిసి మరొక స్త్రీ నిన్ను కౌగిలించు కొంటుంది.

యముడు : ఓ యమీ, అన్యుని కోరుము. మరొకడు నిన్ను చెట్టును తీగవలె ఆలింగనము చేసికొను గాక. అతని మనస్సును నీవు కోరితే లేక అతడు నిన్ను కోరితే మీకు మంగళకరమైన సంబంధం కల్గుగాక."

దీన్నిబట్టి ఆర్యుల్లో అన్నాచెల్లెళ్ళ వివాహము నిషిద్ధంగా వున్నట్లు తెలుస్తుంది. 'ఇక్ష్వాకు' వంటి ఉన్నత వంశాల్లో అన్నాచెల్లెళ్ళ వివాహాలున్నట్లు అర్థమవుతుంది. జాతక కథల్లో సీతారాముల వివాహం కూడా అన్నాచెల్లెళ్ళ వివాహంగా చెప్పబడుతుంది. 'దశరథ' జాతక కథ దీనికి ప్రమాణం. థాయిలాండు రాజ వంశాల్లో వున్నట్లుగా 'ఇరాను' లోని "సాసానీ" రాజ వంశంలోకూడా ఈ ఆచారం వున్నట్లు ఈజిప్టులోని ఫర్హా వంశీకులలోకూడా ఈ ఆచారం వున్నట్లు రాహూల్ సాంకృత్యాయన్ తన పరిశోధనల్లో తెలిపారు.

**భారద్వాజి, రాత్రి** కూడా కల్పిత ఋషికలుగానే భావిస్తున్నారు. వశిష్ఠుని సోదరుడైన అగస్త్యుని భార్య **లోపాముద్ర** పతి వియోగమును

భరించలేని లోపాముద్ర అగస్త్యునితో జరిపిన సంవాదం ఈ సూక్తమందున్నది. (1.179)

ఇంద్రుని పుత్రుడగు వసుక్రుని భార్య పేరుమీద ఒక సూక్తం ఉంది. అంభృణఋషి కుమార్తె వాక్కు. వాక్కు కల్పిత నామమే. వాక్కు, విశ్వవార, విశ్వల, విశ్వవార, శచి, శశ్వతి, శిఖండిని, కాశ్యపి, శ్రద్ధాకామాయని, పరమ, సార్పరాజ్ఞి, సిక్తా, సుదేవి మొదలగువారి పేర్లతో ఉన్న సూక్తాల్లో ఆ కాలంలో వున్న ఆర్య సంస్కృతి మనకు సువ్యక్తమవుతుంది.

సూర్య :- సూర్యుని భార్యగా చెప్పబడుతున్న ఈమె పేరుమీద వున్న ఋక్కులను వివాహ సమయంలో చదువుతారు. ఈ సూక్తాలకు ప్రాధాన్యత ఉంది.

ఋగ్వేదంలోని ఋషికల సంఖ్య రెండు డజనులు వున్నప్పటికి వారిలో చారిత్రక ఋషికలుమాత్రం ఘోష, విశ్వవారలు, ఈ సూక్తాల వలన కొందరు స్త్రీలకు ప్రాధాన్యం వుందని తెలిసింది. తమకు ప్రాధాన్యం రావడం కోసం కొంత సంఘర్షణకూడా స్త్రీలు చేశారు.

ఋగ్వేదకాలంలో స్త్రీల వ్యవస్థ మాతృస్వామ్య వ్యవస్థను శిథిలం చేసి పితృస్వామిక వ్యవస్థను రూపొందించే సంఘర్షణకు సంబంధించినది. భారతదేశంలోని స్త్రీ స్వేచ్ఛా సమానత్వాలను నిలుపుకోడానికి సంబంధించిన తపన కోల్పోతున్న ఆవేదన మనకు ఈ కాలంలో కన్పిస్తున్నాయి. విద్య, సంస్కృతి, కళలు, స్వేచ్ఛ ఒకప్రక్క కన్పిస్తూనే, మరొక ప్రక్క శిథిల మవుతున్న దశ ఈ కాలంలో మనకు దృగ్గోచర మవుతుంది. పురోగమనానికి, తిరోగమనానికి జరిగే సంఘర్షణ ఈ యుగంలో అభివ్యక్తమయింది.

# బహు భర్తృత్వం

ఆర్య అనార్య జాతుల సంస్కృతులు, వైరుధ్యాలు చర్చించడం భారతీయ సంస్కృతిని చర్చించడంలో ఒక ప్రధానాంశం. స్త్రీకి సంబంధించిన అనేక ఆచారాలు, ఆర్య అనార్యులపై పరస్పరం ప్రతిస్పందిస్తూ వచ్చాయి. ఈ రెండు సంస్కృతుల్లోను స్పష్టంగా కనిపిస్తున్న బహు భర్తృత్వం గూర్చి పరిశీలించినట్లయితే స్త్రీకి సంబంధించి మాతృస్వామికత్వం పునాదిగా కలిగిన అనేక అంశాలు ఆర్యుల నుండి అనార్యులకు అనార్యుల నుండి ఆర్యులకు సంక్రమిస్తూ వచ్చాయనేది స్పష్టమవుతుంది.

భారతదేశంలోని ద్రావిడ జాతుల్లో అతి ప్రసిద్ధులైన కోండులు బహు భర్తృత్వాన్ని అతి ప్రాచీన కాలం నుంచి పాటిస్తున్నారు. వీరిలో ఇప్పటికి కూడా ఇదే ఆచారం పాటింపబడుతూ ఉంది. కోండులు తమ్ముళ్ళకు పెండ్లి అయ్యేవరకు అన్న భార్యతోవుండే అవకాశాన్ని కలిగివున్నారు. వీరికి అతి దగ్గరలో వుండే అనార్య జాతుల్లో ప్రసిద్ధులైన గోండులు కూడా ఇదే సంప్రదాయాన్ని అనుసరిస్తూవున్నారు. వీరు "బీహార్" లో విస్తారంగా వున్నారు.[1]

ఉత్తర భారతదేశంలో అతి ప్రసిద్ధి చెందిన తెగల్లో "భూయియా" అనే తెగ ఒకటి, "భూయియా" అంటే "భూనేతలు" (The lords of Soil) అని అర్థము. వీరిలో పెద్దవాని భార్య అవివాహితులైన అతని సోదరులకు కూడా భార్యగా వ్యవహరిస్తుంది.[2]

---

1) R. V. Rassell, Tribes and Castes of the Central Provinces of India. P. 468
The Imperial gazetter of India Vol. XV P. 231
Quoted the Mothers 674

2) I bid.

భారతదేశంలో విస్తారంగా వ్యాపించి ఉన్న సంతాలులలో అన్న భార్యమీద తమ్ముళ్ళకు ఎలాంటి హక్కు వుందో భార్య చెల్లెళ్ళ మీద కూడా అతని తముళ్ళకు అంతే హక్కు వుంది. అంతేగాక సంతాలులలో కుటుం బాలకు కుటుంబాలకు మధ్య గుంపు పెళ్ళిళ్లుకూడా జరుగుతాయి. అవి వారి సాంఘిక వ్యవస్థలో భాగమయ్యాయి.

"A Samtal Uncle is permitted a good deel of freedom or intercourse with his wife's nieces"[1]

సంతాలుల మేనమామకు భార్య మేనకోడళ్లతో కూడా లైంగిక స్వాతంత్ర్యం ఉంది. ఇటువంటి అవకాశమును కొన్ని ప్రత్యేక సందర్భాల్లో మాత్రం వినియోగించుకునే వారు. ఇదే పద్ధతి బెంగాలులో వున్న కొన్ని జాతుల్లో కనిపిస్తూ వుంది.

ఈ పద్ధతి కేవలం ప్రవర్తన మీద ఆధారపడి నిర్మించ బడటం కంటే ఆయా జాతుల్లో వున్న జనాభాలో పురుషుల సంఖ్య ఎక్కువగా వుండటం కూడా దీనికి దారి తీసినట్లుగా పరిశీలకులు కొందరు అభిప్రాయ పడుతున్నారు.

మానవ జాతుల్లో ప్రారంభంనాటి సంస్కృతి, సంపద ఉమ్మడిగా వుండే పద్ధతిలో ఇది సహజంగా అనుసరించ బడిందని లైంగికత్వం ప్రధానం కాదని కొందరు సామాజిక శాస్త్రవేత్తలు నివేదిస్తున్నారు.

ఉత్తర భారతంలో బహు భర్తృత్వం అమలులో ఉన్న జాతులు హిమాలయ ప్రాంతంలో యెక్కువగా వున్నాయి. అరణ్య ప్రాంతాల్లోను ఉత్తర మధ్య భారత ప్రాంతాల్లోను ప్రాచీనజాతుల్లో బహు భర్తృత్వం అనేక వలసల ప్రభావాలకుఅతీతంగా వుండి పోయింది.

దక్షిణ భారతంలో చాలా జాతుల్లో వలసల ప్రభావానికి దూరంగా తమ సంస్కృతులను నిలుపుకొన్నాయి.

---

1) C. M. Graven సంతాలుల మీద చేసిన పరిశోధనా గ్రంథాల నుండి బ్రిఫాల్ట్ సేకరించారు. (ది మదర్స్ - పేజి 674)

ద్రావిడుల్లోను, టిబెటెన్‌లలో ఉన్న బహు భర్తృత్వ విధానాలు ఆర్యుల్లో కూడా కనిపిస్తున్నాయి. పంజాబులోను, హిమాలయ పరిసర ప్రాంతాలలోను నివసించే అనేక జాతుల్లో బహు భర్తృత్వం ఉంది రాజస్థాన్‌లోని రాజపుత్రులు. పంజాబులోని జాట్స్ ఆర్య జాతులకు చెందిన వారుగా కనిపిస్తున్నారు. వీరిలో బహు భర్తృత్వ లక్షణాలు వున్నాయి. ఆర్య సంస్కృతికి పీఠభూమిగా "డెహరాడోన్" ఉండేది. ఇది వైదిక సంస్కృతికి మూలంగా కూడా వుండేది. ఆ ప్రాంతాల్లో బహుభర్తృత్వం విస్తారంగా కనిపిస్తుంది.

The custom of polyandry is supposed to promote good fellow-ship among brothers"

ఈ బహుభర్తృత్వ పద్ధతి సోదరుల మధ్య అనుబంధాన్ని పెంచడానికి ఉపకరించేదని కొందరు పరిశోధకులు భావించారు.

అత్తగారు ఒక పసివాణ్ణి కనిపోతే కోడలు ఆ బాలుణ్ణి పెంచి, పెద్ద చేసి భర్తగా స్వీకరించేదని "విలియమ్స్" పేర్కొన్నాడు.

1874 ప్రాంతంలో రాజపుత్రులు, బ్రాహ్మణ జాతులకు సంబంధించిన చట్టాలలో కూడా ఈ పద్ధతికి బ్రిటీషువారు అనుమతి కలిగించారు.

"ఈ జాతుల్లో నలుగురు అన్నదమ్ములకు ఒకరుగాని, ఇద్దరుగాని భార్యలు వుండి వారికి స్త్రీ సంతానం కలిగివుండేటట్లయితే సోదరులలో ఒకరు వివాహం చేసుకోవచ్చు. మొదట కలిగిన సంతానం బాధ్యతను వివాహితుడు వహించ వలసిన అవసరం లేదు" అని అప్పటి బ్రిటీషు ప్రభుత్వం బహు భర్తృత్వాన్ని చట్టం చేసింది.

"If, according to custom, four brorhers have two or perhaps one wife between them, and four or five daughters are born, and one of the brothers marries again, the children are not shared between them, but remain with the women,"[2]

---

1) G. C. R. C. విలియమ్స్ రాసిన "హిస్టారికల్ అండ్ స్టేటిస్టికల్ మెమోయిర్ ఆఫ్ డెహరాడోన్" అనే పుస్తకం నుండి బ్రిఫాల్టు కోట్ చేశారు — ది మదర్స్ పేజి 678.

2) అదే పుస్తకం నుండి

రాజపుత్రుల్లో బహు భర్తృత్వం ఒకే తల్లి సంతానమునకు పరిమితం చేయబడింది. రాజపుత్రుల్లో ఉన్నత కుటుంబాలకు చెందిన స్త్రీలలో కూడా భర్తలను ఎన్నుకొను విషయంలో పూర్తి స్వేచ్ఛ ఉండేది. అయితే కొత్త వ్యక్తిని భర్తగా స్వీకరించేటపుడు మొదటి భర్తకు అయిన పెండ్లి ఖర్చును తిరిగి ఇచ్చి వేయవలసి ఉంటుంది.

బహు భర్తృత్వాలు అమలు జరిగే జాతుల్లో "వదినె" చాలా కీలకమైన పాత్ర వహిస్తుంది. ఆమె ప్రాధాన్యత ఎంత కీలకమైందో ఆమె బాధ్యతకూడా అంతే ప్రధానమైనది. ఆమె ఉమ్మడి ఆస్థిగా భావించబడటం జరిగేది. అందరిని ఆమె సొంతం చేసుకోగలిగి వుంటుంది. రాజపుత్రులలోని అన్ని కులాల్లో ఈ పద్ధతి అనుసరణీయంగా ఉంది. పరిశీలకులకు ఈ పద్ధతి ఒక వింత అనుభూతిని కలిగించినా, ఆ సమాజములో బహు భర్తృత్వం చాలానిబ్బరంగా, సజావుగా సాగిపోతూవుంది. బ్రాహ్మణ ధర్మాలు ఈ పద్ధతికి రక్షణ కవచంగా వ్యవహరించాయి.

బహు భర్తృత్వం అమలులో ఉన్న జాతుల్లో ఒకరినొకరు నిందించుకొనే సమయంలోకూడా బహు భర్తృత్వ ఆచరణలోపాలేనని గుర్తించబడేవి. అన్న భార్య మిగిలిన మరుదులతో లైంగిక సంబంధాలు సరిగా పంచుకోలేక పోవడం ఆమె లోపంగా భావించబడేది. ఆమె ఇతర స్త్రీల చేతను మరుదులను ఎట్లా చూస్తున్నదో తెలియనిదా! అని నిందించబడేది.

హిందూకుష్ పర్వత ప్రాంతాలలో చిత్రాల్ ప్రాంతంలో ఉన్న ఆర్య జాతుల్లో బహుభర్తృత్వం ఆచరింప బడుతూనే ఉంది. టర్కీ మొదలగు ప్రదేశాలలో విస్తరించివున్న ఇండో ఆర్యులలోకూడా ఈ సంప్రదాయం అనుసరణీయంగా ఉండేది. ఈ బహు భర్తృత్వంలో స్త్రీ పాత్ర చాలా గణనీయమైంది. అందరి ఆలోచనలకు కూడలిగా, ఉమ్మడి సంపదగా, ఉమ్మడి సంపద వారసుల సృష్టికర్తగా ఆమె వ్యవహరించేది. మానసికమైనఎన్నో చిక్కుముడులకు తానుసమాధానంగా,సంధాన కర్తగా ఉండేది. అంతఃస్పర్ధల నిరోధకురాలిగా అంతస్సంబంధాల సమస్యకు కేంద్రంగాకూడా ఆమె ఉండేది.

ప్రాచీన భారతీయ సాహిత్యంలో ఈ బహు భర్తృత్వానికి సంబంధించిన సమాచారం ప్రతి యుగంలోనూ ప్రస్తావించ బడింది. ధర్మశాస్త్రాలలో ఒక వధువను కుటుంబంలో భర్తకు మాత్రమేకాక మిగిలిన వారికికూడా సమర్పించు చున్నట్లు చెప్పబడింది. అపస్థంభ ధర్మ సూత్రాలలో కన్యను పెండ్లి కుమారునికి సమర్పించేటపుడు "ఈ కన్యను భర్త కోసం మాత్రం కాదు" అనే భావంతో అప్పగిస్తున్న మంత్రాలు ఉన్నాయి.[1]

సంతానం లేనట్లయితే భర్త సోదరులలో కాని, ఇంకా జ్ఞాతులలో "నియోగించే" పద్ధతిద్వారా సంతానాన్ని కలిగించుకోవచ్చు. ఆ కాలములో హిందూ వ్యవస్థలో ఈ పద్ధతి అనుసరణీయమైన సంప్రదాయంగా వుండేది. భారతంలో జటిలఋషి కుమార్తె "జటిల" అనే కన్య ఋషి కుమారులైన పదిమంది సోదరులను పెండ్లియాడినట్లు పేర్కొన బడింది.

ప్రసిద్ధమైన భారత, రామాయణ గాధలలో గుంపు పెళ్ళిళ్లు పేర్కొనబడినాయి. సూర్య చంద్ర వంశాలుగా పేర్కొనబడుచున్న రెండు ఆర్య తెగల సంబంధాలు, వైరుధ్యాలు రామాయణ భారత గాధలుగా పేర్కొనబడినాయి. బ్రాహ్మణ సంస్కృతి రక్షకులుగా "అయోధ్య" కేంద్రంగా రాముని రాజ్యం అవిర్భవించింది. రాముడు అతని సోదరులు జనకుని అతని సోదరుల కుమార్తెలైన నలుగురిని వివాహం ఆడారు. ఇదికూడా గుంపు పెళ్ళిళ్ల పద్ధతితో జరిగింది. ద్రౌపతి ఐదుగురు సోదరులను బహు భర్తృత్వ పద్ధతిలోనే చేసుకుంది, వైదిక సంస్కృతిలో బహు భర్తృత్వం ప్రధాన పాత్ర వహించింది. రాముణ్ణి సీతను కేంద్రంగా చేసుకొని ఏకపత్నీ త్వాన్ని ప్రచారం చేయడం ఆనాటి ఆర్యుల సాంప్రదాయాలకు భిన్నమైన అంశం. పాండవులు బహు భర్తృత్వాన్ని అచరించారు. భారతానికి ముందు అనేక ఆర్య తెగలు బహు భర్తృత్వాన్ని అనుసరించిన నమూనాలుకనిపిస్తున్నాయని మాక్స్‌ముల్లర్ పేర్కొన్నారు. విట్నే, వీబర్ మొదలగు పరిశోధకులు వివాహ సందర్భాల్లో ఉపయోగించు వేద మంత్రాల్లోకూడా వధువుచేత పలికించే మంత్రాల్లో బహు

---

1) ది సీక్రెట్ లాస్ ఆఫ్ ది ఆర్యాన్. ఆపస్తంభ II పేజి. 10,27

భర్తృత్వాన్ని అపేక్షిస్తూ చేసిన ప్రమాణాలే కనిపిస్తున్నాయి అన్నారు. అధర్వణ వేదంలోని ఋక్కులలో బహు భర్తృత్వానికి సంబంధించిన వాటిని వీరు గుర్తించి పేర్కొన్నారు.

ప్రపంచంలో ఆర్య జాతులు విస్తరించినచోట ప్రధానంగా ఈ బహు భర్తృత్వం ఆచరించబడుతూ వుండారని బ్రిఫాల్టు పరిశోధించి పేర్కొన్నారు.

ఆర్య జాతులకు సహజమైన ఈ ఆచారానికి భిన్నంగా స్మృతులు నియంత్రించినాయి. బౌద్ధం తరువాతే ఈ మార్పులు సంక్రమించాయి. ఏకపత్నీత్వాన్ని ప్రచారం చేసిన రామాయణంలో రాముడు అతని సోదరులు జనకుని, అతని సోదరుని కుమార్తెలను చేసుకోవడం గుంపుపెళ్ళికి సంబంధించిందే. దశరధుడు మరొక ప్రక్క బహు భార్యత్వాన్ని అనుసరించాడు, ఆ తరువాత కాలంలో వచ్చిన బ్రాహ్మణ ఆచారాలు, సంప్రదాయాలు, నియమాలు పయి భర్తృత్వానికి వ్యతిరేకంగా సూత్రాకరణలు చేసి పురుషాధిపత్యాన్ని పటిబలం చేసే బహు భర్తృత్వాన్ని సమర్ధించారు.

ప్రపంచంలో పరివ్యాప్తమైన ఆర్య తెగల్లోనే గాక అనేక అనార్య తెగల్లో ఈ బహు భర్తృత్వం ఆచరించబడుతూ ఉంది.

వ్యవస్థలు, సమాజాలు మారే క్రమములో ఇందులో అనేకమైన మార్పులు వచ్చాయి. అనార్య తెగల్లోవున్న బహు భర్తృత్వంలో మాతృస్వామ్య లక్షణాలు మిక్కుటంగా ఉన్నాయి.

---

1) Atharva-Veda. XIV II 14. W. D. Whitney, Atherva-Veda Samhita, translated with a critical Commentary (Harvard Oriental Studies Vol. VIII), The Hymns of Adharyana-Veda translated by R. H. Griffths, Vol. II Page 174, A. Weber, Vedische Hoehzeitasprtsche," Indische stadien, Vol. V Page. 205. F. Ruckert Atharva-Veda Page. 195 (అధర్వణ వేదానికి సంబంధించిన ఇంగ్లీషు ట్రాన్స్లేషన్స్ నుండి వీరు బహు భర్తృత్వానికి సంబంధించిన మంత్రాలను సూచించడం జరిగింది).

భారత రచనా కాలాన్ని చారిత్రక దృక్పథంతో అధ్యయనంచేస్తే మనకు విభిన్న వివాహ పద్ధతులు ఒకే కాలంలో వివిధ ఆర్య అనార్య తెగల్లో అనుసరించబడినట్లు అవగత మవుతుంది. ద్రౌపతి బహు భర్తృత్వాన్ని ఆచరిస్తుంది. భర్తలు బహు భార్యత్వాన్ని ఆచరిస్తారు. అర్జునుడు ఉలూచి, చిత్రాంగద, సుభద్రలను పెండ్లి యాడడం మనకు కనిపిస్తుంది. భీముడు హిడింబిని పెండ్లి ఆడుతాడు. అంతకుముందు పాండురాజు కుంతిని, మాద్రిని పెండ్లి యాడడంలో బహు భార్యత్వం ద్యోతక మవుతుంది. మాద్రి సతీ సహగమనం చేయడం చూస్తే ఆనాటికి పితృస్వామికతకు సంబంధించిన దుర్లక్షణాలు కురు వంశములో ఉన్నాయి అని తెలుస్తుంది. మరొక ప్రక్క బీష్ముడి బ్రహ్మచర్యం వీటికి భిన్నంగా కనిపిస్తుంది. విచిత్రవీర్యుని భార్యలు అంబిక, అంబాలికలతో వ్యాసుని "నియోగించడం" చూస్తే ఆ తెగలలో నియోగ పద్ధతి మరొక ప్రక్క కనిపిస్తూ వుంది. దుర్యోధనాదుల సోదరుల వివాహాలమీద భారతంలో పూర్తి వివరాలు లేవు. కుంతికి, మాద్రికి సూర్య, యమ వాయు. ఇంద్ర, అశ్వని దేవతలకు పుట్టినట్లు చెప్పుకుంటున్న కర్ణ, ధర్మరాజు భీమార్జున నకుల సహదేవులు ఏ పద్ధతిలో జన్మించారో అర్థం కావడంలేదు.

వీరుకూడా ఏదోఒక "నియోగ" పద్ధతిలోనే జనించకపోతే దేవతలకు పిల్లలు పుట్టడం అనేది జరగదని మానవ శాస్త్రజ్ఞులు నిరూపిస్తున్నారు. కృష్ణుడి పెళ్ళిలో అనేక విధానాలు ద్యోతక మవుతున్నాయి. భారతంలోని పెండ్లి పద్ధతులలో దాయాదులలోనే చాలాతేడాలు కనిపిస్తున్నాయి. పాండవులు అనుసరించిన పద్ధతులకు, కౌరవులనుసరించిన పద్ధతులకు తేడాలు కనిపిస్తున్నాయి. పెండ్లిళ్లు రాజ్యాన్ని విస్తరించడానికి కూడా కేంద్రంగా చేసుకోవడంలో అనేక తెగలను తమలో కలుపుకోడానికి అనేక రకాల పెండ్లిళ్లను ఆనాటి రాచరిక వ్యవస్థ అనుసరించి వుండవచ్చు. భారతం ఒక కల్పితగాధ....అయినప్పటికి అందులోని అంశాలు భారత రచనా కాలంనాటి సమాజాన్ని మనకు చూపించక మానదు.

భారతం ఒకనాడు రాసిందికాదు. "హిమకరు దొట్టి పూరు భరతేశ కురు పాండు భూపతుల్" క్రమముగా వంశ కర్తలని పేర్కొంటున్న భారతం చాలామంది రచయితలలో చాలా కాలం వ్రాయబడింది. అయితే ఇది ప్రధానంగా ఆర్య తెగలకు సంబంధించిన కథల సముచ్ఛయము.

ఆర్య తెగల ఆచార సంస్కృతులది 'పై చేయి' చేసే ప్రయత్నము భారత రచయితలు గావించారు. అయితే ఆర్య అనార్య తెగలు అనేక సందర్భాలలో వారి ప్రాబల్యం కోసం వివాహాలు చేసుకోవడము అనార్య తెగలకు సంబంధించిన "యదు వంశ కన్య" సుభద్ర' కోసము కౌరవ పాండవులు పోటీ పడడం చివరకు అర్జునుడు ఎన్నో వేషాలు వేసి పెండ్లి చేసుకోవడం ఈ పెండ్లి బలరాముడికి ఇష్టంలేకపోవడం. కృష్ణుడు జరిపించడం చూస్తే అనార్య తెగలను కలుపుకోవడంలో ఆర్య తెగలు పడిన పోటీ మనకు సువ్యక్త మవుతుంది.

శ్రీకృష్ణుడు అనార్య తెగలకు సంబంధించినవాడై వుండి ఆర్యతెగల మీద ఆధిపత్యం కోసం అనేక జిత్తులు వేయడం కనిపిస్తుంది.

పాండవులు అనార్య తెగలకు సంబంధించిన వారనే వాదముంది. పాండవులకు సంబంధించిన ఈ విషయాన్ని కె.యం. కపాడియా తన "మేరేజ్ అండ్ ఫామిలీ ఇన్ ఇండియా" అనే గ్రంథంలో ఇలా సమీక్షించాడు.

The question that naturally follows is whether yudhistira was referring to the old Brahmanic tradition in favour of polyandry or the tradition out side the Brahmanic Circle. Son indologists suggest that the pandavas represented a Non-Aryan tribe, probably because polyandry is still found among the Non-Aryan tribes. Whether the pandavas were Non-Aryan or Aryan cannot be definitely said, but three of servations can be categorically made. Disapproval of polyandry has prevailed in the Brahmanic tradition from very early times. Protests against polyandry came from Drupada, the King of pancala and Karna a representative of the Kauravas and an arch-enemy of the pandavas and their allies. Lastly pandu had a matrimonial alliance with tha King of Madra, a land Known to the epic writer for matrilineal descent and loose sex relations.

అందు మీదట సహజంగా ఉత్పన్నమయ్యే ప్రశ్న ఏమిటంటే యుధిష్ఠురుడు ప్రస్తావిస్తున్నది బహు భర్తృత్వానికి అనుగుణ్యమైన పాత బ్రాహ్మణ సాంప్రదాయాన్నా ? లేక బ్రాహ్మణ సాంప్రదాయ

పరిధిని దాటిన మరొక సాంప్రదాయాన్నా ? కొంతమంది భారతీయ చరిత్రకారులు పాండవులను ఆర్యేతర తెగకు చెందినవారని సూచిస్తున్నారు. అందుకు బహుశ ఆర్యేతర తెగలలో బహు భర్తృత్వం అమలులో ఉండడము కారణము కావచ్చు. అయితే పాండవులు ఆర్యులో, ఆర్యేతరులో నిశ్చితంగా చెప్పలేం. అయితే యీ సందర్భంలో కూడు అంశాలు చాలా స్పష్టంగా పేర్కొనవచ్చు. బహు పురాతన కాలం నుండి బహు భర్తృత్వాన్ని బ్రాహ్మణ సంప్రదాయం అంగీకరించక పోవడం మనం ప్రముఖంగా గమనిస్తాం. ద్రుపదుడు బహు భర్తృత్వాన్ని నిరశించాడు. అలాగే కర్ణుడు కూడా. ఆ విధంగా పాండవులకు మిత్రుడైన ద్రుపదుడు వాళ్ళకు బద్ధ శత్రుసైన కర్ణుడు ఉభయులు బహు భర్తృత్వాన్ని నిరశించారు.

చివరగా వివాహాలను కాదని విశృంఖలమైన లైంగిక సంబంధాలకు పేరుమోసిన మద్రరాజుతో పాండురాజు వైవాహిక సంబంధాలను యేర్పాటు చేసుకున్నాడు.

అనార్యత కనుకూలమైనవాడు దైవాంశ సంభూతుడని వ్యతిరేకులైనవారు రాక్షసాంశ గలవారని ఋషులు వ్యాఖ్యానించడం చూస్తే ఆర్య తెగలు అనార్య తెగలపై పెత్తనం కోసం చేసిన ప్రయత్నంలో ఆర్య అనార్య తెగల సంస్కృతులు ఒకదానికొకటి పెనవేసుకు పోయాయనేది సువ్యక్త మవుతోంది. అనార్య తెగలను ఆర్య తెగలు విలీనం చేసుకొనడానికి కూడా ప్రయత్నం చేశారు.

భారతంలో వున్న "నియోగా"న్ని గూర్చి చర్చిస్తే భారతంలోని తెగలు సంతానం ప్రధానంగా, వంశం నిలబడడం ప్రధానంగా ఆలోచించాయి తప్ప అందులో వారు ఏ శాస్త్రాలను పరిగణనలోకి తీసుకోలేదు. సత్యవతి శంతనుని భార్య. శంతనునికి గంగద్వారా పుట్టిన పెద్ద కుమారుడు భీష్ముడు. చిన్న కుమారులు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు. విచిత్రవీర్యుని భార్యలు అంబిక, అంబాలిక. విచిత్రవీర్యుడు పిల్లలు లేకుండానే మరణిస్తాడు. మరి తమ్ముని భార్యలకు సంతానాన్ని కలిగించాల్సిందెవరు ? భీష్ముడు. భీష్ముడు ఎందుకు అంగీకరించ లేదు ? వ్యాసుడు ఎవరు ? వ్యాసునికి ఈ వంశానికి సంబంధము యేమిటి ?

వ్యాసుడు పరాశరుడికి, మత్స్యగంధికి పుట్టినవాడు. పరాశరునికి యమునానది ఒడ్డున మత్స్యగంధి కనిపించింది. ఆమెను పరాశరుడు మోహించాడు. ఆమె కన్యగా అతని కోర్కె తీర్చడానికి భయపడింది. కన్యత్వం దూషితం కాదని ఆమెకు పరాశరుడు అభయమిచ్చి, ఆ ప్రాంతాన్ని చీకటి చేసి అనుభవిస్తే వ్యాసుడు పుట్టాడట. ఈ మత్స్యగంధికి వరమివ్వగా యోజనాల దూరం సుగంధ వాసనలు పరిఢవిల్లే శరీర సౌగంధ్యం ఆమెకు చేకూరింది. అందుకు ఆమె "యోజనగంధి", గంధవతి" గా పిలవబడింది. ఈ సత్యవతినే యమునానది తీరంలో శంతనుడు చూసి మోహించాడు. అతను వివాహం చేసుకోమని సత్యవతి నడిగాడు. సత్యవతి తండ్రియైన గాధిరాజు నడగమంటుంది. గాధిరాజు తన కుమార్తె సంతానానికే రాజ్యం కావాలన్నాడు. అప్పటికే గంగద్వారా భీష్ముడు పుట్టాడు. భీష్ముని అంగీకారం మేరకు సత్యవతిని శంతనుడు పెండ్లియాడాడు. సత్యవతికి శంతనుని ద్వారా పుట్టిన చిత్రాంగదుడు పెండ్లి కాకుండానే మరణించాడు. వివాహితుడైన విచిత్రవీర్యుడు సంతానం లేకుండానే మరణించాడు. మరి సత్యవతి సంతానానికే శంతనుని రాజ్యం రావాలంటే "సత్యవతి" కి అంతకు మునుపే పరాశరుని వలన పుట్టిన వ్యాసుణ్ణి వెతుక్కురావలసి వచ్చింది. సత్యవతిగా చెప్పబడి ఈ మత్స్యగంధి కుమారుడైన వ్యాసుని 'అంబిక' 'అంబాలిక'లకు నియోగించటం బహు భర్తృత్వ లక్షణమే. అయితే కౌరవ వంశం మొత్తానికి మూలం సత్యవతి. ఈ సత్యవతి ఎవరు ?

ఒక చేపలు పట్టువానికి దొరికిన అమ్మాయి. లేకపోతే చేప నుండి వచ్చింది. ఈమెకు ఇద్దరి భర్తల ద్వారా ముగ్గురు కుమార్తెలు జన్మించారు. అంటే భారతానికి మూలమైన సత్యవతికి "ఈ పద్ధతిలో కాకపోయినా మరొక పద్ధతిలో బహు భర్తలున్నారనేది వ్యక్తమవుతుంది. ఆమె కోడళ్ళ విషయంలో అమలుజరిపిన "నియోగ" పద్ధతిలో బహు భర్తృత్వ లక్షణాలే కనిపిస్తున్నాయి. వేద మంత్రాలు ధర్మసూత్రాల్లో ఉన్న బహు భర్తృత్వ లక్షణాలను కె. యం. కపాడియా వివరిస్తున్నారు.

వేదకాలం నాటి ఆర్యులకు బావా మరదళ్ళకు, వదినా మరిదికి సంబంధాలు ఉన్నాయి. దీనికి ఉదాహరణ ఋగ్వేదములో భర్త చితిపై కూర్చున్న స్త్రీని మరిదిగాని, బావగాని చితి నుండి తీసుకువస్తారు.

అక్కడ నుండి అతడే ఆమెకు భర్త. బృహద్దేవతలో మరది వదినను చితికి వెళ్ళకుండా అడ్డుపడి తీసుకొస్తాడు. అక్కడ నుండి ఆయనే భర్త. అశ్వలాయనంలో భర్త తమ్ముడైన మరదిగాని, భర్త శిష్యుడు గాని చితిపై నుండి దింపుతారు. వీరిలో ఎవరు దింపితే వారే ఏలుకుంటారు. ఋగ్వేదంలో ఒక మంత్రంలో భర్త చనిపోయిన స్త్రీ మరదిని గాని, బావనుగాని తనను కలవడానికి పిలుస్తున్నట్లు పేర్కొనబడి ఉంది. యాస్కరాచార్య రెండవ భర్తను "దేవర" అంటాడు. విధవరాలైన వదినతోగాని, మరదలుతోగాని కలవడానికి హక్కు కలిగినవాడని అర్థం. వీరికి నిబద్ధమైన వైవాహిక సంబంధం ఉందా లేదా అనేది తేలక పోయినా, ఈ ఉదాహరణలను బట్టి ఆర్యులలో బహు భర్తృత్వానికి సంబంధించిన లైంగిక సంబంధాలు మాత్రం స్పష్టంగా ఉన్నాయి.

Intimacy between a woman and her brother-in-law was known to the Vedic Aryans. In the funeral hymn in the Rgveda, the widow who lay on the pyre by the said of her dead husband was asked to rise and come to the world of the living, "He by whose side you lie as life less. Come, this your wifehood of the husband who took thy hand, and wooed thee has (now) been fulfilled." And in the Atharvaveda it is added, "Come to him who grasps thy hand, thy wooer (didhisu) thou hast now entered into the relation of wife to husband.' In Brhaddevata the younger brother is said to prohibit the widow from ascending the pyre. According to Asvalayana, her brother-in-law, being a representative of her husband, or a pupil (of her husband), or some aged servant, should raise her. In another pasaage of the Rgveda, the simile runs, 'as a widow invites her brother-in-law to her bed.' Yaskacarya in his comment on this verse explains devara as a second husband. The word devara may be a derivation from the word div to play, thus meaning a person who could legitimately dally with his brother's wife or widow. Though it connot be definitely said whether the brother-in-law married rhe widow or merely as conjugal rights in her the fact of intimacy between the two is clearly intended.[1]

---

1) Marriage and family in India (1966)
K. M. Kapadia, Page 57, 58

బహు భర్తృత్వం అనార్య తెగల్లోను, ఈనాటికి అనుసరించ బడుతూ ఉంది. కేరళ నందలి మలబారు ప్రాంతము నందలి ఇర్వాన్‌లు బహు భర్తృత్వాన్ని అనుసరిస్తున్నారు. కూర్గులు 19 వ శతాబ్దం ప్రారంభములో కూడా అనుసరిస్తున్నట్లు పరిశోధకులు వ్రాశారు. నీలగిరి కొండల్లో నుండే తోడాలు వారికి దగ్గరలో ఉండే కోటాలు ఈ పద్ధతినే అనుసరిస్తున్నారు.

A man has sexual access to all the sisters of her wife. If a newly married couple find that they are not compatible, the husband may exchange his wife for one of her sisters, The sororate, though preferred, is not however compulsory.[1]

కోటాలు ఉమ్మడి కుటుంబంగా జీవిస్తుంటారు. ఆర్థిక సహకారం, సమానత్వం చాలా ఉన్నతంగా ఈ కుటుంబాల్లో ఉంటుంది. వారి శ్రమ నుండి ఉత్పన్నమైన సంపదను వారు సమంగా అనుభవిస్తారు.

బహు భర్తృత్వాన్ని అనుసరించే జాతులు పాండవులను తమ దేవతలుగా కొలవడం యెక్కువగా జరుగుతుంది. బహు భర్తృత్వం ఆర్య, అనార్య తెగల్లో ఈనాటికి అనేక రూపాల్లో వుంది.

కాలంలో వచ్చిన మార్పు, వ్యవస్థలో వచ్చిన మార్పులు బహు భర్తృత్వంలో వున్న మాతృ స్వామికత మీదకూడా వైదిక వ్యవస్థ బలమైన భారతీయ సంస్కృతిలో స్త్రీకి ప్రాధాన్యాన్నిచ్చిన వ్యవస్థలో బహు భర్తృత్వం ఒకటి. వైదిక వ్యవస్థ ప్రభావం భారతదేశంలో నివసించే అన్ని తరగతుల వారిమీద కొంతలో కొంత పడినప్పటికి, భారత దేశ ఆదిమ జాతుల పునాదిని మాత్రం వైదిక వ్యవస్థ కదల్చ లేకపోయింది.

ఆర్యులు అనార్యులు ఒకరినొకరు జయించుకొంటూ, సంఘర్షించుకొంటూ జీవించినా, ఒకరినొకరు ప్రభావితం చేసుకొంటూకూడా వచ్చారు. ఆదిమ భారతీయ జాతులు వైదిక సంస్కృతికి కొన్నిచోట్ల లోబడినా, కొన్నిచోట్ల బలంగా ఎదిరిస్తూనే వచ్చారు.

---

1) Ibid Page. 94.

అనార్యులు ఆర్యులను ఎదిరించి తమ మాతృస్వామిక సంస్కృతిని రక్షించుకొంటూ వచ్చారు.

అలా రక్షించుకొని కొన్ని బలమైన శాస్త్ర వాదాలను ప్రయోగంలో పెట్టారు. కాని వానిలో తంత్రివాదం ప్రధానమైంది. తంత్రివాదం అవైదిక సిద్ధాంత భూమికలో భారతీయ సంస్కృతిలో స్త్రీ ప్రాధాన్యాన్ని ముందుకు తెచ్చింది. తంత్రి శాస్త్రాన్ని పరిశీలించటం వలన భారతీయ సంస్కృతిలో స్త్రీ ప్రాధాన్యత మనకు లోతుగా అవగాహన అవుతుంది.

# తంత్రి శాస్త్రం — స్త్రీ

తంత్రిమంటే (తన్ + త్రన్) తన్ అనే ధాతువునకు త్రన్ అనే పదం చేర్చడం ద్వారా ఏర్పడింది. తన్ అనే ధాతువునకు "విస్తరించు", "వ్యాపింపచేయు" అని అర్థాలు ఉన్నాయి.[1] "తన్యతే విస్తార్యతే జ్ఞానం తంత్ర"[2] అనగా జ్ఞానమును విస్తరింప చేయునది తంత్రము అనే వ్యుత్పత్యర్థము కూడా ఉన్నది.

తంత్రశాస్త్రం భారతదేశంలో అతి ప్రాచీన కాలం నుండి అనేక వ్యవస్థల్లో అనేక రూపాల్లో ఆచరణల్లో వున్నది. భారతదేశంలో పరివ్యాప్తమైన రెండు ప్రధానమైన తాత్విక ధోరణులు (1) వైదికము (2) అవైదికము. ఈ తంత్రిశాస్త్రము అవైదికమునకు సంబంధించినది.[3]

తంత్రిశాస్త్రం మాతృస్వామ్య వ్యవస్థను పునాదిగా చేసుకొని అభివృద్ధి చెందింది. పితృస్వామిక వ్యవస్థకు బీజ ప్రాధాన్యం ముఖ్యమైతే మాతృస్వామిక వ్యవస్థకు క్షేత్ర ప్రాధాన్యం ముఖ్యం. తంత్రిశాస్త్రం స్త్రీని కేంద్రింగా చేసుకున్న వ్యవస్థలనుండి ఉద్భవించింది, పరివ్యాప్తి చెందింది.

ప్రకృతికి స్త్రీ ప్రతీక. స్త్రీని అర్థం చేసుకోవడం అంటే ప్రకృతిని అర్థం చేసుకోవడమే. అసలు భూమిని, దాని సారాన్ని, దాని శక్తిని ప్రకృతిలోని ఋతు క్రిమాన్ని గుర్తించింది మొదటిగా స్త్రీయే. ప్రిధానంగా వ్యవసాయ సంస్కృతిని స్త్రీ కనుగొన్నది. వ్యవసాయ సంస్కృతిలో ఆవిర్భవించిన ఆచారాలు విధులన్నీ స్త్రీ ప్రిధానంగానే కొనసాగినాయి. అన్ని దేశాల్లో అన్ని జాతుల్లో వ్యవసాయ సంస్కృతి స్త్రీ ప్రిధాన సంస్కృతిగానే అభివృద్ధి చెందింది.

---

1) Lokayata — 321
2) శ్రీ చక్రి విలసనం — పేజి-2 — తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు.
3) Lokayata — Page : 269

అందుకే దేవీప్రసాద్ చటోపాధ్యాయ—

'.If Agriculture was the invention of women, them it is only logical that agriculture magic in it origin should belong exclusively to the province of women''[1] అంటాడు.

బ్రిఫాల్ట్ కూడా ఈ విషయాన్ని ఇలా సమర్థిస్తున్నారు—

''The magical or religious rites intended to secure the fertility of the fields were naturally within tho speciel Competetion of the women who cultivated them':[2]

వ్యవసాయము పంటలు వాటి అభివృద్ధికి సంబంధించిన ప్రతి విషయంలోను స్త్రీ ఆధిపత్యమే నెలకొంది. పంటలు సస్యశ్యామలం కావడానికి కావలసిన వర్షాలు కూడా స్త్రీల మహత్తు వలనే కురుస్తాయని అనేక దేశాల్లో ఉన్న మాతృస్వామిక వ్యవస్థలు నమ్మేవి. వర్షాలు కురవడానికి కావలసిన తంతులు స్త్రీల చేతే నిర్వహింప చేసేవారు. "ఆఫ్రికాలో కూడా వర్షాన్ని సాధించే కార్యక్రమం పవిత్రమైన రాజుగారిదే అయినా స్త్రీల ప్రత్యేక శక్తులు, చర్యలుకూడా దాంతో గాఢ సంబంధం కలిగివున్నాయి. అంటే వ్యవసాయ కార్యక్రమాల్లో అతి ముఖ్యాంశం స్త్రీల ద్వారా జరిగేదన్న మాట. ప్రాచీన కాలంనాటి కొన్ని మత వ్యవస్థల మూలాలు వ్యవసాయక మంత్ర తంత్రాలలో దొరుకుతాయి. డయనీసి యస్ మత వ్యవస్థ ఆవిష్కారాన్ని ప్రతిబింబిస్తుంది. బొయేటియాలో డయానీసియస్ కర్మ కాండలన్నీ అనాదికాలం నుంచి విజయవంతంగా వ్యవసాయంలో ముడిపడ్డ కార్యక్రమాలే. ఈ క్రతువులన్నీ స్త్రీలే నిర్వహించేవారు. థేబిలో డయనీసియస్ ప్రసూతి గృహాన్ని సూచించే ఆలయంలోకి (పౌసానియాల కాలం వరకూ) పురుషులకు ప్రవేశములేదు. పెంథియన్ కథ మనకు చెప్పేది. స్త్రీల మహత్తు గురించి తెలుసుకోవడానికి ఆసక్తి చూపించిన పురుషులను ముక్కలుగా నరికేస్తారు. అసలు డయనీసియస్ మత వ్యవస్థ మొదట్లో స్త్రీల మతమని, అందులో పురుషులు నిషిద్ధులని

---

1) Lokayata — Page 272

2) Lokayata — Page 272

మనకు అర్థమౌతుంది. ఇటలీలో ఈ వ్యవస్థ ప్రారంభ కాలాన యెట్టి పరిస్థితులలోను ఉత్సవాల్లో పురుషులకు ప్రవేశము లేదు.[1]

అందుకే స్త్రీలు చేసే క్రతువులు, ఆచారాలు, విధులు అన్నింటిని వామాచారాలు అంటారు. — వామా అంటే 'స్త్రీ' అని 'ఎడమ' అని సంస్కృతంలో రెండర్థాలు ఉన్నాయి. అయితే స్త్రీలు చేసే ఆచారాలు అని ఇక్కడ అర్థం. దీనికి "ఎడమ చేతి మార్గం" అని వైదికులు అర్థము చెప్పారు. కాని అది సరైనది కాదు.[2] ఈ విధంగా మనం ఆలోచిస్తే తంత్రవాదంలో స్త్రీ ప్రధాన పాత్ర వహించిందని అర్థమౌతుంది. అంతే గాక స్త్రీత్వాన్ని సాధించటమే తంత్రవాదంగా ప్రసిద్ధి చెందింది. స్త్రీత్వం అంటే ప్రకృతితత్వమే.

ప్రకృతిని, స్త్రీని ఆవాహనం చేయటమే తంత్ర శాస్త్రం. అదే తంత్ర శాస్త్రంలోని యోగవిద్యకూడా. ఈ విషయాన్ని దేవీప్రసాద్ ఇలా వివరిస్తున్నారు.

"The most Important point is that the yogasadhana of Tantrism is its psycho physical practices, when properly understood, is found to be nothing but a desperate effort to realise the womanhood in one self. It is in other words a kind of training prescribed to transform the basic personality and Consciousness into that of a female"[3]

తంత్రవాదంలోని యోగసాధన విద్య అంటే స్త్రీత్వాన్ని సాధించటానికి చేసే తీవ్రమైన కృషి అని అర్థం అవుతుంది. మరో మాటలో చెప్పాలంటే మౌలికమైన వ్యక్తిత్వాన్ని చైతన్యాన్ని స్త్రీ వ్యక్తిత్వంగా, స్త్రీ చైతన్యంగా పరివర్తింప చేయడానికి చేసే సాధన.

మనం ప్రపంచంలో వున్న మానవ ప్రాథమిక దశలను వేటిని పరిశీలించినా ఆ వ్యవస్థలో ప్రకృతికి, పంటలకు సంబంధించిన అనేక మహత్తులు స్త్రీలకు సంబంధించినవే. వాటి నిర్మాతలు, నిర్వాహకులు స్త్రీలు గానే వున్నాయి.

---

1) Lokayata — Page 274
2) Lokayata — Page 278, 279
3) Lokayata — Page 280

ఈ విషయాన్ని బ్రిఫాల్టు చారిత్రిక పరిశీలనతో తెలియ చేస్తున్నాడు—

"It does not appear that the universal practice is susceptible of any other interpretation than that magical power was originally associated, with women and was regarded as essentially a woman's function"[1]

మహత్తులు మొదట్లో స్త్రీలకు సంబంధించినవేనని అది స్త్రీలకు మాత్రమే పరిమితమైన కార్యక్రమమని భావించడం మినహా ఈ సార్వజనీన సాంప్రదాయానికి వేరే అర్థం చెప్పకోలేం.

మొత్తంగా మనకు తేలుతున్న అంశం ప్రపంచంలో అనేక జాతులలో వలే భారతదేశం కూడా ఆర్యుల పితృస్వామిక వ్యవస్థ ముందు ఆర్యేతరమైన మాతృస్వామిక వ్యవస్థ వుంది. వ్యవసాయ సంస్కృతిలో వున్న అనేక మహత్తులు ఆచారాలు స్త్రీకి సంబంధించిన ప్రకృతితో పోల్చినవి. అవి స్త్రీ సంస్కృతిని లేక 'మాతృ' సంస్కృతిని ప్రతిబింబిస్తాయి.

ఆర్యులు ప్రధానంగా పశు పాలకులు, పితృస్వామిక వ్యవస్థీకులు. కావున స్త్రీ ప్రకృతి ప్రధానంగా వున్న ఈ తంత్రశాస్త్రం వారి నుండి ఉద్భవించ లేదు.

ఆర్యులకు ముందు ఉన్న సింధూ నాగరికతలో స్త్రీకి ప్రాధాన్యమిచ్చిన ఆధారాలు కనిపిస్తున్నాయి. "హరప్పాలో దొరికిన దీర్ఘ చతురస్రాకారపు ముద్ర చాలా ముఖ్యమైంది. ఆ ముద్రపై తల్ల కిందులుగా నిలబెట్టబడిన స్త్రీమూర్తి, ఆ మూర్తి గర్భాశయం నుండి పైకి వచ్చిన మొక్క" (మార్షల్)

ఈ ఫలకాన్ని పరిశీలించినట్లయితే స్త్రీకి, స్త్రీ జననాంగానికి ఆనాటి సంస్కృతిలో ఎంతో ప్రాధాన్యత యివ్వబడింది. ఆర్యులు ప్రధానంగా పశు పాలకులు. స్త్రీ ప్రధానంగా వున్న వ్యవస్థమీద వారికి గౌరవము లేదు. వారు పితృస్వామిక సంస్కృతిని భారతావనికి మోసుకువచ్చారు.

---

1) Briffault 'The Mothers', ii 534 (Quoted Lokayata Page 277)

"The Aryans who destroyed the Indus cities made their first appearance about the beginning of the second millennium B. C. Many separate groups of Aryans were fully established in the Fertile crescent at the eastern end of the Mediterranean by the middle of the 2nd millennium, as heirs to the Sumerian and semitic civilizations. The Hyksos who broke into Egypt from Asia—Minor during the 13th dynasty and remained in control till about 1580 bear a name translated as 'shephered Kings,' which could describe the Aryan conquerors in India quite well. The name shashank, so common for pharaohs of the 22nd and 23rd dynasties of Egypt (from 945 B. C. down) has a definitely Aryan (sanskrit sasanka) sound. The ancestors of this dynasty were immigrants allied with tribes of known Aryan character. Tyrrhenians, Sardinians, &C."[1]

భరత ఖండంలో సింధులోయ నగరాలను నాశనం చేసిన ఆర్యులు క్రీస్తుపూర్వం రెండో సహస్రాబ్దం మొదట్లో ఇక్కడకు వచ్చారు. రెండో సహస్రాబ్దం మధ్య కాలానికి మధ్యధరా తూర్పు ప్రాంతంలో ఆర్య బృందాలు స్థిర నివాసాలు ఏర్పరుచుకున్నాయి. వీరు సుమేరియన్, సిమెటిక్ నాగరికతల వారసత్వాన్ని సొంతం చేసుకున్నారు. హిక్సోలు అనే ప్రజలు పదమూడవ రాజవంశ కాలంలో ఆసియా మైనర్ నుంచి ఈజిప్టుపై విరుచుకుపడ్డారు. సుమారు 1580 వరకు పెత్తనం చలాయించారు. వీరికి "పశుపాలక రాజులు" అని అర్థం వచ్చే పేరు ఉండేది. భరత ఖండాన్ని జయించిన ఆర్యులకు కూడా ఈ పేరు సరిపోతుంది. 22వ, 23వ వంశాల ఈజిప్టు రాజులలో షషాంక్ అనే పేరు తరచు వినిపిస్తుంది. దీనికి శశాంక అనే ఆర్య శబ్దానికి దగ్గర సంబంధం ఉందని అనిపిస్తుంది. ఈ రాజ వంశాల మూల పురుషులు ఎక్కడినుంచో వలస వచ్చిన వారే. టిర్రేనియన్, సార్డీనియన్ మొదలయిన వీరి తెగలు ఆర్య సంబంధమైనవే.

ఆర్యులు పశుపాలక సంస్కృతికి సంబంధించిన వారని కోశాంబి చారిత్రికంగా నిరూపిస్తున్నారు. అంతేగాక వారు పితృస్వామిక వ్యవస్థకు ప్రభువులు వారి దైవాలుకూడా ప్రధానంగా పురుష ప్రధానమైనవేనని సప్రమాణంగా పేర్కొంటున్నారు.

1) An Introduction to the study of Indain History.
Damodar Dharmanand Kosambi. Page. 81.

ఆర్యులు దాదాపు మొదటి నుంచి పితృస్వామిక ప్రజలుగానే కని పిస్తారు. వారి దేవతలు అత్యధిక భాగం పురుషులే. అగ్ని పవిత్రమై అగ్ని దేవుడైంది. (ఇరానియన్ల లోనూ అంతే) మిగిలిన దేవుళ్ళందరికి దేవుడు ఇంద్రుడు. యుద్ధంలో అరివీర భయంకరుడు. వజ్రాయుధం పుచ్చుకొని, రధంమీద వేగంగా తిరుగుతూ యుద్ధాలు చేస్తాడు. అదే మిటో ఇప్పటికీ స్పష్టంగా తెలియదుగానీ సోమరసం అనే మధువు తాగి మత్తెక్కుతాడు. (ఇరానియన్లు 'సోమ'లు హయోమా అన్నారు). నగ రాలను, వంతెనలను ధ్వంసంచేసి తన ప్రజలకు నీరు సమకూర్చుతాడు. నాస్తిక శత్రువుల తిండి నిలువలను దోచేస్తాడు. వారిపై పోరాటానికి శక్తినేగాక, యుక్తినిగూడా ఉపయోగిస్తాడు. అంతకు ముందున్న వరుణున్ని వెనక్కి నెట్టి ఇంద్రుడు ముందుకొచ్చాడు. గ్రీకుల జౌరానస్ లాగే వరుణుడు ఆకాశ దేవత. చాలా దయగలవాడు. కాని, కోప మొస్తే రోగాలు వ్యాప్తిచేసి మనుషులను శిక్షిస్తాడు. స్త్రీ దేవతలు చాలా తక్కువ. ద్రవ రూపంలో దేవునికి సమర్పించే నైవేద్యానికి ఒక రూపం 'ఇలా'దేవి. ఉషస్ సూర్యోదయ దేవత, ఆమె ఇంద్రుడితో పోరాడి ఓడిపోయిందంటారు. కాని ఆ తరువాతకూడా పూజలు అందుకొంది. (ధ్వని పరంగా ఉషస్‌ను హోమర్ గ్రంథంలోని ఇయోస్‌తో పోల్చుతం టారు. అంతకన్నా ముఖ్యమైన పోలిక మెసపొటేమియాకు చెందిన ఇస్తార్ దేవత). ఈ దేవుళ్ళు పెళ్ళిళ్లు చేసుకోరు. దేవుడు భార్యతో కలిసి కనిపించటం చాలా తక్కువ. దేవుళ్ళ భార్యలను ఉమ్మడిగా "గ్నాస్" అనేవారు. వారికి పెద్దగా ప్రాముఖ్యం లేదు. ఆ కాలంలో ఆర్య సమాజంలో పెళ్ళిళ్లుగాని, ఒక పద్ధతి ప్రకారం ఆడ మగ కలిసుం డటంగాని లేకపోవచ్చు. దేవతల్లోకూడా అది ప్రతి ఫలించి ఉంటుంది.

ఆర్యులు పశుసంపదే ప్రధానంగా కలవారని రాహుల్ సాంకృత్యా యన్—తన ఋగ్వేద ఆర్యుల్లో తెలిపారు. ఆర్యులకు వ్యవసాయము తెలుసు. వారు యవధాన్యాన్ని పండించేవారుకూడా. కాని వారి జీవి తానికి వ్యవసాయం ముఖ్యవృత్తికాదు. గౌణం మాత్రమే. గోవులు, గుర్రాలు, గొర్రెలు, మేకలు — వారికి గొప్ప ధనం. ఇవే వారి తిం డికి, బట్టకూ అతిముఖ్య సాధనాలు. ఇవే తమ దేవుళ్ళను సంతోష పర్చ డానికి వారికి అవసరం, "పశు ధనమే పరమ ధనం" అనుకొన్నందువ ఆర్యులకు నగరాలతో పనిలేకుండా పోయింది. వారికి వచ్చిన బీడులున్న

గ్రామాలే అవసరం. ఈ విధంగా ఋగ్వేద ఆర్యుల సంస్కృతి పశుపాలకుల సంస్కృతి, గ్రామీణ సంస్కృతికి మనం ఈ హద్దులను దృష్టిలో ఉంచుకోవాలి."

మొత్తంమీద ఆర్యులు పశుపాలక సంస్కృతికి, పితృస్వామిక సంస్కృతికి సంబంధించినవారు. వారికి వారి రాకకు ముందే భారతదేశంలో సముచితమైన స్థానం కలిగిన మాతృస్వామిక సంస్కృతికి మాతృ ఆరాధనకు సంబంధించిన తాంత్రిక శాస్త్రానికి సంబంధము లేదని మనకు అవగత మవుతుంది.

## పంచ 'మ' కారాలు

దేవీ ఉపాసనలో పంచ'మ'కారాలు చాలా ప్రాధాన్యతను పొందుతున్నవి. పంచమకారాలు అంటే 'మద్యము, మాంసము, మత్స్యము ముద్ర, మైథునము.' ఈ పదాలన్ని "మ" అక్షరంతో ప్రారంభమౌతాయి. కాబట్టి వీటిని పంచ"మ"కారాలు అన్నారు. ఈ పంచమకారాల తంత్రివాదంలో సాధించడం కష్టమనే భావాన్ని సామాన్య ప్రజలకు ఆధునిక వేదాంతులు సృష్టించిన విధానాన్ని దేవీప్రసాద్ వర్ణిస్తున్నాడు అంతేగాక పంచ"మ"కారాలను చూడాల్సిన పద్ధతి వేరని, అది వ్యవసాయ సంస్కృతికి సమన్వయించి చూడాలని నిగదిస్తున్నాడు.

"The list is no doubt appalling. Those among the modern scholars who have tried to rationalise or justify Tantrism, have naturally found the pancamakara to be the greatest stumbling block. Efforts are made to mystify it, the real significance of panca makara is too subtle or toohidden to be understood by the uninitiated. Or, as is sometimes said, the practices are not for the ordinary man, only the spiritually advanced could go in for these Or, the practice of the pancamakara is difficult and dangerous more difficult, in fact, than walking on a razor's edge and playing with wild tigers. And so on,

Justifications like these do not interest us, Their apparent absurdities only betray the weakness of the position sought to be justified. Advanced technology and greater knowledge of

the laws of nature make it difficult for us either to admire or justify these arcbaic practices. It is necessary, however, to understand them. And this understanding cannot come unless we try to view them from the position of our remote ancestresses who, with the discovery of agriculture, were only begining to advance towards civilization.[1]

నిజమే ఈ జాబితా భీకరంగానే ఉంది. తంత్రవాదానికి బలము చేకూర్చాలని గానీ, సమర్థించాలని గానీ ప్రయత్నించిన ఆధునిక పండితులకు పంచ "మ"కారాలు కొరకరాని కొయ్య. దీన్ని మార్మికం చెయ్యాలనే ప్రయత్నాలు జరిగాయి. పంచమకారాల పరమార్థం చాలా సూక్ష్మముగా ఉంటుంది. లేదా గుప్తంగా ఉంటుంది. తంత్ర మతంలోనికి ప్రవేశించని వారికి అది అర్థం కాదు. అసలు కొందరు ఈ ఆచారాలన్నీ సామాన్యులకు కాదని, ఆధ్యాత్మికంగా ముందుకు వెళ్ళిన వారికే వీటిని విధించారని లేదా పంచ"మ"కార సంప్రదాయాన్ని క్లిష్టమైనదనీ, ప్రమాదకరమైనదనీ — కత్తిపై నడక కంటే, పులులతో సహవాసము కంటే క్లిష్టమైనదని అంటారు. ఇలాంటి సబబులు మనకనవసరం. అందులో అగుపించే అసందర్భాలే వాటిని సమర్థించే పరిస్థితిలోని బలహీనతను బయట పెడతాయి. ఈ పురాతన ఆచారాలను మెచ్చుకోవడానికి గానీ, సమర్థించడానికి గానీ ప్రస్తుతం అభివృద్ధి చెందిన సాంకేతిక శాస్త్రం విశదీకృతమైన ప్రకృతి సూత్రాల విజ్ఞానమూ అడ్డువస్తాయి. కాని, వాటిని అర్థం చేసుకోవడం అవసరం. మనం మన "పురాతన" పూర్వీకుల దృష్టిని తెలుసుకొని ఆ దృక్పథం నుంచి ఈ అంశాలను చూడకపోతే అర్థం కావడం సాధ్యంకాదు. ఎందుకంటే అప్పుడే వ్యవసాయం కొత్తగా కనుగొనబడింది. నాగరికత వైపుకు పురోగమనం మొదలౌతుంది.

స్త్రీ పురుషుల లైంగిక చర్యకు — గర్భధారణకు ఉన్న సంబంధాన్ని గుర్తించిన మానవ జ్ఞాన దశను ఈ ఆచారం ప్రతిఫలిస్తుంది. స్త్రీని భూమితో సమన్వయం చేసి వ్యవసాయ సంస్కృతిని ప్రదీప్తం చేశారు. భూమి ఫలించడానికి "మైథునం" ఒక క్రతువుగా వారు భావించారు. తంత్ర శాస్త్రం స్త్రీ ప్రధానమైన సంప్రదాయం అని వీటన్నింటి ద్వారా తెలుస్తుంది.

1) Lokayata — Page 307

## సారాంశం

తంత్ర శాస్త్రం మాతృస్వామ్య వ్యవస్థ భూమిక కలిగినట్టిది. అవైదిక సాంప్రదాయమైన తంత్ర శాస్త్రంలోని విధులు, కార్యాచరణలు స్త్రీ ప్రధానమైన వ్యవసాయ సంస్కృతికి ప్రతీకగా ఉన్నాయి. కులం, జాతి, లింగ బేధానికి అతీతంగా క్రతు కార్యక్రమాల్లో అందరికీ సమానత్వం ఇచ్చిన తంత్ర శాస్త్రం, అట్టడుగు వర్గాలకు ఉన్న శాస్త్ర జ్ఞాన నిధులను మనకు కనబర్చుతూ ఉంది. తంత్ర శాస్త్రం వైదిక సంస్కృతికి భిన్నమైన భారతీయ వ్యవస్థల సంస్కృతులను, అందులో స్త్రీకి ఉన్న ప్రాధాన్యతను మనకు అభివ్యక్తం చేస్తూవుంది. "మానవ శరీరం కంటే అద్భుతమైన యంత్రమేమీ లేదని" దేహమే సర్వ శాస్త్రాలకు భూమికని ఈ వాదం నిరూపించింది.

ఈ తంత్ర శాస్త్రాన్ని వైదికులు గజిబిజి చేసి ఇది సమాజానికి పనికి రాకుండా అభాసుపాలు చేయడానికి ప్రయత్నించారు. అయితే చారిత్రక లోతుల్లోకి పోయి చూచినపుడు మాత్రమే తంత్ర శాస్త్రంయొక్క వాస్తవ రూపం సరైన క్రమంలో కన్పిస్తూఉంది.

ఇంతేగాక అవైదిక దర్శనాలలో ప్రముఖమైన జైన దర్శనం స్త్రీలను తాత్విక రంగములో ముందుకు నడిపించింది.

జైనుల ఉద్యమాలలో స్త్రీలు విస్తృత పరిజ్ఞానాన్ని, చర్చని కొనసాగించారు. బ్రాహ్మణ సిద్ధాంతాలకు ఎదురు నడచారు. జైన మతోద్యమంలో స్త్రీల పాత్రను చర్చించడం వలన భిన్న వ్యవస్థలలో స్త్రీలలో వచ్చిన పరిణామాలు స్పష్టంగా అవగతమౌతాయి.



# జైనం – స్త్రీ

జైనులు వారి మత ప్రవక్తలుగా 24 గురు తీర్థంకరులను పేర్కొన్నారు. వీరిలో మొదటివాడు రిషభదేవుడు. చివరివాడు వర్థమానుడు ఈతనికే మహా వీరుడని పేరువుంది. ఈతనికి ముందు ప్రసిద్ధి చెందిన పార్శ్వనాథుడనే తీర్థంకరుడు క్రీ॥ పూ॥ 9వ శతాబ్దంలో జీవించాడు. మిగలిన 22 తీర్థంకరులు చారిత్రక పూర్వ దశల్లోని వారుగా చెప్పబడుతున్నారు.[1]

24వ తీర్థంకరుడైన మహావీరుడు క్రీ॥ పూ॥ 561 లో వైశాలిలోని కుంద గ్రామములో జన్మించాడు. ఈతడు లిచ్ఛవి వంశ ఉపశాఖ జ్ఞాతృ వంశానికి చెందినవాడు. ఈతని తండ్రి సిద్ధార్థుడు. మహావీరుడు సామంతవీరుని కుమార్తె యశోదను పెండ్లాడాడు. వీరికి వివాహమైన పది సంవత్సరాలకు ఒక కుమార్తె కలిగింది. ఆ అమ్మాయి పేరు ప్రియదర్శన. ఆ తరువాత రెండు సంవత్సరాలకు ప్రాపంచిక విషయాలన్నిటిని వదిలివేసి 12 సంవత్సరముల దీక్ష అనంతరం 42వ ఏట రాజుపాలిక నదీ తీరంలో అంబికా గ్రామంలో జ్ఞానోదయం పొందాడని బౌద్ధ గ్రంథాలు చెబుతున్నాయి. అక్కడ నుండి 31 సంవత్సరాలు అవిరామంగా దేశాటన చేశాడు. జైనము అంటే జయించినది అని అర్థము. జైనుడు అంటే జయించినవాడు. రాగ ద్వేషములను జయించిన వారే జైనులని వారి నమ్మకము. జైన మత వ్యాప్తికి నిరంతరం కృషిసల్పిన మహావీరుడు 72వ ఏట పాట్నాకు సమీపంలోని పావపురిలో క్రీ॥ పూ 468 నిర్యాణము చెందాడు.[2]

---

1) An Introduction to Indian Philosophy. (1986)
by Satisohandra Chetterjee M. A, Ph. D.
Dhirendra Mohan Datta, M. A, Ph. d. P. 72.

2) Studies in Jainism and Budhism in Mithila
by Upendra Thakur P. 81.

బ్రాహ్మణులు తమ సంస్కృతిని అభివృద్ధి చేయడానికి సంస్కృతాన్ని, బౌద్ధులు తమ సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి పాళి భాషను ఉపయుక్తం చేసుకున్నారు. అయితే జైనులు తమ మత ప్రచారానికి ప్రాంతీయ భాషను ముఖ్యంగా ప్రాకృత భాషలను సాధనం చేసుకున్నారు. జైనులు భారతీయ భాషలకు ఎంతో సేవ చేశారు. ఈ విషయాన్ని హరిలాల్ జైన్ తన పరిశోధనలో ఇలా పేర్కొన్నారు.

"The Jains have played a very important role in the linguistic development of the Country. Sanskrit has all along-been the medium of sacred writings and preachings of the Bra hmanas and Pali that of Buddists. But the Jains utilized the prevailing languages of the different times at different places for their religious propaganda as well as for the preservation of Knowledge, In this way, they exercised a predominant influ-nce on the developmdnt of the prakrit languages. They even gave a literary shape to some of the regional languages for the first time.
Mahavira preached in the mixed dialect called Ardhra-Magadhi, in order that he might be understood by people speaking both Magadhi and Souraseni, and his teachings were classified into twelve books called Srutangas,"[1]

జైన మతం బ్రాహ్మణ ఆధిపత్యాన్ని ప్రశ్నించింది. వేదాలను తిరస్కరించింది. వైదిక వివాహ వ్యవస్థను విమర్శించింది. జైనులు లైంగిక సంబంధాలు బ్రహ్మచర్యంకన్నా తక్కువ స్థాయిలోవని సిద్ధాంతీకరించారు.

ప్రాచీన జైన గ్రంథాలు బ్రాహ్మణ వ్యతిరేకతను ప్రకటించాయి. 24 గురు జైన తీర్థంకరులు క్షత్రియ కులాల నుండే వచ్చారు. బ్రాహ్మణాధిపత్యాన్ని ఎదిరించారు.

---

1) The Cultural heritage of India
Voi, 1. (1976) Pago. 402,

పార్శ్వనాధ కాలము నుండే స్త్రీలు సన్యాసినులుగా దీక్ష బొందే వారు. దిగంబరులు శ్వేతాంబరులు స్త్రీ మోక్షం విషయంలో భేదాన్ని కలిగి ఉన్నారు. దిగంబరుల ఉద్దేశ్యంలో స్త్రీ మోక్షానికి పరిపూర్ణత చెందిన వ్యక్తి కాదు. శ్వేతాంబరులు మాత్రం స్త్రీకి మోక్షానికి వెళ్ళే అర్హత ఉందన్నారు.

"దిగంబరులు" స్త్రీలు కూడా దిగంబరంగానే ఉండాలన్నారు. శ్వేతాంబరులు వీరు తెల్ల వస్త్రాలు వేసుకోవచ్చు అనేవారు. మహావీరుడు వివాహితుడని శ్వేతాంబరులు అంటారు. చరిత్ర కూడా అదే చెబుతుంది. దిగంబరులు మాత్రం మహావీరుడు బ్రహ్మచారి అని అంటారు.

మగవారు భార్యలను వదిలివేస్తూ సన్యాసులుగా మారుతూ ఉండేవారు. స్త్రీలు కూడా తమకు ఇష్టం వచ్చినప్పుడు సన్యాసినులుగా మారుతూ ఉండేవారు. కొంత కాలం పోయిన తరువాత హిందువులతో వీరికి సంబంధాలు పెరిగాయి. అంతటితో వీరి నిబంధనలు కొంత సడలాయి.

దిగంబరులు శ్వేతాంబరులు జైన సన్యాసిని జైన సన్యాసి కంటే తక్కువదనే విషయంలో ఏకాభిప్రాయంతో ఉండేవారు.

శ్వేతాంబర శాఖ — గుజరాతు, రాజపుతానా పశ్చిమ భాగము, సంయుక్త ప్రాంతం, మధ్య భారతాల్లో బాగా వ్యాప్తి నొందింది. దిగంబర శాఖ పశ్చిమోత్తర పంజాబులోను. తూర్పు రాజపుతానాలోను, దక్షిణ భారతంలోను విస్తృతిని పొందింది. శ్వేతాంబరుల మూల గ్రంథము "అంగ" ప్రాకృతంలో వ్రాయబడింది. దిగంబరుల గ్రంథాలన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి.

జైన సన్యాసినులను "మహా పరిజ్ఞాన", "అరుణో పావత." "దృష్టి వాద" అనే మూడు అధ్యాయాలను మాత్రం చదవనిచ్చేవారు కాదు.

"దృష్టివాద"లో కొన్ని ఇంద్రజాలాలు ఉన్నాయి. వాటికి ఏకాగ్రత కావాలి. స్త్రీలు చంచలులు కాబట్టి ఇది చదవనివ్వకూడదని వారి ఉద్దేశ్యం.

జైన మతంలో మూడు సంవత్సరాలు పురుషుడు సన్యాసం పుచ్చు కొంటే అతడు ముప్పది సంవత్సరాలు సన్యాసినిగా బ్రతికిన స్త్రీలకు గురువవ్వడానికి అవకాశం ఉండేది.

బౌద్ధ సన్యాసులు వ్రాసినంత సాహిత్యం జైన సన్యాసులు వ్రాయ లేదు. అంతఃపుర కాంతలు ఏ విధంగా సన్యాసినులుగా మారారో జైన సన్యాసినులు వారి సాహిత్యంలో వివరించారు. వారిలో జయంతి అనే ఆమె కోశాంబి రాజు సహస్రానిక కుమార్తె. ఆమె మహావీరునితో మతము గురించి చాలా లోతైనచర్చలు చేసి సన్యాసిని అయ్యింది.

మహావీరుని కూతురు ప్రియదర్శన గొప్ప విజ్ఞాన వంతురాలిగా ప్రసిద్ధికెక్కింది. మొదట తన భర్తతోపాటు జైన మతంలో చేరింది. తరువాత సన్యాసినిగా మారింది.

కొందరు సన్యాసినులు పురుషాధాయిత్వాలకు గురయ్యారు. కొం దరు గర్భవతులయి పిల్లలను కూడా కన్నారు. కన్యలకు, సన్యాసిను లకు పుట్టిన బిడ్డల కోసం శిశు సంరక్షణాలయాలు కూడా నడుపబడ్డాయి.

లైంగిక సంపర్కం లేకుండానే స్త్రీలకు గర్భిణి రావచ్చు అని బృహత్కల్ప భాష్యంలో ఉంది. గర్భధారణమును బట్టి శీలాన్ని శం కించడానికి వీలు లేదని జైన దర్శనాలు పేర్కొన్నాయి.

లైంగిక సంపర్కం లేకుండా గర్భధారణకు నాలుగు కారణాలను వారు పేర్కొన్నారు.

1) వీర్యంపై ఎలాంటి అచ్ఛాదన లేకుండా కూర్చొన్నప్పుడు ఆ స్త్రీకి గర్భం రావచ్చు.
2) నిద్రిస్తున్న స్త్రీ మర్మాంగములోనికి వీర్యాన్ని పంపించినప్పుడు గర్భం రావచ్చు.
3) వీర్యంతో తడచిన అంగ వస్త్రమును ధరించినప్పుడు గర్భము రావచ్చు.
4) వీర్యం కలిసిన నీరు త్రాగిన కూడా గర్బం రావటానికి ఆస్కారం ఉంది అన్నారు.

ఈ కోణంలో చూస్తే చాలా సందర్భాల్లో క్రూరులైన మగవారి దయా దాక్షిణ్యాలమీద వారి శీల రక్షణ ఉన్నదని యీ గ్రంథాలు పేర్కొన్నాయి.

జైన సన్యాసులు బ్రహ్మ చర్యాన్ని కఠోరంగా పాటించారు. ఒక వేళ నియమాన్ని వారు అతిక్రమిస్తే వారు తప్పక శిక్షింప బడేవారు. ఆమె లౌకిక ప్రపంచం నుండి రక్షింప బడాల్సిన అవసరము యెప్పుడూ ఉండేది.

కొన్ని సందర్భాల్లో గౌరవప్రదమైన గృహస్థుని సంరక్షణలో వారు జీవించవచ్చు. లేని పక్షంలో వారికి ప్రత్యేకంగా నియమించిన బిక్షాటనావసరం లేని ఆశ్రమాల్లో నివసించవచ్చు. అక్కడ ప్రతి నిత్యం వ్రత కర్మ కాండలు జరుగుతాయి. ఎవరైనా వారిమీద నింద మోపినా, ఆశ్రమ యజమానులు వారిని బహిష్కరించేవారు కాదు. వారు దోషభూతులైనప్పుడు సన్యాసినులకు పుట్టిన కేసి, సత్యకి వంటి వారిని ఉదహరిస్తూ సమర్ధించ బడేవారు.

జైన సన్యాసినుల రక్షణ విషయంలో అప్రమత్తంగా వుండేవారు. జైనులలో వున్న ఈ మానవత, సహన లక్షణాలు క్రూర హిందూ సంస్కృతికి భిన్నమైనవి. కన్యకు వితంతువుకు బిడ్డలు కలిగి వుండడాన్ని హిందూ వ్యవస్థ పూర్తిగా నిరసించింది.

జైనులు స్త్రీలకు ప్రత్యేక నిఘంటువును సృష్టించారు. వారి భావాలకు అనుగుణంగా నిర్వచనాలు అల్లారు.

"She is called Nari (Na-ari) because there was no worse enemy for man than she, she is Mahila because she charms by her wiles and graces, she is called Padma because she accelerates a man's passion. she is called Mahitiya because she creates dissention, she is Rama because she delights in coquetry, she is called Angana because she loves the Anga or body of men, she is Josiya because by her tricks she keeps men under subjection, she is Vanita because she caters to the taste of men with her various blandishments"[1]

1.) J. C. Jain — Life in Ancient India as Depicted in the Jain Canons, Inbian women through the ages quoted P. 110, 111

పురుషునికి ఈమెకన్న శత్రువు ఇంకొకరు లేనందు వలన ఆమె "నారి" అని చెప్పబడింది. ఆమె తన శరీర లావణ్యంతో అందంగా కనిపించి ఆకర్షించుచును గాన "మహిళా" అనబడు చున్నది. పురుషుని కోరికలను పెంపొంద జేయుటచే "పద్మ" అని చెప్పబడు చున్నది. పురుషుని జ్ఞానమును నిరోధించును గాన "మాహిత్య" అని చెప్పబడు చున్నది. భౌతిక జీవితము నందు ఆనందము నిచ్చుటచే "రమ" అని చెప్పబడు చున్నది. పురుషుని శరీరమును పౌరుషమును ప్రేమించునది గాన "అంగన" అని చెప్పబడు చున్నది, తన మాయలచే పురుషులను వశ్యులనుగా చేసుకొని నిలుపుటచే "జోష్య" అని చెప్పబడు చున్నది. అనేక విధములైన కోరికలతో పురుషుల అభిరుచులను తీర్చేది కాబట్టి "వనిత" అనబడు చున్నది. అని పేర్కొన్నారు.

ఈ నిర్వచనాల మీద వైదిక సంస్కృతి ప్రభావం కనిపిస్తుంది. స్త్రీ సౌందర్యానికి, సౌకుమార్యానికి పురుషుడు లొంగి పోరాదని అందుకే ఆమెకు దూరంగా వుండమని ఈ నిర్వచనాలు భయపెడుతున్నాయి.

జైనం, బౌద్ధం ఒక ప్రక్క వైదిక సంస్కృతిని నిరసిస్తూనే దాని ప్రభావానికి కొన్ని సందర్భాల్లో గురవుతూనే వుంటాయి. అయితే మౌలికంగా మాత్రం జైనం, బౌద్ధం అవైదిక దర్శనాలుగా నూత్న సిద్ధాంతాలను ప్రతిపాదించడమే గాక నూత్న జీవిత విధానాన్ని కూడా నిర్దేశించ గలిగాయి. అయితే జైన గ్రంథాలు స్త్రీల విషయంలో వారి శీలాన్ని, హృదయాన్ని అనుమానించడమే గాక వారిని దైవ మతాల ముందు నిల వేసినా వారు దేవతలను కూడా తమ తెలివితో, ఆర్ద్రతతో మోసగిస్తారని కొన్ని చోట్ల పేర్కొన్నాయి. అంతే గాక జైన గ్రంథాలు స్త్రీల హృదయం లోతైందని, అది తెలిసికోవడం తెలివిగల వారికి కూడా చాలా కష్టమని వర్ణించిన తీరును జె. సి. జైన్ ఈ విధంగా ఉదహరించారు—

"..... .... ... .... the intelligent may know the sands of the earth., the waters of the sea and the size of the Himalayas, but a woman's heart they may not know. They weep and make you weep, they tell lies and make you beleve them A woman indeed is like suger when she has fallen in love, but the very same woman surpasses the bitter Nimba as soon as her love has ended .... ... ... Delighting in various love sports

'unstable in their affections, they are lika the colour of turmeric. Cruel in their hearts and charming in body, speech and glance girls resemble a knife in laid with gold.'[1]

తెలివి గలవారు హిమాలయాల ఆకార పరిణామాన్ని, సముద్ర జలాలను, భూమి ఇసుక పొరలను తెలుసుకొన గలరు. కాని, స్త్రీ అంతర్యమును వారు యెరుగజాలరు. స్త్రీలు విలపిస్తారు. విలపింపజేస్తారు. అబద్ధాలాడతారు. వాటిని నమ్మిస్తారు. ప్రేమలో బడినప్పుడు స్త్రీ నిజముగా పంచదార లాంటిది. కాని ప్రేమ ముగిసే సరికి ఆ స్త్రీయే వేప చేదును మించి పోతుంది. స్త్రీలు వివిధ కామ క్రీడలలో వినోదించేవారు. ప్రేమ కలాపాలలో అస్థిరులైనవారు, పసుపుపచ్చ ఛాయగలవారు, హృదయాలలో క్రూరత్వం గలవారు, శరీరంలో, మాటల్లో, చూపుల్లో లావణ్యం గల పడుచు పిల్లలు బంగారు కత్తిని పోలివుంటారు.

ఇంతేగాక జైన గ్రంథాలు జైన సన్యాసులు స్త్రీలకు దూరంగా వుండమని నిర్దేశించినాయి. కాళ్ళు, చేతులు నరికివేయబడినా నమ్మవద్దని స్త్రీ ఏ పరిస్థితుల్లో వున్నా ఆమెకు దూరంగా వుండమని ఆజ్ఞాపించినాయి.

అనేక విషయాలలో నిగ్రహముగా ఉండి ప్రసిద్ధుడైన "సుభయు" అనే జైన సన్యాసి కేవలం ఒక రాణి కుమారులు తాకినంతనే నిగ్రహశక్తిని కోల్పోయాడనే ఉదాహరణనుచెబుతూ స్త్రీకి దూరంగా ఉండమని జైన సన్యాసులను జైన గ్రంథాలు హెచ్చరించాయి.

జైన సన్యాసుల కథలు ఇలా ఉన్నప్పటికి జైన సమాజము స్త్రీల పట్ల గౌరవంగానే వ్యవహరించింది.

జైనుల్లో కొందరు స్త్రీని గురించి చాలా ఉన్నతంగా కూడా ఆలోచించారు. అయితే వాటి నిరూపణకు గ్రంథాలు తక్కువగా ఉన్నాయి.

జైనులు కూడా బౌద్ధులులాగే వేశ్యలను ఆదరించారు. 64 కళలలో ఆరితేరి ఉన్నందున "చంప" అనే వేశ్య చాలా ఉన్నతంగా గౌరవింపబడిందని Naya Damma Kaha అనే జైన గ్రంథంలో పేర్కొనబడింది.

---

1) J. C. Jain Life in Ancient India. As depicted in the Jain Canons, quoted Ibid Page 112.

కొందరు జైన సన్యాసుల వేశ్యలుతో కూడా సంబంధం కలిగివున్నట్లు "వ్యవహార భాస" అనే జైన గ్రంధములో చెప్పబడింది.

అంతఃపుర స్త్రీలకు పరదా పద్ధతి ఉండేది. రాజులకు పెక్కు సంఖ్యలో భార్యలుకూడా ఉండేవారు. మహాసేన అనే రాజుకు వెయ్యి మంది భార్యలు ఉన్నట్లు జైన గ్రంథాలు చెబుతున్నాయి. సింహసేన అనే రాజుకు 500 మంది భార్యలు ఉండగా ఒక భార్యనే రాజు ఆదరిస్తున్నాడని, మిగిలిన 499 మంది భార్యలు అసమ్మతిని తెలుపుతారు. వీరి తల్లులు రాజు ప్రేమిస్తున్న భార్యను చంపడానికి ప్రయత్నించగా, రాజు మరొక పథకం వేసి ఈ 499 మంది తల్లులను విందుకు ఆహ్వానించి ఆ విందుశాలను దగ్ధంచేసి వారిని చంపివేస్తాడు.

భారతదేశంలో జైన మతం బాగా వ్యాప్తిలో ఉన్న కాలంలో జైన రాజులు అంతఃపుర వ్యవస్థను గురించి ఈ విధంగా అనేక కథలు వివరించబడ్డాయి.

ఇంతేగాక జైనుల కాలంలో స్త్రీలు కుండలు చేయడంలో యెంతో సామర్థ్యాన్ని కలిగి ఉండేవారు. ఈకాలంలో స్త్రీలు వడకడంలోను, నేయుడంలోను ప్రపంచ ప్రసిద్ధిగాంచారు. స్త్రీలు అనేక చేతి వృత్తుల్లో నైపుణ్యం కలిగి ఉన్నారు. [1]

అయితే జైన మతం వ్యాపార వర్గాల్లో అభివృద్ధి చెందినంత వ్యవసాయ వర్గాల్లో అభివృద్ధి చెందలేదు. జైనంలో వున్న అహింస సిద్ధాంతము వ్యవసాయ వర్గాలు జైనంలోనికి చొచ్చుకు రావడానికి అడ్డంకి అయ్యింది.

ఈ విషయాన్ని రొమిలా థాపర్ ఇలా వివరించారు—

"Jainism spread rapidly amongst the trading community The emphasis on non-violence (ahimsa) prevented agriculturalists from being Jainas, since cultivation involved killing insects

---

1) "Hindu Ethos and the Challenge of change" (1972) By Subhaya Dasgupta. Page. 7R,

and pests, it also excluded crafts endangering tha life of other creatures. Trade and commerce were possible occupations and the encouragement of frugality in Jainism coincided with a similar sentiment in commercial activity."[1]

జైన మతము వ్యాపార వర్గంలో వేగంగా వ్యాపించింది. అహింసపై నొక్కి వ్యవసాయదారులు జైనులగుటకు ఆటంకమైనది. కారణం వ్యవసాయంలో క్రిమికీటకాలను చంపుట ఉన్నది. ఇతర జీవులకు ప్రాణాపాయం కలిగించే వృత్తులను కూడా జైనం త్రోసివేసింది. వారికి వర్తక వాణిజ్యాలే సాధ్యమైన వృత్తులు. జైనంలో మానవ జీవన సరళికి ప్రోత్సహించబడిన పొదుపరి విధానం వారి వాణిజ్య రంగంలో అన్వయానికి కూడా సరిపోయింది.

బౌద్ధజైనాలు ఆర్య రాజుల నుండి ఆవిర్భవించలేదు. అవి ఆటవిక తెగల నుండే ఆవిర్భవించాయి. బుద్ధుని శాక్య వంశంకాని, మహావీరుని లిచ్ఛవి వంశంగాని ఆటవిక తెగల నుండి ఆవిర్భవించినవే. బౌద్ధ జైన నియమ నిబంధనలు "అనార్య"మైనట్టివే. ఈ విషయాన్ని కోశాంబి ఇలా గ్రంథిస్తున్నాడు.

"The Buddhist and Jain monastic orders were modelled upon such tribal constitutions, quite naturally. seeing that the Buddha came from tribal Sakyans and the Jain founder Mahavira from tribal Licchavis.'[2]

బుద్ధుడు ఆటవిక తెగ శాక్యుల నుండి, జైన మత స్థాపకుడైన మహావీరుడు ఆటవిక తెగ లిచ్ఛవిలు నుండి వచ్చారనేది చూస్తే బౌద్ధ, జైన మత పద్ధతులు అట్టి ఆటవిక తెగ నిబంధనలపై చాలా సహజంగా యేర్పరచ బడినవి.

---

1) A history of India Volume I (1978)
By Romila Thapar, P, 65,

2) An Introduction to the Study of Indian History (1975)
by D, D, Kosambi Page. 136.

మహావీరుడు ఆధ్యాత్మిక భావనతో కుల లింగ భేదాలు విస్మరింప బడతాయి అన్నాడు.

"Caste - system, according to him (Mahavira) was just circumstantial and it is easy for a spiritual man to break the fetters of this system The gift of supernormal vision was no monopoly of any order or Caste or sex and in this matter he made no distinction between men and men or between men and women."[1]

మహావీరుని ప్రకారం కుల వ్యవస్థ పరిస్థితులననుసరించి తాత్కాలికంగా యేర్పడినదే. ఈ వ్యవస్థ బంధాలను ఛేదించటం ఆధ్యాత్మిక చింతన గల వానికి చాలా సులభం. విశేష దృష్టి కలిగి వుండట మనేది ఏదో ఒక పద్ధతి లేదా కులం లేదా లింగం యొక్క గుత్త హక్కుకాదు. ఈ విషయంలో ఆయన పురుషుల మధ్య, లేక పురుషులు స్త్రీల మధ్య తేడాను చూపలేదు.

మొత్తం మీద జైనం అవైదికం. వైదిక సంస్కృతికి భిన్నమైన సంస్కృతిని రూపొందించే ఈ ప్రయత్నంలో "అహింస"ను ఆచరణాత్మక రూపంగా ముందుకు తీసుకు వచ్చింది. జైనంలో స్త్రీ వైదిక సంస్కృతికి భిన్నమైన జీవిత విధానాన్ని అనుసరించింది. జైనంలో స్త్రీకి సంబంధించిన అశుచిషేత తక్కువగా వున్నప్పటికి స్త్రీ పట్ల వైరాగ్యాన్ని జైనులు యెక్కువగా పాటించారు. స్త్రీని ఒక భోగ్య వస్తువుగా వారు పరిగణించక పోయినా, ఆ స్త్రీకి దూరంగా ఉండాలని ప్రబోధించారు. ఆచరణలో విఫలమయ్యే కొద్ది స్త్రీ ప్రాధాన్యాన్ని గ్రహించారు. అశుచి వేత లేని కుటుంబ వ్యవస్థా నిర్మాణానికి ప్రయత్నించారు. స్త్రీ బ్రహ్మచర్యానికి అవరోధంగా ఉన్న సామాజిక ప్రాకృతిక అంశాలను కూడా వారు శాస్త్రంగా తెలుసుకో గలిగారు.

భారతదేశంలో బౌద్ధ జైన సంస్కృతుల ప్రభావం తగ్గి, గుప్తుల స్వర్ణ యుగం ఆవిర్భవించిన తరువాత స్త్రీ "సతీ సహగమన" జ్వాలల్లో దగ్ధ మవ్వడం ప్రారంభమైంది. బౌద్ధ జైనాలు పరిఢ విల్లిన దేశాల్లో స్త్రీ స్వేచ్ఛ అభివృద్ధి చెంది సోషలిస్టు రాజ్యాలు ఆవిర్భవించినవి. దీన్ని బట్టి మనం అవగతం చేసుకోవచ్చు బౌద్ధ జైనాల గొప్పతనం.

---

1) Law' "Mahavira" P. 44. quoted from "Studies in Jainism and Buddhism in Mithila P. 87 88,.

# బౌద్ధం — స్త్రీ

బ్రాహ్మణ సంస్కృతి వ్యాప్తి చేసిన వర్ణ వ్యవస్థతోపాటు బలిదాన వ్యవస్థ రాజ్యమేలుతున్న కాలమది. బలులు, సోమపానాలు, మాంస భక్షణలు నిరంతరం నిర్వహించే ఆర్య పురోహిత వర్గం భారతీయ వ్యవస్థ మీద పెత్తనం చేస్తున్న కాలమది. ఆర్య బ్రాహ్మణ పౌరోహిత్య సంప్రదాయ బద్ధమైన హిందూ వ్యవస్థపైన తిరుగుబాటు చేసిన భారతీయులు జైనులు, బౌద్ధులు. ఈ బౌద్ధ జైన ఉద్యమాల నిర్మాతలు క్షత్రియులు. వారు బ్రాహ్మణాధిపత్యాన్ని యెదిరించి అగ్రవర్ణాధిపత్యాన్ని పొంద గలిగారు. బౌద్ధ, జైన సాహిత్యాలు క్షత్రియులను బ్రాహ్మణుల కన్నా అగ్ర వర్ణాలుగానే పేర్కొన్నాయి.

"In the literature of Buddhists and Jains we find the Kshatriyas often mentioned as the first caste and superior to the Brahmins."[1]

గొప్ప చక్రవర్తియైన అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించడం చరిత్రలో అత్యద్భుతమైన సంఘటన. ఈ అంశము భారత దేశాన్నే కాదు ఆసియా మొత్తాన్ని ప్రభావితం చేసింది. భారతదేశం బౌద్ధ భూమిగాను విముక్తి మార్గంగాను, ఆనాడు గోచరించింది. బౌద్ధ స్థూపాలు, శిల్పాలు, క్షేత్రాలు భారతదేశంలోనేగాక సిలోన్, జావా, సుమిత్రా మలయా, బర్మా, ఇండోచైనా, మధ్య ఆసియా, టిబెట్, కొరియా, చైనాలలో వెలిశాయి. అంతేగాక ఆనాడు బౌద్ధ భిక్షువుల ధర్మఘోషతో ఈ క్షేత్రాలు ప్రతిధ్వనించాయి. క్రీ॥ పూ॥ 5వ శతాబ్దం నుంచి క్రీ॥ శ॥ 8వ శతాబ్దము వరకు బౌద్ధ సంస్కృతి తన అహింసా సిద్ధాంత ఆచరణని భారతదేశంలో ప్రతిఫలింప జేయ గలిగింది. బౌద్ధ ధర్మ ప్రభావానికి బెదిరి సోమపానులు, మాంస భక్షకులైన బ్రాహ్మణులు శాఖాహారులు గాను, అహింసాపరులుగాను, నిరూపించు కోవడానికి ప్రయత్నించారు.

---

1) Indian Women through rhe eges (1964)
by P. Tnomas. Page. 79.

"The Brahmins who were, during the Vedic Period, great sarcificers, Soma-drinkers and meat - eaters, emerged in the huddhist period as vegetarians and teetotallers, Anyway we are here concerned not so much with the religious influance of Buddhism as its social iufluence."[1]

ఈ విధంగా తమ ప్రభావాన్ని అన్ని వర్ణాలమీద పరచగలిగిన బౌద్ధ జైనుల తిరుగుబాటునుగూర్చి రోమిల్లా థాపర్ ఇలా వివరించారు—

"There was much in common between Buddhism and Jainism. Both were started by members of the Kshatriya Caste and were opposed to brahmanical orthodoxy, denying the authority of the Vedas, and antagonistic to the practice of animal sacrifices, which had by now become a keystone of brahmanical power, Both appealed to the socially down - trodden, the Vaishyas who were economically powerful, but were not granted corresponding social status and the shudras who were obviously oppressed. Buddhism and Jainism though they did not directly attack the caste system. were nevertheless opposed to it and can, to that extent, be described as non-caste movements. This provided an opportunity for those of low caste to opt out of their caste by joining a non-caste sect. The lack of expenses involved in worship as contrasted with Brahmanical worship, also attracted the same stratum in society."[2]

బౌద్ధ జైనాలలో ఒకే రకంగావున్న విషయాలు అనేకం వున్నాయి రెండు మతాలు క్షత్రియ కులస్థుల చేతనే ప్రారంభించ బడినాయి. రెండునూ బ్రాహ్మణ సనాతన ఆచారాలను వ్యతిరేకించినాయి. వేద ప్రామాణ్యాన్ని నిరాకరించినాయి. జంతు బలులను తీవ్రంగా ఖండించినాయి. ఇప్పుడు బ్రాహ్మణులు జంతు బలుల నిషేధాన్ని ముఖ్యంగా చెబుతున్నారు. బౌద్ధం జైనం రెండూనూ సాంఘికంగా క్రింది తరగతులవారికి ఆర్థికంగా శక్తిమంతులుగా వున్న బ్రాహ్మణ క్షత్రియులతో పాటు సాంఘిక స్థాయి ఇవ్వబడని వైశ్యులకు, అణగ ద్రొక్కబడిన శూద్రులకు

1) Ibid P. 79

2. A History of India (1968) Volume 1 P. 67, 68.

తమ ధర్మాన్ని స్వీకరించ వలసినదిగా విజ్ఞప్తి చేసినాయి. బుద్ధిజం జైనిజం రెండునూ కుల వ్యవస్థను సరాసరి ప్రతిఘటించక పోయినా, అవి ఏదోవిధంగా దాన్ని వ్యతిరేకించి నందున అవి కుల రహిత ఉద్యమాలుగానే వర్ణించ బడినాయి. ఇది క్రింది కులాల వారికి తమ కులము కాని వారితో కలవటానికి అవకాశం కల్పించింది. బ్రాహ్మణ ఆరాధనా విధానంలోవలె గాక, తమ ఆరాధనలలో ఖర్చు లేకపోవటం కూడా బౌద్ధ జైనాలు క్రింది తరగతుల వారిని ఆకర్షించటానికి కారణభూతమైనాయ్.

బుద్ధునికి ముందు వివాహం స్వయంవర పద్ధతి ఉండేది, సిద్ధార్థుడు హిందూ క్షత్రియుడే. అతడికి ఆ తరువాత వివేకవంతుడనే అర్థంలో గౌరవ ప్రద్ధంగా బుద్ధుడనే నామం సంక్రమించింది. అతడు కూడా స్వయంవర పద్ధతిలోనే యశోదరాను పెండ్లాడాడు.

అప్పుడు అందమైన అమ్మాయిలకు బహుమతులు ఇస్తూ, నచ్చిన అమ్మాయిని వివాహం ఆడేవారు. బుద్ధుడు యశోధరకు ఉంగరాన్ని బహుమతిఇవ్వడంద్వారా వివాహ మాడినట్లుగా కూడా చరిత్రకారులు చెబుతున్నారు.

సిద్ధార్ధ యశోధరాల వివాహాన్ని బట్టి ఆనాడు బాల్య వివాహాలు లేవు. కొందరు చరిత్రకారులు బుద్ధుడు యశోధ సమ వయస్కులని పేర్కొన్నారు.

బౌద్ధులు వైదిక సంస్కృతిని మొత్తాన్ని వ్యతిరేకించారు. బ్రాహ్మణులకు శృంగార లైంగిక జీవితం, గృహస్థాశ్రమం పవిత్రమైనవి గనుక బౌద్ధులు లైంగిక జీవితాన్ని గృహస్థాశ్రమాన్ని వ్యతిరేకించారు. లైంగికతను పాపంగా భావించారు. వివాహాన్ని బౌద్ధులు ఆదిలో పవిత్రమైనదిగా యెంచలేదు. వివాహాన్ని సామాజిక. ఆర్థిక ఒప్పందంగానే భావించారు, అవసరమైనప్పుడు విడిపోయి బౌద్ధ బిక్షువులుగా చేరవచ్చు. బౌద్ధ దేశాలలో ఇప్పటికీ అదే పద్ధతి ఉంది.

"The Buddha does not seem to have had a very high opinion of women. At first he was not even prepared to found an order for nuns"[1]

1) Indian women through the ages (1964) P. 82.

బుద్ధునికి స్త్రీల పట్ల మొదట్లో అంత మంచి అభిప్రాయం ఉండేది కాదు. ఆయన మొదట్లో స్త్రీ ను సన్యాసినులుగా చేర్చుకొనడానికి అంగీకరించ లేదు.

ఒకసారి బుద్ధుణ్ణి పెంచిన మహాప్రజాపతి బౌద్ధ మతంలో చేరడానికి నిశ్చయించుకొని బుద్ధుడున్న ప్రాంతానికి అంటే కపిలవస్తు నుండి వైశాలికి నడిచి వచ్చింది. కష్టపడి నడిచి వచ్చి బుద్ధుణ్ణి ఆశ్రమంలో చేర్చుకోమని ప్రార్థేయ పడుతుంది. అయితే బుద్ధుడు నిరాకరిస్తాడు. బుద్ధుని శిష్యుడైన ఆనందుణ్ణి అడుగుతుంది. ఆనందుడు ఆమె తరపున వాదించాడు. నీవు పెంచిన తల్లికే ఆశ్రమంలో స్థానం ఇవ్వకుండా ఎట్లు నిర్వాణం పొందగలవని ప్రశ్నిస్తాడు. చివరకు బుద్ధుడు ఆ తల్లికి ఆశ్రమ ప్రవేశాన్ని కల్పించాడు. ఆ సందర్భంలో ఆనందునితో బుద్ధుడు స్త్రీల ప్రవేశం లేకుండా ఉండి ఉంటే బౌద్ధ మతం వెయ్యి సంవత్సరాలు జీవించగలిగి ఉండేదని, స్త్రీల ప్రవేశంతో 500 సంవ్సరాల కంటే జీవించదని చెప్పాడు, అయితే అందుకు విరుద్ధంగా బుద్ధుని మరణం తరువాత భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ 2500 సంవత్సరాలు అవుతున్నా ఇప్పటికీ బౌద్ధం బతికే ఉంది.

బుద్ధుడు తన జీవిత కాలంలో స్త్రీలపట్ల కొన్ని సమయాల్లో వైముఖ్యం ప్రకటించాడు.

బౌద్ధ భిక్షువులకు "స్త్రీలను వీలున్నంత వరకు చూడవద్దు" అని, చూడవలసి వస్తే మాట్లాడ వద్దని, మాట్లాడవలసి వస్తే జాగ్రత్తగా మెలగమని బుద్ధుడు ప్రబోధించాడు.

"Once he is known to have said, He feels no pleasure when she comes, no sorrow when she goes, him I call a true Brahmana. released from passions."[1]

స్త్రీల ఆగమన నిష్క్రమణాలతో ఆనందాన్ని కాని, దుఃఖాన్ని కాని అనుభవించనివాడు నిజమైన జ్ఞాని అని బుద్ధుడు భావించాడు,

---

1 ) A Regligious History of Anicient India - 1984
Dr. S. R. Goyal Page. 269.

అయితే అతడు తన సమకాలీనమైన స్త్రీల పట్ల దయతో ప్రవర్తిం చేవాడు. పురుషులు ముఖాముఖి మాట్లాడేవారు. స్త్రీలు మాత్రం దూతల ద్వారా తమ విషయాలను చెప్పుకొనేవారు.

కొన్ని సందర్భాల్లో బుద్ధుని అనుయాయుల్లో కూడా స్త్రీల పట్ల తక్కువ భావం ఉండేది. బుద్ధుని మరణం తరువాత రాజ గృహములో జరిగిన సమావేశంలో బుద్ధుడు చనిపోయినప్పుడు స్త్రీలు ఏడ్చిన కన్నీరుతో ఆయన శరీరం తడవడం ద్వారా ఆయన శరీరం అపవిత్రం అయిందని బౌద్ధ భిక్షువులు ఆనందుని విమర్శించారు.

బుద్ధుడు స్త్రీలను గూర్చి :—

In the Milindapana the Buddha is reported to have said that "with opeitunity and secrecy and the right wooer all women will go wrong. They falling with others, with a crippre men. In the "Chullavagga" The Buddha opines that "Unfathomably deep is the character of women. They are like robbers with many artifices, with whom truth is hard to find, to whom lie is like the truth, a truth is like a lie. No heed should be paid to either likes or dislikes."

"మిలిందపాన"లో ఇలా వివరించారు :— "అవకాశం వుండి రహస్యంగా వుంచబడితే ఆకర్షించే వాడుంటే ప్రతి స్త్రీ తప్పు చేస్తుందని, అంగవైకల్యం కలిగిన వాడైనా సరే స్త్రీలు వారితో కూడతారని "చుల్లవగ్గ"లో బుద్ధుడు స్త్రీల హృదయం ఎంతో లోతైనదని, వారి నైజం తెలుసుకోలేనిదని, ఎంతో చాక చక్యం కలిగిన దొంగల వంటి వారని, వారి నుండి నిజం తెలుసుకొనడం కష్టమని, వారు నిజాన్ని అబద్ధంగా, అబద్ధాన్ని నిజంగా మార్చ గలరని, వారి ఇష్టా ఇష్టాలను లక్ష్య పెట్టరాదని చెప్పాడు.

ఈ అభిప్రాయాన్ని బట్టి బుద్ధుని మీద స్త్రీకి సంబంధించినంత వరకు బ్రాహ్మణ సంస్కృతి ప్రభావం ఒక దశలో ప్రగాఢంగా కనిపిస్తుంది.

బుద్ధుని అభిప్రాయాలు హిందూ సంస్కృతిని ప్రతిబింబించేవి చాలా ఉన్నాయి. భార్యలకు సంబంధించి చెబుతూ —

---

1) India, The status of women in Ancient India. P. 222
quoted - Ibid 272

ఏడు రకాల భార్యలున్నారని, వారిలో 4 రకాలు పవిత్రులని. వారు తల్లి వంటి వారు, చెల్లి వంటి వారు, మిత్రుని వంటి వారు, బానిసలైనవారు — ఈ నలుగురు మోక్షానికి అర్హులని, ఇక మిగిలిన మూడు రకాలు ఒకటి చండాలిని, రెండు చోరగత్తె, మూడు ఉంపుడుగత్తె ఈ ముగ్గురు నరకానికి వెళతారని వివరించాడు.

అయితే బౌద్ధ యుగంలో "సతి" దురాచారం భరత భూమిలో కనిపించలేదు. భర్త మరణించిన తరువాత భార్యపై హిందూ సంస్కృతి రుద్దిన మూఢాచారాలన్నింటిని బౌద్ధం వ్యతిరేకించింది. బౌద్ధం క్షీణించడం ప్రారంభించిన తరువాత భరత భూమిలో భర్త చనిపోయిన భార్య దగ్ధ మవ్వడం ప్రారంభమైంది. బౌద్ధ మతంలో సంఘతత్వం కూడా స్త్రీ విషయంలో పరివ్యాప్తమైంది.

బౌద్ధం తరువాత వచ్చిన హిందూ మతం మీద బౌద్ధ ప్రభావము చాలా ప్రగాఢంగా పడింది. బౌద్ధాన్ని జ్ఞాపకం చేయకుండా హిందూ మత గ్రంథాలు ముందుకు నడవలేక పోయినాయి. బౌద్ధాన్ని అశాస్త్రీయమైన ధోరణిలో హైందవం ఖండించింది. కొన్ని సందర్భాల్లో బుద్ధుడు స్త్రీ విషయంలో వ్యతిరేకంగా వ్యాఖ్యానించినా, రానురాను బౌద్ధ యుగములో స్త్రీ వ్యక్తిత్వం ప్రభాసించడం ప్రారంభించింది. పురుషాధీనత తగ్గుముఖం పట్టింది. బౌద్ధంలో సన్యాసినులు కూడా ఉన్నారు. వీరిలో ప్రసిద్ధులు మహాప్రజాపతిక్షేమ, పటాచర, సుభద, ఆమ్రపాలి వంటివారు.

రాచరిక వ్యవస్థలో రాజ నర్తకులకు చాలా గౌరవం ఉండేది. వారికి రాజాస్థానాల్లో పలుకుబడి ఉండేది. వారు సంపన్నులుగా కూడా ఉండేవారు.

బుద్ధుని కాలంలో అమ్రపాలి అనే రాజనర్తకి ఉండేది. బుద్ధుడు వైశాలి పట్టణానికి వెళ్ళినప్పుడు ఆమ్రపాలి తన ఆతిథ్యాన్ని స్వీకరించమని ఆహ్వానించింది. బుద్ధుడు అంగీకరించాడు. ఆ వార్త అందరికి తెలిసింది. అప్పుడు ఆ నగర పాలకులు లిచ్ఛవి వంశస్తులు. బుద్ధుణ్ణి ఆహ్వానించడానికి, ఆతిథ్యం ఇవ్వడానికి ఆమ్రపాలి కంటే తామే అన్ని విధాలా అర్హులమని వారు భావించారు. ఆమ్రపాలి కిచ్చిన ఆహ్వానాన్ని కాదని తమకు అతిథిగా రమ్మని కోరారు. బుద్ధుడు దానికి అంగీకరించ లేదు.

అప్పుడు ఆ రాజ వంశీయులు ఆమ్రపాలిని నీ ఆహ్వానాన్ని ఉపసంహరించుకొని మా ఆహ్వానానికి మార్గం సుగమం చేయమన్నారు. ఆమె అందుకు అంగీకరించ లేదు. బుద్ధుడు ఆమ్రపాలి ఆతిధ్యాన్నే స్వీకరించాడు. రాజ వంశాన్ని ధిక్కరించి ఆమ్రపాలి నిలవగలిగింది కూడా. ఇటువంటి సంఘటనలు చరిత్రలో చాలా ఉన్నాయి.

వేశ్య ఆహ్వానాన్ని మన్నించి నందుకు బుద్ధునికి చరిత్రలో మరక లేమి పడకపోగా చరిత్ర బుద్ధుని మన్నన చేసింది. ఇటువంటి సంఘటనల్లో రాజ వంశాన్ని కూడా కాదని నిలవగలిగిన బుద్ధుని ఔదార్యం ఉన్నతమైనదిగా గోచరిస్తుంది.

బాధ్యతను మరచి శృంగారలాలసత్వంలో మునిగిన తన తమ్ముడు నందుని బుద్ధుడు తన అనుయాయుడుగా చేసుకోవడమే గాక, అతడి భార్య సుందరి కూడా ధర్మ దీక్షను పొందడానికి ఉద్యుక్తురాలైనప్పుడు దీక్ష ఇవ్వడానికి బుద్ధుడు వెనుకాడలేదు.

ప్రసిద్ధ బౌద్ధ సన్యాసి ఉపగుప్తుడు పాటలిపుత్రము నందు అందాలరాశి వాసవదత్త ఇంటికి భిక్షాటనకు వెళ్ళాడు. ఆమె భిక్ష లేకుండానే చేతులు చాపుతుంది. ఈ కర కంకణాలు నాకెందుకు సర్వసంగ పరిత్యాగి నంటాడు. అంటే ఆమె చతురోక్తిగా కరములు చాచటంలో నర్మగర్భాన్ని తెలుసుకోలేక పోయావంటుంది. అందుకు ఉపగుప్తుడు "సమయం" చూసి వస్తానంటాడు.

చాలాకాలం ఎదురు తెన్నులు చూస్తుంది. ఈతడు రాలేదు. అంతలో ఒకనాడు వాసవదత్త బంగారు రత్నాల ఉంగరాల కోసం ఒక ధనవంతుని హత్య చేస్తుంది. దీనికి రాజు ఆగ్రహించి ఆమె కళ్ళు తీయిస్తాడు. ఆమె దుఃఖార్తురాలై తిరుగుతూ ఉంటుంది. అప్పుడు ఉపగుప్తుడు వచ్చి ఆమెకు బౌద్ధ ధర్మాన్ని బోధించాడు. ఈ సందర్భాన్ని వివరిస్తూ బొద్దులూరి నారాయణరావుగారు తన శాంతి పథంలో ఇలా చెప్పారు.

"కనులు పోయిన సరికొ్రొత్త కనులు వచ్చె
బుద్ధిలో నున్న చీకటి పొరలు విచ్చె
రమ్ము చెల్లెలా భౌద్ధ సంఘమ్ము దెసకు
అంచు గొంపోయె నుపగుప్తు నంధురాలి.

సంఘ సేవయే శరణమ్ము శాంతి కనుచు
ధర్మ రక్షయె శరణమ్ము దాంతి కనుచు
బుద్ధ దేవుడె శరణమ్ము భూమి కనుచు
మూగ బండలు బొమ్మలై మ్రాల్గు చుండె."

ఈ గాధ వలన బుద్ధుని శిష్యులు యెందరో అభాగినులైన స్త్రీలకు బౌద్ధ ధర్మ దీక్షను ఇచ్చినట్లు మనకు గోచరమవుతున్నది. అందువల్లనే బౌద్ధ యుగము రాలగరగించు మేటి వరాల యుగము.

అది ప్రపంచ ప్రజా హృదయ తంత్రుల మీటి
మంత్రి ముగ్ధులఁజేయు మౌర్య యుగము
అది దయారస దివ్య సుధలు గిన్నెల నింపి
త్రావుఁడంచును బంచు ధర్మ యుగము
అది వర్ణ విద్వేష మంతరింపఁగఁజేసి
సౌమనస్యముఁబెంచు స్వర్ణ యుగము
అది శాంత్య హింసల కెదురు కోలు నొసంగి
పసిడి పీటల వేయు బౌద్ధ యుగము

విశ్వ విశ్వంభరాదేవి విస్తువో వఁ
జిత్రకారుని కుంచియున్ శిల్పియులిని
వెలికి నుబికిన యనుభూతి వెల్లువలను
రాలఁగరగించు మేటి వరాల యుగము

(శాంతి పథము)

బౌద్ధ యుగంలో సమత వెల్లి విరిసింది. ప్రారంభములో కంటే రానురాను స్త్రీ సమత్వము అభివృద్ధి చెందింది. ఎందరో ఉన్నత వర్గాల స్త్రీలు ఆస్థులు, అంతస్తులు, కౌటింబిక జీవితాలు వదలి బౌద్ధ దీక్షను

స్వీకరించారు. వైశాలి సైన్యాధికారి మేనకోడలు సిన్హా వంటి వారెందరో బౌద్ధ మతాన్ని స్వీకరించారు. బౌద్ధం సౌందర్యలాలసత్వంలో నిగ్రహాన్ని ఆత్మస్థయిర్యాన్ని కోల్పోయిన ఎందరో స్త్రీలకు సన్మార్గాన్ని చూపి జీవితానికి లక్ష్యాన్ని. గమ్యాన్ని ఏర్పరచింది.

ప్రపంచ చరిత్రలోనే విదేశాలకు వెళ్ళి సేవా కార్యక్రమాల్లో పాల్గొని మొదటి వనితగా పేర్కొనబడిన అశోకుని కుమార్తె అయిన సంఘమిత్ర బౌద్ధ సన్యాసినిగా ఎందరికో మార్గదర్శకమై తన సేవా పథంలో సింహళంలోనే నిర్యాణం పొందింది.

బౌద్ధ ధర్మ దీక్షను స్వీకరించిన స్త్రీలు గురువుల చెంత వారు పొందిన శాంతిని ఎన్నో గీతాలుగా అభివ్యక్తం చేశారు.

## Sumangala's Song

O women! Well set free! How free am I,
How thorough'y free from kitchen drudgery !
Stained and squalid 'mong my cooking pots,
My brutal husband ranked even less
Than the sun-shades he sits and weaves always.
Purged now of all my former lust and hate,
I dwell musing at ease beneath the shade
Of spreading bouges – O, but 'tis well with me.

## Song of Mettika

Though I be suffering and weak, and all
My youthful spring be gone, yet have I come,
Leaning upon my staff, and climb aloft the mountain peak.
My cloak thrown off,
My little bowl o'erturned, so sit I here,
Upon the rock. And o'er my spirit sweeps
The breath of liberty! I win, I win
The triple lore, the Buddha's will be done!

### Song of Sangha

Home have I left, for I have left my world!
Child have I left, and all my cherished herds !
Lust have I left and ill-will too is gone,
And igncrance have I put far from me;
Craving and root of craving overpowered,
Cool am I now, knowing Nibbana's peace.

### Song of Vasatti

Now here, now there, lightheaded, crazed with grief,
Mourning my child, I wandered up and down,
Naked, unheeding, streaming hair unkempt,
Lodging in scourings of the streets, and where
The dead lay still, and by the chariot road-
So three years long I fared, starving athirst.

And then at last, I saw Him, as He went
within that blessed city Mithila,
Great tamer of untamed hearts, yea Him
The Very Buddha, banisher of fear.

Come back my heart to me, my errant mind:
Forthwith to Him I bent low worshipping,
And there, e'en at his feet, I heard the Norm
For of his great compassion on us all,
'Twas He who taught me, even Gotama.

I heeded all he said and left the world
And all its cares behind, and gave myself
To follow where he taught, and realise
Life in the Path to great good fortune bound.

Now all my sorrows are hewn down, cast out,
Uprooted, brought to utter end,
In that I now can grasp and understand
The base on which my miseries were built.[1]

---

1) పాళీ భాషలో C.A.F రైక్స్ డేలిప్స్ చేసిన అనువాదాలను పి. థామస్ తన "ఇండియన్ ఉమన్ త్రూ ది ఏజెస్" 88, 89 పేజీలలో కోట్ చేశారు.

ఈ విముక్తి గీతాలు, బౌద్ధ సంస్కృతి రానురాను స్త్రీలకు కలిగించిన శాంతిని, దాంతిని, క్రాంతిని మనకు బొమ్మకట్టిస్తున్నాయి.

అంతేగాక వైదిక ధర్మంతో తులనాత్మకంగా పరిశీలించినప్పుడు బౌద్ధం స్త్రీకిచ్చిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు భారతదేశంలో కంటే బర్మా దేశంలోనే మనకు స్పష్టంగా గోచరిస్తున్నాయి.

ప్రత్యేకించి వివాహం పట్ల బౌద్ధం స్త్రీని గురించి ఆలోచించిన పద్ధతి స్త్రీ ఆత్మగౌరవానికి దోహదం చేసే రీతిలో వుంది. ఆ రోజుల్లో బహుళ ప్రచారంలో వున్న పరదా పద్ధతిని బౌద్ధం నిరసించింది.

స్త్రీల శీల రక్షణ ముఖ్యంగా వారి మానసిక బలంపై ఆధారపడి వుంటుందేకాని, పరదాల పద్ధతివల్ల కాదని బౌద్ధం నమ్మింది. అందుకే యశోధర ముసుగు లేకుండా ప్రజల మధ్యకు వచ్చినప్పుడు ఆమె యెదుర్కొన్న విమర్శలకు సమాధానంగా ఆమె ఆత్మ విశ్వాసంతో స్త్రీల మానసిక బలాన్ని ఉత్తేజ పరుస్తూ ముసుగు పద్ధతిని నిరసించింది. బౌద్ధం బహు భార్యత్వాన్ని, బహు భర్తృత్వాన్ని నిరసించింది. టిబెట్, చైనాలలో కూడా బౌద్ధం ఈ పద్ధతినే ప్రచారం చేసింది.

మూడు రకాలైన వివాహ పద్ధతులను బౌద్ధం ప్రవేశ పెట్టింది.

1) పెద్దల ఆమోదంతో జరుగునవి.

2) మధ్యవర్తుల సహకారంతో జరుగునవి.

3) ప్రేమ వివాహాలు.

బౌద్ధం వివాహంలో స్త్రీ పురుషుల యొక్క పరస్పర అవగాహనకే ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. మైనరులకు కూడా చేసుకొనే హక్కు వుందికాని నిర్ణీత సమయం లోపల పెద్దలు అభ్యంతర పెట్టవచ్చు. 20 సంవత్సరాలువచ్చిన కన్యకు అప్పటివరకు తల్లితండ్రులు వివాహం చేయకపోతే "కన్య"యే సత్వంతిృంచి వివాహం చేసుకోనే హక్కును బౌద్ధం కలిగించింది. అది చట్ట సమ్మతము, సంఘ సమ్మతం కూడా అవ్వడం గమనించ వలసిన విషయము. స్త్రీ పునర్వివాహమునకు అర్హురాలుగా బౌద్ధం ప్రకటించింది

భర్త బౌద్ధసన్యాసం తీసుకొన్నచో ఆతనిమనస్సులో మార్పు వచ్చుటకు ఒక వారం రోజుల వరకు సమయం ఇచ్చి ఆమె పునర్వివాహం చేసుకొనడానికి బౌద్ధం అవకాశం ఇచ్చింది. వితంతువులు, విడాకులు పుచ్చుకొన్న స్త్రీలు కూడా పునర్వివాహమునకు అర్హులని బౌద్ధ సంఘం ప్రకటించింది. దీనిని బట్టి వివాహ విషయంలో స్త్రీకి బౌద్ధ రాజ్యాలు పూర్తి స్వేచ్ఛను చట్టబద్ధంగా కలిగించినట్లు స్పష్టమవుతుంది.

బర్మాలో వున్న ప్రభుత్వ నిర్ణయాల కంటే, చట్టబద్ధమైన సలహాల కంటే బౌద్ధమే బర్మాలోని స్త్రీలకు ఎక్కువ ప్రయోజనాత్మకమైన స్వేచ్ఛను సంతరింప జేసినట్లుగా చరిత్ర చాటి చెబుతోంది. పురుషులతో పాటుగా సమత్వాన్ని పొంద గలుగుటకు ఆనాటి స్త్రీని బౌద్ధం సన్నద్ధం చేసిన తీరు సమున్నతమైనట్టిది.

బౌద్ధ సంఘం కాలం గడిచేకొద్ది స్త్రీని సరైన దృక్పథంలో అర్థం చేసుకొంది. స్త్రీకి సమత్వాన్ని సమకూర్చింది. స్త్రీ బానిసత్వ విముక్తికై ఎలుగెత్తి పిలుపు నిచ్చింది.

అయితే బౌద్ధ యుగం భారత దేశంలో అంతరించే కొంది స్త్రీకి సంకెళ్ళు బిగుసుకున్నాయి. వైదిక సంస్కృతే బౌద్ధయుగా నంతరం భారతదేశంలో హిందూ మతంగా పరిణామంచెంది అసమ సమాజానికి ఉక్కు కవచాలు పూన్చింది. హిందూ సమాజంలో మరల స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు తిరోగమించాయి.

అనేక చారిత్రక పరిస్థితుల వల్ల బౌద్ధ యుగం అంతరించి, మర్లా హిందూ యుగం ప్రారంభమైంది. హిందూ యుగంలో వర్ణ వ్యవస్థను పితృస్వామ్య వ్యవస్థను, స్త్రీ బానిసత్వాన్ని పునరుద్ధరించారు. హిందూ ధర్మశాస్త్ర కర్తలైన గౌతముడు, మనువు, పరాశరుడు మొదలగువారు ఈ విష కర్మలో ప్రధాన పాత్ర వహించారు. వీరి విషపూరిత ధర్మశాస్త్రాలను పరిశీలించడం ద్వారా హిందూయుగ స్వభావం మనకు స్పష్టమవుతుంది.

# గౌతమం ధర్మ సూత్రాలు - స్త్రీ

స్త్రీకి సంబంధించిన ధర్మసూత్ర గ్రంథాల్లోగౌతమధర్మ సూత్రాలు కూడా ప్రసిద్ధమైనవి. ప్రసిద్ధమైన ఋషుల వరుసలోని గౌతముడు అనేక విషయాల్లో పురాణాల్లో ప్రసిద్ధుడు. ఈయన గురించి భారత రామాయణాల్లో ప్రసిద్ధ గాథలు ఉన్నాయి. గౌతముడు తన ధర్మ సూత్రాల్లో స్త్రీకి సంబంధించి కఠోరమైన నియమనిష్టలను నిర్దేశించాడు. స్త్రీజాతిమీద ఈతనికి ఈర్ష్యా ద్వేషాలు కూడా ఉన్నట్లు మనకు ప్రస్ఫుటమౌతాయి.

అయితే ఈతని గురించి చెప్పే కథల్లో ఈతడి భార్య ఇంద్రుడితో సంబంధం పెట్టుకోవడం, ఈతడు ఆమెను రాయిగా శపించడం, రాముని పాద ధూళి వలన తిరిగి ఆమె మూర్తీభవించడం చూస్తాము. అయితే ఈ గాథలో యదార్థత లేకపోయినా, ఆ రోజుల్లో ఆర్య ఋషులు యజ్ఞ యాగాల్లో తల మునకలై భార్యల మీద శ్రద్ధ చూపకుండా భార్య ఎవరితోనో తిరుగుతుందని అనుమానించి చివరకు వారిని బాధించడం మనకు గోచరమవుతుంది. అటువంటి పీడకులలో ఈ గౌతముడు కూడా ఒకడై ఉండాలి. ప్రకృతి ప్రేరణలకు వ్యతిరేకమైన అనేక నియమ నిష్టలను పెట్టుకొని, వాటిని ఋషులు అనుసరించ లేక, ఇతరులతో సంబంధాలు పెట్టుకోవడం ఎట్లా జరుగు తుండేదో, అట్లాగే స్త్రీలు కూడా వీరి అసమర్థతను అనాలోచన విషయాలను వ్యతిరేకిస్తూ ఉండడం కూడా జరుగుతూ ఉండేది. అయితే పురుషుడు అన్ని కాలాల్లో తనకు మాత్రం తిరిగే స్వేచ్ఛను ఉంచుకుంటూ, స్త్రీలకు మాత్రం నిషేధించడం జరుగు తుండేది. గౌతముడు స్త్రీ యజ్ఞ యాగాది విషయాల్లోకూడా అస్వతంత్రులాలని సూత్రీకరించు చున్నాడు.

"అస్వతన్త్రా ధర్మే స్త్రీ" – గౌతమ ధర్మ సూత్రాలు (2-9-1)

**వివరణ :** శ్రౌత సంబంధమైనవి గాని లేక గార్హ్య సంబంధమైనవి గాని అగు ధర్మమునందు భర్తయొక్క ఆచరణమును అనుసరించి వర్తింప వలసినదే గాని స్త్రీ స్వతంత్రురాలై యుండ దగినది కాదని సూత్రార్థము.

అంటే, వేదాలకు సంబంధించిన గృహమునకు సంబంధించిన ఏ విధియందు కూడా స్త్రీ స్వతంత్రురాలై ఉండకూడదట. ఇక్కడ స్త్రీని వైదిక సంస్కృతితో అన్ని రంగాల్లోను బానిసను చేసే సూత్రాలను నిర్దేశిస్తున్నారు. ఎందుకు స్త్రీని వైదిక కర్మకాండకు దూరంగా ఉంచారని ప్రశ్నిస్తే శృంగార శాస్త్ర ప్రకారం స్త్రీ చంచలనమైనది అని చెబుతున్నారు. ప్రకృతి సంబంధమైన ఆమె ఋతు ధర్మాన్ని నీచమైనదిగా, అంటరానిదిగా నిర్ధేశించి స్త్రీని అన్ని కర్మకాండలకు దూరంగా ఉంచడం జరిగింది. ఆమె పరుల కంట పడితేనే ఏమో అయిపోతుందని భయపడి ఆమెను పరులకంట పడకుండా గౌతముడు నిర్దేశిస్తున్నాడు.

"వాక్చక్షుః కర్మసంయతా" - గౌతమ ధర్మ సూత్రాలు-(2-9-3)

విసరణ : మరియును నామె వాక్సంయమము గలదిగాను అయియుండి వర్తింప వలయునని సూత్రార్థము. ఇందు పరులకంట బడకుండా మెలగుటయే చక్షుస్సంయమ మనియును, వ్యవహారదశ నిర్వర్తించుట కెంత మాటలాడిన చాలునో అంత మాటలాడుటయే (అనగా యధోచితముగా మాట్లాడుటయే) వాక్సంయమ మనియును, తన కుటుంబమునకు సంబంధించిన అవశ్యములగు కార్యములను చేయుటయే కర్మ సంయమ మనియు నెరుంగ వలయును.

స్త్రీ వాక్కుపై నిర్బంధం, చూపుపై నిర్బంధం పెట్టి ఆమెను పూర్తిగా నిర్బంధంలో ఉంచడానికి ప్రయత్నం చేయు చున్నాడు గౌతముడు.

పరుల కంట పడకుండా ఉండటం వలన కేవలం ఎవడైతే కట్టుకుంటుందో వాడు కుంటైనా, గుడ్డైనా వాడినే స్వర్గంగా భావించి వాడినే చూస్తూ ఉండవలెను. ఒకవేళ మరొకణ్ణి చూచినట్లయితే వాడి చేత ఆకర్షింప బడుతుందేమోనని భయం. చివరకు తోడబుట్టిన అన్నయ్య వచ్చినా తలుపుచాటు వుండి మాట్లాడడం ఈనాటికి కొందరు స్త్రీలకు అలవాటుగా వుంది. ఈ సూత్రాలు స్త్రీ వ్యక్తిత్వాన్ని అనుమానిస్తున్నాయి శంకిస్తున్నాయి, నిర్బంధిస్తున్నాయి. ఆమె గుండెలమీద సమ్మెటపోటు వేస్తున్నాయి. ఆమె ఆలోచనల్ని, ఆమె ఆలోకనాల్ని కుంచించి

చేస్తున్నాయి. ఆమె సూక్ష్మ దృష్టిని, ఆమె విశాల పరిధిని కుంచింప చేస్తున్నాయి.

స్త్రీని ప్రధానంగా సంతానం కనే ఒక యంత్రంగా వారు భావించారు. భర్త చనిపోయినా వాడి తమ్ముడికైనా సంతానం కని వారి వంశాన్ని నిలబెట్టాలి. అందుకే సూత్రాన్ని నిర్మించాడు.

"అపతి రపత్య విప్సుర్దేవరాత్" - గౌతమ ధర్మ సూత్రాలు (2-9-4)
వివరణ : బిడ్డలు కలుగకయే ఉన్న స్థితిలో భర్త మరణించినచో నట్టి యామెకు అపత్యము (సంతానము) కావలయునని ఇచ్ఛగల్గుచో అప్పుడామె దేవరుల వలన మాత్రమే సంతానము కోరగా వచ్చునని సూత్రార్థము. దేవరులనగా తన భర్తయొక్క సోదరులలో చిన్నవారు గాని, పెద్దవారు గాని అగుదురు.

స్త్రీ సంతానమే ప్రధానంగా కలదిగా చిత్రించ బడింది. ఈ సంతానం కూడా వంశాన్ని నిలబెట్టు కోవడమనే అంశమే ప్రధానంగా చెప్ప బడింది. భర్త సోదరులతో కలిసే ముందు జ్ఞాతురాలై కలవడం ఒక నియమం అట !

"గురు ప్రసూతానర్తుమతీస్యాత్" - గౌతమ ధర్మ సూత్రాలు (2-9-5)
భర్త వైపున నున్నవారుగాని, తండ్రివైపు వారుగాని అయిన గురుజనము చేతను జ్ఞాతురాలై - ఆ పిమ్మటనే దేవరులతో గలిగా వలయుననియు, అందునను ఋతుకాలమును దాటగా రాదనియు సూత్రార్థము.

పిండ సంబంధం కలవార్ని తరువాత ఋషి సంబంధం కలవార్ని తరువాత గోత్ర సంబంధం కలవార్ని ఆమెకు ఇష్టం లేకపోయినా తప్పకుండా ఆమెతో కలిపి ఉంటారు.

"పిణ్డ గోత్రర్షి సంబన్ధేభ్యో యోనిమాత్రాద్వా !"
పిండ సంబంధం గల సపిండుల వలనను, ఋషి సంబంధంగల సమాన ప్రవరుల వలనను, గోత్ర సంబంధం గల సగోత్రుల వలనను క్రమాను సారంగా సంతానమును పొందుట కభిలషింపవలయునని సూత్రార్థము.

ఈ నియమముతోనే అంబిక - అంబాలికను పైరు గడ్డాల వ్యాసునికి ఇష్టం లేకపోయినా కలుపుట. ఆ కథ నిజమా! కాదా! అనే ప్రశ్న కంటే ఆనాడు సంతానం కోసం భర్త లేకపోతే వంశాలు నిలబెట్టు కోవడం కోసం ఈ విధమైన తంతు జరిగేదనుటలో అత్యుక్తి లేదు. అయితే భర్త సోదరులకు కాక ఇతరులతో కలవడం మీద కూడా చర్చ జరిగింది,

"నా దేవరాదిత్యేకా" - గౌతమ ధర్మ సూత్రాలు

ఇచ్చట మరికొందరు - గత భర్తృకమై సంతానమును కామించెడి స్త్రీ దేవరుని వలన మాత్రమే అట్లు సంతానమును పొందగవచ్చునే గాని తదితరులైన వారినుండి పొందగారాదు అని సూత్రార్థము.

ఈ పైన జరిగిన చర్చ కంతటికి ఒకటే ప్రధాన విషయం. అదేమిటంటే ఈ సంతానం స్త్రీకి సంబంధించిందా? పురుషునికి సంబంధించిందా? మాతృస్వామిక వ్యవస్థలో స్త్రీకి సంబంధించినదే, కాని పితృస్వామిక వ్యవస్థ కాబట్టి గౌతముడు పితృస్వామిక వ్యవస్థను స్థిరీకృతము చేయడానికి బద్ధకంకణులైన ధర్మ కర్తల్లో ఒకడు కాబట్టి ఈ సంతానము పురుషునిదే అని నిర్దేశిస్తున్నాడు.

"జనయితు రపత్యమ్" - గౌతమ ధర్మ సూత్రలు.

ఈ విధంగా పుట్టిన సంతానము క్షేత్రిది యగునా? (అనగా క్షేత్రము కలవానిదా!) లేక బీజము (వీర్యము) కలవానిది అగునా? అను ఆశంక గల్గగా నీసూత్రములో వారించు చున్నాడు.

అట్టి అపత్యము పుట్టించిన వానిదే యగును గాని, క్షేత్రిది కాదని సూత్రార్థము. అపస్థంభ సూత్రము నందు కూడా ఉత్పాదించిన (పుట్టించిన) వాని సంబంధమే పుత్రుడును — అని బ్రాహ్మణులు చెప్పినట్లులుగా సూత్రించియున్నది.

దీనిని బట్టి మొత్తంగా గౌతమ ధర్మ సూత్రాల్లో స్త్రీకి గౌరవంగాని ప్రాధాన్యతగాని, ప్రశస్తిగాని ఏమి కనిపించడం లేదు. వంశాన్ని నిలపడానికి వివాహము అవసరము. ఆ వివాహానికి స్త్రీ అవసరం. ఆ స్త్రీ భర్తతో కాకపోతే వారి సోదరులతో, కాకపోతే వారి గోత్రికులతో, లేకపోతే ఋషి వర్యులతో ఎవరితోనైనా సంతానం కనాలి. ఆ సంతానం మాత్రం పురుషుడిదే. ఇది గౌతముడి న్యాయం — వైదిక న్యాయం— ఆనాటి ధర్మం—ఈనాటికి కొన్ని జాతుల్లో, తెగల్లో స్త్రీమీద పెత్తనము చేస్తున్న ధర్మం.

○

# మనుస్మృతి - స్త్రీ

హిందూ ధర్మ శాస్త్రమైన మనుస్మృతి స్త్రీలకు అభేద్యమైన కట్టడులు విధించింది. ఉక్కు సంకెళ్ళు బిగించింది. స్త్రీ విద్యను నిరోధించింది. స్త్రీ వ్యక్తిత్వాన్ని కించ పరచింది. స్త్రీ హృదయాన్ని కోత పెట్టింది.

మనుస్మృతిలో స్త్రీకి విధించిన నిర్బంధాలు అమానుషమైనవి.

మనుస్మృతి క్రీ॥ పూ॥ రెండవ శతాబ్ధిలో వ్రాయబడి ఉంటుందని డా॥ బి. ఆర్. అంబేడ్కర్ పేర్కొన్నారు. బౌద్ధ యుగం అంతరించి హిందూ రాజ్యాలు ఆవిర్భవించే క్రమములో పుష్య మిత్రాదులు ఈ మనుస్మృతిని బ్రాహ్మణ రాజ్య నిర్మాణానికి సాధనంగా వాడుకున్నారు.

వర్ణ వ్యవస్థ పునరుద్ధరణ, స్త్రీ అణచివేత యిందులో ప్రధానమైన అంశాలుగా ముందుకు వచ్చాయి. ఈ ధర్మాలను పరిశీలిస్తే బ్రాహ్మణ రాజ్య ఆవిర్భావానికి మూల సూత్రాలు మనకు అభివ్యక్తం అవుతాయి.

శ్లో॥ పితారక్షతి కౌమారే భర్తారక్షతి యౌవనే
రక్షంతి స్థావిరే పుత్రా నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి"
(మనుస్మృతి - 9-3)

బాల్యమున తండ్రి స్త్రీలను రక్షించును. యౌవనమున మగడు రక్షించును. ముసలి తనమున పుత్రులు రక్షింతురు. కావున స్త్రీ స్వతంత్రురాలిగా నుండటానికి వీల్లేదు. (భర్త, కుమారులు లేనప్పుడు బంధువులు రక్షింతురు.)

దుర్మార్గమైన ఈ నిబంధన కొన్ని వేల సంవత్సరాల స్త్రీ స్వాతంత్ర్యానికి సంకెళ్ళు వేసింది. అమానుషమైన ఈ నిబంధన స్త్రీ వ్యక్తి

త్వానికి, నిజాయితీకి గోరీ కట్టించి, స్త్రీలోని జవ సత్వాలను వమ్ముచేసి అబలగా రూపొందించింది.

పురుషుడ్ని నిత్య శంకితుడుగా, కాపలాదారుడిగా తయారు చేసింది. సీతను అగ్ని పరీక్షకు గురిచేయడం వంటి పౌరాణిక నీతులు ఈ నిబంధనలకు తోడు ప్రచారం చేశారు. ఈ అనుమానంతోనే ఆరేళ్ళ పిల్లకి అరవై ఏళ్ళ వాడిని కట్టే బాల్య వివాహాలు సృష్టించారు. ఈ అనుమానంతోనే మగడు చనిపోయిన తరువాత శీల సంరక్షకుడు లేకుండా పోతున్నాడే అని అమానుషంగా సతీ సహగమనం పేరుతో అంతము చేశారు అందుకేమనువు స్త్రీని సౌగంధ్యాది పరిమళముల వైపుగూడా పోనీకుండా కాపాడుకుంటూ ఉండమని పదేపదే చెబుతున్నాడు. స్త్రీ విషయములో ఎప్పుడు ఎక్కడ అప్రమత్తంగా వున్నా ఆమె పక్కదారి తొక్కుతుంది అనే దారుణమైన నిందను స్త్రీ లోకంపై దొర్లిస్తున్నాడు.

శ్లో॥ "అస్వతంత్రాః స్త్రియః కార్యాఃపురుషై స్వైర్దివానిశం
విషయేషుచ సజ్జంత్య స్సంస్థాప్యా ఆత్మనో వశే"
(మను - 9-2)

భర్త మొదలగు పురుషులు స్త్రీలను తమ అధీనత నందుంచు కొన వలయును. తరచుగా వారు నిషిద్ధములు గాని. రూప రస గంధాది విషయము లందు ప్రవర్తించు చున్నను వారి నట్లు పోనీయక పురుషులు తమ అధీనత యందే ఉంచుకొన వలయును.

ఆనాడు మనువు వాకొన్న ఈ దుష్ప్రవచనం ఈనాటికి పురుషుల మెదళ్ళకు మేకులు కొడుతూనే ఉంది. ఎం. ఏ, పి. హెచ్. డి. లు పట్టాలు తీసుకొన్న ప్రబుద్ధులు కూడా బయటికి వెళ్ళేటప్పుడు ఇంటికి తాళాలు వేసుకొని వెళ్ళే మనస్తత్వం ఈ నిబంధనల ఫలితమే. పెళ్ళినాడు వంచిన తల కాటికి పోయినా లేపని తల్లులు ఎంతోమంది భరత భూమిలో పాతివ్రత్యం పేరుతో బానిసత్వాన్ని అనుభవించారు. చివరకు తండ్రి తరపు వారు కూడా వంశ ప్రతిష్ట పేరుతో స్త్రీపట్ల కర్కశంగానే వ్యవహరించారు. ఈ విషయంలో మనువు ఎట్టి శాశనం చేస్తున్నాడో చూడండి,

శ్లో॥ సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః స్త్రియోరక్ష్యా విశేషతః
ద్వయోర్హి కుల యోశ్శోక మావహేయు రరక్షితాః
(మను 9-5)

ఇంచుకంతైనను దుష్ట సంసర్గముల నుండి స్త్రీలను మీదు మిక్కిలి జాగ్రత్తతో కాపాడవలయును. వారట్లు జాకరూకతతో కాపాడ బడనిచో ఉభయ వంశములకు దుఃఖము దెత్తురు.

స్త్రీని బానిసగా ఉంచిన విషయంలో బ్రాహ్మణుల దగ్గర నుండి క్రింది కులాల వరకు అందరూ దుర్మార్గంగానే వర్తించారు. మగడు కుంటైన, గుడ్డియినా, కుష్టువాడైన అతన్ని ఈసడించకుండా బానిసగా వర్తించమని స్త్రీని శాసించడమే గాక, మగళ్ళు ఆ స్థితిలో వుండి మరెవరైనా మగడు కోరిన స్త్రీని భార్య పెళ్ళి బతిమాలి వీడికి తెచ్చి తార్చాలని, అంతేగాక కుంటి, గుడ్డి అయిన కురూపుల భార్యలు ఎటూ పోకుండా చూసుకోమని మనువు వారికి గుచ్చి చెబుతున్నాడు.

శ్లో॥ స్వాం ప్రసూతిం చరిత్రంచ కుల మాత్మాన మేవచ
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయం రక్షన్ హి రక్షతి"
(మను 9-7)

అట్లు భార్యను కాపాడుటం జేసి వ్యభిచారాది సంకర దోషముల లేమిచే పరిశుద్ధమైన సంతతిని, శిష్టాచారమును, తన పెద్దల వంశమును పరిశుద్ధమైన సంతతి వలన కలిగిన పరలోక క్రియలచేత, తన్నును, పతివ్రతయగు భార్య యుండుటచే యాగాదుల కధికారము కలదు కనుక స్వధర్మ సంరక్షణమును జేసికొన్నవాడగును గాన భార్య సంరక్షణము చేయవలయును.

వ్యభిచార దోషము లేకుండా, శుద్ధంగా, స్వచ్ఛంగా వంశాన్ని ఉంచుకుంటూనే యజ్ఞానికి అర్హులట. ఊర్వశిని చూచి స్ఖలించిన సూర్య వరుణుల వీర్యం నుండి కుండలో పుట్టాడని చెబుతున్న వశిష్టునికి ఏ పవిత్రత ఉండి యజ్ఞాలు చేశాడు ! అంబిక – అంబాలికతో వ్యాసుడికి పుట్టిన దృతరాష్ట్రి, పాండురాజ, విదురులు ఎలా యజ్ఞాలు చేయడానికి

అర్హులు. యమధర్మరాజుకు - కుంతికి పుట్టాడని చెబుతున్న ధర్మరాజు యజ్ఞాలు చేయడానికి ఎలా అర్హుడయ్యాడు ? కౌసల్య, సుమిత్ర, కైకేయిలను ఋష్యశృంగుడాదిగా గల వారితో చేసిన యజ్ఞం పేరుతో పుట్టిన శ్రీరామాదులు ఎలా యాగాల కర్హులయ్యారు ?

కలుస్తుంటారనే సత్యం తెలియని మనువు పెట్టిన ఇట్టి నిబంధనలను చూచే వేమన—

"ఆలిరంకు తెలుప అఖిల యజ్ఞమ్ములు
తల్లిరంకు తెలుప తద్దినాలు" అన్నాడు.

శ్లో॥ "న కశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్య పరిరక్షితుం
ఏతైరూపాయ యోగైస్తు శక్యాస్తాః పరిరక్షితుమ్"
(మను 9–10)

స్త్రీలను బలవంతముగా కాపాడ నెవ్వరికిని తరముగాదు. కావున వారి నీక్రింది ఉపాయములచే సంరక్షింప వలయును.

శ్లో॥ "అర్థస్య సంగ్రహే చైనాం వ్యయేచైవ నియోజయేత్
శౌచేధర్మేఽన్న పక్త్యాంచ్య పరిణాహ్యస్య చేక్షణే"
(మను 9–11)

(స్త్రీని) ధనమును కాపాడుట, వ్యయ పరచుటల యందు, ద్రవ్యములు శరీరమును పరిశుద్ధ పరచుట యందును, భర్త శుశ్రూష మొదలగు కార్యము లందును, వంట వార్పుల యందును, గృహోపకరణముల రక్షణము నందును నియమింప వలయును.

నిత్యము శుద్ధి కార్యముల్లో, సేవా కార్యక్రమాల్లో తలమునకలుగా స్త్రీని నియుక్తం చేస్తేకాని ఆమె తప్పు చేయకుండా వుండదు అనే దుష్ట నీతిని మనువు ప్రవచిస్తున్నాడు. ఇట్టి దురభిప్రాయం ఎందరి మెదళ్ళలోనో గూడు కట్టుకొని స్త్రీల యెడ పాశవికంగా ప్రవర్తించే ధోరణిని అలవర్చింది. ఈ పరిధులు దాటి ఎందరో స్త్రీలు ఉన్నత పరిధుల్లో పయ

నిస్తున్నప్పటికీ మగవాళ్ళ మనసులు మాత్రం ఇట్టి సంకుచిత దృష్టినుండి విశాలం కాలేక పోవడానికి కారణం ఈ భావాల పట్టు ఇంకా సంస్కృతి నుండి విముక్తం కాకపోవడమే. భార్యలను మీరెంత కాపాడుకున్నా, రక్షించుకున్నా వారి మనసులు పరపురుషాభియుక్తాలు, కాబట్టి వారు పాడవుతూనే వుంటారని ఈ ధర్మకర్త పురుష పుంగవులకు అనుమానాన్ని తరతరాలుగా నూరి పోస్తున్నాడు.

శ్లో॥ "ఏవం స్వభావం జ్ఞాత్వాఽనాం ప్రజాపతి నిసర్గజం
పరమం యత్న మాతిష్టేత్ పురుషో రక్షణం ప్రతి"

(మను 9-16)

ఇట్లు బ్రహ్మ సృష్టించిన కాలము నుండియే వీరి స్వభావ మిట్టిద య్యెనట. ఎరిగి పురుషుడు మెంతయును ఆపుదలతో నుంచ కడుంగడు యత్నించ వలయును.

మాతృస్వామిక వ్యవస్థను ధ్వంసం చేసి పితృస్వామిక వ్యవస్థ రాజ్య మేలుతున్న ఆ కాలంలో మనువు స్త్రీ దాస్యానికి అభేద్యమైన ఉక్కు ప్రాకారాలు నిర్మిస్తున్నాడు. ఆనాటి నుండి ఈనాటి వరకు ఈ విధమైన నీతినే బోధిస్తున్నారు. కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములవారు "రజస్వలైన బాలికలను పాఠశాలలకు పంపించగూడదు, భారతంలో అనుశాసనిక పర్వమందు భీష్ముడు బోధించిన నైతిక మార్గాలను బోధించాలి" అని శాసించారు. (శ్రీకంచి కామకోటి జగద్గురు దివ్య చరిత్ర పేజి-81) మనువు నుంచి కామకోటి పీఠాధిపతి వరకు స్త్రీ స్వాతంత్ర్యాన్ని తమ ఉక్కు పాదాల క్రింద అణగద్రొక్క చూస్తూనేవున్నారు.

శ్లో॥ శయ్యాసనమలంకారం కామం క్రోధ మనార్జవం
ద్రోహ భావం కుచర్యాం చస్త్రీభ్యో మను కల్పయత్"

(మను 9-17)

శయ్య, పీఠము, భూషణములను, కామ క్రోధములను, కపటమును పరద్రోహమును, పరహింస, కుత్సితపు నడవడి కలిగి యుండుట

వీనన్నిటిని స్త్రీలకు మనువు మొదటనే కల్పించెను. కనుక వీరిని ప్రయత్నముతో రక్షింప వలయును.

అధికారంతో స్త్రీలు వారి ప్రకృతి సిద్ధమైన వాంఛను తీర్చుకోవడం మానరు. మనువు వారిని ప్రయత్నంగా రక్షింప మంటున్నారు. ఇటువంటి ప్రేరణతోనే ఇనుప కచ్చడాలు తగిలించి స్త్రీల మానాలను రక్షించుకునే దశకు పురుషుడు వచ్చాడు.

ఇనుప కచ్చడాలంటే ఏమి అనుకుంటాము. మన బుద్ధికి అడ్డమన్నది లేదు. ఎలాంటి కుతంత్రానికైనా ఒడిగడుతుంది. తన ప్రియుడినో ప్రేయసినో ఇంకొకరుపయోగించరాదు. దీని కోసము తాళము వేశాము. పట్కాలతో ఇనుప కవచాలను తయారు చేశాము. గోప్యాంగాలను భద్రపరచాము. ఇతరులకు దుర్భేద్యంగా వుండే కోటల్లాగ కాపాడాము. స్వప్రయోజన బుద్ధికి సింహాసనము కట్టాము. (తాపీ ధర్మారావు) ఈ విధంగా మరొక వ్యక్తిని పీడించి, శాసించి, దండించి బానిసత్వములో ఉంచుకోవడానికి భార్యత్వముగా ప్రచారము చేశారు.

శ్లో॥ "నాస్తిస్త్రీణాం క్రియా మంత్రై రితి ధర్మో వ్యవస్థితః
నిరింద్రియా హ్యమంత్రశ్చ స్త్రీయోఽనృత మితిస్థితిః"
(మనుస్మృతి 9-18)

జాతక కర్మ, నామకరణాదులు స్త్రీలకు మంత్రవత్తుగా లేవని ధర్మ శాస్త్రాలు పలుకు చున్నవి. కనుక స్త్రీలు మంత్ర వత్సంస్కారములు లేనివారలు కావున పాప రహితులును, ప్రమాణములగు వేద స్మృతులు లేనివారలు కావున ధర్మజ్ఞులు కానివారలును పాపములు పోకార్చు మంత్ర జపములు మున్నగునవి లేనివారలు గావున పాపము కలిగినను దానింబోకార్చు శక్తి లేని వారలగుటచే కల్లమాడిన శుభలైన వారని శాస్త్రములు పలికెను కావున వారిని ప్రయత్నములో రక్షింప వలయును.

"స్త్రీయుశ్చైవ విశేషేణ తస్మాత్త్రాదృతో భవేత్"

స్త్రీలు చాపల్యముచే మంత్రము (ఆలోచన) వెల్లడి పరుతురు. కావున వీరినెల్లను మంత్ర స్థానమందు లేకుండా జేయవలెను. "ఆడదాని

నోట్లో నువ్వు గింజ నానదు" అని మంత్రం గుట్టు వీరు రట్టు చేస్తున్నారని మనువు వీరిని మంత్రస్థానందగ్గరకు రానివ్వొద్దు అని శాసిస్తున్నాడు.

"స్త్రీశూద్ర నాధీయేతామ్" స్త్రీ శూద్రులారా. వేదా ధ్యయనము చేయరాదురా ! యని ప్రశ్నింప అని కట్టడి చేయుచున్నాడు. "స్త్రీ భ్రమంతి వినశ్యతి" స్త్రీలు ఇల్లు వదలి బయట చరించిన చెడిపోవు చున్నది అని రకరకాల కట్టుడులు చేయబడిన వంటే స్త్రీని ఎన్ని సంకెళ్ళతో బంధించారో ఆలోచించండి.

తథా చ శ్రుతయో బహ్వని గీతానిగ మేష్వపి
స్వాలక్షణ్య పరీక్షార్థం తాసాం శ్రుణుత నిష్కృతీః

(మను 9–21)

స్త్రీలకు వ్యభిచార శీలత్వము స్వాభావిక మని చెప్పబడినది. అవిషయమున వేద వాక్యములు ప్రమాణములుగా చెప్పబడు చున్నవి. అత్తెరగున పెక్కులు వేద వాక్యములు స్త్రీలకు వ్యభిచార శీలత్వమును ప్రకటించు చున్నవి.

ఒక్కొక్క రాజు - రాణి వాసాల పేరుతో వందల మంది కన్యలను చేసుకొని వారికి సౌఖ్యాన్ని ఇవ్వలేని అశక్తులై యుండి ఇట్టి సూత్రాలను అడ్డు పెట్టుకొని వారికి ఎందరినో కాపలా ఉంచి ప్రకృతి సూత్రాలను ఎదిరించ లేక స్త్రీలను వ్యభిచారిణిలుగా ప్రచారం చేసి వారి మనస్తత్వం చెడ్డదని స్థిరీకరించారు. అందుకే వారి కాపలాలు వారికి ఇనుప కచ్చడాలు. దీనినే "నాగరికత" అంటున్నారు. నాగరికత అనేది ఒక వ్యక్తిని మరొక వ్యక్తి, ఒక వర్గాన్ని మరొక వర్గం దోచుకోవడం అనే పద్ధతి మీదే ఏర్పడింది.

చివరకు తల్లి వ్యభిచారాన్ని కుమారుడు శంకించి దాన్ని శోధించ డానికి మంత్రాలు చెప్పిస్తున్నాడు మనువు—

శ్లో॥ "ధ్యాయత్య నిష్టం యత్కించ త్పాణిగ్రాహస్య చేతసా
తస్యైషః వ్యభిచారస్య నిహ్నవస్సమ్యగుచ్యతే"

స్త్రీ మనసు భర్తకు ఏడియేని చెరుపుతలచుచున్నదో అట్టివ్యభిచారి దోషమునకు ఈ మంత్రము చక్కని ప్రాయశ్చిత్తమని మన్వాదులు చెప్పిరి. "మాతా" అనుటవలన ఇది పుత్రునికి ప్రాయశ్చిత్తవాక్యమే కాని తల్లికికాదు.

ఆ వ్యభిచారికి పుట్టిన ఈ కుమారుని తండ్రి ఫలానా వాడని ఈ కుమారుడు ఎలా నిర్ణయింపగలడు. తల్లిరంకును, భార్యరంకును కాపాడు కోవడం, శోధించు కోవడమే మంత్రాలుగా సంస్కృతిగా చెలామణి చేసుకున్నారు.

ఈ విధంగా మధ్యయుగాల రాచరిక వ్యవస్థను ఈ మనుస్మృతి శాసించి పాలించింది. మధ్యయుగాలలో మనుస్మృతి నిర్మించిన మౌఢ్య కుడ్య ప్రాకారాలపట్టు ఈ నాటికీ సడలలేదు.

పైగా అనేక సందర్భాలలో జటిల మవుతుంది. స్త్రీని అణగద్రొక్కే విషయంలో మనుస్మృతి మార్గంలో నడిచిన పరాశరస్మృతిని కూడా పరిశీలిస్తే మొత్తం స్మృతికారులు స్త్రీకి చేసిన ద్రోహం మనకు అభివ్యక్త మవుతుంది.

+○+

# పరాశరస్మృతి - స్త్రీ

ఆర్య అనార్యగణాల పౌరోహిత్య సమ్మేళనం నుండి యేర్పడిన బ్రాహ్మణవర్ణం తమ ఆధిపత్యాన్ని స్థిరీకృతం చేసుకోవడం కోసం తమకు అనుకూలమైన ధర్మశాస్త్రాలను రూపొందించుకోవడం జరిగింది. ఈ ధర్మశాస్త్రాలు ముఖ్యంగా బ్రాహ్మణ వర్ణం యొక్క ఆధిక్యతను, ఆధిపత్యాన్ని, అనుష్ఠానాన్ని ఇతర వర్ణాలకు వారువేరుగాఉండి వారి ఆధిపత్య ప్రకటనను నిర్ధారిస్తాయి. ఈ ధర్మశాస్త్రాలు భారత దేశంలో మానవ సంస్కృతిని వర్ణవ్యవస్థాది భేదంతో వర్గీకరించి ఒక వర్ణానికి మరొక వర్ణానికి తీవ్రమైన భేదాన్ని కల్పించడం జరిగింది.

ఆధిపత్య వర్ణాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల నుండి శూద్రులను, అస్పృశ్యులను పూర్తిగా వేరుచేసి వారిని అన్నిరంగాల్లో బానిసలుగా తొక్కిపట్టి వుంచడానికి ఇనుపగోడలు నిర్మించాయి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణాల్లోని స్త్రీని కూడా శూద్రజాతులతో సమానం చేసి స్త్రీని ఆచార కర్మకాండకు దూరంగా వుంచారు. స్త్రీని హీనంగాచూచారు. బ్రాహ్మణాధిక్య సమాజ మంతటిలోను స్త్రీ తీవ్రంగా హింసింపబడింది. పితృస్వామిక వ్యవస్థబలంగా నడిచింది వశిష్ఠునికి, అరుంధతికి పుట్టిన శక్తి కుమారుడైన పరాశరుడు ఈ ధర్మాలను తన కుమారుడైన వ్యాసుడాదిగా గల ఋషులకు బోధించినట్లు చెప్పబడుతూవుంది.

కలియుగానికి సంబంధించిన ధర్మాలను పరాశరుడు బోధిస్తున్నట్లు చెప్పబడింది. అయితే కలియుగంలో స్త్రీలు పురుషులను జయిస్తారనే భయం బ్రాహ్మణ వర్గానికి వుంది.

> "జితోధర్మోహ్యధర్మేణ సత్యం చైవానృతేనచ
> జితాశ్చోరైస్తురాజానస్త్రీభిశ్చ పురుషాకలౌ"
>
> (పరాశరస్మృతి-ప్రథమాధ్యాయం-30 శ్లోకం)

---

పరిశీలించిన గ్రంథం – పరాశరస్మృతి, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటితం 1920 చెన్నపట్నం

కలియుగమునందు అధర్మముచేత ధర్మము, అసత్యముచేత సత్యము, చోరులచేత రాజులు, స్త్రీల చేత పురుషులు జయింపబడుదురు.

స్త్రీలచేత పురుషులు జయింపబడతారు కాబట్టి వీరిని అణచివుంచడానికి ధర్మాలను నిర్దేశిస్తున్నాడు పరాశరుడు. ఉత్తమజాతి స్త్రీలను కూడా శంకిస్తూ వీరిని శూద్రులు కూడినట్లైతే వారు పాతకులౌదురని రాసి స్తున్నాడు.

విక్రీణన్మద్య మాంసానిహ, భక్షన్యచభక్షణమ్,
కుర్వన్న గమ్యాగమనం శూద్రః పతిత తత్క్షణాత్.
(పరాశరస్మృతి-ప్రథమాధ్యాయం 67)

శూద్రుడు జీవనార్థము మద్యమాంసములను విక్రయించినను, తినకూడని మాంసాదికమును భుజించినను, ఉత్తమ జాతి స్త్రీలను కూడినను వెంటనే పతితుడగును.

బ్రాహ్మణ స్త్రీలను కూడ రాదని, ఆవుపాలు త్రాగకూడదని ప్రత్యేకంగా నివేదిస్తున్నాడు.

కపిలాక్షీర పానేన బ్రాహ్మణీగమనేనచ
వేదక్షర విచారేణ శూద్రః పతిత తత్క్షణాత్.
(పరాశరస్మృతి - ప్రథమాధ్యాయం 68)

కపిల వర్ణముగల యావుపాలు త్రాగినను బ్రాహ్మణ స్త్రీలగూడినను, వేదములచదివినను శూద్రుడు వెంటనే పతితుడగుచున్నాడు.

బ్రాహ్మణ స్త్రీని శూద్రునితో సమానంగా చూస్తున్నాడు. శూద్రుడు బ్రాహ్మణస్త్రీతో కూడితే దోషమంటున్నాడు. వర్ణసాంకర్యాన్ని ఇంత గట్టిగా నిషేధించడానికి కారణం? స్త్రీని ఆచారకర్మకాండకు దూరంగా వుంచడానికి కారణం? స్త్రీని శాస్త్రాధ్యయనానికి దూరంగా వుంచడానికి కారణం? స్త్రీలో వున్న సూక్ష్మగ్రాహ్యత ప్రశ్నించే గుణం, పురోహిత వర్గం యొక్క దోపిడీకి సంస్కృతిని స్త్రీకి స్వేచ్ఛ ఇస్తే భగ్నం చేస్తుందనే నమ్మకందప్ప మరొకటికాదు.

పితృస్వామ్య వ్యవస్థను, పితృస్వామ్య ఆధిపత్యాన్ని కాపాడుకోవాలంటే తప్పక స్త్రీని చండశాసనాలతో బంధీకృతురాలిని చేయకతప్పదు.

ఆమెను అన్ని కోణాల నుండి శాసిస్తున్న పరాశరుడు, ఆమెను భర్తతో కూడే విషయంలో కూడా నిర్బంధిస్తున్నాడు. ఈమె ఋతుస్నాత యైన తరువాత భర్త అభీష్టం తప్పక నెరవేర్చాలి. లేకపోతే నరకాన్ని అనుభవించి పెక్కు జన్మల్లో విధవ అవుతుందట.

ఋతుస్నా తాతు యనారీ భర్తారంనోప సర్పతి,
సామృతా నరకం యాతివై ధవ్యంచ పునః పునః
(చతుర్థాశ్వాసం - 14 శ్లో)

ఏ స్త్రీ ఋతు స్నాతయయి భర్త చేత శయనార్థము ఆహూతయైనను అతని అభీష్టము నెరవేర్చదో ఆ స్త్రీ మరణించిన పిదప నరకము ననుభవించి పెక్కు జన్మలందు విధవ యగు చుండును.

అంతేగాక భర్త దరిద్రుడైనా, మూర్ఖుడైనా ఎటువంటివాడైనా ఆతనికి అధీనురాలై ఉండాలని శాసిస్తున్నాడు.

దరిద్రదం వ్యాధితం మూర్ఖం భర్తారాం యాఽవ మన్యతే
సాశునే జాయితే మృత్యా సూచరీచ పునః పునః
(చతుర్థాశ్వాసం - 17)

ఏ స్త్రీ తన భర్తను దరిద్రుడనియు, రోగియనియు, మూర్ఖుడనియు అవమానం చేయు చున్నదో. ఆ స్త్రీ మరణించిన పిదప కుక్కగాను, పందిగాను పెక్కుసార్లు పుట్టు చుండును.

ఇంతకంటే దారుణమైన శాసనం మనకు ఏ ధర్మ శాస్త్రాల్లోను కనిపించదు.

పురుషుడు అసమర్థుడు అయినా, రోగి అయినా, మూర్ఖుడుఅయినా అతడిని ప్రశ్నించకుండా, తల వంచుకుని అతడికి సేవకురాలుగా ఉండడమే భార్య కర్తవ్యంగా పేర్కొంటూ, లేకుంటే వచ్చే జన్మలో పందిగా కుక్కగా పుడతావని నమ్మించడం వలన ఈనాటికి ఇన్ని వందల సంవత్సరాల తరువాత కూడా ఆమె మెదడు పైన ఈ అమానుష సూత్రాలు ముద్రింపబడి ఉన్నాయి. ఈ అభేద్య సంకెళ్ళ నుండి తరతరాలుగా

విముక్త కాలేక పోతూవుంది. పురుష ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి ఆమె మెదడుకు ఇన్ని సంకెళ్ళు వేయవలసి వచ్చింది. ముఖ్యంగా ఈ పురుషాధిపత్యం వైదిక సంస్కృతిలో ప్రవహించే వారిమీదే ఎక్కువవుంది, మాతృస్వామ్య వ్యవస్థ భూమిక కలిగిన జాతుల్లోను, స్త్రీ శ్రమ ప్రధానంగా గల జాతుల్లోనూ ఈ ఆధిపత్యం ఇంతగా లేదు. పూర్వ జన్మ పునర్జన్మ, కర్మ మొదలగు వైదిక విశ్వాసాలు మెదడుకు పట్టిన జాతుల్లోనే ఈ ఆధిపత్యం బలంగా ఉన్నది.

వైదిక సంస్కృతిలో స్త్రీకి బానిసత్వం ప్రధానంగా చెప్పబడింది. వ్రతాలు, నోములు కంటే కూడా భర్తకు శుశ్రూష చేయడమే ప్రధానం అని పరాశరస్మృతిలో నిగడించ బడింది.

పత్యే జీవతి యానారీ ఉపోష్య వ్రతమాచరేత్
ఆయుష్యం హరతే భర్తుస్సానారీ నరకవ్రంజేత్
(చతుర్థాశ్వాసం - 17 శ్లోకం)

ఏ స్త్రీ తన భర్త జీవించి యుండగా అతని శుశ్రూషను ఉపేక్షించి నోములు ఉపవాసములు సలుపు చుండునో ఆ స్త్రీ భర్త యాయువు హరించును. నరకమును పొందును.

భర్త శుశ్రూష పేరుతో స్త్రీకి శాశ్వత బానిసత్వాన్ని శాసిస్తున్నాడు. నేను చెప్పిన సూత్రాలను ఆచరించక పోయినట్లయితే "నరకానికి వెళతారు" అని భయ పెట్టడం స్త్రీల మెదడులకు మేకులు కొట్టడానికి ప్రయత్నించడం తప్ప మరొకటి కాదు. చివరకు వ్రతాలు ఆచరించాలన్నా భర్త అనుమతిని పొంది తీరాలంటున్నాడు ఈ స్మృతి కర్త.

అపృష్ట్వా చైవ భర్తారం యానారీకురుతే వ్రతమ్
సర్వం తద్రాక్షసాన్ గచ్ఛేదిత్యేవ మనురబ్రవీత్
(చతుర్థాశ్వాసం - 15 శ్లోకం)

ఏ స్త్రీ భర్త యొక్క అనుమతిని పొందకయే వ్రతాదికం నాచరించిన యెడల ఆ చేసినది అంతయు దేవతా ప్రీతికరముగాగాక రాక్షసులకు చెందును.

ఇన్ని సంకెళ్ళు స్త్రీకి విధించిన పరాశరుడే ఒకే పురుషుడికి సొంత భార్యకు పుట్టిన పిల్లలను, జార స్త్రీకి పుట్టిన పిల్లలను వేరుచేస్తున్నాడు. అంటే ఒక పురుషుడు పలువురి స్త్రీలతో కలవడాన్ని నిరోధించలేక పోతున్నాడన్న మాట! పరాశరుడు ఈ రకరకాలుగా పుట్టిన పిల్లలకు పేర్లు కూడా వేరుగా పెడుతూ ఉన్నాడు. అంటే ఒక ప్రక్క ఇటువంటి సామాజిక వ్యవస్థను అనివార్యంగా ప్రోత్సహిస్తూనే ఉన్నాడు.

తద్వత్పర స్త్రియాః పుత్రౌద్వౌస్మృతౌ కుండగోళకౌ
పత్యైజీవతి కుండస్తు మృతే భర్తరి గోళకః
(చతుర్థాశ్వాసం - 23 శ్లోకం)

అదే విధంగా పరస్త్రీయందు జన్మించిన కుండ గోళకులను పుత్రులు క్షేత్రాధి పతియొక్క పుత్రులే యగుచున్నారు. భర్త జీవించి యుండగా జారుని వలన పుట్టిన కొడుకు "కుండుడు" అనంబడును. భర్త చనిపోయినపిదప జారుని వలనపుట్టిన కొడుకు "గోళకుడు" అనంబడును.

* ఔరసః క్షేత్రజశ్చైవ దత్తః కృత్రిమ కస్సుతః
పుత్రులు ఔరసుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రియుడు అని చెప్పబడుదురు.

భర్త మరొక స్త్రీతో బిడ్డలు కనడం, భార్య మరొక పురుషునితో బిడ్డలు కనడం, ఈ కన్నవారికి రకరకాల నామకరణాలు చేసికోవడము, ఇదంతా ఎందుకు జరుగుతుంది. స్త్రీకి విపరీతమైన నిర్బంధాలు పెట్టడం, పురుషుణ్ణి యదేచ్ఛగా వదలి వేయడం, ఒకరు చేస్తే తప్పు. మరొకరు చేస్తే శాస్త్రం. ఈ విధమైన కృత్రిమ నిర్బంధ సమాజంలో సమాజ

---

* ఔరసుడు = పెండ్లాడిన భార్య యందు తాను కన్న కొడుకు.
క్షేత్రజుడు = దేవరాది న్యాయం ననుసరించి భర్త మున్నగువారి చేత నియమింప బడిన భార్యయందు ఇతరులవలన బుట్టిన కొడుకు.
దత్తుడు = ఇతరులకు దత్తు ఈయబడిన వాడు.
కృత్రిముడు = గుణములను బట్టి దగ్గరకు చేరినవాడు,

పరిణామం శాస్త్రీయంగా ఉండదు. ఇక్కడ పేర్కొన్న పురుషాధిపత్య సమాజంలో పురుషుడు స్త్రీని అనేక కోణాల నుండి అనుభవించి, వారసుణ్ణి కనడానికి మాత్రం భార్యని వినియోగించాడు. దీనికి ముద్దుగా "దంపతీ" వ్యవస్థ అని పేరు పెట్టుకున్నాడు కూడా. ఈ దంపతీ వ్యవస్థ పేరుతో ఒక భార్యను చేసుకొని మిగిలిన వారిని అనేక రకాలుగా అనుభవించడం పురుషాధిపత్యం పరాకాష్టకు చెందిన రాచరిక వ్యవస్థలో మిక్కిలిగా జరిగింది. ఈ విషయాన్ని ఏంగెల్స్ "కుటుంబము, వ్యక్తిగత ఆస్థి, రాజ్యాంగాల పుట్టుక" అనే గ్రంథంలో ప్రతిభావంతంగా వివరించాడు.

ఇందు (దంపతీ వివాహం) లో మగవానిది ప్రాధాన్యం. జన్మ కారకుడైన తండ్రి విషయంలో సందేహం లేకుండా చేసుకోవడం దీని ముఖ్య ఉద్దేశ్యం.

"తండ్రి అనంతరం ఆయన ఆస్థికి ఆయన బిడ్డలే వారసులు కావాలనేది అక్కడున్న అవసరం. వివాహ బంధం గట్టిదనమే జంట పెళ్ళికి దీనికీ తేడా. ఈ నూతన వ్యవస్థతో దంపతులలో ఎవరు కోరినా వివాహాన్ని ఛేదించటం సాధ్యపడదు. కాని ఆచరణలో మాత్రం మగవాడు వివాహ బంధాన్ని త్రెంచి, భార్యను తోసేయ గలడు. దాంపత్య ధర్మాన్ని అతిక్రమించే హక్కు అతనికే మిగిలింది. (ఉంపుడు కత్తెను ఇంటిలో పెట్టనంతవరకూ మగవాడు దాంపత్య ధర్మాన్ని మీరగల హక్కును నెపోలియన్ ధర్మ సూత్రాలు స్పష్టంగా అంగీకరిస్తున్నాయి.) సంఘం అభివృద్ధి పొందిన కొలదీ మగవాడు తన హక్కును ఉత్తరోత్తరాభివృద్ధిగా అమలు పరచుకొంటూ వచ్చాడు. భార్య మాత్రం గత కాలపు దాంపత్య జీవిత రూపాల్ని జ్ఞాపకం చేసుకొన్నా, పునరుద్ధరించబోయినా అతి కఠోర శిక్షలకు గురి అవుతుంది.

గ్రీకు ప్రజలలో ఈ వివాహ పద్ధతి అతి కఠోర రూపంలో కనబడుతుంది. గ్రీకు పురాణ గాథలలోని దేవకాంతలు ఎక్కువ గౌరవాన్ని, స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నా గ్రీకు యుగమప్పుడే మగవాని పెత్తనం స్థిరపడింది. బానిస కన్యల తోడి పోటీలో భార్యలు అవమానితులయ్యే స్థితి కనబడుతూంది అన్నాడు మార్క్స్. తెలమేచసుడు ^A తల్లిని దుయ్యబట్టి ఆమె నోరునొక్కడం మనకు "ఒడిస్సే"^AA లో కనబడుతుంది.

---

^A తెలమేచసు - ఒడస్సెను కొడుకు. గ్రీకు పురాణ గాథలలో

^AA ఒడస్సెను గురించి హోమరు వ్రాసిన కావ్యం.

పట్టుబడిన పడుచులు విజేతలు ఆనంద విలాసాలకు గురికావడం హోమరు రచనలో కనబడుతుంది. సైన్యాధిపతులు తమ హోదాల ననుసరించి వరుస క్రమములో తమకు నచ్చిన వారిని ఆ పడుచుల నుంచి ఏరుకొనే వారు. ఆ విధంగా ఎన్నుకొన్న ఒక బానిస యువతి కోసము అగమెమ్నాన్, అఖిల్లమల మధ్య ఏర్పడిన జగడం గురించే "ఇలియడ్" కావ్యంలో మనం చూస్తాము. కాస్త పేరుగల వీరుణ్ణి గురించి ప్రస్తావించి నప్పుడల్లా హోమరు ఆ వీరుని గుడారంలోనూ, శయ్యలోనూ భాగస్వామిని యైన యువతిని గురించి కూడా తప్పకుండా వ్రాస్తాడు. ఆ పడుచుల్ని ఆ వీరులు గ్రీకు దేశానికి కూడా తీసుకుపోయేవారు. భార్యతోపాటు ఒకే ఇంట్లో కాపురం పెట్టించేవారు. కసంద్రాసును అగమెమ్నాన్ తన ఇంటికి తీసుకెళ్ళినట్లు ఎస్కిలస్ వ్రాశాడు. ఈ పడుచులకు సంతానం కలిగితే వారికి కూడా తండ్రి ఆస్తిలో కొంత వాటా ఇచ్చేవారు. వారిని స్వతంత్రులుగానే పరిగణించేవారు. తెలెమాన్[M]కు ఒక దాసీ కన్య యందు పుట్టిన వాడే తుక్రోస్.[X] అతడు తండ్రి పేరు పెట్టుకొనడానికి అనుమతించారట. కట్టుకున్న భార్య వీటన్నింటినీ భరించాలి. అంతేగాని తాను తప్పుదారి తొక్కరాదు. నాగరిక యుగంలోకన్న వీరి యుగంనాడే స్త్రీలు ఎక్కువ గౌరవాన్ని అనుభవించారు. ఏమంటే ఆమె ఔరసులను కంటుంది. గృహస్వామి తాను తెచ్చే బానిస స్త్రీలను ఆమె పర్యవేక్షణలో ఉంచుతాడు. వారిలోంచి కొందర్ని ఉంపుడుకత్తెల్ని చేసుకుంటే అవివేరు. దంపతీ వ్యవస్థతోపాటు ప్రక్కప్రక్కనే బానిసత్వం సాగుతూండడమూ, ఇంట్లో అందమైన పడుచు బానిసలు ఉండడమూ, వారిమీద అధికారం మగవాడిదే కావడము వలన ప్రారంభము నుంచి దంపతీ వివాహంలో పాతివ్రత్యం స్త్రీకే విధి. మగవాడికి ఏక పత్నీత్వం నిబంధన కాదు. అదే ఈనాటికీ కొనసాగుతూంది."

---

M తెలమాన్ — గ్రీకు పురాణ గాధల్లో వ్యక్తి. సొపోక్లిస్ యురిపిడీస్‌ల నాటకాలలో ఒక పాత్ర.

X తుక్రోస్ — గ్రీకుల పురాణ గాధలలోని వ్యక్తి. సలామాన్ నగర పౌరుడు, తెలెమాన్ కొడుకు. ట్రాయ్ నగరాన్ని ముట్టడించిన గ్రీకు సైన్యాలలో చాలా సమర్థుడైన విలుకాడు.

అంటే పురుషాధిక్యత ఒక్క భారతదేశంలోనే కాదు—పితృస్వామికత ఎక్కడ వుంటే అక్కడ అన్ని కోణాల్లోను విస్తరించింది. ముఖ్యముగా ఆర్య సంపర్క మున్న జాతుల్లో ఇది మిక్కుటంగా అమలు జరిగింది. సంస్కృతంలో వ్రాయబడిన పురాణాల్లో, కావ్యాల్లో ఈ పురుషాధిక్యత అన్ని రంగాల్లోను ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

పరాశరుడు చివరకు స్త్రీని చంపినా పది ఆవులను, వృషభాన్ని దక్షిణగా ఇస్తే చాలు అంటున్నాడు.

శిల్పినం కారుకం శూద్రం స్త్రియం వాయస్తు ఘాతయేత్
ప్రాజా పత్యం ద్వయం కృత్వా వృషైకా దశ దక్షిణా

చిత్రరువులు వ్రాయు వానిని, శిల్పిని, వంట వానిని, శూద్రిని స్త్రీని వీరిలో నెవ్వరినైనా చంపినవాడు రెండు ప్రాజాపత్య కృచ్ఛ్రము లాచరించి పది ఆవులను, ఒక వృషభమును దక్షిణగా నిచ్చిన చాలును.

అంటే శూద్రులను, స్త్రీలను చంపితే కేవలం ప్రాయశ్చిత్తంతో సరిపోతుంటే వీరిపైన ఎంత చులకన భావం ఉందో ఒకసారి పర్యావలోకనం చేసినట్లయితే గుండెలు తల్లడిల్లక మానవు.

## సతీ సహగమనం — స్వర్గలోక గమనం

భారత భూమిలో అమానుషమైన సతీ సహగమనం ఎందరో స్త్రీలను బూడిద చేసింది. ఈ దుర్మార్గమైన దురాచారం భారతదేశంలో హెచ్చు కాలం మారణ కాండను నిర్వహించింది. ఈ పాశవిక చర్యను సమర్థిస్తూ పరాశరుడు మనుష్య శరీరము నందు మూడుకోట్ల యాబది లక్షల రోమాలుంటాయని — సతీ సహగమనం చేసిన స్త్రీ అన్ని సంవత్సరాలు స్వర్గ లోకంలో ఉంటుందని వాకొంటున్నాడు చూడండి —

త్రిసః కోట్యర్ధ కోటిచయానిలో మాని మానుషే,
తావత్కాలం వసే త్స్వర్గే భర్తారం యాఽను గచ్ఛతి
(చతుర్థాధ్యాయం - 33 శ్లోకం)

మనుష్య దేహము నందు మూడుకోట్ల యాబది లక్షల రోమము లుండును. భర్త మరణించిన పిదప ఆ భర్తతోడ సహగమన మొనర్చిన సాధ్వి అన్ని వేల సంవత్సరములు భర్తతోడ స్వర్గ లోకమున నివసించును.

వ్యాళ గ్రాహీ యథావ్యాళం బలా దుద్ధరతే బిలాత్
ఏ వం స్త్రీ పతి ముద్ధృత్యతే నైవసహ మోదతే

(చతుర్థాశ్వాసం – 33 శ్లోకం)

పాములవాడు పుట్టలో దూరిన పామును బలము కొలది కలుగు నుండి ఎటుల పైకి లాగునో అదే విధముగా భర్తతోడ సహగమన మొనర్చిన స్త్రీ అదివఱకు తన భర్త తానొనర్చిన పాపము వలన నరక బాధ ననుభవించు చున్నను భర్తను పాప విముక్తుని చేసి వానితో గూడ స్వర్గ లోకము నందు ఆనందము ననుభవించును.

ఈ విధంగా పితృస్వామిక వ్యవస్థా ప్రభువులు, పోషకులు, స్మృతి కర్తలు స్త్రీని అనేక మూఢ విశ్వాసాలకు గురిచేసి మానవ సంస్కృతి నుండి వారిని దూరం చేయడానికి ప్రయత్నం చేశారు. ఆమె వ్యక్తిత్వాన్ని ఖననం చేయడమే గాక, ఆమె సౌశీల్యాన్ని ధ్వంసం చేశారు. అన్ని రంగాల్లోను పురుషుని ఆధిక్యతను, జులుంను స్థిరీకృతం చేయడానికి నిరంతరం ఉక్కు సంకెళ్ళను బిగించారు.

మనిషిగా బ్రతకడానికి వీలు లేకుండా అందమైన బానిస లక్షణాలను రూపొందించారు. ఈ స్మృతుల ప్రభావం పడని అటవిక జాతుల్లో స్త్రీ పేదరికంలో కూడా స్వేచ్ఛగా బ్రతికింది. మరియు ముఖ్యంగా బ్రాహ్మణ స్త్రీ ఈ మారణ కాండలో దహించుకు పోయింది. క్షత్రియ కాంతలు అసూర్యపశ్యలుగా రత్నాగారాల్లో బంధీకృతులై బహుభార్యత్వ దుర్భర జీవితాల్లో కృషించి పోయారు. వైశ్య స్త్రీలు ధనాగారాల మధ్య వస్తు మార్పిడి లాగా చేయబడ్డారు. శూద్ర స్త్రీలు దుర్భర పేదరికంలో కుటుంబ భారాన్ని మోసే సాధనంగా వాడబడ్డారు. ఇక అస్పృశ్య స్త్రీలు ఈ వ్యవస్థకు దూరంగా పెట్టబడ్డారు. ఈ విధంగా పితృస్వామ్య వ్యవస్థను పెంచి పోషించిన వైదిక ఋషులలో ఒకరిచేత వ్రాయబడిన పరాశరస్మృతి

ఈనాడు అసలు లేక పోయినా అందులోని భావాలు మాత్రం భారత దేశపు స్త్రీ మీద పెత్తనం చేస్తూనే ఉన్నాయి. ఫలాన స్మృతిలో ఫలాన శ్లోకంలో ఈ భావం చెప్పబడినదని కూడా చాలా మందికి తెలియదు. కాని ఆ భావం వారిమీద పెత్తనం చేస్తూనే ఉంటుంది.

ఎక్కడివరకెందుకు — సతీ సహగమన నిర్మూలనానికి ఎంతో బలీయమైన కృషిని బ్రహ్మ సమాజంవారు చేశారు. కాని ఈనాటికి సతీ సహగమనం భారతదేశంలో ఎడనెడ జరుగుతూనే ఉంది. ఈ స్మృతుల స్మృతులు భారతావని మెదడుల్లో గూడు కట్టుకున్నాయి. ఈ స్మృతుల ప్రభావం పురాణ స్త్రీల మీద ప్రగాఢంగా ఉంది. పౌరాణిక కాలంలోని స్త్రీల పైన ఈ నమ్మకాల ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది.

ఆర్య సంస్కృతిలో ఉన్న పితృస్వామికతను ప్రభుత వహించి స్త్రీని అణగ దొక్కడానికి ఈ స్మృతులు సోపానాలైనాయి. స్త్రీ అబలత్వాన్ని స్థిరీకృతం చేసి వ్యక్తిత్వం మీద దమన కాండ జరిపిన ఈ స్మృతుల భావాల ప్రభావం నుండి విముక్తి చెందడం మీద స్త్రీ లోక అభ్యున్నతి ఆధారపడి ఉంది. 

# హిందూ వివాహ వ్యవస్థలో - స్త్రీ

వివాహ విధానాలు ఆయా కాలాల్లో ఆయా సామాజిక వ్యవస్థల్లో వస్తున్న మార్పులను బట్టి రూపొందాయి. హిందూ వ్యవస్థ ఆచరణలోకి రాకముందు ఉండే అనేక విధానాలు మనకు ఆయా కాలాల చరిత్రలలో మనకు దృశ్యీకృతం అయ్యాయి. ఎంత లేదన్నా, ఆ కాలాల్లో స్త్రీకి కొంత స్వేచ్ఛ, కొంత వ్యక్తిత్వం కొనసాగింది. చివరకు వైదిక వ్యవస్థలో కూడా ఈ స్వేచ్ఛ కొంత కనబడుతుంది. మనుస్మృతి కాలానికి తరువాత హిందూ వ్యవస్థగా కొనసాగిన బ్రాహ్మణాధిపత్య వ్యవస్థలో వివాహ పద్ధతి వర్ణ ఆచార బానిస విధానాలు కూడలిగా ముందుకు వచ్చింది. అందుకే హిందూ వివాహ వ్యవస్థలో స్త్రీ గురించిన వాస్తవాంశాలను తెలుసుకోవలసిన అవసరం వుంది. స్త్రీని పెండ్లిలో ఒక వ్యక్తిగా గాక ఒక వస్తువుగా ఎలా రూపొందించారో, వివాహ కార్యక్రమములో స్త్రీని ఒక సజీవశక్తిగా గాక ఒక ఉపకరణంగా ఎలా మలచారో మనము పరిశీలించకుండా "స్త్రీ"కి హిందూ సమాజము ఇచ్చిన స్థానాన్ని నిర్ణయించలేము.

వివాహం అనే పదంలో "వి" అనగా విశిష్ఠము, "వాహం" అనగా పొందుట అని అర్థము.

ఈ విషయాన్ని హిందూ వ్యాకర్తలు విస్తృతంగా వ్యాఖ్యానించారు.

> వివాహః వహ ప్రాపణే ఇత్యస్మాద్ధాతోః
> భావేషు శోకృతే వహనం వాహః విశిష్టో
> వాహః వైశిష్ట్యంచ ప్రతిగ్రహో ద్యష్టవిధో
> పాయాన్యత మోపాయే నహ్యేమాది
> గుప్తపద నయనాంత కర్మాభి సంస్కృతత్వమ్ ! తథాచ
> వివాహ పదార్థో (ద్విదల) ద్విఫల స్పద్ధతి !

---

1 మనుస్మృతి కాలానికిముందటి ఆర్యులవ్యవస్థను వైదికవ్యవస్థ అనవచ్చు

1) స్వత్వోత్పాదనం 2) సంస్కారా ధానం చేతి ! తదేతత్ సృష్టికృతం పారస్కరేణ ! పిత్రా ప్రత్తా మాదాయ గృహీత్వా నిష్క్రామతి (1-4-15) వరంద దాతీ (1-8-14 త్యం తేన !

(వీర మిత్రోదయం – సంస్కారకాండ)

అష్ట విధములైన వివాహాల్లో దేనితోనైనా హోమం మొదలుకొని సప్తపది వరకు గల సంస్కారములచే సంస్కరింపబడుట అని వివాహ శబ్దమున కర్థము చెప్పారు.

## అష్టవిధ వివాహాలు

హిందూ వివాహ వ్యవస్థను ఎనిమిది విధాలుగా నిర్వచించారు. మనుస్మృతికారుడు ఈ వివాహ పద్ధతులను క్రోడీకరించాడు. వాటిని పరిశీలిద్దాం :—

## 1. బ్రహ్మ వివాహము

ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతి శీలవతే స్వయమ్।
ఆహూయి దానం కన్యయా బ్రాహ్మోధర్మః ప్రకీర్తితః

(మను 3-27)

వేదశాస్త్ర సదాచారములుకల వరుని స్వయముగా ఆహ్వానము చేసి వస్త్రాదులచే అలంకరించి, మధు పర్కాదులచే పూజించి, కన్యాదానము చేసినచో అది బ్రాహ్మణ వివాహ మనబడును.

## 2. దైవ వివాహము

యజ్ఞేతు వితేత సమ్యగృత్విజే కర్మకుర్వతే॥
అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే॥

(మను 3-28)

అగ్నిష్టోమాది యజ్ఞమును జేయుచుండగా తనకు ఋత్విక్కుగా సున్న వరునకు అలంకరించి తన కుమార్తె నిచ్చినచో దానిని దైవ వివాహమని చెప్పుదురు.

## 3. ఆర్ష వివాహము

ఏకంగో మిథునం ద్వేవా వరాదాయ ధర్మతః ।
కన్యా ప్రదానం విధివదార్షో ధర్మస్స ఉచ్యతే ॥

(మను 3-29)

ఒక ఆవు, ఒక వృషభము ఒక గోమిథునమగును. ఇట్టి మిథునమును ఒకటిగాని, రెంటినిగాని యాగార్థముగాని, తిరిగి కన్యకు ఇచ్చు నిమిత్తముగాని వరుని వద్ద నుంచి తీసుకొని కన్యాదానము చేయుట ఆర్షమనే వివాహము. ఇచ్చట ధర్మతః అనుటచే శుల్కముగా స్వీకరించుట కాదు—అట్లుకాక శుల్కముగా గ్రహించుట దోషమని భావము.

## 4. ప్రజాపత్య వివాహము

సహోభౌ చరతాం ధర్మమితి వాచాను భాష్యచ।
కన్యా ప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః ॥

(మను 3-30)

ఓ వధూవరులారా ! మీరిద్దరు కలసి ధర్మము నాచరింపుడు అని ముందు పలికి పూజించి, కన్యాదానము చేయుటను ప్రాజాపత్య వివాహమందురు.

## 5. ఆసుర వివాహము

జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయై చైవశక్తితః ।
కన్యా ప్రదానం స్వాచ్ఛం ద్యాసురో ధర్మ ఉత్యతే ॥

(మను 3-31)

కన్యయొక్క పితాదులకును కన్యకును శక్తిననుసరించి ద్రవ్యము నిచ్చి కన్యను తీసికొనుటను ఆసుర వివాహమందురు.

## 6. గాంధర్వ వివాహము

ఇచ్ఛయాஉన్యోన్య సంయోగః కన్యాయాశ్చ వరస్యచ ।
గాంధర్వస్సతు విజ్ఞేయో మైథున్యః కామ సంభవః ॥

(మను 3.32)

కన్య తల్లిదండ్రుల సంబంధము లేకుండగనే స్త్రీ పురుషుల అనగా వధూవరుల ఆలింగనాది సంయోగము కాని, మైథున రూప సంయోగం కాని యుండుటను గాంధర్వ వివాహమందురు.

## 7. రాక్షస వివాహము

హత్వా ఛిత్వాచ భిత్వాచ క్రోశంతీం రుదతీం గృహాత్।
ప్రసహ్య కన్యా హరణం రాక్షసో విధిరుచ్యతే ॥
(మను 3-33)

కన్యకిష్టము లేకున్నను బలత్కారముగా కన్యను హరించుచు. కన్య బంధువులడ్డము వచ్చినచో వారిని హింసించి, ఛేదించి, భేదించియు కన్య యేడ్చుచున్నను తనతో తీసికొని పోవుటను రాక్షస వివాహ మందురు.

## 8. పైశాచ వివాహము

సుప్తాం మత్తాం ప్రమత్తాం వారహో యత్రోపగచ్ఛతి।
సపాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః ॥
(మను 3-34)

నిద్రించు చున్నదానిని గాని, మద్యపానము చేసి పరుండిన దానిని గాని, మద్యపానమును అధికముగా చేసి వస్త్రమునుకూడా సరిగా ధరించని స్త్రీని ఎరులులేని సమయములో మైథునము చేయుటను పైశాచ వివాహమందురు.

ఈ వివాహాను పరణం పౌరాణిక కాలంలో వివిధ సమాజాల్లో వివిధ పద్ధతుల్లో ఉండేది. వాటన్నింటిని మను చరిత్రకారుడు సమీక్షించాడు.

అయితే బ్రహ్మ వివాహం, దైవ వివాహం, ఆర్ష వివాహం, ప్రాజాపత్య వివాహము, ఆసుర వివాహాలే బ్రాహ్మణులు అనుసరణీయాలుగా భావిస్తున్నారు.

అద్భిరేవ ద్విజా గ్ర్యాణాం కన్యాదానం విశిష్యతే।
ఇతరేషాంతు వర్ణనా మితరేతర కామ్యయా॥

(మను 3-35)

తల్లిదండ్రుల ఇష్టము మీద తండ్రి ఉదకముతో కూడా దానము చేయుటయే బ్రాహ్మణులకు ముఖ్యము.

క్షత్రియాదులకు పరస్పరానురాగమే ప్రధానము. అక్కడే బ్రహ్మ వివాహము చేసుకొన్న వాని పుత్రుడు తనను, ఇరువది మంది పూర్వాపరులను తరింపజేయు ననియు, దైవ వివాహము చేసుకున్న వాని పుత్రుడు తనతో పదునైదు మందిని తరింప జేయుననియు, అర్ష వివాహము చేసుకున్న వాని సంతానము తనతో ఏడుగురిని తరింప జేయునని ప్రాజాపత్య వివాహము చేసుకొన్న వాని పుత్రుడు తనతో పదముగ్గురిని తరింప జేయుననియు చెప్పబడినది.

(మను 3-37,38)

మొదటి నాలుగు వివాహాలలో ఏ వివాహమున జనించినను బ్రహ్మ వర్చస్సు, వేద శాస్త్రాధ్యయన సంపత్తి, మంచి రూపము, సత్యగుణము, ధనము, యశస్సు, భోగము, ధర్మాచరణ కలుగునని సూత్రీకరించారు.

చివరి నాలుగు వివాహాలలో చేసుకొనిన వారికి జనించినవారు క్రూరకర్మలను చేసేవారు, అసత్యాన్ని పలికేవారు, వేద ధర్మాన్ని ద్వేషించేవారు జన్మిస్తారని చెప్పబడింది. అయితే పురాణ పురుషులలో పెక్కురు చివరి నాలుగు పెండ్లిండ్లే చేసుకొనెడివారు. అర్జునుడు, కృష్ణుడు భీముడు వీరందరు గాంధర్వ వివాహాలను, రాక్షస వివాహాలను ఆచరించినవారే. మరి ఈ శాస్త్రం ప్రకారం వారికి పుట్టిన సంతానం క్రూర కర్ములు కావాలి. ఋషులు విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, పరాశరుడు ఎవరూ బ్రాహ్మణ ఆచార బద్ధమైన మొదటి నాలుగు వివాహాలను ఆచరించినవారుకాదు. బ్రాహ్మణునకు మొదటి ఆరు పెండ్లిండ్లు అనగా బ్రహ్మ, దైవ, అర్ష, ప్రాజాపత్య, అసుర, గాంధర్వ వివాహాలు ఆచరణ యోగ్యమని, క్షత్రియునకు అసుర, గాంధర్వ, రాక్షస, పైశాచ వివాహాలు ఆచరణ యోగ్యమని మనుస్మృతికారుడు పేర్కొన్నాడు.

చతురో బ్రాహ్మణ స్యాద్యా న్ప్రశస్తాన్క వయోవిదుః।
రాక్షసం క్షత్రియ స్యైనక మాసురం వైశ్య శూద్రయోః॥
(మను 3-24)

అనగా బ్రాహ్మణునకు ఒక్కనికే మంచి సంతానం కలుగవలెనని, మిగిలిన వర్ణాలకు దుష్ట సంతానం కలిగిన పరవాలేదని బ్రాహ్మణునకు మాత్రం పైనాలుగు పెండ్లిండ్లు కేటాయించి మిగిలిన వారికి ఇతరమైన పద్ధతులు చేసుకున్న పరవాలేదని మనుస్మృతికారుడు అగ్ర వర్ణాధిపత్యాన్ని పెండ్లిలో కూడా నిగదిస్తున్నాడు. మొదటి నాలుగు పెండ్లిండ్లు బ్రాహ్మణునకు శ్రేష్టమని, క్షత్రియునకు రాక్షసము శ్రేష్టమని ఆసురము వైశ్య శూద్రులకును ముఖ్యమని మనుస్మృతికారుడు నివేదిస్తున్నాడు.

వివాహమునకు స్త్రీ యోగ్యతల మీద మనుస్మృతికారుడు ఇచ్చిన వివరణలే హిందూ మతానుచరులు ఇప్పటికీ పాటించడానికి ప్రయత్నిస్తున్నారు. మనుస్మృతికారుడు వధు యోగ్యతల గురించి ఈ విధంగా వివరిస్తున్నాడు. "తల్లికి సపిండ కానిదియు, తండ్రికి సగోత్ర కానిదియునగు కన్యక ద్విజాతులకు పత్నిగా నుండుటకు యోగ్యురాలు. సంపత్తులెంత వరకున్నను వక్ష్యమాణ కులములలోని కన్యకలను చేపట్టరాదు. జాతకర్మాది సంస్కారము లెరుగనిదియు, మగ సంతతి కలుగనిదియు, వేదాధ్యయనము లేనిదియు, శరీరము మిక్కిలి రోమములుకలదియు, మూలశంక, క్షయ, మందాగ్ని, అపస్మారము, బొల్లి, కుష్ఠురోగము లేరు పడ్డదియునగు కులములు త్యాజ్యములు.

రాగి వెంట్రుకలు కలదియు, హెచ్చుగా అవయవములు కలిగినదియు, నిత్యవ్యాధి బాధ కలదియు, రోమములు లేనిదియు, మిక్కిలి రోమములు కలదియు, వమరుబోతుగా నుండునదియు, పిల్లికండ్లు కలదియు, నక్షత్రములయు, వృక్షములయు, నదులయు, నదులయు, మ్లేచ్ఛులయు, పక్షులయు, పాములయు, దాసులయు పేరు కలదికాని, భయంకర నామధేయమున్నది కాని వివాహయోగ్య కానేరదు.

అవికలాంగి, మృద్వంగి, సమ్యనామ్ని. హంసయామిని, గజ గామిని యగునదియు, రోమములు, కేశములు, సూక్ష్మముగా నుండు నదియు వివాహయోగ్య అగును."

(మనుస్మృతి - మూడవ అధ్యాయం)

## పెండ్లి కుమారునికి ఉండకూడని లక్షణాలు

1) ఉన్మాదము కలిగి ఉండరాదు.
2) పతితుడు కారాదు.
3) కుష్టురోగి కారాదు.
4) నపుంసకుడయి యుండకూడదు.
5) తన గోత్రములో పుట్టినవాడు కారాదు.
6) కన్నులు, చెవులును లేనివాడు కారాదు.
7) అపస్మార రోగము కలిగియుండరాదు.

ఇవి వర దోషములు. ఈ దోషములు వధువునకూ ఉండరాదు. ఇవి కాత్యాయనుడు చెప్పినాడు.

ఉన్మత్తః పతితః కుష్ఠీతథా షండస్స్వ గోత్రజః
చక్షుశ్శోత్ర విహీనశ్చ తథాపస్మార దూషితః
వరదోషాస్త్ర ధైపైతే కన్యాదోషాః ప్రకీర్తితాః

అని ఆయన సూత్రము.

వరుని గురించి కాత్యాయనుడు చెప్పింది ఎక్కువ పరిగణనలో లేదు.

స్త్రీ విషయంలో మనుస్మృతికారుని ఆంక్షలు మాత్రం తూచితూచి ఆచరించడానికి హిందూ ధార్మికులు ప్రయత్నించారు.

ఈ సూత్రాలు గుప్తుల తరువాత భారతదేశంలో హిందూమతాను సరణ రాజ్యాలు యేర్పడ్డ తరువాత బలంగా ఆచరణలోకి వచ్చాయి,

## వర్ణాంతర వివాహ పద్ధతులు

శ్లో॥ సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తాదార కర్మణి
కామతస్తు ప్రవృత్తానా మిమాంస్స్యుః క్రమశో వరాః

అనియున్నది. ద్విజులు ముందుగా తన వర్ణ స్త్రీని వివాహమును చేసుకొనవలయును. కామాధిక్యము కలవాడయినచో సజాతీయ (సవర్ణ) స్త్రీ వివాహమైన తర్వాత మిగిలిన వర్ణ స్త్రీలను చేసికొన వచ్చును—అని అర్థము.

తర్వాత—

శ్లో॥ శూద్రైవ భార్యా శూద్రస్య సాచ స్వాచ విశః స్మృతే
తేచస్వాచైవ రాజ్ఞశ్చ తాశ్చస్వా చాగ్రజన్మనః
(మనుస్మృతి 3-13)

అనియున్నది. శూద్రునకు శూద్ర స్త్రీయే భార్యగా నుండ వలయును. వైశ్యునకు వైశ్య స్త్రీయు, శూద్ర స్త్రీయు ఉండవచ్చును. క్షత్రియునకు క్షత్రియ స్త్రీయు, వైశ్య - శూద్ర స్త్రీలను ఉండవచ్చును. బ్రాహ్మణునకు బ్రాహ్మణ స్త్రీయు క్షత్రియ-వైశ్య - శూద్ర స్త్రీలు భార్య లుగా నుండ వచ్చునని యర్థము.

బ్రాహ్మణుడు క్రింది జాతులన్నింటిని వివాహము చేసుకోవచ్చు. అట్లాగే క్షత్రియ - వైశ్యులు చేసుకొనవచ్చు. అయితే శూద్రుడు చేసుకొనడానికి వీలులేదు. దీనిని బట్టి “పంచములు” వర్ణ వ్యవస్థలోకి రాలేదు. శూద్రుడు శూద్ర స్త్రీనే వివాహము చేసుకోవచ్చుననే నియమం ద్వారా వర్ణ సంకరానికి శూద్రుడు పాలుపడ కూడదనే నియమం ద్వారా మిగిలిన మూడు వర్ణాల పురుషులకు వర్ణ సంకరానికి అవకాశం ఇవ్వడం ద్వారా వర్ణ సంకరాన్ని బ్రాహ్మణ - క్షత్రియ వర్ణాలే ఎక్కువ పాటించాయి అనేది సువ్యక్తమవుతుంది. ఒక ప్రక్క వర్ణ సంకరాన్ని బోధిస్తూనే “వర్ణ”త్వాన్ని కాపాడుకొనే నియమాలు చెప్పిన ప్రయోజనం లేనిపని అవుతుంది. వర్ణ సంకర వివాహ పద్ధతి వలన మొత్తం వ్యవస్థలో ఒకరి నుండి ఒకరు జనించే అవకాశం కలుగు చున్నప్పుడు వర్ణ వ్యవస్థను నిబద్ధీకరిస్తూ ధర్మ సూత్రాలు వల్లించడం వ్యర్థం. అయితే ఈ హిందూ పెండ్లి విధానంలో పురుషుడు ప్రధాన పాత్ర వహిస్తున్నాడు. వర్ణ సంకరానికి సిద్ధపడవలసిన వాడు, ఆచరించ వలసినవాడు అతడే అవుతున్నాడు. ఇంకా ఈ పెండ్లిలో ప్రధానమైన అంశం కన్యాదానం.

## కన్యాదానం

కన్యను దానము చేయుట వలన కన్యాదాతయొక్క పితరులు తరిస్తారు. వారికి బ్రహ్మలోక నివాస ప్రాప్తి కలుగుతుంది. మోక్ష ప్రాప్తి కూడా కలుగుతుంది, కన్యను దానం చేసేటప్పుడు కన్యాదాత అనగా తండ్రి.

కన్యామిమాం ప్రదాస్యామి పితౄణాం తారణాయవై।

అను మంత్రమును చెపుతాడు. ఈ మంత్రమే మహాసంకల్ప మందు—

మయాసహదశ పూర్వేషాం దశాపరేషాం
మద్వంశానాం పుత్రాణాం నరకాదుత్తార్య
శాశ్వత బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం
సాలంకృత కన్యాదాన మహం కరిష్యే॥

అనగా నిటునటు పది తరములవాడు నాతో గూడా నా వంశీయులగు పితరులు నరకము నుండి బయటపడి శాశ్వతముగా బ్రహ్మలోక నివాస ప్రాప్తి నొందుటకై నేనీకన్యను నీకు దానము చేయుచున్నాను. అని చెప్పుటచే పితరులకు బ్రహ్మలోక నివాసప్రాప్తి కలుగుటయే ప్రధాన ధ్యేయంగా కన్యాదానం చేయు చున్నట్లు మంత్రార్థం తెలుపుతోంది.

"త్వద్దా నాన్మోక్ష మాప్నుయాం" అని చెప్పుట వలన కన్యాదాత "కన్యవగు నిన్ను దానం చేయుట వలన నేను మోక్షమును పొందు చున్నానని చెప్పుచున్నాడు.

కాబట్టి ఈ దానంలో "కన్య" ఒక వస్తువైంది. ఈ వస్తువును దానం చేసేవ్యక్తి తాను మోక్షానికి వెళ్ళడంకోసం ఈమెను దానం చేస్తున్నాడు. అందుకు ఆమె సుఖ సంతోషాలను పరిగణనలోనికి తీసుకోకుండా, తాను దానం చేస్తున్న వ్యక్తి వయస్సును దృష్టిలో పెట్టుకోకుండా అతి చిన్న వయస్సులలోనే ఆమెకు ఆలోచన రాకముందు, అవయవ పొందిక ఏర్పడక ముందే మోక్షార్థమై దాత కన్యను దానం ఇవ్వడం ప్రారంభించాడు.

కన్యను ఇచ్చినందుకు శుల్కం పొందే కాలంలో ధనార్జనే ధ్యేయంగా ఈ వివాహ కాండ జరపడం జరిగింది. అందుకే ఈ వివాహంలో ప్రధానమైన కన్య వివాహ వయస్సును గూర్చి చూద్దాం.

## కన్య వివాహ వయస్సు

"కన్య"కు ధర్మ శాస్త్రాల్లో వివరణలు అనేక మున్నప్పటికి" కలే పరాశర స్మృతిః" కలియుగమునకు పరాశర స్మృతి అన్నారు. కాబట్టి పరాశర స్మృతిని ప్రధానంగా తీసుకుందాం. హిందూ ధార్మికులు మను స్మృతిని కూడా ప్రధానంగా తీసుకుంటారు. కాబట్టి మనుస్మృతినికూడా మనం పరిగణనలోనికి తీసుకొని పరిశీలిస్తున్నాము. వివాహ కన్యను గూర్చి పరాశర స్మృతిలో ఇలావుంది.

ప్రాప్తేతు ద్వాదశే వర్షేయః కన్యాం న ప్రయచ్ఛతి।
మాసిమాసి రజస్తస్యాః పిబంతి పితరః స్వయమ్॥ (7-5)

12 వ సంవత్సరం వచ్చిన తరువాత తన కన్యకు ఎవడు వివాహము చేయడో వాని తండ్రి, తాత మొదలగు పితరులు ఆ కన్యక యొక్క రజస్సును ప్రతి మాసమందు అగువానిని భక్షింతురు అని అర్థము. దీనికి కూడా రజస్వల కాకుండగనే వివాహము చేయువలయు ననియే తాత్పర్యము.

రజస్వల కాకుండానే వివాహం చేయడానికి తండ్రులను ప్రేరేపించిన ఈ శాస్త్రం వలన రజస్వల అయిన తరువాత వివాహముచేస్తే దారుణమైన శిక్షకు గురి కావలసి వచ్చేది. మానవ విలువలను తగలేసే ఈ నియమాలను బ్రాహ్మణ సమాజం మన సమాజం మీద అమానుషంగా రుద్దింది.

మనుస్మృతి యందు చెప్పబడిందంటూ కన్యమీద అనూచానంగ వస్తున్న శ్లోకంలో—

అష్టవర్షా భవేత్కన్యా (ద్గౌరీ) నవ వర్షాతు రోహిణీ
దశవర్షా భవేద్గౌరీ (త్కన్యా) అత ఊర్ధ్వం రజస్వలా॥ (3-21)

ఎనిమిది సంవత్సరముల వయస్సు కలదానిని కన్యయనియు, తొమ్మిది సంవత్సరముల వయస్సు కలదానిని గౌరియనియు చెప్పబడినది. పురాణంలో — (ఏ పురాణమో పేర్కొన బడలేదు.)

యావన్న లజ్జితాంగాన్ని కన్యా పురుష సన్నిధౌ।
యోన్యాద్యదని న గూహేత తావద్భవతి కన్యకా॥

వస్త్ర విహీన అయినపుడు పురుషుని చూచియు సిగ్గు పడనిదియు కన్యయని చెప్పబడినది. అంటే స్త్రీత్వాన్ని ఇంకా గుర్తించని దశయని బోధ పడుతుంది. ఈ దశలో ఈ పసి బాలలకు పెండ్లి చేయడాన్ని ఎందుకు తలపెట్టారో ?

వీరు పతివ్రతలుగా కొనియాడుతున్న సీత మొదలగు వారికి ఎప్పుడు పెండ్లయ్యిందో ? వారుకూడా కన్యలుగానే చేసుకున్నారా ? అంటే లేదు. అంతకు ముందటి రఘు వంశములోని కన్యలు స్వయంవరాలు జరిపించిన కాంతలు. వీరెవరు ఎనిమిది సంవత్సరాల లోపు పెండ్లి చేసుకున్నవారు కాదు. భారతంలో ప్రసిద్ధి చెందిన కాంతామణులు "సత్యవతి" అంబిక, అంబాలిక, గాంధారి, కుంతి, ద్రౌపది, సుభద్ర, ఉలూచి, హిడింబి మొదలగు కన్యలెవరు ఆ వయిస్సులో పెండ్లి చేసుకున్నవారు కాదు, అలాగే శకుంతల, దేవకి, దమయంతి మొదలగువారు కాని, అలాగే రామాయణ కాంతామణులైన దశరధుని భార్యలు కౌసల్య, సుమిత్ర, కైకేయిలు, రామ లక్ష్మణ భరత శతృఘ్నుల భార్యలు సీత, ఊర్మిళాదులుకు కాని పెండ్లిండ్లు ఎనిమిదేళ్ళకు, లేక పది పన్నెండు ఏండ్లకు లోపు జరగలేదు. మరి ఎప్పుడు ఈ మంత్రాలు ఆచరణలోకి వచ్చాయి ? కన్యయొక్క వయస్సు ఎప్పుడు నిర్ణయింప బడింది ? ఈ కన్య వయస్సును రజస్వలకు ముందు నిర్ధేశించడం ద్వారానే బాల్య వివాహం అనే దురాచారం ప్రబలింది.

స్మృతులు, గృహ్య సూత్రాలు వివాహం వయస్సును నిర్దేశిస్తూ అనేక సూత్రాలు గావించినాయి. మనుస్మృతిలో—

శ్లో॥ త్రింశ ద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశ వార్షికమ్।
త్ర్యష్ట వర్షోఽష్ట వర్షాం వా ధర్మే సీదతి సత్వర॥

అని చెప్పబడింది.

30 సంవత్సరముల వయస్సు గల పురుషుడు 12 సంవత్సరముల వయస్సు గల కన్యను, 24 సంవత్సరముల వయస్సు గల పురుషుడు 8 సంవత్సరముల వయస్సుగల కన్యను వివాహము చేసుకొనవలెను. అట్లు చేసుకున్నచో ధర్మం నందుండు చున్నాడని భావము.

గుణవంతుడు దొరకకపోతే గుణ హీనునికైన ఇవ్వాలికాని రజస్వల అయ్యేవరకు ఉంచకూడదని శాసించారు.

శ్లో॥ దద్యాద్గుణ వతే కన్యాం నగ్నికాం బ్రహ్మచారిణే।
అపి వా గుణహీనాయ నో పరుంధ్యా ద్రజస్వలామ్॥
బో. గృ. 4-1-12

అని బోధాయన వచనమును వ్రాసిరి. గుణవంతుడగు బ్రహ్మచారికి రజస్వల కాని కన్యను ఇచ్చి దానము చేయవలయును. అట్లు గుణవంతుడు దొరకనిచో గుణహీనుని కయినను ఇవ్వవలయును. కాని రజస్వల యగువఱకు ఉంచకూడదు అని అర్థము.

"నగ్నిక" అనగా రజస్వలగుటకు సిద్ధముగానున్నది అని అర్థం. రజస్వలయిన తరువాత వివాహన్ని పూర్తిగా నిషేధిస్తూ ధర్మశాస్త్రకారులు ఎన్నో సూత్రాలు వ్రాశారు. మరీచి—

శ్లో॥ గౌరీం దదన్నా కపృష్టం వైకుంఠం రోహిణీం దదత్।
కన్యాం దదద్బ్రహ్మ లోకం రౌరవంతు రజస్వలాం॥

అని చెప్పినాడు. 10 సంవత్సరములుగల గౌరి సంజ్ఞగల కన్యను ఇచ్చి వివాహము చేసినచో స్వర్గ లోకమును, 9 సంవత్సరములు గల రోహిణి సంజ్ఞ గల కన్యను ఇచ్చి వివాహము చేసినచో వైకుంఠమును, 8 సంవత్సరముల వయసుగల కన్యనుఇచ్చిన అత్యుత్తమ మగు బ్రహ్మ లోకమును పొందుదురు అని అర్థము.

"దశవర్షా భవ ద్గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా।
ప్రాప్తేతు ద్వాదశే వర్షే అత ఊర్ధం రజస్వలా॥

ఈ సూత్రాల ద్వారా మొత్తంగా మనకు తెలుస్తున్నది. హిందూ ధర్మశాస్త్రకారు లందరూ "కన్య" అనగా రజస్వల కాక ముందటిది అని తేల్చి బాల్య వివాహాన్నే నిర్దేశించారు. ఈ బాల్య వివాహాల వలన మొత్తం స్త్రీ జాతికి జరిగిన అన్యాయాన్ని గూర్చి రాబోయే భాగాల్లో చర్చిద్దాం.

## వివాహం ఎన్ని రోజులు ?

ఆపస్తంబ మహర్షి మతమును అనుసరించి

"త్రిరాత్రము భయో రధశ్శయ్యా
బ్రహ్మచర్యం క్షారలవణ వర్జనంచ"

ఆప. గృ. 8_8

వివాహం స్థాలీపాకదివసం మొదలుకొని నాలుగు రోజుల ఒక పూటతో సమాప్తం చేయవలసి ఉన్నదని చెప్పబడింది.

అశ్వలాయన మహర్షి—

"అత ఊర్ధ్వం త్రిరాత్రం ద్వాదశ రాత్రం సంవత్సరం
మైక ఋషి ర్జాయుతే" 1–8

స్థాలీపాకమైన తరువాత మూడు రాత్రులు గాని, 12 రాత్రులు గాని, ఒక సంవత్సరం గాని దీక్ష వహించ వలయునని అర్థము.

"ఏకం రాత్రం వా" అని కూడా భరద్వాజ సూత్రాల్లో ఉంది.

హిందూ సంప్రదాయ బద్ధులు ఆర్భాటాలకు దిగి వారికి వీలున్న శాస్త్రాలను పేర్కొని ఒకరోజు మొదలుకొని దినాలు, వారాలు పెండ్లిళ్ళు జరుపుకొంటూ వుంటారు.

## వరుడు

హిందూ ధర్మశాస్త్రాల ప్రకారం వరుడు బ్రహ్మచర్య వ్రతమును పాటించిన తరువాత అనగా బ్రహ్మచర్యమునకు వేదాధ్యయనం, గురు

కుల వాసం. క్రమశిక్షణా చెప్పబడినవి. బ్రహ్మచర్య దీక్షతో గురువు నింట చేర్చాలి. ఉపనయనం జరిపించడం అంటే ఉప + నయనం దగ్గరకు కొనిపోవడం. అనగా గురువు దగ్గరకు కొనిపోబడాలి. ఉపనయనం గర్భాష్టమ సంవత్సరంలో జరపాలి. అంటే గర్భమున బడినది మొదలు ఏడు సంవత్సరాలు నిండి ఎనిమిది సంవత్సరం నిండు లోపల అని అర్థము.

"ఉపనయన గురుశ్శిష్యం శిక్షయేత్ శౌచమాదితః"

—మనుస్మృతి

బ్రహ్మచారి స్నాన సంధ్యానుష్ఠానములు సనుముగా నిర్వర్తించుట. వస్త్రములుదికికొనుట, గురువునకు ధర్భలు మున్నగు సామాగ్రిని సాధించి పెట్టుట నేర్పబడుతుంది, అటుపైన వేదాధ్యయనానికుపకరించు అంగముల శాస్త్రాధ్యయనం చేయుట. పదమూడవ సంవత్సరమున ఉత్తరాయణమున శుక్ల పక్షమున శిష్యునిచే గురువు "నాంది" అను దేవతాపూజ చేయించి వేదవ్రతమనుష్టించుటకు "మహానామ్ని" వ్రతాన్ని చేయించ వలయును. అప్పుడు క్షురకర్మ ఉపనయన హోమములు మొదలు పెట్టించబడతాయి. (మేఖల) నడికట్టు పటకా, అజినం (లేడి చర్మపు చొక్కా) దండం (చేతి కర్ర) ధరింప జేయవలయును. పదిహేనవ సంవత్సరమున వేదాధ్యయనం పూర్తి కాగానే ఉపనిషద్ వ్రతాన్ని చేయించాలి. పదహారవ సంవత్సరం స్వస్తి వచనం అభ్యుదయికం చేయించి బ్రహ్మ తేజస్సును శిష్యుని ముందు ప్రతిష్ఠించుటకు గోదాన వ్రతము, తరువాత మంత్రాధ్యయనంతో క్షురకర్మ గావించాలి.

ఇప్పుడు శుద్ధమైన వైదిక వివాహానికి వరుడు తయారవుతాడు.

ఈ వరుడు ఏ కాలంవాడు ? ఏ వ్యవస్థవాడు ? ఏ పాలక వర్గం రూపొందించినవాడు ? ఈ గురువులు ఏ కాలంవారు ? శిష్యులేకాలం వారు ? కృష్ణాజినాలు ఏ కాలానివి ? వేదాంగ అధ్యయనం ఎక్కడ ?

కాలం మారింది. వ్యవస్థ మారింది. కాలంతోపాటు వరుడు పై ఆచారాన్ని పులుముకునే ముందుకు వస్తున్నప్పటికి అతణ్ణి హిందూ ధార్మిక ఆచార నిబద్ధుడిగా పేర్కొని పురోహితులు తమ కుక్షింభరత్వం కోసం

ఆచార కర్మకాండను మాత్రం చావనీయకుండా చూస్తున్నారు. పితృస్వామిక వ్యవస్థలో వరునియొక్క ఈ నియమ నిబంధనలకు మాత్రం తిలోదకాలిచ్చారు. పురోహిత కర్మకాండలకు వారి కుటుంబంలోని పుత్రి వర్యులే ఎదురు తిరగడంతో "గుణ నిధులు" "నిగమ శర్మ"లు ఆవిర్భవించి ఆ వ్యవస్థయొక్క నిజ స్వరూపాన్ని బట్టబయలు చేశారు.

కన్యను చేసుకోవడానికి యోగ్యమైన వయస్సు, బుద్ధి, హృదయం, పురుషత్వం కావాల్కాని వేదాధ్యయన కర్మకాండలు వరత్వాన్ని నిలుపుతాయా? అలా నిలిపితే బృహస్పతి భార్య తార చంద్రుణ్ణి వరించినట్టు పురాణాలెందుకు చెబుతున్నాయి? బృహస్పతి కంటే వేదాధ్యయనపరుడు ఉన్నాడా? గౌతముని భార్య అహల్య ఇంద్రునెందుకు మోహించింది? ఆయనికి వరుని లక్షణాలు లేవా! భృగుమహర్షి భార్యను పులోముడు ఎందుకు ఎత్తుకుపోయెను? ఇలా వేదాధ్యయన పరుల ఉపనయన సంస్కారపరుల చరిత్రలు తడవిన అట్టి నియమ నిబద్ధత వరత్వానికి లక్షణం కాదని తేలుతుంది.

వరుని లక్షణం ఆయా సామాజిక కాలాలను బట్టి అతని సామర్ధ్యము బుద్ధి కుశలత స్త్రీతో భాగస్వామిగా నుండగలిగిన నేర్పుమీదే ఆధారపడి ఉన్నది.

## వివాహంలోని అంశాలు

1) సమావర్తనము
2) కన్యావరణము
3) కన్యాదానము
4) వివాహ హోమము
5) పాణిగ్రహణము
6) అగ్ని పరిచర్య
7) లాజహోమము
8) సప్తపది
9) నక్షత్ర దర్శనము

అను అంశములు వివాహములో ముఖ్యమైనవిగా చెప్పారు.

ఈ కర్మకాండ లన్నింటిలోను పురుషుని ఆధిపత్యమే నిరూపింపబడింది. పురోహితుల జీవన విధానానికి అనుగుణంగా అంతూ పొంతూ లేని వివాహ కర్మకాండని రూపొందించినారు.

సమాజంలో వాటన్నిటిని అనువర్తించడానికి వీలులేక పోయినా వ్యవస్థ మీద ఆ పట్టును కోల్పోకుండా ఉండడం కోసం పురోహిత వర్గం వాటి అనుసరణ విషయంలో కపటత్వంతో కూడిన అన్వయాన్ని ఇస్తూ కొనసాగిస్తూనే ఉంది.

సమాజాన్ని మార్చాలని ప్రయత్నించిన ఉద్యమా లన్నింటిని నిరోధించే క్రమంలో ఈ వ్యవస్థ కొనసాగింపుకు బృహద్ వ్యూహాన్ని ఎప్పటికప్పుడు వేస్తు హిందూ పునరుద్ధరణ వాదంతో ఈ కర్మకాండను ముందుకు నెడుతూనే ఉన్నారు. అనేక అభిప్రాయాలు ఎంత సమాజం మారినా ఇంకా వెంటాడుతూనే ఉన్నాయి. రజస్వలయిన అమ్మాయి నిండా భూ తా లు ఉంటాయని ఆ భూతాల నుండి సమర్తాడిన పిల్లను తప్పించటమే కీడు తియ్యడం అంటారు. ఈ విషయాన్ని తాపీ వారు ఇలా వివరిస్తున్నారు.

అసలు కన్యాత్వంలో ఉండే మొదటి అభిప్రాయాలు మనవి చేస్తాను. ఆ రోజులలో ఆడపిల్ల సమర్తాడిందంటే దానిని ఒక మహా మ్మారిలాగా చూసేవారు. ఆడదాన్ని ఆశ్రయించుకొని ఎన్నో భూతాలు భయాలు ఉంటాయని అనుకునేవారు. ఆ ఆడదానిని ముట్టుకుంటే ఆ భూతాలు పట్టుకుంటాయట. దాని కాలు భూమికి తగిలితే పచ్చిక మొల వను. పంటలు పండవు. దానిగాలి సోకితే చెట్టు కాయదు. అందుచేత రజస్వల కాగానే ఆడదానిని ఆకుల మీదనో, ఇప్పుడు చాపల మీద అను కోండి—విడిగా ఉంటే రాతి మీదనో కూర్చొ పెట్టేవారు. ఆ పాడుభూతాలు ఆడదాని అవయవాలు పాడుచేయకుండా ఉండడానికి ఏమేమో అగచాట్లు పడేవారు. ఇప్పుడు చిమ్మిలి పంచిపెట్టినట్టు ఆ భూతాలను మోసంచేసి ఎలాగయినా తప్పించుకోవడానికి ఈ ఆడదాని చేత మారువేషాలు వేయిం చేవారు. ఇప్పటికీ ఈ ఆచారం అరవ దేశంలో ఉంది. ఈ పనంతా చాలా ముసలివారు చేయిస్తూ ఉండేవారు. చచ్చినా పర్వాలేదన్న ముస లివాట. చిన్న వయస్సువారు దగ్గరకు పోయేవారుకాదు. ఈ రోజులలో అంత భయం ఉండేది.

ఈ దోషాలు పోగొట్టుకోవడం కోసము ఇప్పటికి కన్యకు అరటి పెట్టుకు చేస్తున్నారు.

కీడు పేరుతో—

ఈ కన్యను మన పెద్దలు ఎలా ఉపయోగించుకున్నారో తాపీవారు ఇలా వివరించారు.

"మరి కొన్నాళ్ళకు — రాజులు, ఆచార్యులు, బ్రాహ్మణులు ఇలాంటి పేర్లు సంఘములో ప్రవేశించిన తరువాత—వాళ్ళలో కొంత మహత్తు ఉందన్న భావాలు కలిగిన తరువాత—ఈ మొదటి శోభనాలకు ఆ పెద్దలు తాంబూలం పుచ్చుకునేవారు. సమూర్తాడిన పిల్లను మొదట నాయకుడితోనో, రాజుతోనో, ఆచార్యుడితోనో, బ్రాహ్మడితోనో జత కట్టించేవారు. ఆ పాపాల భైరవులను భూతాలు ఏమీ చేయలేవట. చచ్చినట్లు పిల్లను వదిలిపెట్టేవి. తరువాత ఏ మగవాడయినా జతకట్టవచ్చు. చావడు."

ఈ విధంగా అనేక దురాచారాలతో స్త్రీలను వంచించారు.

తరువాత వివేకం కలిగిన తరువాత ఈ కన్యను ఇతరులెవరు అనుభవించటానికి వీలు లేదన్నాడు. కన్యత్వం మీద ఎన్నో పరీక్షలు, ఎన్నో ఆంక్షలు, అక్షత యోనిగా వివాహం ఆడడానికి ఎన్నో సంకెళ్ళు బిగించారు. చివరకు ఆమె పవిత్రతను పరిశీలించడానికి కన్యత్వ పరీక్షలకు కూడా దిగాడు.

ఈ పురోహిత వ్యవస్థ పురుషుడి తరపున నిలబడి స్త్రీని తమకు అనుకూలంగా అనేక పీడనలకు గురిచేశారు. పురుషుడు ఎలాంటి వాడయినా ఫరవాలేదు. వికలాంగుడైనా, శక్తిహీనుడైనా పురుషుడైతే చాలు. అతడు పెండ్లికి అర్హుడు. అదే "స్త్రీ" అయితే ఎన్నో నియమాలు ఆంక్షలు తూకాలు, కొలతలు ఇంకా ఎన్నో బంధనాలు రూపొందించారు.

సమాజం మారిందనుకొంటున్న ఈనాడు కూడా "కట్నదాహం" మరింత పెరిగింది. అమ్మాయి చదువు, గుణం, రూపంతోగాక ఆమె తెచ్చే డబ్బుతోనే ఆమెకు విలువ నిస్తున్నారు. లేనట్లయితే ఆమెను

---

పెళ్ళి — దాని పుట్టు పూర్వోత్తరాలు — 111 పేజి,

పీడించి చంపుతున్నారు. ఎందరో స్త్రీలు ఈ ఆధునిక సమాజంలో ఈ కట్నాల అగ్ని గుండంలో దహించ బడుతూనే ఉన్నారు. పురుషుడు స్త్రీని ఎన్నుకోవడమనే ఈ విధానం ప్రాచీన కాలంలో లేదు. స్త్రీయే పురుషుణ్ణి వివాహానికి ఎన్నుకునేది.

While there is in primitive Society a striking absence of manifestations of individual choice on the part of the men as ragards the women, there is considerable evidence of sexual selection exercised by the women as regards the men. Among many peoples it has been noted that the imitative in individual marriage does not come from the men, but from the women."

వివాహాన్ని రూపొందించి అభివృద్ధి చేసిన స్త్రీ, ఆ వివాహ విధానపు ఉక్కు పిడికిలిలోనే నలిగిపోతూ ఉంది. హిందూ వివాహ వ్యవస్థ స్త్రీ విషయంలో బలిపీఠంగా మారింది.

స్త్రీకి ఉన్న స్వభావ సిద్ధమైన ప్రతిభ లన్నింటిని నాశనం చేసి, స్త్రీ కేవలం ఒక శృంగార వస్తువుగా, భోగ పరికరంగా పెట్టి వేయడము జరిగింది.

స్త్రీని కేవలం భోగ వస్తువుగా మల్చడం కోసం ఒక శృంగార శాస్త్రాన్ని "కామ సూత్రాల" పేరుతో నిర్మించారు. ఈ కామ సూత్రాలను వాత్స్యాయనుడు రచించాడు. అతనికి ముందు ఎంతోమంది కామ సూత్రాలు రచించారు. కాని వాత్స్యాయనుడు దాన్ని శాస్త్రంగా మలిచాడు. స్త్రీ భౌతిక రూపం పురుషునికి ఎలా ఉపయుక్తమో అతడు ఆ గ్రంథంలో ఉల్లేఖించాడు. ఈ కామ సూత్రాలను పరిశీలిస్తే కాని హిందువులు "స్త్రీ"ని ఎలా భోగ వస్తువుగా శిల్పించి అనుభవించారో అర్థము కాదు. అందుకే కామ సూత్రాలను పరిశీలిద్దాము. సత్యాన్వేషణలో మరొక అడుగు ముందుకు వెళదాము.

---

The Mothers — 168
Robert Briffault.

# వాత్స్యాయనుని కామ సూత్రాలు - స్త్రీ

వాత్స్యాయనుని కామ సూత్రాల ప్రభావం సంస్కృతంలో రచింపబడిన పురాణ, ప్రబంధ, కావ్య, నాటక, శతక సాహిత్య మంతటి పైన బలీయంగా ఉంది.

స్త్రీకి సంబంధించిన ధర్మ శాస్త్రాలు, కామ శాస్త్రాలు, వాటి ననుసరించిన సాహిత్యం అంతా స్త్రీని అవమానించి అణచి వేసే దారిలోనే నడిచింది.

ఈ కామ సూత్రాలకు మూల గ్రంథాన్ని బృహస్పతి వ్రాశాడని ప్రశస్తి. మహాదేవుని అనుచరుడైన నంది సహస్రాధ్యాయమైన కామ సూత్రాలను రచించాడు. ఈ గ్రంథాన్ని మూలంగా పెట్టుకొని శ్వేత కేతువు ఐదు వందల అధ్యాయములు గలిగిన కామ సూత్రాలను రచించెను. దానిని సంక్షేపించి పాంచాలుడైన బాభ్రవ్యుడు సాధారణము, సాంప్రయోగికము, కన్యా సంప్రయుక్తము, భార్యాధికారకము, పారిదారికము, వైశికము, ఔపనిషధకము అనే ఏడు అధికరణములతో నూటయాబది అధ్యాయముల శాస్త్రమును సంతరించెను.

ఇందులోని వేశ్యాధి కరణమును దత్తకుడు, చారాయణుడు సాధారణాధి కరణమును, సువర్ణనాభుడు సాంప్రయోగికమును, ఘటకముఖుడు కన్యా సంప్రయుక్తమును, గోనర్థీయుడు భార్యాధికారికమును, గోణికాపుత్రుడు పారదారికమును, కుచుమారుడు ఔషధికమును వేరువేరు గ్రంథములుగా వ్రాసిరి. ఇట్లు పూర్వులు వ్రాసిన అనేక గ్రంథాలను క్రోడీకరించి హిందూ ధర్మశాస్త్రాల భావ సంపత్తిని కూర్చి వాత్స్యాయనుడు కామ సూత్రం అనే పేరుతో ఈ గ్రంథాన్ని రచించాడు.

కీట్స్ పండితుడు ఈ వాత్స్యాయనుడు క్రీ॥ శ॥ 3వ శతాబ్ది వాడని అభిప్రాయపడ్డాడు. అయినా ఈతడి కాలము అసందిగ్ధము.

ఈ వాత్స్యాయనుడు అర్థశాస్త్ర రచయిత అయిన కౌటిల్యుడే అని, న్యాయ భాష్యకర్త వాత్స్యాయనుడేనని వాదాలు ఉన్నాయి. కాని ఈ వాత్స్యాయనుడు వారిరువురికి భిన్నుడని పెక్కురి అభిప్రాయము.

కామ సూత్రము, సాధారణ—సాంప్రయోగిక—కన్యా సంప్రయుక్తక—భార్యాధికారిక—పారదారిక—వైశిక—ఔపనిషదిక—పేర్లతో ఉన్న ఏడధికరణములతో ఈ గ్రంథము సంగ్రంథించ బడినది. ఈ గ్రంథములో 17 వందల శ్లోకములు, 36 అధికరణములు ఉన్నాయి. ఇందులోని ప్రథమ ప్రకరణములో వాత్స్యాయనుడు ఈ విధంగా నుడువుచున్నాడు—

కామశాస్త్రం ప్రకారము పురుషునికి ధర్మార్థ కామ మోక్షాలు ముఖ్యమైనవి. బాల్యమందు విద్య, యౌవనమందు కామం, వార్ధక్యమందు ధర్మం పురుషుడు పాటించాలని కామ శాస్త్రం చెబుతుంది. ఈ కామ శాస్త్రాన్ని పురుషుడు తప్పకుండా అభ్యసించాలని, స్త్రీకూడా జవ్వనానికి ముందే చదవాలని, దాది కూతురు, చెలిమికత్తె, తల్లి తోబుట్టువు వంటి నమ్మకం గల వారి దగ్గర చదవాలని కామశాస్త్రం చెబుతోంది.

కామ శాస్త్రం ఈ అంశాలను స్త్రీలు నేర్చుకోవాలని చెబుతోంది.

నృత్యము, గీతము, వాద్యము, బొమ్మలు వ్రాయుట, తిలకమును లెస్సగ దిద్ది తీర్చుట, పువ్వులతోడ బియ్యముతోడ బలి తృప్తి కయి ముగ్గులు లోనగునవి వేయుట, పువ్వులతో ఆస్తరణములను సిద్ధ పరుచుట, ఒడలికి, దుస్తులకు, దంతములకు రంగు వేసికొనుట, మణులతో కట్టడములను గావించుట, పాన్పుల నేర్పరుచుకొనుట, జల క్రీడాంగములను నేర్చుట. చిత్ర యోగములను గురుతించుట, మాల్యములను గ్రుచ్చుట, అలంకారమొనర్చు కొనుట, పన్నీరు మున్నగు వానిచే పరిమళమును బెంపుసేయుట, ఇంద్రజాలము లెరుంగుట, కాచుమారములు తెలియుట, హస్తలాఘవము గుర్తెరుంగుట, భక్ష్యములను సిద్ధ పరచుట గుడ్డలను గుట్టుట, సూత్ర క్రీడలాడుట, ప్రహేళికలు నేర్చుట, ప్రతిమాల యెరుంగుట, దుర్వాచక యోగములు తెలియుట, పుస్తకమును మధురముగా చదువుట, నవలలయు, నాటకములయు పరిజ్ఞానము నందుట, సమస్యలు పూరించుట, పేము, వెదుళ్ళులోనగు వానినల్లుట చెక్కటపుంబనులు, వాస్తువిద్య యెరుగుట, రత్నాదులను పరీక్షించుట, గనుల నుండి వెడలు లోహములను గురుతించుట, వృక్షములకు చికిత్సాదికమును చేయుట, కోళ్ళయు, పొట్టేళ్ళయు, పిట్టలయు పందెములను

గమనించుట, చిలకయు, గోరువంకయు మాటలు గుర్తెరుంగుట, తలం టుట మొదలగు వాని యందు నేర్పు చూపుట, అక్షరముష్టికనెరుంగుట, మర్మముగా భాషించటం తెలియుట, దేశ భాషలు చదువుట, శకున జ్ఞానము కలిగియుండుట, నిఘంటువులు వల్లించుట, కార్యక్రియ ఛంద శ్శాస్త్రము నెరుంగుట, వస్త్ర గోపనములు తెలియుట, వస్తు రూపమును భ్రమపెట్టు ప్రయోగములు తెలియుట, జూదమాడుట తెలియుట, గుట్ట ములు లోనగు వానిని అలవరచుట, విజయ ప్రయోజనముల విద్యలు, వ్యాయామ విద్యలు నేర్చుట, ఇవి కామ సూత్ర మూలకంగ భూతము లగు విద్యలని కామ సూత్రం తెలుపుతుంది.

ఇవన్నీ స్త్రీ ఎందుకు నేర్చుకోవాలంటే పురుషుణ్ణి వశ పరచుకోవడా నికట ! ఇందులో స్త్రీ వ్యక్తిత్వాన్ని పెంచే లక్షణాలు లేకపోగా, స్త్రీని కేవలం భోగ వస్తువుగా మార్చి కామ స్వరూపిణిగా రూపొందించడానికి మాత్రం ఈ లక్షణాలు ఉపయుక్తమయ్యాయి. గణికులుగా, వేశ్య లుగా స్త్రీలను రూపొందించి, భోగశాలలను నిర్మించి ఇటువంటి కామ శాస్త్రములు అభ్యసింప జేసి స్త్రీని కళాత్మకంగా అగౌరవ పరచడానికి ఈ విద్యలు ఉపయుక్తమయ్యాయి. స్త్రీ బాహ్య ప్రవర్తన, అంగ విన్యా సము, పురుష వశీకరణ మంత్రాలే ఈ విద్యల్లో ఉన్నాయి కాని స్త్రీ వ్యక్తిత్వాన్ని మెరుగు పరచే అంశాలు లేవు. స్త్రీలను మామూలు విద్యలు చదవడానికి అనర్హులుగా చేసి, ఇటువంటి "భోగ" విద్యలు మాత్రం నేర్వ డానికి అవకాశమిచ్చారు. అందులో కూడా కౌటింబిక స్త్రీని, భోగ స్త్రీని వేరుపరచి పురుషుడికిమాత్రం ఇద్దరినిఅనుభవించే అవకాశం కల్పించారు.

ఇక పురుషుడు "స్త్రీ"ని ఎన్ని మార్గాల నుండి వశపర్చుకోవాలో ఆ వశపర్చు కోవడానికి పురుషుడు చేయాల్సిన నటనలు, అతడికి దూతలు అతడికి మర్మజ్ఞులైన మిత్రులు, ఈ దూతల్లో, మిత్రుల్లో తేడాలు, ఇవన్నీ వర్ణింపబడినాయి. ద్వితీయా శ్వాసములో వర్ణించిన ఆలింగన విశేషాలు, చుంబన విశేషాలు, దంత క్షత విశేషాలు మొదలగు వాటిలో స్త్రీని అను భవించే పద్ధతులు బోధిస్తూ స్త్రీ ఇటువంటి ప్రక్రియలు లేనిది సంతుష్టిచెం దదు, పురుషుడు అప్రమత్తుడై ఉండాలి అని బోధిస్తూ కామ శాస్త్రమే స్త్రీ మీద విపరీతమైన అనుమానాన్ని పురుషుడికి కలిగిస్తుంది. స్త్రీ జీవి

తమే కామ మయం అనే "శంక"ను పురుషుడి మనస్సులో స్థిరీకృతము చేస్తుంది.

తృతీయా శ్వాసంలో పెండ్లి శాస్త్రోక్తంగా చేసుకోవాలని, అట్లు చేసుకున్న మంచి సంతానము కలుగునని కామ శాస్త్రం చెబుతుంది. అం తేగాక, అమ్మాయికి సంబంధించిన వంశము మొదలగునవి ఈ విధంగా ఉండాలని కామ శాస్త్రం నిర్దేశిస్తుంది.

"వంశము మంచిది కావలెను. కన్నియకు తల్లిదండ్రులుండ వలెను, ఆ పెతనకన్న రెండు మూడేండ్లు చిన్నదిగ నుండవలెను. మంచి యాచారములు కలిగి ధన ధాన్యములు, పాడిపంటలు, చుట్టపక్కములు అన్నదమ్ములు, అత్తమామలు, అప్తులు మెలయుచుండ ఎడ తెగక సాగెడు వంశమున ఉద్భవించి యుండవలెను. పండ్లు, వెంట్రుకలు, కన్నులు, చన్నులు, గోళ్ళు అంతగా కురుచలు, అంతగా దీర్ఘములు కాక తగు రీతిగా నుండవలెను. అట్టి కన్నియను పరిశీలించి తానుగూడా మంచి లక్షణములు కలిగియుండి వివాహమాడ వలెను. ఏ కన్నియను చేపట్టినచోఁ తాను ధన్యుఁడనని తలంప నవకాశ ముండునో, సాటి వారపహసింపరో అట్టి కన్యనే చేపట్టవలెనని కామ శాస్త్రం చెబుతూంది.

ఇంతేగాక ఆమెను పెండ్లి ఆడడానికి ఎన్ని నిబంధనలను పేర్కొం టున్నాడో చూడండి —

"ఇఁక కన్యను వరించు సందర్భమున శకున జ్ఞానము గురుతింప వలెను. వరణ కాలమందు కన్నియ నిద్దురవోవు చున్నను, ఏడ్చు చున్నను, గృహము నుండి వెడలు చున్నను ఆ పెను మానుకోవలెను. అట్టులే ప్రశస్తమైన పేరులేని దానిని, లోపములు మాపుట కయిదా యుంచిన దానిని, లాఁతి వారికీయబడ్డ దానిని, కపిల వర్ణము కలదానిని, మగరాయడుగ నుండు దానిని, దొడ్డికాళ్ళదానిని, లకచియైన దానిని, చెడిన దానిని, మూగ దానిని, చిన్ననాటి నుండి చెలిమి చేసిన దానిని, ఈడుచా లని దానిని, మిక్కిలిగఁజె మటలు వోయుదానిని, జేసికోరాదు. ఏ కన్ని యలకు నక్షత్రములయు. నదులయు, వృక్షములయు పేరులుగానీ, లకార రేఫములు ఉపాంతముగ నున్న పేరులుగాని పెట్టఁబడునో అట్టి వారిని వర్జిం పవలెను. చూపులలో నీ చూపులకు, చిత్తమునకు సమ్మో దము కలుగు కన్నియను చేపట్టవలెను. కావున కన్నియకు ప్రధాన

సమయమున మంచి వేషము ఉంపవలెను. ఆ కన్నియ నిచ్చలు, నగలు లోనగువానిచే అలంకరించుకొని చెలికత్తెలతోగూడి యాడుచునో వివాహాదులందు వీలు చేసికొనియో వరునకు గన్పట్టవలెను."

కామ శాస్త్రంలో చెప్పబడిన ఈ అంశాలన్నింటిలో స్త్రీని పెండ్లిచేసుకోవడానికి కావలసిన అసలు "హృదయం" ప్రస్థావనే లేదు. డబ్బు, నగలు, శకునాలు. వంశాలు తప్ప ఆమెకు హృదయం ఉన్నదన్న సంగతి కామశాస్త్ర కారునికి అవగాహన ఉన్నట్టే లేదు. ఈ భావాలు భారత దేశంలోని అన్ని వ్యవస్థల మీద పెత్తనం చేస్తూనే వున్నాయి.

చతుర్థాశ్వాసములో భార్య భర్తకు చేయవలసిన దాసిత్వమును గూర్చి వర్ణించుచు బహు భార్యల యెడ భర్త ఎట్లా మెలగ వలెనో నుడువుచున్నాడు. భార్యలను తన అధీనములో నుంచుకొనే పద్ధతులను వివరిస్తూ "తన్ను నిందించు నాయక యందు ఆ దోషములనే అంటగట్టి మందలించు చుండవలెన"ని ప్రబోధిస్తున్నాడు. ఈ భావాలు రాచరిక వ్యవస్థకు సంబంధించినవి అయినప్పటికీ అవి ఇప్పటికీ పురుష ప్రపంచము మీద రాజ్యం చేస్తూ వున్నాయి.

పంచమాశ్వాసము చాలావిచిత్రమైనది. పారధారికమనే పేరుతోవున్న ఈ అశ్వాసంలో పరుల భార్యలను ఏ విధంగా వశపర్చుకోవాలో మార్గాలు విశ్లేషిస్తాడు. అంతా వివరించి ఇదంతా ఎందుకు చెప్పానంటే, తమ భార్యలను కాపాడుకోవటానికేనని బుకాయిస్తాడు.

"దొసగులు కొన్ని యువతుల యందు సాజములయి యుండుట జేసి ఆకస్మికముగా అదుష్ట దూషణము కావింపరాదు. అతిగోష్టి, నిరంకుశత్వము,, వల్లభుని స్వైర విహారము. ముందు వెనుక లరయక పురుషులందరితో స్వేచ్ఛగా మెలంగుట, ప్రవాస మందుండుట, విదేశమున నివసించుట, తిండికి-గుడ్డకు భంగము కలుగుట, స్వైరిణులతోఁ జెలిమి సేయుట-పతి ఈర్ష్యాళువగుట. ఇయ్యవి స్త్రీలు చెడిపోవుటకుఁగారణములు.

ఇంతదనుకఁజెప్పిన యోగముల నెవ్వఁడు శాస్త్ర రీతిని గురుతించి ప్రవర్తించునో యాతఁడు తన భార్యల యెడ బలత్వము బొందక బ్రతుకఁగలడు. ఇందలి యోగములు కొన్ని పాక్షికములై యుండును.

అందును అపాయములు పెక్కులు కానుపించుటను ధర్మార్థములకు పై లోమ్య మేర్పడుటకు వీలుండుటను పారదారకము పనికిరాదు. కాఁగా నియ్యది తమ భార్యలను గాపాడు కొనుటకును, శ్రేయః ప్రాప్తికిని మాత్రమే యుపకరించును. అంతియగాని ప్రజలలోఁబరస్పర భార్యల విషయమై అల్లకల్లోలము లేర్పడుటకై యియ్యది యారబ్ధము కాలేదని యెఱుంగునది."

భార్యలను ఎన్నో బంధనాలతో బంధిస్తేనే గాని కాపాడుకోలేమని ఈ అశ్వాస సారాంశముగా తెల్పాడు. అశ్వాసంలోన మాత్రం ఇతరుల భార్యలను ఆకర్షించే పద్ధతులను వివరించాడు. స్త్రీలు డబ్బుకు, అందానికి, డాంబికమైన మాటలకు, రకరకాల వికారచేష్టలకు లొంగిపోయేవారు అనే భావనను కలిగించడానికి ఈ అశ్వాసం తోడ్పడుతుంది తప్ప మరొక భావం కలగదు. ఈ "పారదారికం" మీద సాంప్రదాయులైన విమర్శకులు కూడా భిన్నమైన అభిప్రాయాలు వ్యక్తం చేశారు. చివరకు యీ అంశాన్ని సమర్థించడానికే పెక్కురు ప్రయిత్నించారు. సంస్కృత వాఙ్మయ చరిత్ర వ్రాసిన మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు యీ భాగం మీద తన అభిప్రాయాము యీ విధంగా తెల్పుచున్నాడు —

"లోకమున కామాంధులై పర భార్యల నభిలషించువారు చేయు నట్టి వివిధములైన యుపాయములను, వారి చేష్టలను జూపించిన యీ భాగము చదివిన వారికి పంచదార సమాగమాభిలాషకంటె స్వభార్యా సంరక్షణాభిలాషయే యధికము కాకపోదు. అది గాక, యే శాస్త్రమైనను మంచిని బోధించుటకు ప్రయుక్తమైనది గాని చెడ్డను బోధించుటకు కాదు. అట్టియెడ ప్రాణికోటికి సహజమైన కామము ధనాధికార బల మత్తులయెడ దారి తప్పి యందందు విజృంభించుట యను దోషము లోకమున పృథ్వ్యాధి సిద్ధమై వచ్చుచుండ, గార్హస్థ్యము త్రివర్గ సాధనముగా నుపదేశింప బూనిన వాత్స్యాయనముని దోష వివరణమున అట్టి చెడ్డ నడఁగించుట కుద్దేశించెనన వలెనుగాని, ప్రత్యక్షమైన యాదోషమునే గుణముగా వర్ణించెనన వచ్చునా? అట్లయినా స్త్రీ పురుష శీలములను, భావ పరీక్షను, భార్యాధికారికమును, త్రివర్గ ప్రతిపత్తిని వర్ణించిన యీ ముని అభిప్రాయ మేమైయుండును? అందుచే గ్రామమునకు సంబంధించిన యెల్ల విషయములను విశదీకరించు నీ శాస్త్రమండలి యీ ప్రకరణము

సందర్భోచితమై లోకజ్ఞాన దాయకమగు చున్నదనియే విశ్వసింపనగును. అయినా, ఈ శాస్త్రము లౌకిక విద్యా నిష్ణాతులగు విద్వాంసులెవరికి వారు చదువుకొనదగియున్నది గాని, శిష్యులకు పాఠము చెప్పతగినది కాదని మాత్రము నా అభిప్రాయము. విశదీకరించి చెప్పుటకు సిగ్గు కలిగించు సందర్భము లిందుండుటయే యందుకు కారణము."

(—సంస్కృత వాఙ్మయ చరిత్ర ద్వితీయ సంపుటము
పేజి 194. 195)

ఈ అభిప్రాయంలో వాత్స్యాయనుణ్ణి సమర్థించడానికే ప్రయత్నం జరిగింది. పెక్కురు విమర్శకులు ఇప్పటికి ఇట్టి అభిప్రాయములను, గ్రంథములను సమర్థిస్తూనేవున్నారు. "భార్య"ను అనుమానించటమనే దుష్టవ్యాధి భారతీయుల నరనరములకు పాకుటకు ఇట్టి శాస్త్రములే ఆధారములు.

'వైశిక' పేరుతోఉన్న ఆరవ ఆశ్వాసంలో వైశ్య అనే ఒక తెగను సృష్టించి వారికి విటులను వశపర్చుకొనే విద్యలను నేర్పి వేశ్య అనే భోగ వస్తువుకు జీవితంలేదు నటనతప్ప అని అనేక పట్టుల నిగదిస్తున్నాడు.

'ఔపనిషదకము' అనే పేరుతోవున్న ఏడవ ఆశ్వాసములో పురుష వశీకరణ ఔషధాలు, స్త్రీ వశీకరణ ఔషధాలను తెల్పుచూ, స్త్రీలు పురుషులను హావభావాదులచేతనేగాక ఔషధాలతోకూడా వశపర్చుకోవచ్చు అని ప్రబోధిస్తున్నాడు. అందులో పేర్కొనిన ఔషధ ప్రయోగాలను నమ్మి ఎంతమంది రోగగ్రస్తులయ్యారో? ఈవిధంగా అశాస్త్రీయమైన ఊహాత్మక భావజాలాన్ని శాస్త్రంగా రూపొందించిన వాత్స్యాయనుడు 'స్త్రీ' విషయంలో అన్నీ అభూతకల్పనలు కల్పించి, ఆమెను భోగవస్తువుగా నిరూపించి, ఆమెపై విపరీతమైన అనుమానాలను రేకెత్తించి, ఆమె కామ స్వరూపిణి తప్ప మరొకటి కాదను భావమును కల్పించి పురుషుణ్ణి నిత్యశంకితుడుగా మలచి, స్త్రీకి హృదయం లేకుండా చేసి ఈనాటికి పురుషులభావ ప్రపంచం మీద తనపెత్తనాన్ని కొనసాగిస్తున్నాడు. ఇదిగొప్ప శాస్త్రమని అన్నిభాషల్లోకి అనువదించబడి పాశ్చాత్యులు సహితం "ఓహో" అన్న గ్రంథమని విమర్శకులు నుడువుతున్నారు. వ్యాపార రచయితలు

దీనిలోని భావజాలాన్ని అనేక కోణాల్లో ప్రచారంచేసుకొంటూ ధనార్జనగా విస్తున్నారు. భారతీయ భాషల్లో వ్రాయబడిన కావ్యములు. ప్రబంధ ములన్నిటిమీద ఈ వాత్స్యాయనుడి గ్రంథ ప్రభావం ప్రగాఢంగావుంది.

ఈ గ్రంథాన్ని అనుసరించి వచ్చిన కొక్కోక కవి వ్రాసిన 'రతిరహస్యం' దత్తక సూత్రం, కూచిమార చంద్రం ఇవన్నీ వాత్స్యాయనానుసరణములే. ఈ శాస్త్రములలో శాస్త్రీయత లేకపోగా, సమాజాన్ని ప్రక్కదారి పట్టించి, మానవాభ్యుదయానికి విఘాతమును కల్పించుచున్నవి. ఈ గ్రంథాలన్ని స్త్రీని వ్యాపార వస్తువుగా చిత్రించిన పితృస్వామిక వ్యవస్థ యొక్క వికృత రూపాలు. ఆర్య సంస్కృతి యొక్క దుష్టనీతికి ప్రతిబింబాలు. మరి ముఖ్యంగా "స్త్రీ" విషయంలో ఈ గ్రంథములు ప్రచారం చేస్తున్న అవాస్తవ సమాచారాన్ని శాస్త్రీయ దృక్పథం నుండి ఖండించి, స్త్రీ మానసిక ఔన్నత్యాన్ని ప్రకటించే భావజాలాన్ని సామాజిక పరిణామ క్రమంలో చారిత్రక అవగాహనతో స్త్రీ వ్యక్తిత్వాన్ని నిరూపించే శాస్త్ర గ్రంథాలను వెలుగులోకి తీసుకురావాలి. ఆ ప్రయత్నములో స్త్రీ విముక్తి ఉద్యమకారులు సఫలీకృతులు కావాలి.

ఈ వ్యాసములోని కొటేషన్లు కొత్త సత్యనారాయణ చౌదరిగారి అనువాద గ్రంథము నుండి తీసుకొనబడినవి.

# నిఘంటువులు - స్త్రీ

నిఘంటువుల్లో స్త్రీకి అనేక పర్యాయ పదాలు వున్నాయి. విస్తృతార్థాల్లో, ఆలంకారికార్థములలో వికృతార్థాల్లో, విపరీతార్థాల్లో అనేక పదాలు ఉద్భవించాయి. మరిముఖ్యంగా సంస్కృత నిఘంటువుల్లో స్త్రీకి బహుముఖార్థాలు ఇవ్వబడినాయి. ఇవన్నీ పరిశీలిస్తే స్త్రీ శబ్దానికి పర్యాయ పదాలు ఎన్ని కోణాలనుండి ఉద్భవించాయో మనకు సుబోధకమవుతుంది. దీనిని బట్టి ఒక సంస్కృతిలో స్త్రీని గురించి ఎన్ని పదాలు పుట్టాయో మనం అవగతము చేసుకోవచ్చు.

## సంస్కృతంలో

స్త్రీ - యోషిత్ - యోషితా - అబలా - యోషా - జోషా - నారీ - సీమన్తినీ - వధ్వా - ప్రతీపదర్శినీ - వామా - వనితా - మహిళా - రామా కల్యా - మండయంతీ - పరిగృహ్యా - వధూటీ - వధుటి - సుప్రతిమా.

## ఆంధ్ర భాషలో స్త్రీకి పర్యాయ పదాలు, రూప భేదాలు

బోణి - బోటి - బోడియ - చేడియ - చేడె - ప్రోయాలు - పడుదల - పైదలి - పొలంతుక - పొలుతుక - పొత్తిక - పొలతి - పొలితి - పొల్తి - అతివ - తొయ్యలి - తెఱవ - అన్నువ - అన్ను - కోమలి - కోమ - లేమ - చాన - చామ - నవలా - నాటుక - నాతి - గోతి - గొంతి - నెలత - నెలతుక - నెలందుక - పడతుక - పడతి - మడతి - సకి - సకియ - చెలువ - చెలియ - చెలి - చెల్వ - మెలత - మెలతుక - మెల్తుక - మెల్త - ముగుద - ఎలనాగ - ఉగ్మలి - బిత్తరి - ఇంతి - కలికి - కల్కి - మగువ - ఉవిద - కొమ్మ - జోటిక - వెలది - వలతి - ఆడుది - ఆడది - ముద్దుగుమ్మ - గోల - బోటి - తెఱవ - ముదిత.

## సంస్కృత భాషలో అనేకార్థాల్లో స్త్రీ పదం

అంగనా = మంచి అంగము గలది
భీరుః = భయము గలది
కామినీ = మిగుల కామము గలది
వామలోచనా = మంచి కన్నులు గలది
ప్రమదా = మిక్కిలి మదము గలది
భామినీ = శృంగార చేష్ట గలది
మానినీ = ప్రణయ కోపము గలది
కాంతా = మిక్కిలి చక్కనిది
లలనా = వేడుక గలది
నితంబినీ = గొప్ప పిరుదలు గలది
సుందరీ = రూప లావణ్యము గలది
రమణీ = రమింప జేయునది
రమా = సుందరమైనది
వరాంగనా = అతి ప్రశస్తాంగ యుక్తనారి
మదిరాక్షి = మదోదగ్రా - తలోదరీ - ముఖ్యా - రాగిణీ
(ఇవి శృంగార పరముగా వాడు శబ్దాలు)
కచ్చురా = కరురాలైన స్త్రీ

## ఆంధ్ర భాషలో విశేషార్థాల్లో స్త్రీ పర్యాయ శబ్ద ప్రయోగం

చిగురు బోణి - చిగురు బోఁడి - ఇగురు బోఁడి - తలిరు బోఁడి - తీఁగె బోఁడి . పుఁవు బోఁడి - పువ్వాఁరు బోఁడి - పూవుఁ బోడి - విరి బోఁడి - పూఁ బోఁడి - ఇంచుఁ బోఁడి - లియ్యఁ బోఁడి - నన బోఁడి - మింఁచు బోఁడి - మెరుఁగు బోఁడి - తొగకంటి - కలువకంటి - కల్వకంటి- కాలుకంటి - క్రాల్గంటి - వాలుగంటి - వాల్గంటి - చిలకలకొలికి - మిటారి- టిక్కులాడి - ఒప్పులాడి - కీల్బొమ్మ - జాళువా బొమ్మ - పొన్నికొమ్మ- గచ్చురాలు - రంపెలాడి - పింజారి - ప్రామిడి - కట్టిడి - బంకెత-గద్దరి- అన్నెకారి మొదలగునవి

## సంస్కృతంలో అనేకార్థాలు

మరుండా - మరుటా - ఉచ్ఛల లాటిక = ఎత్తయిన నొసలుగలది

పాళిః = మీసాలు గల స్త్రీ

పాలీ = నరమాలినీ - నరమానినీ - సశ్మశ్రుః = గడ్డము, మీసము గల స్త్రీ.

అటకీ = స్థనాది స్త్రీ వ్యంజనములు పుట్టని స్త్రీ

వికటా = దొడ్డికాళ్ళు గల స్త్రీ

సంహికా = వంగిన మోకాళ్ళు గల స్త్రీ

వృషతా = బొల్లి గల స్త్రీ

కాలికా = గూని కన్య

దూషికా = కోపనా - క్రోధనా

భామినీ = చండి = కోపము గల స్త్రీ

రోహిణికా = కోపాదుల చేత రక్త వర్ణమైన స్త్రీ

మధుస్వనా, హంసగద్గదా = మధుర స్వరము గలది.

వరారోహా, మత్తకాశినీ, మత్తకానిని, ఉత్తమా, వరవర్ణినీ, నాభిలా, జానిః, కమలా = ఉత్తమ స్త్రీ

శ్రీమతి = భాగ్యశాలినియైన ఆడుది

శ్రీయమ్మన్యా = తనను లక్ష్మినిగా తలంచునది

మహిషీ, రాజ్ఞి, శుద్ధాంత, మహాదేవి = రాణి

భోగిన్యః — దేవ్యః = పట్టపుదేవి కంటె తక్కిన రాజ స్త్రీలు

వావాతా = రాజుయొక్క రెండవ భార్య

పరివృక్తిః = రాజుయొక్క మూడవ భార్య

పాలాకిం = రాజుయొక్క నాల్గవ భార్య

గణికాః = పెండ్లి చేసికొనక సంగీతాది కళలచే రాజులను మెప్పించువారు.

ప్రగణికాః = రాజు ఉంపుడుగత్తె

గ్రామయో = పల్లెటూరి పడుచు

పత్ని - పాణిగ్రహీతా
ద్వితీయా - సహధర్మచారిణీ
భార్యా - జాయా
గృహిణీ - గేహినీ
కుల్యా - జనీ
పరిగ్రహః - దారాః } భార్యా
క్షేత్రం - కళత్రం
గేహం - గృహం
జానిః - సహచరీ
పాలుషీ - వధూః

ఆంధ్రంలో

ఆలు - ఆలి - ఇల్లాలు - ప్రోయాలు - పెండ్లాము - పెండ్లము - రాణి

సంస్కృతంలో

కుటుంబినీ - పురంధ్రి = గృహిణీ - గేహస్తురాలు

కృతసాపత్నికా
అధ్యూఢా } పెద్ద పెండ్లాము
అధివిన్నా

సపత్ని
సుచరిత్రా
సతీ
సాధ్వీ
పతిపత్ని } పతివ్రత
ఏకపత్ని
పతివ్రతా
ఆర్యా
మనస్విని

ఊర్మిలా = భర్త చేత విడువబడిన పతివ్రతయైన స్త్రీ

స్వయంవరా
పతి-వరా } తనంతటనే మగని వరించు స్త్రీ
వర్యా

వల్లభా
ప్రేయసీ
ప్రేష్టా
ప్రియా
దయితా } ప్రియురాలైన పెండ్లాము
రమణీ
ఇష్టా
ప్రణయినీ
అచండీ

ప్రియా }
అంటు కత్తియ - అంటుకత్తె
నంటుకత్తె - ననుపుకత్తె
నేస్తకత్తె - నేస్తకత్తియ్య
నేస్తురాలు - నెయ్యురాలు
నెయ్యరి - నెచ్చెలీ
పొత్తెకత్తె - సంగాతికత్తె - సంగాతికత్తియ

## పెండ్లికాని అమ్మాయికి సంస్కృతంలో, తెలుగులో

| సంస్కృతంలో | ఆంధ్రంలో |
| --- | --- |
| కన్యా<br>కన్యకా<br>కుమారి<br>అలకనంద<br>వరదా | కన్నె - కన్నియ - కన్య<br>పిల్ల - పడుచు<br>చిన్నది - పిన్నపాప<br>ఆడుపాప - అమ్మి<br>అమ్మాయి |

గౌరి
నగ్నికా
అనాగతార్తవా } సమర్తాడని పడుచు

## ముప్పది ఏండ్లకు లోబడిన వయస్సుగల స్త్రీకి సంస్కృతంలో, తెలుగులో

| సంస్కృతంలో | ఆంధ్రంలో |
| --- | --- |
| తరుణీ - తలునీ<br>యువతిః - దిక్కరి<br>ధనికా - కాహలి<br>చరీ - శ్యామ<br>వధూటి | జవరాలు - జవ్వని<br>గుబ్బెత - గుబ్బలాడి<br>చామ - పడుచు<br>పోటి - కొమరెత<br>కొమరాలు - కొమరె |

కూకుః = ఎనిమిది సంవత్సరముల ఈడుగల కన్య
రోహిణి = పెండ్లికాని తొమ్మిది ఏండ్ల వయస్సుగల స్త్రీ
మహోదయ = ఎదిగిన కన్య

పరకీయ
పరపుష్టా } పరుని భార్య

కూర్పా = స్వస్త్రీ

సూర్యా
నవపరికా
నవవారికా
నవోఢ
వధూః } క్రొత్తగా పెండ్లయిన స్త్రీ

సువిదల్లా )
ఊఢా ) పెండ్లైన స్త్రీ

స్నుషా )
జనీ )
వధూః ) కోడలు
వధూటీ )

చిరుటీ )
చిరంటీ ) పేరంటాలు
సువాసినీ )

స్వవాసినీ = పుట్ట నిండనున్న స్త్రీ

ఇచ్ఛావతీ )
కాముకా ) ధనాదులందు ఆశగల స్త్రీ

వృషస్యంతీ )
కాముకీ ) వలపుకత్తె

అంజనీ )
లేపకామినీ ) గంధము మున్నగునవి పూసుకొను స్త్రీ

ప్రావణికా )
ధృష్టా ) సాహసికురాలగు కన్య

విగతా = అన్యాసక్తయైన స్త్రీ

వశకా = వశ్యురాలైన స్త్రీ

వాంఛినీ = వాంఛింపదగిన స్త్రీ

శరభా = శిథిలాంగియగు కన్య

వికలా = రోగయుక్తయగు కన్య

నిఘవిష్టా = వికలాంగియగు కన్య

ప్రసభా )
నిరిణా )
మీఢా ) సిగ్గులేని స్త్రీ
ధర్షణి )
నిర్లజ్జా )

చర్షణీ - బంధకీ - అసతీ )
కులటా - ఇత్వరీ - స్వైరిణీ )
పాంసులా - వాంఛినీ - లంజికా )
ముక్తా - సృర్మా - ఖిలా ) బంకులాడి
శంబరీ - వ్యభిచారిణి - కలతూలికా )
జారిణీ - ఛిణ్ణా )

ఇదే అర్థంలో ఆంధ్ర భాషలోని పదాలు

అంకెత - బంకులాడి - అంకువాలు - అంకుబోతు - అంకువాలి చెడివ - చెడిపె - అండగది - ఆసగలది - గుడిసెవాటు - చెడ్డ తొయ్యలి - జరభి - తిరుగుబోతు - నుపుకత్తె - ననపుగూటి - బజారి - బసవి - మిండత - మిండకోర - మిండలకోర - మిండలకోరి - మిండలితాగ - వాడవదిసె - విటకత్తె - విటుకులాడి - తెలిచొరవరి - దిచ్చరి - వెల్లాటపత్తియి వెల్లాడకత్తె - వేడుక కత్తియ - వేడుక కత్తె - పొగసుకత్తె.

కూతురు అనే అర్థంలో సంస్కృతంలో, ఆంధ్ర భాషలో

| సంస్కృతంలో | | తెలుగులో |
| --- | --- | --- |
| ఆత్మజా | | కూతు |
| తనయా | | కూతురు |
| తనూజా | | కొమరిత |
| సూనుః | | కొమారిత |
| సూతా | | కొమారితె |
| పుత్రీ | = | కొమార్త |
| పుత్రికా | | కొమర్తె |
| కుమారీ | | కుమారి |
| నందనా | | బిడ్డ |
| దుహితా | | పట్టి |

పైమాత్ర = సవతి తల్లి కూతురు

ఈ విధంగా స్త్రీకి సంబంధించిన అర్థాలు ఇచ్చుకుంటూపోతే ఇదొక మహాగ్రంథం అవుతుంది. పితృస్వామిక వ్యవస్థలో స్త్రీపై పురుషాధిపత్యం నెరిపే క్రమంలో అనేక పదాలు ఉద్భవించాయి. కొన్ని పదాలు రాచరిక వ్యవస్థలో బహుభార్యత్వంలో జనించాయి. కొన్ని స్త్రీని వేశ్యగా చిత్రించి, ఆమెను హేళన చేసే పద్ధతిలో ఉద్భవించాయి. కొన్ని పదాలు స్త్రీ అంగిక వర్ణనను ఉద్దేశించి ఉద్భవించాయి. కొన్ని వ్యుత్పత్యార్థాన్ని కలిగి వున్నాయి. కొన్ని రూఢ్యర్థంలో వున్నవి. కొన్ని అలంకారిక సమాస పదాలు కుడా వున్నాయి. కొన్ని పదాలు చారిత్రకంగా జనించాయి. కొన్ని వ్యవహారిక భాషా ప్రవాహంలో జనించాయి. ఈ భాషా విస్తృతి వలన మనకొక విషయం సువ్యక్త మవుతోంది. భారతీయ సాహిత్యం "స్త్రీ" మీదే వ్యాప్తమైంది. అయితే అందులో స్త్రీని గౌరవపరచే దానికంటే న్యూనత పరచిన భాగాలే ఎక్కువ. ఒక్క స్త్రీకే కాదు. "స్త్రీ" దేవతలకైతే ఈ పద బాహుళ్యం మరీ విపరీతం. ఒక రిద్దరిని పరిశీలిద్దాము.

## లక్ష్మి

సంస్కృతంలో

లక్ష్మీః - లక్ష్మీ - పద్మాలయా - పద్మా - కమలా - శ్రీః - హరిప్రియా - ఇందిరా - ఇందీ - ఇందిః - లోకమాతా - ఋ॥మా - రమా- మంగళదేవతా - భార్గవీ - లోక జననీ - క్షీరసాగర కన్యకా - జలధిజా- సారసా - చలా - నారాయణీ - హేమా - లంజా - మంగా-మవియాలా- సీ॥ఈః - ఈ సీః క్షీరోదసుతా - అబ్ధిజా - పద్మవాసినీ - పద్మప్రియా - పద్మలాంఛనా - విశ్వజననీ - క్షీరోదజా - హరివల్లభా - పద్మవాసా - రమామాధవీ.

(ముందు వారి వర్గములో జెప్పబడ గల పద్మముల పేర్లను కొన్నింటిని పద్మా - కమలా - సారసా అను మాదిరి స్త్రీ లింగములనుగా చేసి లక్ష్మికి పేళ్ళనుగా జెప్పవచ్చును. పైజయన్తీ నిఘంటువు నందు లోకపాలధ్యాయములో లక్ష్మి నామముల జెప్పి "స్త్రీ లింగాశ్చాంబు

జాహ్నవ్యయోః" అనియు, పర్యాయ సంయోగ న్యాయ ప్రదర్శనార్థ్యా యము నందు "మాక్షికేక్షీ, స్త్రీయో లక్ష్మ్యాం నరః పద్మస్యే సారసీ" అనియు చెప్పబడిన పర్యాయ సంయోగ న్యాయమును ననుసరించి)

ఆంధ్రంలో

లచ్చి _ పై॥ లక్కిమి - పై॥ కలుములబోటి _ కలుముల జవరాలు పచ్చవిల్తుని తల్లి - వెన్నుసెదకొమ్మ _ వెన్నునిరాణి కరివేల్పునిల్లాలు _ ననవిల్తు తల్లి - వలరాజుతల్లి - తల్లితల్లి - (పా) తాతతల్లి _ కడలి కూతురు - పాలయుబ్బు సంద్రపు కూతురు - సిరి - పై॥ అచ్చిగుబ్బెత - లిబ్బిపడంతి - కమ్మతమ్మిబిడారు - గరితమిన్న - తమ్మియింటిగరిత - కలుములచెలి - పాల్కడలి కానుపు - జిడ్డుకడలిబొట్టియ _ తమ్మిగద్దియ బోటి - తామరబిడారు - చెలంతుక - పెనిమిటి యెదనుండు ననబోడి _ మరుతల్లి - నెలచెల్లెలు _ నెలచెలియలు - కలువలతేనితోడు _ సత్తి సె చ్చెలి - పంటవలంతి తోడికోడలు - పల్కులచెలియత్త - మగని పేరెద నున్న వగలాడి _ తత్స - కమల (అ) - లక్ష్మి - శ్రీ - (ఈ) లోక మాత - (ఋ).

## పార్వతి

సంస్కృతంలో

ఉమా - కాత్యాయనీ - గౌరీ - పార్వతీ - కాళీ _ శ్యామలా_హైమ వతీ - ఈశ్వరీ - ఈశ్వరా - శివా _ భవానీ - రుద్రాణీ _ శర్వాణీ - మృ డానీ - శాంభవీ - మంగళా - సర్వమంగళా _ కల్యాణీ - శుభంకరీ- అపర్ణా - దుర్గా - చండికా - చండీ _ అంబికా - ఆర్యా - దాక్షాయణీ _ దక్ష కన్యా - గిరిజా - మేనకాత్మజా - శక్తిః - సింహరథా - సతీ-హిండీ_వారా లికా _ శిఖరవాసినీ - కోట్టవీ - బాభ్రవీ _ కైటభీ _ కైటభా _ యాదవీ - కర్పూరీ - భ్రామరీ - బహిర్ధ్వజా - కాలంజరీ - శైలేయీ _ గణనాయికా_ ఏకానంశా - దృషద్వతీ - తామసీ - గౌతమీ _ ఈశానీ - ఈశీ _ రౌద్రీ _ అద్రిజా - మహాదేవీ - రేవతీ - షష్ఠీ - హిమా - శతముఖీ - యోగినీ_

పరమేష్ఠినీ – సునన్దా – నన్దినీ _ నన్దా నన్దయన్తీ - కలాపినీ_కాలరా త్రీ– రక్తదన్తీ – ఏకపాటలా – ఏకపర్ణా _ భద్రకాలీ – మహాకాలీ _ కరాలికా– వింధ్యవాసినీ మందరవాసినీ – కాంతారవాసినీ – మలయవాసినీ.

ఆంధ్రంలో

కలికంఠునిల్లాలు _ కలికంఠురాణి _ ముక్కంటి వెలది – అగ్గికను వాని సెలతుక – గట్టు రాచూలి - గట్టాచూలి – గట్లరాయనిపట్టి _ వలి మల కూతురు - ఏనుగుల గొంగతత్తడి నెక్కుదంట – సింగపు దీంజిగల చాన _ సామి సామేని జేకొన్నచాన – సింగము నెక్కుదంట – జంగము తల్లి – గట్లరేనిబిడ్డ – గట్టురాకొమరిత – కలిచేడియ – కప్పు ముత్తయి దువ _ కప్పుటిల్లాలు – మగని యందపు మేనదగిన మగువ – పెనకయ్య తల్లి – సామితల్లి – సత్తి – పై॥ లచ్చిమెచ్చిలి కల్వల దొరదారి – పెని మిటి సామేన బెనగొన్న గేస్తురాల్ – సామిమెయి పాల్గాను ముద్దియ _ దుగ్గ – పై॥ దుగ్గి – పై॥ అమ్మిక – పై॥ బూచుల దొరసాని – మల యమ్మ – జిగిబొచ్చిమెకము జిక్కిగల కొమ్మ – కొదమ సింగమెక్కు కొన్నజింత – పుడమి తాలుపుల రాబిడ్డ.

తత్స – ఉమ - (అ) శక్తి (ఇ) గౌరి (ఈ)

ఇందులో అనేకమైన అర్థాలొచ్చే పదాలు ఉన్నాయి. సామాన్య స్త్రీల కంటే దేవతలకు ఇంకా ఎక్కువ పేర్లు పెట్టారు. అందులో భీకర అర్థాలు, భయ కంపితమైన అర్థాలు శృంగార పరమైన అర్థాలు ప్రక టించే పేర్లు ఎన్నో ఉన్నాయి.

ఇంతేగాక సర్వ నామాల్లో కూడా స్త్రీని అనేక విధాల పిలిచారు. ఒక్కతే అనటానికి ఎన్ని రకాలుగా స్త్రీని పిలిచారో ఇక్కడ చూడండి.

| | | | | |
|---|---|---|---|---|
| ఒకరిత | ఒకర్త | ఒకర్తు | ఒకర్తుక | ఒకత |
| ఒకతుక | ఒకొరిత | ఒకొర్త | ఒకొర్తు | ఒకొర్తుక |
| ఒకొక్కత | ఒకొతుక | ఒకక్కరిత | ఒకక్కర్త | ఒకక్కర్తు |
| ఒకక్కర్తుక | ఒకక్కత | ఒకక్కతుక | ఒకొక్కరిత | ఒకక్కర్తి |
| ఒకొక్కర్తు | ఒక్కొర్తుక | ఒక్కొత | ఒక్కొతుక | |
| ఒకరితి | ఒకర్తి | ఒకతి | ఒకొరిత | ఒకొర్తి | ఒకొతి |

ఒక్కరితె ఒక్కర్తె ఒక్కతె ఒక్కొరితె ఒక్కొర్తె
ఒక్కొతె ఒకరితె ఒకర్తె ఒకతె ఒక్కొరితె
ఒకొర్తె ఒకొతె ఒక్కరితె ఒక్కర్తె ఒక్కతె
ఓక్కొరితె ఓక్కరితె ఒక్కర్తె ఓక్కొర్తె
ఓక్కతె ఓర్త ఓర్తె ఓర్తు ఓర్తుక

## ఎవతె అనడానిక

ఎవ్వరిత ఎవ్వర్త ఎవ్వత ఎవరిత ఎవర్త ఎవత
ఎవ్వర్తె ఎవ్వతె ఎవర్తె ఎవతె ఎవ్వరితె ఎవర్తె
ఎవ్వతె ఎవరితె ఎవతె ఎవర్తుక ఎవ్వతుక ఎవర్తుక
ఎవతుక అని ప్రయోగించినారు.

తెలుగు కవులలో అద్వితీయమైన ప్రతిభగల తిక్కన స్త్రీని గురించి ఈ విధమైన ప్రయోగాలు చేశాడు.

పూఁబోఁడి :-- కోడలుగాక పూఁబోఁడి యిట్లు దెరువె పోయిపోయి
విరాట 6-64

చేఁడియ :— తోడి తెమ్మనినఁ జేడియ సమ్మదమంద క్రమ్మఱన్
విరాట పర్వం 6-20

ఇంతకు మున్నిచ్చేడియ మెలఁగు విరాట పర్వం 1-250
చేడియ నీకును చెనుఁదరిగె. విరాట పర్వం 2-156
సవిస్తరంబుగా నచ్చేడియ చెప్పినవిని ఉద్యోగ పర్వం 4-208

అమ్ముద్దియ :— అల్ల నెత్తియమ్ముద్దియఁద డవి కన్నునీరుదుడిచి యతడు విరాట పర్వం 5-120

అమ్ముద్దయకు :— ఇట్లు శృంగారంబు చేసిన అమ్ముద్దయకు ముక్త ఫలప్రాలంబ మాలికల విరాట పర్వం 5-358

(తిక్కన పద ప్రయోగ కోశము - ప్రథమ ద్వితీయ తృతీయ సంపుటాలు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ - 1971)

ఇంకా కొన్ని అర్థాల్లో స్త్రీ

తెలుగులో

బూమెకత్తె
బూమెకత్తియ } అసత్యము కల స్త్రీ
బూమెలాడి

పొలసురాలు
పెడసరకట్టె } మూర్ఖురాలు
మోటడకత్తె

బంకెత = బుద్ధురాలు

గట్టివా = గట్టిగా మాట్లాడునది

చివ్వలాడి = కలహశీలురాలు

కోహలీ = ఎక్కువ దుర్భాషలాడు కన్య

కట్టడి = కఠినురాలు

సిగ్గరి
సిగ్గరి కత్తియ
సిగ్గరికత్తె } సగ్గరికత్తె
సిబ్బితికత్తె
పుచ్చడీక

అనాద
అనద
ఆలకి
కుంక
కుంకి
తెంపి } పెనిమిటి లేని స్త్రీ
ముండ
మోపి
ముండమోపి
ముసుకు
ముసుగు

మగనాలు
ఐదువరాలు
అయిదువరాలు
ఐదువ
అయిదువ
ముత్తై
ముత్తో
ముగతి
క్రొత్తడి
మిక్కిణ
} ముత్తైదువ

ఒప్పులాడి
అందకత్తియ
అందకత్తె
సొగసుకత్తె
రూపసి
ఒయారి
ఓయారి
ఒయ్యారి
ఒయ్యారికత్తె
రూపరి
} అందకత్తె

**క్రింది కులాల స్త్రీలను పిలిచిన తీరు**

| సంస్కృతంలో | ఆంధ్రంలో |
|---|---|
| రజకీ | చాకిత |
| చండాలీ | మాలెత |
| మాతంగీ | పల్లెత |
| శబరీ | బోయెత |
| కిరాతీ | ఎఱుకత |

## బ్రాహ్మణ స్త్రీని పిలిచిన తీరు

| సంస్కృతంలో | ఆంధ్రములో |
|---|---|
| బ్రాహ్మణీ | బాపత |
| | బాపనిది |
| | బాపనక్క |
| | పాఱుటక్క |
| | పాఱుత |

మహాచకమ్మ = స్త్రీ, పురుషుల లక్షణములు గలది

## దానికి పర్యాయ పదాలుగా వాడినవి

| సంస్కృతంలో | ఆంధ్రములో |
|---|---|
| దాసీ | బోనకత్తియ - బోనకత్తె |
| పోటా | దాసిస - దాసిసె |
| చేటికా | గులాము - గుల్లాము |
| చేటా | పాచిక - పాదకి |
| వడవా | పారిక - పాతొత్తు |
| కుంభధాంకా | వరవడు - వరపు |

## వేశ్యకు సంస్కృతంలోను - ఆంధ్రంలోను వాడిన పర్యాయ పదాలు

| సంస్కృతంలో | ఆంధ్రంలో |
|---|---|
| వారస్త్రీ - వారవాణిః | లంజె - లంజ - లంజియ |
| పణ్యస్త్రీ - గణికా | లంజెత - వెల్లాటకత్తె |
| వేశ్యా - రూపాజీవా | వెలయాల్ - వెలయాలు |
| భుజిష్యా - దాసికా - దాసీ | వెల వెలది - బోగముది |
| అలజ్జికా - విలాసినీ | బోగము చాన - బోగము లేమ |
| కామరేఖా - స్మరవీధికా | నటి - వెలది - పడుపుది |
| పరపుష్టా - సర్వవిల్లభా | పడుపుగొమ్మ - పడుపుజేడియ |
| సురా - మంజికా | పడుపుకత్తియ - రోచెల్వ |

| | |
|---|---|
| చర్షణీ - గ్రామణీః | రో వెలది - పొత్తుటాలు |
| కణేరా - కణేరుః - గణొ౦ః | వేడుక కత్తియి - వేడుక చెలి |
| ఝాలా - ఝర్ఝరా - బర్ఘటీ | వేడ్కకోమ - వేఱుపు బానిప |
| ఝచ్ఛరా - వర్చటీ - ఝంఝా | మానికదారి - లయ్యా |
| ఖండహాసినీ - భోజ్యా | తౌత్తు - సాని |
| పింగళా - రూపజీవనా | గడనకత్తె - గడనపడతి |

లింగాభట్టీయములో ఈ విధంగా ఉన్నది

స్త్రీ యోషి దబలా యోషా నారీ సీ మంతి నీ వధూః
ప్రతా పదర్శినీ వామా వనితా మహిళా తథా ।

స్త్రీ శబ్దము మొదలు ౧౧ సామాన్యముగా స్త్రీలపేళ్లు॥ స్త్యాయతి సంఘాతో భవత్యర్యాంగ గర్భ ఇతి స్త్రీ * స్త్యైష్ట్యై శబ్ద సంఘాత యోః। దీనియందు గర్భము కూడునది ॥పా॥ యోషితా ॥గోపా॥ శ్లో॥ స్త్రీ వధూర్యోషితా రామేతి త్రికాండ శేషః॥ ౨॥౪॥ అల్పం బలమస్యాః అబలా- అల్పార్థనఞ్ఞ। అల్పమైన బలము గలిగినది ॥౩॥ నృణాతిన యతిస్వ వశం పురుషమితి నారీ ॥సీ॥ నృనయే । పురుషుని స్వవశము బొందించుకొనునది ॥౫॥ సీ మంతం కేశవీధీ అస్యా ఇతి సీమంతినీ ॥సీ॥ సీమంతమనంగ పాపట-అది గలిగినది ॥౬॥ ఊహ్యతే భర్త్రేతి వధూః॥ ఊ-సీ॥ వహప్రాపణే। పురుషుని చేత వహింప బడునది ॥౭॥ ప్రతీపం వక్రం ద్రష్టుం శీల మస్యా ఇతి ప్రతీ పదర్శినీ ॥సీ॥ వక్రముగా జూచునది ॥౮॥ వామత్వేన వక్ర స్వభావత్వేన రమ్యత్వేనవా - వామా। వక్రశీలమైనదిగాని రమ్యమైనదిగాని వామా ॥౯॥ వనతి పురుషమితి వనితా * వనషణ సంభక్తౌ। పురుషుని బొందునది ॥౧౦॥ మహ్యత ఇతి మహిళా * మహ పూజా యాం। ఆదరింప బడునది ॥౧౧॥

విశేషా స్త్వంగ నాభీ రూః కామినీ వామలోచనా ।
ప్రమదా మానినీ కాంతా లలనా వ నితంబినీ ।
సుందరీ రమణీ రామా.

అంగనా శబ్దము మొదలు ౧౨ ప్రత్యేకముగా స్త్రీ విశేషముల ॥పేళ్లు॥

ప్రశస్తాన్యంగాన్యస్యా ఇతి అంగనా । మంచి అవయవములుకలది ॥౧॥
భయం శీల మస్యా ఇతి భీరూః । వెఱపుస్వ భావముగా గలది ॥౧॥
అతిశయేనకా మోఽస్యా ఇతి కామినీ ॥స్త్రీ॥ అతిశయమైన కామముగలది ॥౧॥

వామే రుచి రేలోచనే అస్యాః ఇతి వామలోచనా । మంచి కన్నులు గలది
ప్రకృష్టో మదశ్చేతో వికారోస్యా ఇతి ప్రమదా । మిక్కిలి మదము గలది ॥౧॥

మానో ఽ స్యాః ఇతి మానినీ ॥స్త్రీ॥ ప్రణయ కోపము గలది॥
భావ శ్శృంగార చేష్టా - సోఽఅస్యా అస్తీ భావినీ । శృంగార చేష్టగలది ॥౧॥
కామ్యత ఇతి కాంతా కాంతౌ । కోరఁబడునది - అనగా చక్కనిది ॥౧॥
లలతి విలసతీ - లలనా ॥ ల సశేషః క్రీడన యోః విలాక్త మేది ॥౧॥
పృథుర్ని తంబః కటి పశ్చాద్భాగః సోస్యా అస్తే నితంబిని ॥స్త్రీ॥
పశ్చాన్నితం బట్యా ఇత్య గ్రీవక్యతి । గొప్ప పిరుదులు గలది ॥౧॥

సుష్టు ఆద్రియతే సుందరీ ॥స్త్రీ॥ దృఞ్ ఆదరణే
లెస్స దరింప బడునది । రూప లావణ్యము గలది ॥౧॥
రమయత నాయకమితి రమణీ ॥స్త్రీ॥ రను క్రీడాయాంనాయకుని రమింప జేయునది ॥౧॥
రమతే కామ శాస్త్రానుసారే కళాభిరితి రామా ॥ రము క్రీడాయాం చేత రమించునది - గీత కళాదులు నేర్చి రమించునది ॥౧॥

కోపనా సైవ భామినీ ।
వరారోహామత్త కాశిన్యుత్తమా వరవర్ణినీ ॥౨౬౩॥

కోపనా భామినీ శబ్దములు కోపము గల స్త్రీల పేళ్లు ।

కోపశీలా కోపశీనా । కోపమేస్వ భావముగా గలిగినది ॥౧॥
భామ్యత్య వశ్యంకు ప్యతి భామినీ ॥ క్రోధే అవశ్యము కోపగించుకొనునది ॥౨॥

ఆరుహ్యత ఇతిఆరోహకః కటిః వరః శ్రేష్ఠః ఆరో హా ఽస్యా ఇతి వరారోహా। పురుషుని చేత ఆరోహించబడునది గనుక. ఆరోహమనగా పిరుదు-శ్రేష్ఠమైన పిరుదులు గలిగినది ॥౧॥ మధుపానం వినాప్రకాశత ఇతి మత్తకాశినీ ॥స్త్రీ॥ కాశృ దీప్తౌ। మధుపానము లేకయె మత్తురాలి వలె ప్రకాశించునది.

పాపి గౌరవాత్ మత్త గజవత్ మందం క సతేతి మత్తకాసినీ ॥స్త్రీ॥ కస గతౌ॥ గొప్ప పిరుదులు గల పాట వలన మదపు టేనుగువలె మెల్లగా నడుచునది ॥౨॥

రూపశీలా ది భిరుత్కృష్టత్వా దుత్తమా। రూప శీలాదులందు దుత్కృష్టమైనది ॥౩॥

వరశ్శ్రేష్ఠో వర్ణోరూప మస్యా ఇతి వరవర్ణినీ। శ్రేష్ఠమైన రూపముగలది. శ్లో॥....శోష్ణ సర్వాంగి గ్రీష్మేతు సుఖశీతలా॥ భర్తృన్ రక్తాచయా నారీ సా భ వేద్వర వర్ణినీతిదుద్రః ❀

కృతాభిషేకా మహిషి భోగిన్యోఽ న్యానృ వస్త్రియః ❀
పత్నీ పాణిగృహితీ చద్వితీయా సహధర్మిణీ ॥౭౬॥

పట్టపు దేవి మహిషీ యనంబడును॥ మహ్యతే పూజ్యత ఇతి మహిషీ॥స్త్రీ॥ మహపూజాయాం। పూజింప బడునది ॥౧॥ ❀❀ తక్కిన రాజస్త్రీ లెల్ల భోగినులనంబడుదురు. ॥ భోగః సంభోగో యా స్వితి భోగిన్యః। ఏస్త్రీల యందు సంభోగము గలదో వారు భోగినులు ॥౧॥ ❀❀ పత్నీ శబ్దము మొదలు ౩ అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము పేళ్ళు॥ పత్యుర్నయా సహయజ్ఞ యోగస్స్యం వద్యత ఇతి పత్నీ ॥స్త్రీ॥ పతికి ఈ పెళ్లాంగూడు కొను యోగము గలదు ॥౧॥

పాణిగృహితోఽస్యా ఇతి గృహీతీ ॥స్త్రీ॥ దీనియొక్క హస్తము గ్రహింప బడును ॥౧॥

యజ్ఞాధికార ఫల భాగినో జా యా సత్యోరనన్తరత్వేన ద్వితీయా ।
యజ్ఞాధికారమందు ఫలమును బొందునప్పుడు పతితోఁగూడ తాను రెండ
వది ॥౩॥

పత్న్యా భర్త్రా సహధర్మః దానయజ్ఞాదిర సాతి సహధర్మిణీ ॥స్త్రీ॥
పతితోఁగూడ దానయజ్ఞాది ధర్మము గలిగినది ॥౪॥

భార్యా జాయా థపుంభూమ్ని దారా స్స్యాత్తు కుటుంబినీ।
పురంధ్రీ సుచరిత్రా తు సతీ సాధ్వీ పతివ్రతా ॥౨౬౩॥

భ్రియత ఇతి భార్యా భృఞ్ - భరింప బడునది ॥౩॥ జాయతె అస్యాం పతిః పుత్ర రూపే ణేతి జాయ జనీ ప్రాదుర్భావే. ఈపెయందు పతి పుత్ర రూపమున జనించును ౨ యరదాంతి ఉద్వే జయంతి పతీనితి దారాః దృ భయే. పతుల భయపెట్టువారు॥ ఈ శబ్దము అకారంత పుల్లింగ నిత్య బహువచనము॥ అయం స్త్రీలింగేప ।శ్లో। క్రోఢే హారాతథా దారాత్రయు ఏతే యథాక్రమం । క్రోడే హరేచదా పుత్రః ప్రోక్తామనీషి భిరితి చంద్రః ॥౩॥ మొదటి ౪ శబ్దములు యజ్ఞాధికారముగల పెండ్లామునకును తక్కిన ౩ శబ్దములు సామాన్యమైన పెండ్లామునకును పేళ్ళని కొందరు కుటుంబినీ పురంధ్రీ శబ్దములు కొడుకులు, కూతుళ్ళు మొదలగు కుటుంబము గల స్త్రీ పేళ్ళు॥ కుటుంబం పుత్ర భృత్యాదికం అస్యా ఇతి కుటుంబినీ ॥సీ॥ పోషింపవగిన పుత్ర భృత్యాదులు గలది ॥౧॥

పురం గృహం ధరతీతి పురంధ్రీ ॥స్త్రీ॥ ధృఞ్ ధర। పురమనగా గృహమును భరించునది ॥౨॥

సుచరిత్రా శబ్దము మొదలు ౪ పతివ్రత పేళ్ళు॥ శోభనం చరిత్రమస్యా ఇతి సుచరిత్రా। శుభకరమైన చరిత్ర గలది ॥౧॥
దర్శనా దేవ పాపంస్యతీతి సతీ ॥స్త్రీ॥ షోంత కర్మణి। దర్శన మాత్రముననే పాపమును జోగొట్టునది ॥౨॥

సాధు గుణ యోగస్సాధ్వీ ॥స్త్రీ॥ మంచి గుణము గలది ॥౩॥ పతి సేవావ్రత మస్యా ఇతి పతి వ్రతా॥ పతి సేవయే వ్రతముగా గలది ॥౪॥

ఇంకా లింగా భట్టీయములో స్త్రీ పరంగా వేలకొద్ది పదాలు అనేకానేక అర్థాల్లో చెప్పబడి యున్నవి.

ఈ విధంగా స్త్రీకి సంబంధించిన పదాలను సమకూర్చుతూ పోతే అదొక ఉద్గ్రంధ మవుతుంది. ఈ నిఘంటు పరిశీలన వలన నాకు తేలిన అంశములు ఏమిటంటే — అటు సంస్కృత వాఙ్మయంలో కాని, ఇటు తెలుగు వాఙ్మయంలో కాని మొత్తంగా స్త్రీని గౌరవించే పద్ధతిలో అభిభాషించిన శబ్దముల కంటే స్త్రీని అగౌరవ పంచి న్యూనత పరచిన శబ్దములే ఎక్కువగా ఉన్నవి. స్త్రీ మీద పురుషాధిపత్యము, స్త్రీని భోగ వస్తువుగా పరిగణించినతీరు ఈపదసముచ్ఛయమువలన మనకు ద్యోతక మవుతుంది పురుషాధిపత్య సమాజము స్త్రీని పరిగణించిన అనేక తీరులు, సామాజిక అస్తవ్యస్తత్వంలో కులాలనుబట్టి స్త్రీని పిలిచిన వరుస, సంస్కృత శబ్దాలు కొన్ని తత్సమాలుగా, తద్భవాలుగా రూపాంతరం చెందిన పద్ధతి, ప్రాకృత శబ్దాలుకూడా కొన్ని తెలుగులోకి వచ్చిన విధము - అన్న విషయాలు ఈ స్త్రీ పద సముచ్ఛయము వలన మనకు తెలుస్తున్నాయి.

భారతీయ సమాజంలో స్త్రీకి అన్ని కోణాలు నుండి అన్యాయమే జరిగింది. ఆమెను పిలిచిన సర్వనామాలు చూస్తే - అది, అసి, ఓసి - ఎంత చులకన భావాన్ని వ్యక్తం చేస్తాయో! స్త్రీ విముక్తిని కాంక్షించే అభ్యుదయ సమాజం "స్త్రీ"ని గౌరవించే కొత్త పదజాలంని కొత్త సమాజాల ఆవిర్భావాల నుండి సృష్టించి స్త్రీని అగౌరవపరచే అన్ని శక్తులను ధోరణులను ధ్వంసం చేయాలి. సామాజిక పరిణామ కృషిలో స్త్రీ గౌరవ సాహిత్ సృష్టి కూడా ఒక బాధ్యత. ఆ బాధ్యత స్త్రీ అభ్యుదయోద్యమముతోనే ముడిపడి ఉంది. నిజమైన స్త్రీ అభ్యుదయోద్యమాల నుండి ఆ పదబంధాలు పరిఢవిస్తాయి, పరిప్లవిస్తాయి.



# పురాణాల్లో - స్త్రీ

మన పురాణాలు అత్యుక్తులతో, అనృతాలతో, అసంబద్ధాలతో, అసహజాలతో, అభూత కల్పనలతో విరాజిల్లుతూ ఉంటాయి. ఈ పురాణాలు పద్దెనిమిది. వీటి ప్రచారం నిరంతరం సాగుతూ ఉంటుంది. ఈ పురాణ స్త్రీల ఛాందస ఔన్నత్యాన్ని కొన్ని వేల దేవాలయాల్లో నిరంతరం బోధిస్తున్నారు. అందువలన వీటి ప్రభావం భారతీయుల మనస్తత్వం మీద దినదిన ప్రవర్ధమాన మవుతూవుంది.

పురాణాల్లో స్త్రీని నీచాతి నీచంగా వర్ణించడం జరిగింది. ఆమె మనస్తత్వాన్ని, ఆమె వ్యక్తిత్వాన్ని ఎంతగా కించపరచడానికి వీలుంటుందో అంతగా కించ పరిచారు. అసభ్యంగా, బీభత్సంగా, జుగుప్సగా చిత్రీకరించారు. ఆమెను పతివ్రతగా పొగుడుతూనే, వ్యభిచారిణిగా, మనసు నిలకడలేని దానిగా అభివర్ణించారు, లక్ష్మీదేవి పురాణాల్లో ఉన్నతమైనది. ఆమెకు హయహయుడు పుట్టిన విధానం “దేవీ భాగవతం”లో ఏ విధంగా వర్ణింపబడిందో పరిశీలించండి,

“రేవతుడనువాడు గుఱ్ఱమెక్కి వెళ్ళుచుండగా విష్ణువు లక్ష్మిని పిలిచి, చూడుమా గుఱ్ఱమెంత యందముగా నున్నదోయని చెప్పెను. లక్ష్మి యాగుఱ్ఱమును రెప్పవేయక చూచు చుండెను. “నీవు రెప్ప వేయకయే చూచు చుంటివి. నీకు గుఱ్ఱపు రూపు మనసైనది కాబోలు. నీవాడు గుఱ్ఱముపై పుట్టుమని శపించెను. ఈ శాపమున కామె విచారించెను. “నీవు శివుని ప్రార్థింపుము. నీకు పుత్రుడు కలిగిన పిదప శాపవిముక్తి యగునని విష్ణువు పలికెను. లక్ష్మి కైలాసమున కేగి శివునిగూర్చి ప్రార్థించెను. శివుడు విష్ణువును రావించెను. విష్ణువు అశ్వరూపము తోడనే వెళ్ళియా యాడు గుఱ్ఱమును గూడెను. అది గర్భవతియై పుత్రునిఁ బడసెను. వెంటనే లక్ష్మికి శాప విమోచన మయ్యెను. ఆ పుట్టిన బాలుని లక్ష్మీ విష్ణువు లచటనే దిగవిడచి చనిరి. ఆ పుత్రుడే హయహయుడు.”

ఈ కథ ఎంత జుగుప్సాకరముగా నున్నదో "లక్ష్మి" విషయంలో ఎంత నీచమైన భావము కలుగుతుందో ఆలోచించండి. ఈ విధమైన కథలనే నిరంతరం ప్రచారం చేయుడం జరిగింది.

మరొక పురాణ స్త్రీ గౌతముడి భార్య అహల్య. ఆమెను ఇంద్రుడు గౌతముని వేషములో వచ్చి అనుభవించి గౌతముడి చేత శపించబడ్డాడు. ఈ కథకు ఎనలేని ప్రచారమిచ్చారు. అహల్యా ఇంద్రుల సంభోగ కేళీ విలాసాలను కొందరు కవులు జుగుప్సాకరంగా వర్ణించారు. ఒక విటుడితో కలవడమే గాక, "అహల్య" ఆతనిని వీడలేక ఏమంటుందో చూడండి.

"నమ్మినదాన, నా తనువు నమ్మిన దానను నీకు, నింకనే నమ్మక చెల్ల! నన్ను విరహాగ్నికిం బాల్పడంజేసి పోవ టన్ సమ్మత మాయెనా ? విడువ జాలితివా ? యెటులైన నిన్నునే బొమ్మనజాలం జాలినను బొందిని ప్రాణములుండనేర్చునే ?

(అహల్యా సంక్రందనం - సముఖం వేంకట కృష్ణప్ప నాయుడు - 3ఆ, 122 ప.)

ఈ కథ చదివిన తరువాత, విన్న తరువాత పాఠకునికి స్త్రీని అనుమానించడం వేధించటం ఋషులకేతప్పలేదు. ఋషి భార్యలకే చిత్తచాంచల్యం కలిగింది. సామాన్యుల మాటచెప్పాలా? అనే భావ కలుగుతుంది.

భృగు మహర్షికి పులోమ అనే భార్య ఉన్నది. ఆమె గర్భవతి. ఆమె అగ్ని హోత్రమును సిద్ధముచేయు సందర్భంలో ఆమె భర్తలేని సమయమున "పులోముడు" అనే రాక్షసుడు వరాహ రూపమున ఆమెనెత్తుకొని పోవుచుండగా ఆమె గర్భము చ్యుతమయ్యెను. ఆచ్యుతమైన గర్భస్థ పిండమే చ్యవనుడను మహర్షి అయ్యెనట ! —ఋషి పత్నులు ఎవరితోనైన లేచి పోవడమో, ఎవరన్నా లేపుకు వెళ్ళడమో - జరిగితే తప్ప రచయితకు తృప్తి వుండదేమో ! స్త్రీని అనేక రూపాలుగా అవమానించిన "కథలు" కోకొల్లలుగా పురాణాల్లో ఉన్నాయి.

మరొక కథలో జమదగ్ని అనే ఋషి రేణుక అనే తన భార్యతో నర్మదా నదీ తీరంలో విహరిస్తూ మన్మథ క్రీడకు ఉపక్రమించారట.

"ఆ సమయమున సూర్యుడు వారికడకు విప్ర రూపమున విచ్చేసి ఓయి జమదగ్ని ! నీవు బ్రహ్మ మనుమడవు వేదకర్తవు. మహా తపశ్శాలివి. అట్టి నీవిట్లు పట్టపగలు సురతక్రీడకుం జొచ్చుట ధర్మమా ? "యద్యదా చరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః" అన్న నానుడినిబట్టి పెక్కురు నిన్ననుసరింతురు" అని పల్కెను.

అది విని జమదగ్ని సురత విముఖుడై నిలువ, నగ్నయగు రేణుక వెంటనే సూక్ష్మ వస్త్రము ధరించి సిగ్గుపడి నిలిచిందట. అప్పుడు భృగుడు సూర్యుడికి ఇట్లా చెప్పినందుకు రాహు గ్రస్తుడవు కమ్మని శాపము పెట్టెనట.

ఈ కథలు పెక్కులు ఋషులవే. వారి భార్యల విషయంలో ఇంత జుగుప్సాకరంగా వర్ణనలు పురాణముల నిండా కోకొల్లలు. స్త్రీలను న్యూనత పరచి పురాణ రచయితలు ఆనంద పడ్డారు. నేడు పాఠకులు అవే చర్విత చర్వణంగా చదివి ఆనందిస్తున్నారు.

పురాణాల్లో వున్న శృంగార లీలలు, కామ కలాపాలు, వ్యభిచార వర్ణనలు పాఠకుల్ని నిరంతరం ఒక ప్రక్క ఆనందంలో ముంచుతాయి. అటువంటి కథలనే నీతి కథలుగా, వాటి పారాయణమే ముక్తిదాయకంగా హిందూ సనాతన వాదులు ప్రచారం చేస్తూ, ఈ పురాణాలను భారతీయ భాషలన్నింటిలోకి అనేక కవితా ప్రక్రియల్లోను, కళారూపాల్లోను అను వదించి, ప్రజలకు దృశ్యంగా, శ్రవ్యంగా నిరంతరం చూపిస్తూ, విని పిస్తూ ఉన్నారు.

ఈ పురాణ ప్రచారం వల్ల జరుగుతున్న అన్యాయాల్ని, వాటిని ఎదిరించాల్సిన అవసరాన్ని శ్రీ నార్ల వెంకటేశ్వరరావు తన "నరకంలో హరిశ్చంద్రుడు పీఠికలో వివరిస్తూ—

"మన పురాణాలకు సంబంధించినంత వరకు దానవులు, కిరాతులు నిషాదులు అన్న వారిని లెక్కనుంచి మినహాయిస్తే, అన్యులలో ఒక్క నహుషుడు తప్ప, ఒక్క వేనుడు తప్ప, పౌరాణిక నీతిపై, పౌరాణిక ధర్మముపై తిరుగుబాటు చేసిన మహాదవ వ్యక్తి ఈ క్షణంలో నాకు జ్ఞాపకం

రావడం లేదు. ఒకవేళ నేను గుర్తుతెచ్చుకొనలేక పోతున్నవారు మరీ కొందరుంటే — అట్టివారు బహుశా ఇద్దరూ, ముగ్గురిని మించరు. ఎంతటి దీన స్థితికైనా, మరెంతటి హీనావస్థకైనా, ఎంతటి దురన్యాయానికైనా, మరెంతటి దుర్గతికైనా ప్రజా బాహుళ్యాన్ని మానసికంగా ఒప్పించ గల పద్ధతిని "బ్రెయిన్ వాషింగ్" అంటారు. ఈ "మెదడు ఉతుకుడు" విద్యలో ప్రావీణ్యానికి నోబుల్ బహుమానం ఉంటే, దాన్ని మన పురాణాల రచయితలకే వంసగా యిచ్చుకొంటూ పోవాలి. ! కనీసం ఒకటిన్నర లేదా రెండు వేల సంవత్సరాలుగా ఈ "బ్రెయిన్ వాషింగ్" క్షుణ్ణంగా జరిగి ఉండకపోతే, మన దేశంలో అగ్రవర్ణాలవారు - అగ్రవర్ణాలు చేసిన, చేస్తున్న ఘోరఅన్యాయాలకు ప్రతిఘటనగా వారు పెడుతున్న దారుణ హింసలకు ప్రతీకారంగా సాయుధ విప్లవాలు కనీసం ఒక వెయ్యి చెలరేగి ఉండేవి."

ఈ మాటలు అక్షర సత్యాలు. పురాణాల మీద శాస్త్రీయ దృక్పధంతో "వార్ల" చేసిన ఈ వ్యాఖ్య ఎంతో నిశితమైనది, సత్యపూర్ణమైనది.

భారతదేశంలో స్త్రీ ఈనాటికి అణగారి ఉండిపోయి ఉండడానికి కారణం ఈ పౌరాణిక గాథా ప్రచారాలే. భారత దేశంలో స్త్రీకి సంబంధించిన "అణచి వేత" పవిత్రమైన పాతివ్రత్యంగా ప్రచారం పొందింది. కనీసము స్త్రీని సంబోధించేటప్పుడైనా గౌరవంగా సంబోధించటం జరుగలేదు వాల్మీకి రామాయణంలో సితను ఈ విధంగా సంబోధించారు.

1. గజనా సోరూ ! — ఏనుగు తొండము వంటి తొడలు గలదానవగు సీతా !
2. సుశ్రోణీ — చక్కని పిరుదలు కలదానా !
3. మదిరేక్షణా ! — మత్తెక్కిన కనులుగల దానా !
4. అరభవ్యశుభశ్రోణి — చక్కని పిరుదలు కలదానా !

ఈ సంబోధనలు అయోధ్య కాండ — 30 వ సర్గలో 30, 32, 33, 40, 42 శ్లోకాల లోనివి.

ఇంతేకాక శ్రీరాముడు వనవాసానికి వెళ్తూ - సీతను అయోధ్యలోనే వుండ మనటమే కాక—

"విప్రియం నచ కర్తవ్యం భరతస్య కదాచన
సహి రాజా ప్రభుశ్చైవ దేశస్య కులస్యచ॥"
(అయోధ్య కాండ - 26వ. 34 శ్లో)

భరతుడు దేశమునకే గాక, ఇంటికి గూడ అధిపతి, అతడికి ఎన్నడు విరోధము కలిగించకుము.

"ఆరాధితాహి శ్రీలేన ప్రయత్నైశ్చోప సేవితాః
రాజాన స్సంప్రసీదంతి కుప్యంతి చ విపర్యయే॥"
(అయోధ్యకాండ - 2 వసర్గ-35వ శ్లో)

భావం॥ అనుకూల వ్యాపారంతో నారాధించి, ప్రయత్న పూర్వకముగా సేవించుచో రాజులు ప్రసన్నులగుదురు. దానికి వేరు విధముగా నాచరించుచో కోపింతురు.

పై నివేదనలో ఎంత న్యూనత భావం ద్యోతక మవుతుందో పర్ణింప లేము. చివరకు భరతుణ్ని ఆరాధించి, ప్రసన్నుణ్ని చేసుకోమని భార్యకు శ్రీ రాముడు బోధించటం కంటే శోచనీయం మరొకటి లేదు. ఈ విధమైన నీచ భావాలను వ్యక్తీకరిస్తూ, రాముడు సీతకు ఉపదేశం చేయడం వల్లనే సీత రాముణ్ని ఈవిథంగా నిందించింది.

"కిం త్వామ మన్యత వైదేహః పితా మే మిధిలాధిపః
రామ! జామాతరం ప్రాప్యస్త్రియం పురుష విగ్రహం॥"
అయోధ్యకాండ -30వ సర్గ-3వ శ్లో)

భావం॥ (సౌందర్యముచేతనే పరులను భ్రమింప జేయునట్టి ఓ రామా!) విదేహ వంశమున పుట్టినవాడు, మిధిలా నగరము రాజధానిగా దేశమును చక్కగా రక్షించువాడగు నా తండ్రి, నన్నొక దానిని రక్షింప లేక నన్ను వీడిపోవడవికేగినట్లు తెలిసికొని, లోపల స్త్రీ స్వభావము కలిగి, బయటకు మాత్రము పురుష వేషము గల అల్లునిగా నిన్ను తలంప కుండునా?

ఈ సీత వాక్యాల్లో ఎంత ఈసడింపు గోచరిస్తుంది. ఎవడు రాజయితే వాడికిభార్యగా వ్యవహరించమనే భావాన్ని వ్యక్తంచేసిన రాముడి

మన స్త్వం ఎంత హీనమయిందో మనకు సువ్యక్తమవుతూనే ఉన్నది. ఇక్కడ సీత ధైర్యంతో అన్న మాటలు ఆనాటి రాజన్యుల హీనభావాల మీద కొరడా దెబ్బలు. స్త్రీ వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలనే తాపత్రయం ఆమె మాటల్లో కనిపిస్తుంది. వాల్మీకి సీత రామాయణంలో అనేక సందర్భాల్లో అన్యాయానికి, అణచివేతకు వ్యతిరేకంగా మాట్లాడుతుంది.

అయినా అగ్నిదేవుని పరీక్షలైతేకాని రాముడికి నమ్మకం లేదని చిత్రించి, "సీతకే అవమానం తప్పలేదు, రాముడికే అనుమానం తప్పలేదు." అని సూత్రీకరించి ఈనాటి స్త్రీలను కూడా నిరంతరం అవమానించడము కద్దు.

పురాణాల్లో దేవతలను వర్ణించేటప్పుడు కూడా శృంగార భరితంగానే వర్ణించడం పరిపాటి. పార్వతమ్మోరుకైనా ఆ బెడద తప్పదు.

శివ పురాణంలో "కుమారస్వామి జననం" చదివితే తెలుస్తుంది ఆర్ష సమాజానికి స్త్రీ మీద ఉన్న గౌరవం. దేవతల పేర్లు చెప్పి పార్వతీ పరమేశ్వరుల రతిక్రీడలు వర్ణించి పాఠకులను తత్ శృంగార రచనామృతం ద్వారా స్వర్గానికి పంపడానికి ప్రయత్నిస్తారు — పురాణ రచయితలు.

"స్త్రీ" ఏ కోణం నుండైనా గౌరవింపబడాలి. ఆమె ఔన్నత్యాన్ని వ్యక్తిత్వాన్ని చిత్రించాలి. కానీ సంస్కృత పురాణాలలో స్త్రీ వ్యక్తిత్వం అనేక కోణాల నుండి కించపరచ బడింది. భారతంలో ద్రౌపతి పంచ భర్తృకగా చిత్రింప బడింది. శ్రీకృష్ణుని భార్యలు భర్త కోసం వెంపర లాడి తమ వ్యక్తిత్వాన్ని బుగ్గి చేసుకొంటారు. ద్రౌపది చేత ఆరో భర్త కావాలనిపించడం మరింత న్యూనత పరచడమే అవుతుంది. రామాయణములో కైకేయి, మందర పాత్రలను వంకబెట్టి స్త్రీని అత్యంత నైచ్యంగా వర్ణించడం జరిగింది.

ఇక భాగవతంలో శ్రీకృష్ణలీలలు, గోపికల పాట్లు చెప్పనలవికాదు. అనేక సందర్భాల్లో అంగాంగ వర్ణనలతో స్త్రీని ఆట వస్తువుగా చేసి ఆడుకోవడం బహిరంగ శృంగార వర్ణనలకు వేదాంత అర్ధాలను జోడించి మురిపించడం మనలకు విసుగు కలిగిస్తుంది. సంస్కృత భాగవతానికి అనువాదమైన పోతన భాగవతంలో గోపికలు కాళిందీ నదీ తీరాన "కాత్యాయని"ని ఈ విధంగా వేడుకొంటున్నారు.

"ఓ కాత్యాయనీ ! భగవతి !
నీకును మ్రొక్కెదము మేము నీదనుకంపన్
మాకందఱకును పైశమ
శ్రీకృష్ణుడు మగడు గాగ జేయుము తల్లీ !"

అని వారు స్నానము చేస్తుండగా శ్రీకృష్ణుడు వారి "అంబరముల్ దొంగిలెన్," దొంగిలి వెంటనే చెట్టు నెక్కగా ఆ గోపికలు—

"కొంటివి మా హృదయంబులు
కొంటివి మా మానములజ్జ గొంటివి వలువల్
కొంటివి కానెట్లు చేసెదొ
కొండెపు గద నిన్ను నెఱిఁగి కొంటిమి కృష్ణా !"

అని అనడమే కాక, పాఠకులకు సిగ్గు కలిగించే ఇంకా ఎన్నో సంభాషణలు చేస్తారు.

"ఉల్లములు నొవ్వ నాడిన
కల్లలు చేసినను నగిన కల చినవైనన్
వల్లభులు సేయు కృత్యము
వల్లభలకు నెగ్గుగాదు వల్లభమధిపా !"

ఈ విధమైన రాసక్రీడలు భాగవతంలో కోకొల్లలు. దశమ స్కంధంలో ప్రసిద్ధి చెందిన రాసక్రీడలో కొన్ని పద్యాలు చూడండి—

"రామల తోడను రాసము
రామానుజుడాడఁజూచి రాగిల్లి మనో
రాముల మీద వియచ్చర
రాములు మూర్ఛిల్లిపడిరి రాజకులేశా !"
(1086 ప)

"తారాధిప నిభ వదనలు
తారధిప వంశ్యుఁగూడి తారు నటింపన్
దారలు నిల్చి సుధాంశుడు
దారును వీక్షింప రేయి తడవుగ జరిగెన్."
(1087 ప)

"ఆడుచుఁ బాడుచు నందొక
చేడియ మంజీర మంజుశింజిత పమరం
గూడి హరికరము చనుగవ
పెడాయఁం దిగిచె జఘన భారాలపమై."

(1091 ప)

ఇట్లు భగవంతుడైన శ్రీకృష్ణుడు గోప సతులకు అందరకు అందరై రాస క్రీడ జరిపెనట.

ఈ పద్యాలు కొందరికి అర్థమౌతాయి. కొందరికి కావు. అర్థం కాక పోవడమే మంచిది. గోపికలనే మనము స్త్రీలని భావిస్తే ఇంత జుగుప్సా కరమైన సన్నివేశాన్ని మనం ఎక్కడా చూడం. "అనాగరికం" అనే దానికి అర్థం ఈ సన్నివేశంలోనే మనకు ద్యోతక మవుతుంది. అయితే వీటికి ఆధ్యాత్మిక అర్థాలు కల్పించి ప్రచారం చేస్తున్నారు. ఈ రాసక్రీడ లను బహిరంగంగా మైకుల్లో చదివి అర్థాలు చెప్పి, స్త్రీని నడివీధిలో వికృతంగా అవమానిస్తున్నారు. కృష్ణుడు దేవుడు, అతనికి పరాంగనలు ఎవ్వరు ? అందరితో క్రీడించే హక్కు అతనికి ఉందని కవి సమ ర్థిస్తున్నాడు—

"సర్వ భక్షుఁడగ్ని సర్వంబు భక్షించి
దోషిగాని పగిది దోషమైనఁ
జేసి దోష పదముఁ జెందరు తేజస్వు
లగుట చంద్ర వాసవాదులధిప !"

అగ్ని ఏ విధంగా సర్వమూ భక్షించి దోషికాడో అలాగే గొప్పవారు తప్పు చేసినా దోషులు గారట ! అందుకే ఈనాటి బాబాలు, స్వాములు, అవతార్లు శ్రీకృష్ణుణ్ని అనుసరిస్తున్నారు. స్త్రీని న్యూనత పరిచే అనేక సంఘటనలు పురాణాల నిండా పరివ్యాప్తమై ఉన్నాయి.

క్రీ॥ పూ॥ 6వ శతాబ్దం నుండి క్రీ॥ శ॥ 16వ శతాబ్దం దాక ఈ పురా ణాల రచన సాగుతూనే ఉంది. వీటి అనువాదాలు ఈనాటికి నిరంతరంగా సాగుతూనే ఉన్నాయి. ఈ పురాణాల ప్రచారానికి తిరుపతి దేవస్థానం వంటి మతసంస్థలు లక్షలాది రూపాయలు ఖర్చు చేస్తున్నారు. సినిమాలు,

నాటకాలు. రేడియోలు ఈ పౌరాణిక "స్త్రీ"లను తమ ప్రచారంలో చిత్రిస్తూనే ఉన్నారు.

అందుకే వివేకవంతులు, విజ్ఞానులు, సంస్కారులు, అభ్యుదయ వాదులు పురాణాల్లో స్త్రీకి జరిగిన అవమానాన్ని ఈసడించి ఆమె వ్యక్తిత్వాన్ని పరిదీప్తం చేసే ఆమె గౌరవాన్ని ఇనుమడింప జేసే మహోన్నత సంస్కృతికి పట్టంగట్టి "మహిళను" అనుమానించే అన్ని ధోరణుల మీద యుద్ధం ప్రకటించ వలసిన అవసరం ముందుకు వచ్చింది. అందుకే ఈ పరిశీలన. ఈ గవేషణ. ఈ పరిశీలన ద్వారా "నిజాన్ని" తెలుసుకొని అభ్యుదయ పథంలో గమించాలన్నదే నా ఆశయం॥ 

# నీతి శతకాల్లో స్త్రీ

సంస్కృతంలో వ్రాయబడిన నీతి శతకాలకు చాలా ప్రశస్తి వుంది. అవి భారతీయ భాషలన్నింటిలోకి ప్రచారమైనాయి. అవి నానుడులుగా చాటువులుగా కూడా పల్లె పట్టుల్లోకి ప్రవహించినాయి. ఒక పల్లెటూరులో రచ్చబండ మీద కూర్చొని మాట్లాడుచున్న చమత్కారుడికి నోటిలోనుండి వచ్చే పద బంధం భర్తృహరి సుభాషితాల్లో కనిపిస్తుంది. ఈ సుభాషితాలు అనేక రూపాల్లో ప్రచారం పొంది గ్రామీణ ప్రజల నాలుకలమీదకు చేరి నవనడానికి ఇది గుర్తు. తెలుగులో నీతి శతకాలు చెప్పిన సుమతీ శతక కర్త బద్దెన, వేమన వంటివారి మీదకూడా ఈ నీతి శతకాల ప్రభావం చాలా బలంగా వుంది. ఆడవాళ్ళను వెటకారంగా అనే మాటలు ఎన్నో ఇందులో ఉన్నాయి. నీతి శతకకారులకు స్త్రీల మీద గౌరవం లేదు. స్త్రీలు కేవలం శృంగార గుళికలనే వారి భావం. పురుషులను ఆకట్టుకోవడం, శృంగార చేష్టాన్వితంగా జీవించటమే స్త్రీల ప్రవృత్తి అని అనేక రీతుల్లో స్త్రీలను గురించి అధిక్షేపించారు. తెలుగులో ఉన్న తిట్టుకవుల అధిక్షేప శతకకారుల మీదకూడా వీటి ప్రభావం ఉంది.

నీతంటే ప్రజల్లో నైతిక విలువలను ప్రదీప్తంచేసి వారిలో మానసిక వికాసాన్ని కలిగించేది. నీతిని, నిజాయితిని తప్పకుండ ప్రజలకు రుజువర్తనను నేర్పేది. కానీ నీతి శతకాలు అలాలేవు. ఎడనెడ కొంత నీతి కనిపిస్తున్నప్పటికి స్త్రీల విషయంలో చాలా తప్పుడు భావాన్ని కలిగి ఉన్నాయి. స్త్రీని చాలా హీనంగా, నీచంగా దురవగాహనతో చూశాయి. అవి పరిశీలించి అందులో నీతి ఎంతవుందో, అధిక్షేపణ ఎంతవుందో నిగ్గు తేల్చాల్సిన అవసరం వుంది. స్త్రీని విప్లవీకరించే క్రమంలో స్త్రీ మీద వున్న సాంస్కృతిక దుష్టాచారం మీదకూడా యుద్ధం చేయవలసిన అవసరం వుంది నీతి శతకకారుల్లో భర్తృహరి సుప్రసిద్ధుడు. అతని సుభాషితాలను పరిశీలిస్తే అనేక విషయాలు మనముందుకు వస్తాయి.

భర్తృహరి సుభాషితాల్లోని "స్త్రీ ప్రశంస" అనే ఖండికలో స్త్రీని అభినందిస్తున్న తీరు పరిశీలిస్తే మనకు నీతి శతక కారులకు స్త్రీ దమీ

ఉన్న అభిప్రాయం సుబోధమవుతుంది. స్త్రీ తన హావ భావముల చేత పురుషుణ్ని కట్టిపేస్తుందని, అందుకే స్త్రీ విషయంలో అప్రమత్తంగా ఉండాలని భర్తృహరి హెచ్చరిస్తూ ఆమెను వర్ణిస్తున్నాడు.

శ్లో॥ స్మితేన భావేన చలజ్జయా భియా
పరాఙ్ముఖై రర్ధ కటాక్ష వీక్షణైః
వచోభి రీర్ష్యా కలహేన లీలయా
సమస్త భావైః ఖలు బన్ధనం స్త్రియః
-భర్తృహరి సుభాషితం శృంగార శతకం - 2వ శ్లోకం

తా॥ స్త్రీలు చిఱునవ్వుల చేతను, చేతులు మొదలగునవి త్రిప్పుట చేతను, సిగ్గుచూపుట చేతను, భయపడుట చేతను, పెడమోము చూపుట చేతను, కడగన్నులు సగము మూసి తెఱచిచూచుట చేతను, మాటల చేతను పొలయులుక చేతను, సొగసుల చేతను మఱి యనేక చేష్టల చేతను పురుషులను గట్టివేయుదురు.

భర్తృహరి సుభాషితం - శృంగార శతకం, స్త్రీ ప్రశంస-2

అంటే స్త్రీ తనహావభావ విలాసాలతో పురుషుణ్ని ఆకట్టుకుంటుందని, ఈ అంశాన్నే కావ్య లక్షణాలలో నాయికకు వుండవలసిన శృంగార భావ హేలా విలాసాలను ఈ విధంగా సంస్కృతంలో వివరించటం జరిగింది.

"భావో హావశ్చ హేలా చ మాధుర్యం ధైర్య మిత్యపి,
లీలా విలాసో విచ్ఛిత్తిర్వి భ్రమః కిలకిఞ్చితమ్
మోట్టాయితం కుట్టమితం బిబ్బో కోలలితం తథా
కుతూహలం చ చకితం విహృతం హాసఇత్యపి
ఏవం శృఙ్గార చేష్టాస్స్యురష్టా దశ విధా మతాః"
(ప్రతాప రుద్రియశో భూషణం)

స్త్రీలోని శృంగార చేష్టలను ఈ లక్షణం ఆధారంగా అన్ని నాటి కాల్లోను కావ్యాల్లోను స్త్రీలను కేవలం శృంగార బొమ్మలుగా మలచి వారి వ్యక్తిత్వాన్ని నాశనం చేయటం జరిగింది. ఆమె కళ్ళు, కనుబొమ్మలు. పలుకులు, నవ్వులు, నడకలు అన్నీ పురుషుణ్ని వశపర్చుకోవడానికి

ఆభరణాలుగా మాత్రమే వర్ణించడం ఎంత అసహజమైన విషయమో పరిశీలించండి.

శ్లో॥ భ్రూ చాతుర్యాత్ కుఞ్చితాక్షాః కటాక్షాః
స్నిగ్ధావాచో లజ్జితాన్తాశ్చ హాసాః
లీలామన్దం ప్రస్థితం చస్థితం చ
స్త్రీణా మేత ద్భూషణం చాయుధం చ.

భర్తృహరి సుభాషితం - శృంగార శతకం 3

తా॥ కనుబొమలు నేర్పుతో వంచియరకన్నువెట్టి, కడగంటితో జూచుటయు, చిన్న పలుకులును. సిగ్గుతో గూడిన చిరు నగవులను, కులుకు నడకయు, ముసిముసి నగవును స్త్రీలకు స్వభావ సిద్ధములైన భూషణములుగను, పురుషులను వశపరచుకొనుట కాయుధములుగను నగుచున్నవి.

స్త్రీలు తమ కళ్ళతో శృంగార చేష్టలు విపరీతంగా చేస్తారని, సిగ్గులతో బిడియాలతో వయ్యారాలతో శృంగార భంగిమలు ప్రదర్శించటమే వారి పని అనియు వర్ణిస్తున్నాడు. అనేక భంగుల హావభావాలు, హాస విలాసాలు ప్రదర్శిస్తూ శృంగార రస సంభరితులై చరించటమే వారి ప్రవృత్తి అని అభిభాషిస్తున్నాడు.

శ్లో॥ క్వచిత్స భ్రూభఙ్గైః క్వచిదపి చ లజ్జా పరిగతైః
క్వచిద్భీతి త్రస్తైః క్వచిదపి చ లీలా విలసితైః
కుమారీణా మే తైర్మదన సుభగైర్నేత్ర వలితైః
స్ఫురన్నీలాబ్జానాం ప్రకర పరికీర్ణా ఇవ దిశః

భర్తృహరి సుభాషితం - శృంగార శతకం 4

తా॥ ముద్దరాండ్రు కొన్నిచోట్ల కనుబొమలు ముడిపెట్టుకొనియు, కొన్నిచోట్ల సిగ్గుచే తలవంచుకొనియు, కొన్ని తావులందులికిపడియు, కొన్ని చోటులందు తమ సొగసులు జూపియు, కొన్నిచోట్ల కమలములం బోలుమోములం జూపియు, కన్నుల ద్రిప్పియు నంతట నల్లకలువలు వికసించియున్నవో యనునట్లుగా చేయుదురు.

అంతేగాక చిరునగవులు, చంచల దృష్టులు ఆమెకు పురుషుణ్ని వశపర్చుకొనే ఆభరణాలుగా కవి వర్ణిస్తున్నాడు.

శ్లో॥ స్మితం కిఞ్చి న్ముగ్ధం సరళ తరళో దృష్టి విభవః
పరిస్పన్దో వాచా మభినవ విలాసోక్తి రసః
గతానామా రమ్భః కిసలయిత లీలా పరికరః
స్పృశన్త్యా స్తారుణ్యం కిమివ హినరమ్యం మృగదృశః
భర్తృహరి సుభాషితం - శృంగార శతకం 6

తా॥ మోమునందలి చిరునగవు, చక్కనైన చంచల దృష్టి, క్రొత్తనైన సరసంపు బలుకులుబలుకుట, ఒయ్యారపుటారంభ దశయగు నడకల తీరు, వీనిలో జౌ్వనమున నుండు మృగాక్షి కేది రమ్యముగా నుండదు? అన్నియు రమ్యములుగానే యుండును.

ఈ పై విలాసము లన్నింటితో పురుషులను వశపర్చు కోవడమే వీరి పనిగా, భర్తృహరి వర్ణిస్తున్నాడు. మోహం పురుషుడిలో పుట్టించేది స్త్రీయేనని. విద్వాంసుడైనా, మరెవ్వడైనా స్త్రీయొక్క హావభావాలకు లొంగి పోతున్నాడని స్త్రీని అధిక్షేపిస్తున్నాడు. పైగా ఈ అధిక్షేపించే భాగానికి "కామినీ గర్హణము" అనే పేరుకూడా ఆలంకారికంగా పెట్టారు.

ఇందులో మొదటి శ్లోకమే విద్వాంసులు స్త్రీల హావభావాలనుచూచి మోహపడుతున్నారని వర్ణించబడింది.

శ్లో॥ కాన్తేత్యుత్పలలోచనేతి విపుల శ్రోణీభరేత్యున్న మ
త్పీనోత్తుఙ్గపయోధ రేతి సుముఖామ్భో జేతి సుభ్రూరితి
దృష్ట్వా ముహ్యతి మోదతేఽభిరమతే ప్రస్తౌవిద్వానపి
ప్రత్యక్షాశుచి భస్త్రికాం స్త్రియమహో మోహస్య దుశ్చేష్టితమ్
భర్తృహరి సుభాషితం - శృంగార శతకం 41

తా॥ లోకమున విద్వాంసుడు సైతము తనకంటికి బాగుగా గనపడుచుండు తోలుబొమ్మవంటి కాంతను జూచి మోహించుచున్నాడు. మఱి యానంద మొందుచున్నాడు. కోరదగినదనియు, కలువకంటి యనియు వెడద పిరుదుల భారము గలదనియు. నుత్సాహముతో గూడిన గుబ్బ

గుబ్బలు గలదనియు, తమ్మివంటి మోము గలదనియు, పొగను బొమలు గలది యనియు గొనియాడుచు రమించు చున్నాడు. ఆహా! మోహము యొక్క పెద్ద వ్యాపారమేమని చెప్పవచ్చును.

అసలు స్త్రీని చూస్తే పిచ్చి, తలస్తే వేండ్రము, తాకితే పొక్కు కలుగునట. అట్టి దానిని ఎలా ప్రియురాలంటావని అశాస్త్రీయ దోరణిలో గర్హిస్తున్నాడు. స్త్రీమీద ఏహ్య భావం కలిగేటట్లు చిత్రిస్తున్నాడు.

శ్లో॥ స్మృతా భవతి తాపయా దృష్టాభోన్మాద కారిణీ
స్పృష్టా భవతి మోహాయసా నామదయితా కథమ్.
భర్తృహరి సుభాషితాలు - శృంగార శతకం 42

తా॥ తలచిన మాత్రమున వేండ్రము కలిగించును. చూచినంత మాత్రమున పిచ్చినికలుగజేయును. తాకినంత మాత్రమునపొక్కించును. అట్టి మగువ నెట్లు ప్రియురాలనవచ్చును.

ఈ భావాలు ఏ దృష్టితో చూచినా చాలా గర్హనీయమైనవి. స్త్రీ లోకంపట్ల పురుషునికి భయాన్ని, అసహ్యాన్ని కలిగించడానికి ఈ భావాలు తోడ్పడుతున్నాయి. అంతేగాక స్త్రీ నమ్మకం లేనిదని ఆమెకు ఎప్పుడూ కాపలా అవసరమని, ఆమెను సదా రక్షించకపోతే, ఇనుప కచ్చడాలు బిగించకపోతే తప్పు చేస్తుందనే భావం నీతి శతకకారులకు బలంగా ఉంది. అంతేగాక స్త్రీని ఒక యంత్రంగాకూడా భావిస్తూ, ఆ యంత్రాన్ని చేసినవాణ్ని నిందిస్తున్నాడు.

శ్లో॥ ఆవర్తః సంశయా నామ వినయ భవనం పట్టణం సాహసానాం
దోషాణాం సన్నిధానం కపటశతమయం క్షేత్ర మప్రత్యయానామ్
స్వర్గద్వారస్య విఘో నరక పురముఖం సర్వమాయా కరణ్ణం
స్త్రీయస్త్రం కేనసృష్టం విషమమృత మయం ప్రాణిలోకస్య పాశః
భర్తృహరి సుభాషితం - శృంగార శతకం 45,

తా॥ సంశయముల కునికిపట్టును, అడకువ లేమికిపుట్టినిల్లును, తెంపులకు వీడును, పాపములకు పెన్నిధియు, పెక్కు వంచనలే మేటుగా గలదియు, అపనమ్మికలకు పుట్టుచోటును, స్వర్గపు వాకిలి నడ్డగించు గడియ మ్రానును, నరక పట్టణమునకు వాకిలియు, మాయలకన్నింటికి

పెట్టియయు, ప్రాణులకుకట్టు త్రాడును, అమృతంవలె గాన్పించు విష ముసైన యీ స్త్రీయంత్రమునే మాయకాడు సృజించెనో! తెలియకున్నది.

ఇంతకంటే దూషణమేమున్నది? దురభిప్రాయమేమున్నది? అందుకే ఆర్ష సమాజంలో ఋషుల దగ్గర నుండి రాజుల వరకు అంటే గౌతముడి వంటి వారి దగ్గరనుండి రాముడి వరకు అందరూ స్త్రీలను అవమానించినవారే! అంతేకాదు, వారికి పరీక్షలుపెట్టి నిప్పుల్లో దూకించిన వారే. కొందరు శాపాలు పెడితే కొందరు పరీక్షలు పెట్టారు. ఇదే భారత దేశపు నీతిగా చెలామణి అయ్యింది. అంతేగాక, స్త్రీ చంచల చిత్త అని అనేకమందిని అనేక విధముల మురిపించునని ఆమెను నమ్మవద్దని నీతి శతకకారుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ జల్పన్తి సార్థ మన్యేన పశ్యన్త్యన్యం సవిభ్రమాః
హృద్గతం చిన్తయన్త్యన్యం ప్రియః కోనామ యోషితామ్.
భర్తృహరి సుభాషితము - శృంగార శతకం 80

తా॥ స్త్రీ లొక్కనితో ప్రేమమీర మాటాడుదురు. మరియొకని తళుకుబెళుకు నడకలతో జూతురు. మనస్సున మరొకని తలచు చుందురు. కాన వారి కిష్టుడు ఒకడనుట లేదు.

ఇది ఎంత పెద్ద అభియోగమో ఆలోచించండి. బహుభార్యత్వాన్ని నడిపించది పురుషుడు. అనేక సందర్భాల్లో స్త్రీని మోసగించే పద్ధతులను అనుసరించింది పురుషుడు. అందుకని పురుష ప్రపంచమంతా చెడ్డదని కాదు. స్త్రీని నమ్మకుండా మనస్సులో శంక లేర్పరచుకొని ఆమె మీద "అనుమాన"మే తప్ప అనురాగం లేకుండా చేయడం కోసం ఈ విధమైన నీతులు వల్లించారు. ఇవి నీతిగా ప్రచారం చేశారు. అంతేగాక స్త్రీ కంటి చూపు పాముకాటు కంటే దుష్కరమైనదనియు, పాము కరిస్తే వైద్యుడైనా ఉన్నాడుగాని స్త్రీ కంటిచూపు పడితేబాగుచేసే వైద్యుడే లేడనియు శృంగార నీతిశతక కర్త అభిభాషిస్తున్నాడు.

శ్లో॥ వ్యాదీర్ఘేణ చ లేన వక్రగతినా తేజస్వినా భోగినా
నీలాబ్జద్యుతినా వరమహందష్టోన తచ్చక్షుషా,

దష్టే సన్తి చికిత్స కా దిశిదిశి ప్రాయేణ ధర్మార్థినో
ముగ్ధాక్షీ క్షణ వీక్షి తస్య నహి మేప్రైద్యోనవ్యాప్యౌషధమ్.
భర్తృహరి సుభాషితం – శృంగార శతకం 54

తా॥ మిక్కిలి నిడుపై కదలుచు వంకరగా బోవునదియు, బలిమి గలదియునై పడగ గలిగి నల్ల గలువ వంటి వన్నె గల సర్పము నన్ను గఱచినను హానిలేదు. అయితే, చెవి వరకు నిడుపై యదురుచు, వంకరగా బోవుచు మెరుగు గలిగి విరిగి గలిగియుండు నల్లగలువకు సాటి వచ్చు నాకలువ కంటియొక్క చూపులను పాము గరచిన గీడు తప్పక వచ్చును. అది కొంచెమైనను మేలుకాదు. సాధారణములగు పాములు గరచిన జికిత్సచేయు పుణ్యాత్ములు మూలమూలకు నెందరోయున్నారు. ముద్దు చూడ్కులు గల కాల్గంటి చూపు తగిలెనా చికిత్సచేయు వైద్యులును లేరు. మందును లేదు.

స్త్రీని విషయుక్తంగా, స్త్రీచూపులను పాముకాటుగా వర్ణించి స్త్రీఎడ పైముఖ్యాన్ని కలిగించడం అశాస్త్రీయం, అసంబద్ధం, అనృతకల్పనం. స్త్రీ చూపేకాదు. స్త్రీయే విష సర్పమని నుడవడం స్త్రీ లోకాన్ని అవమానించడమేగాక మానవ సంస్కృతినే అవమానించటం—

శ్లో॥ అపసరసఖే! దూరా దస్మాత్కటాక్ష విషాన లాత్
ప్రకృతి విషమా ద్యోషిత్సర్పా ద్విలాస ఫణా భృతః
ఇతర ఫణినా దష్టశ్శక్య శ్చికిత్సితు మౌషధై
శ్చతుర వనితా భోగి గ్రస్తంత్యజన్తిహి మన్త్రిణః
భర్తృహరి సుభాషితం - శృంగార శతకం 51

తా॥ చెలికాడా! కడగంటి చూపులనెడి విషపు నిప్పులు గ్రక్కునదియు, స్వభావ వక్రమైనదియు, సొంపులనెడి పడగలను దాల్చినది యునైన యాడుది అను పాములు కరచిన యెడల మంత్రజ్ఞులు మూలికలు తెచ్చి చికిత్సచేసి విష వేగము తగ్గించి మాన్పుదురు. జాణయగు నెలతుక యనుపాముచే కరవబడిన దానిని కుదుర్చుట అసాధ్యమని తలంచి మంత్రజ్ఞులు విడిచివేయుదురు.

ఈ శతకం చదివిన తరువాత, ఈ శతకంలోని భావాలను నమ్మితే స్త్రీలోకం ఎంత 'అవమానింపబడాలో ఆలోచించండి. అయితే ఇంతవరకు నమ్మినవారి సంఖ్యకూడా గణనీయంగానే యున్నది.

ఇంతేగాక వేదాంతులు తమకు బ్రహ్మలోకం కనిపించాలంటే స్త్రీ మోహం ఉండకూడదని ఒక సిద్ధాంతాన్ని చెప్పి స్త్రీ స్వర్గానికి, ముక్తికి అడ్డంకని నీతులు, నీతి సూక్తులు వల్లించారు. అదే విషయాన్ని సమర్థిస్తూ భర్తృహరి ఈ విధంగా నుడువుచున్నాడు.

శ్లో॥ యదాసీ దజ్ఞానం స్మరతిమిర సఞ్చార జనితం
తదా దృష్టం నారీమయ మిదమశేషం జగదితి,
ఇదానీ మస్మాకం పటుతర వివేకాఞ్జనజుషాం
సమీభూతా దృష్టిస్త్రి భువనమపి బ్రహ్మమనుతే.

భర్తృహరి సుభాషితం - 69

తా॥ మరుండనెడి యంధకారము వ్యాపించుటచే నెప్పుడు తెలివిలేమి గలిగెనో, అప్పుడు నా కంటికి బ్రహ్మ స్వరూపమగు ప్రపంచమెల్ల స్త్రీ మయముగా దోచెను. మేలయిన వివేకమను కాటుక వేసికొనుటచే నా కన్నుల మసక దొలగి ఇప్పుడు ప్రపంచమెల్ల బ్రహ్మ స్వరూపముగా దోచుచున్నది. అవివేకులకు ప్రపంచము స్త్రీయే. వివేకులకు ప్రపంచం బ్రహ్మయే యనుట.

ఈ శ్లోకానికి భర్తృహరే మరొకచోట ఈ విధంగా సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ స్వపర ప్రతారకోఽ సౌ నిన్దతి యోఽలీకపణ్డితో యువతీః
యస్మాత్తపసోఽపి ఫలం స్వర్గః స్వర్గేఽపి చాప్సరసః

భర్తృహరి సుభాషితం – శృంగార శతకం 72

తా॥ బూటకపు బండితులు గొందరు స్త్రీలు చెడ్డవారు, వారితో జేరరాదు. అరణ్యము లందు దపస్సు చేయుట మేలని పల్కుచుందురు. వీరు తాము మోసపోయి, యొరులను మోసపోవునట్లు చేయుదురు. ఏలయన, ఆ తపస్సుకు ఫలం స్వర్గమేకదా ? స్వర్గమున నుండు

వారచ్చరనె. అచ్చటికిబోయినను మగువలే తపఃఫలముగా నున్నప్పుడు స్త్రీలను నిందించుట పైకేగాని లోపల స్త్రీ లాభమునకు దగిన పనులనే వారు చేయుచుందురు.

ఇహ పరలోకాలు రెండింటిలోను స్త్రీ సుఖముదప్ప పురుషుడికి వేరే ఆలోచన లేదనే భావన పై రెండు శ్లోకాలవల్ల మనకు భర్తృహరి వివరిస్తున్నాడు. స్త్రీలు సద్గతి విరోధులని అతడి భావము. స్త్రీని మోహించినవాడు లేక అభిమానించినవాడు మంచి మార్గములో నడవలేడని చెప్పటం ఎంత అనుచితమో ఆలోచించండి. సంస్కృత వాఙ్మయంలో స్త్రీని శృంగార భావంతో తప్ప మరొక విధంగా చూడడం చాలా మృగ్యంగా ఉంది. స్త్రీతో చెలిమి వలన ఎంత శాస్త్రవేత్తయైన మంచి మార్గములో నడువలేడని వివరిస్తున్నాడు చూడండి.

శ్లో॥ శాస్త్రజ్ఞోఽపి ప్రగుణితనయోఽప్యాత్తబోధోఽపి బాఢం
సంసారేఽస్మిన్ భవతి విరలో సద్గతీ నామ్,
యేనైతస్మిన్నిరయనగరద్వార ముద్ఘాటయన్తీ
వామాక్షీణాం భవతి కుటిలా భ్రూలతా కుఞ్చికేవ.

భర్తృహరి సుభాషితం - శృంగార శతకం 77

తా॥ ఈ సంసారమున నందమగు కన్నులుగల పొలతుల యొక్క వంకరలైన తీగెవంటి కనుబొమలు నరక పట్టణముయొక్క తలుపులు తీయు కుంచె కోలలవలె నున్నవి కాన నీ సంసారమున మెలగెడు మానవుడు శాస్త్రజ్ఞుడయినను, నీతిని దెలిసిన వాడయ్యు, జక్కగా గురూపదేశము నొందిన వాడయినను సద్గతినొందుట దుర్లభము.

అంతేగాక స్త్రీని కేవలం భౌతిక రూపిణిగానే భావిస్తున్నాడు. ఆ భౌతిక దేహాన్ని ఆనందించిన కవులను నిరసిస్తున్నాడు. స్త్రీలో ప్రాకృతిక సౌందర్యం ఏమీలేదని, కేవలం మాంసపు తిత్తులే ఆమె శరీరమని కవులు అనవసరంగా ఆమెను అభివర్ణిస్తున్నారని వైరాగ్యాన్ని ప్రబోధిస్తున్నాడు. ఆ వైరాగ్యంలో స్త్రీ మీద అసహ్య భావాన్ని ప్రోది చేస్తున్నాడు.

శ్లో॥ స్తనౌ మాంసగ్రంధీ కనకకలశా విత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాఙ్కేనతులితమ్
స్రవన్మూత్ర క్లిన్నం కరివరశిరస్స్పర్ధి జఘనం
ముహుర్నిన్ద్యం రూపం కవిజన విశేషైర్గురుకృతం

భర్తృహరి సుభాషితం - వైరాగ్య శతకం-16

తా॥ మాంసపు ముద్దలైన స్తనములను బంగరు కుండలనియు, కఫమునకు నెలవగు మొగములు చంద్రబింబములనియు, మూత్రవసిక్తమగు జఘన స్థలమును ఏనుంగు కుంభస్థలమనియు, ఈ విధముగా ఏవగింపదగిన కామినీ రూపమును కొందరు కవులు పెద్దచేసి పొగుడుదురు.

ఇక్కడ "ఏవగింపు" "నిన్ద్యంరూపం" అనేది గమనించ దగిన విషయం. స్త్రీతో సంబంధము కలిగివుంటే మోక్షము లేదు; తపస్సు లేదు; నిద్రలేదు; స్త్రీ కామ స్వరూపిణి, ప్రేరణశక్తి; స్త్రీని చూస్తే పురుషుడు ఏ పరిస్థితుల్లోవున్నా వెంటబడతాడు. అందుకే పురుషుడు స్త్రీకి దూరంగా ఉండాలి అని ప్రబోధిస్తున్నాడు. "సంసార కారగృహే" అని సంసారాన్ని కారాగృహంగా వర్ణిస్తున్నాడు. స్త్రీ విషయ సుఖములందు ఆసక్తి కలదని కామ స్వరూపిణియని, ఆమె యెంతటి నిష్టాగరిష్టుణ్ని అయినా లోబర్చు కుంటుందని, ఆమెకు దూరంగా ఉండటం మంచిదని, స్త్రీఅంటే మోహందప్ప మరొకటి కాదని భర్తృహరి స్త్రీని గూర్చి చాలా అసంబద్ధమైన, అనృతమైన ప్రకటనలను తన శృంగార, వైరాగ్య శతకాల్లో వాకొన్నాడు. అయితే "స్త్రీకి హృదయముంది." ఆ హృదయానికి సముద్రమంత లోతైన భావాలున్నాయి. హిమాలయాలకంటే ఎత్తైన ఆశయాలున్నాయి అని మాత్రం భర్తృహరికి తెలియదు. ఈతడి ప్రభావం తెలుగుశతకకారులైన పెద్దన, ధూర్జటి వంటివారి మీద ప్రగాఢంగా ఉంది. సమాజంలోకి ఈ భావమే బాగా ప్రచారమయ్యింది. ఆమెమీద ఉన్నతమైన భావాలు ప్రచారంలోకి రాకుండా ఇవటుంటి అవగాహనలేని ఔన్నత్యంలేని దుర్నీతులు వ్యాప్తిలోనికి వచ్చినాయి. భర్తృహరి క్రీ॥శ॥ 500 లకు పూర్వమువాడు అని కొంతమంది చెబుతున్నారు. స్మృతికారులు న్యాయబద్ధంగా ఏ విషయాలు ప్రచారం చేశారో, నీతి శతకకారులుకూడా అవే విషయాలను కవితాబద్ధం, సూత్రబద్ధంచేసి ప్రచారంలోకితెచ్చారు. ఈ సూక్తాలు స్త్రీని అన్ని కోణాల నుండి అధ్యయనం చేయడానికి అడ్డు

పడ్డాయి. ఆమె వ్యక్తి వికాసాన్ని ఈ అపవాదులు ధ్వంసం చేశాయి. ఆమెకూడా మానవురాలే ననే వివేకం నాశనమై, ఆమెకుకూడా మానవ సంస్కృతికి సంబంధించిన అన్ని కోణాలు ఉంటాయి అనే అంశం మరు గునపడి, కేవలం ఆమెను శృంగార పరంగా, భోగపరంగా, సంభోగ పరంగా చూడటమే అలవాటుగా సంక్రమించి ఆమెపై అనుమానాలు గూడుకట్టుకొని, ఆమెను కట్టడుల్లో పెట్టడానికి బాల్య వివాహాలు, సతీ సహగమనాలు, అంతులేని దురాచార విష వలయాలు, అభేద్యమయిన దుర్నీతి సంకెళ్ళు బిగించి, ఆమెపై భారతీయ వైదిక బ్రాహ్మణ సామా జిక వ్యవస్థ తీవ్రమైన అత్యాచారాన్ని గావించి ఆమెను అణచి వేసింది అనే చారిత్రిక సత్యం ఈ ఉదాహరణల నుండి మనకు వ్యక్తమవుతుంది.

భారతదేశంలో స్త్రీకి విముక్తిని, వ్యక్తిత్వాన్ని సంతరించాలంటే ఎన్ని కోణాల నుండి అణచివేశారో ఆ కోణాలన్నింటిని పరిశీలించాలని ఇంతకుమునుపే అనుకున్నాము. అందుకే ఆ క్రమంలో మరింత ముం దుకు పోదాము.

# అధిక్షేప శతకాల్లో స్త్రీ

ఆంధ్ర సాహిత్యంలో శతకముల శాఖ చాలా విశిష్టమైనది, విశాల మైనది. ప్రసిద్ధములైన "సుమతి" "వేమన" శతకములేకాక వేలాది శతకాలు తెలుగు భాషలో వెలువడ్డాయి. వీటిలో భక్తి, నీతి, శృంగార శతకాలేకాక "అధిక్షేప," చారిత్రక, కథాత్మక, శాస్త్ర, తత్వవర్ణనాత్మక శతకాలు పెక్కులున్నాయి. ఈ శతకాలన్నింటిలో అధిక్షేప శతకాలుగా పేర్కొనబడు కవి చౌడప్ప, వేణుగోపాల, గువ్వలచెన్న శతకాల వంటివి ఇప్పటికీ ప్రజల నాలుకలపై నర్తిస్తూ ఉన్నాయి. ఈ అధిక్షేప శతకాల్లో కూడా స్త్రీని అనేక సందర్భాల్లో అపహాస్యంగా సంబోధించడమేగాక వ్యంగ్యంగా, వెటకారంగా, చమత్కారంగా "స్త్రీ"లపై అనేక విసుర్లు విసరడం జరిగింది. ఈ కవులకు ఒక రకంగా స్త్రీలమీద సదభిప్రాయం లేదు. వీరి విసురుల ప్రభావం సమాజంమీద చాలా ప్రగాఢంగా ఉంది. అనేక సందర్భాల్లో గ్రామాల్లోకూడా రచ్చబండలమీద ఈ పద్యాలను, వ్యాఖ్యలను వాచాలురు వాడడం వింటూనే ఉంటాము. అశ్లీలమైన శబ్దాలను కూడా కవులు ఛందోబద్ధమైన కవిత్వంలో యథేచ్ఛగా వాడడం జరిగింది,

"లంజకు ధన మీఁదలతురు
రంజన గలదైనమూఢు రాలే యైనన్
(కవి చౌడప్ప శతకం_66)

ఇక్కడ స్త్రీని న్యూనత పరచే బూతు పదాన్ని వాడడానికి కవి వెనుకాడలేదు. అవే శబ్దాలు మహా పండితుల నోటకూడా అనూచానంగా రావడం మనం చూస్తూనేవున్నాం. అంతేగాక పురుషుడు ఇతర స్త్రీలతో తిరగడం ఒక గౌరవంగా పేర్కొంటూ అదే సమయంలో స్త్రీని న్యూనత పరచే పద్యాలు చూస్తుంటే కవులకు స్త్రీ అంటే ఎంత చులకన భావమో మన కర్థమవుతుంది.

"పండుగ పండుగ యందురు
పండుగ యెనమేమి? వయసు సడుచుల ప్రక్కన్
పండిన దినమే పండుగ
ఖండిత యశ కుందవంపు కవి చౌడప్పా!"
(72వ పద్యం)

"కొండవలె పెనిమిటుండగ
మిండనిఁ జవి మరిగి కడలు మీఱుచుఁ దిరిగే
రండను యమపురి జీల్తురు
కండలుగా కుందవరపు కవి చౌడప్పా"

(60వ పద్యం)

ఈ పద్యాల వలన మనకు నీతికంటే "స్త్రీ"ని ఎంతెంత మాటలని న్యూనత పరచినా అడ్డు చెప్పేవారు లేరనేది స్పష్టమవుతుంది. ఏ అలంకార శాస్త్రముకూడా దీన్ని అనౌచిత్యమని చెప్పలేదు. పైగా స్త్రీని అంగాంగ వర్ణన చేయడం ద్వారా పాఠకుణ్ణి సంతోష పెట్టడం లాగానే పాఠకుణ్ణి సంతోష పర్చడానికి ఈ విధమైన శృంగార భాషణంగూడా మార్గంగా భావించారు. కవిత్వం అంటే ఎదుటి వాణ్ని ఎంత దిగజారిన శబ్దాలతోనైనా ముదిపించడం అని కవి చౌడప్ప ఈ పద్యాలద్వారా రుజువు చేస్తున్నాడు.

"గుడిసెయు మంచము, కుంపటి
విడియము, పొగాకు, రతికి వెంపరలాడే
పడతియు గల్గిన చలి యె
క్కడి దప్పా కుందవరపు కవి చౌడప్పా!"

(59వ పద్యము)

"వగలాడి చెంతనుండిన
మగవానికి నూరకుండ మనసయ్యేనా
తగు సరసమ్ముల వాడక
ఖగపతి ఖల కుందవరపు కవి చౌడప్పా!"

(61వ పద్యం)

ఈ విధంగా పరిశీలిస్తే కవి చౌడప్ప తన శతకంలో ఇంకా భరించరాని భావాలను శబ్దాలను వాకొన్నాడు. అదేమి వింతో! నవ్యులైన సాహితీ విమర్శకులుకూడా ఈ విధమైన వ్రాతలను ఏ రూపంలోను ఖండించలేదు. ఈ విధమైన పద్ధతి ఆర్య సంస్కృతీ ప్రభావంతో బాగా పెరిగింది, స్త్రీ అంటే ఒక భోగ వస్తువని, స్త్రీ ఒక వ్యాపార వస్తువని

ఆమెను ఏకోణం నుండి అధిక్షేపించినా, వ్యాఖ్యానించినా. వర్ణించినా అది అనౌచిత్యం కాదని మహా పండితులకూడా వున్న అభిప్రాయంగా తెలుస్తూవుంది. అందుకే ఇటువంటి అవాకులు చవాకులను కూయ గలిగినవాడే గ్రామాల్లోకూడా "చమత్కారి"గా చెలామణి అవుతున్నాడు.

అంతేగాక తక్కువ కులాల స్త్రీని చాలా అపహాస్యంగా, ఎందుకూ కొరగాకుండ, అసె, ఒసె, అయే, ఒయే అని పిలవడమే గాకుండ, ఒక రకమైన వెటకారంతో అవమానాన్నంతా ఒక చోట చేర్చి పలుకుతారు. ఈ తక్కువ కులాలుగా చూడబడే స్త్రీలకు దానం చేసిన ఒకణ్ణి ఎద్దేవా చేస్తూ వేణుగోపాల శతక కర్త పోలిపెద్ది వేంకటరాయ కవి ఈ విధంగా వ్యాఖ్యానిస్తున్నాడు.

"ఈడిగె ముత్తికి జోడు శాలువలిస్తి
కురుబ గంగికి జరీ కోకలిస్తి
కడియాలు కుమ్మర కనికికి దర్శిస్తి
పోగులు గోసంగి పోలి కిస్తి
పోచీలు చాకలి పుల్లి చేతుల వేస్తి
దానితల్లికి నూఱు దారవోస్తి
దాసరచ్చికి దేవతార్చనలమ్మిస్తి
గుణాగ్రిన్ని ఉప్పర కొండి కిస్తి
ననుచుఁ బాత్రమపాత్రము ననక యిచ్చి
చెప్పుకొందురు మూఢులు సిగ్గులేక
మదరిపులిఘాల మునిజన హృదయులోల
వేణుగోపాల భక్త సంత్రాణ శీల !"

(వేణుగోపాల శతకం - 21 ప)

ఈ పద్యంలో అణగద్రొక్కబడ్డ కులాల స్త్రీలకు దానం చేయడాన్ని అపాత్ర దానంగా తేల్చాడు కవి. ఇక ఆ స్త్రీలను ఈడిగెముత్తి, కురుబ గంగి, కుమ్మర కనికి, గోసంగి పోలి. చాకలి పుల్లి, దాసరి అచ్చి, ఉప్పర కొండి అంటూ సంబోధించాడు. భారతదేశంలో ప్రతి గ్రామంలో అగ్రవర్ణాల, ధన మదాంధుల చేత అనునిత్యం వాళ్ళు ఈ విధంగానే పిలువబడుతున్నారు. పెద్దకులాల వాళ్ళైతే దొరసానమ్మలు, అమ్మగార్లు

అని పిలవాల్సిందే. ఈ పద్యంలో సామాజిక వాస్తవికత కన్పిస్తున్న ప్పటికీ కవికూడా వీరిని నీచంగా పిలవడమే ఔచిత్యంగా భావిస్తున్నాడు. ఉదయం లేచి ఏ శ్రామిక స్త్రీల చెమట మీదయితే ఈ భూస్వాములు బ్రతుకుతారో ఆ శ్రామిక స్త్రీలను అపహాస్యంగా తక్కువచేసి పిలవడము, మాట్లాడడం ఈనాటికి పరిపాటిగా సాగుతుంది. అది గ్రామీణ సంస్కృతిగా చెలామణి అవుతుంది. కాని అది భూస్వామ్య సంస్కృతి. ఈ భూస్వాముల చేత పోషింపబడే ఈ కవుల భాషణలుకూడా ఆ సంస్కృతికి అనుకూలంగానే వుంటాయి.

అంతేగాక భార్యనుకూడా అనేకమైన వెటకారపు మాటలతో న్యూనత పరచే పదాలు చాలామంది వాడడం చూస్తూవుంటాము. ఈ విధమైన అవాకుల దండకం వంకాయలపాటి వేంకటకవి తన "మదన గోపాల శతకం"లో ఈ విధంగా కూర్చి పేర్చాడు.

పలుగు గయ్యాళి దెబ్బల గండు పలుగాడి
మూలుగుబోతు బలె మాయలేడి
పిసిని గొట్టు పిసాళి పెంకెబొంకుల పుట్ట
చెడుగు నిక్కులయిక్క చెనటిమంకు
టకుబాజు కల్లరి టాటోటు గడుమోట
బందెల పుట్టిల్లు నందగత్తె
అంకుల రాట్టంబు రవ్వలమారి తం
టాకోరు రంతుల రావు ముచ్చు

ఇట్టి బేర్జంపుఁ బెండ్లాము నేలుచున్న
నరుని దౌర్భాగ్య దశ యెన్న నొరుల వశమె
భూరిమయ వాస! కోలంక పుర నివాస!
మదన గోపాల! రాధికా హృదయ లోల!

(మదన గోపాల శతకం - 70 ప)

ఈ పద్యంలో భార్యకు - పలుగు గెయ్యాళి, దెబ్బల గండు, పిసిని గొట్టు, పెంకె, బొంకుల పుట్ట, చెడుగు, మంకు, కల్లరి ఇటువంటి బిరుదులు ఎన్నో ఇచ్చాడు. స్త్రీ అంటే గయ్యాళిదనే భావాన్ని చాలా పెద్ద

యెత్తున ప్రచారం చేశారు శతక కవులు. ఈ విషయములో "వేమన్న" కూడా సోరు కలిపాడు, పురుషుని ఆగడాలను కప్పిపుచ్చుతూ స్త్రీలను తక్కువ కులం పేరుతో నిందించడం, వేశ్యల పేరుతో నిందించడం, చివరకు భార్యపేరుతోకూడా నిందించడం జరిగింది. భార్యను నిందించే మరో దండకాన్ని కూడా ఈ వేంకటకవిగారే కూర్చారు.

"దాన ధర్మ విహీన మానసురాలు
సకల మాయావాద జన్మురాలు
గురుతరానేక దుర్గుణ గణాన్వితురాలు
బహు జనోపద్రవ సహితురాలు
భూత భేతాళ ప్రభూత భీకరురాలు
సతతాన్య నిందా విచారురాలు
భూరి కోప వికార భార దారుణురాలు
పరజన ద్రవ్యాపహరుణురాలు
యెన్న నిటువంటి పెండ్లాము నేలుచున్న
పురుషుని యభాగ్య మెంతని బొగడవచ్చు

(మదన గోపాల శతకం - 71)

ఇక్కడ సంస్కృత సమాసాల్లో "భార్యా నింద" కనిపిస్తుంది. స్త్రీ దుర్గుణ గణాన్వితురాలుగా. భూరి కోప వికారభార దారుణురాలుగా వర్ణింపబడింది. ఇదే విధంగా "గువ్వల చెన్న శతకం"లో కూడా పేర్కొనడం జరిగింది.

"ఆలికి చనువిచ్చిన చోఁ
దేలిక కులమందునైనఁ దేలిక చేయున్

(గువ్వల చెన్న శతకం - 83 ప)

ఈ విధంగా అధిక్షేప శతకాల్లో స్త్రీని వర్ణించిన తీరు, స్త్రీని వ్యాఖ్యానించిన తీరు అనాటి సామాజిక వాస్తవికతతో స్త్రీని న్యూనత పరచిన విషయాన్ని మనకు బోధపరుస్తుంది. దీనంతటికిమూలం వైదిక సంస్కృతిలోని స్మృతి, ఇతిహాసాల ప్రభావం సమాజం మీద ఉండడం భూస్వామ్య వ్యవస్థలో స్త్రీని ఆస్తిహక్కుకు దూరంగా ఉంచడం అని మనకు సుబోధ

మవుతుంది. రాచరిక వ్యవస్థల కాలములో కొన్ని శతకాలు, రాచరిక వ్యవస్థలు కూలుతున్న, జమిందారీ వ్యవస్థకు పునాదులు రూపొందుతున్న దశలో కొన్ని శతకాలు వ్రాయబడ్డాయి. రాచరిక, జమిందారీ వ్యవస్థ లన్నింటిలోను గ్రామాల్లో కొనసాగింది భూస్వామ్య వ్యవస్థే. ఈ భూస్వామ్య వ్యవస్థలో స్త్రీ ప్రధానమైన శ్రామిక శక్తిగా ఉన్నప్పటికీ కూడా అన్ని కోణాల్లోను స్త్రీని చాలా హీనంగా చూడడం, వ్యాఖ్యానించడము జరిగింది. ఈ భూస్వామ్య వ్యవస్థను కూల్చే ఆర్థిక పోరాటాలను రూపొందించుకొనే క్రమంలో దాని పునాదుల మీద రూపొందిన సంస్కృతినికూడా శిధిలం చేయవలసిన అవసరం బలంగా ఉంది.

ఏ సంస్కృతినైనా నాశనంచేసి దాని స్థానంలో నూతన సంస్కృతిని వ్యాపింప జేయాలంటే ఆయా సంస్కృతుల మీద మనకు పూర్తి అవగాహన, లోతైన అధ్యయనం అవసరం. అందుకే స్త్రీ మీద నేటికి కొనసాగుతున్న దారుణమైన సాంఘిక, సాంస్కృతికమైన దోపిడీని ఎదుర్కోవానికి ఇటువంటి సాహితీ ధోరణులన్నింటినీ నిరసించి, నూత్న సంస్కృతిని రూపొందించుకోవాలి. అప్పటి వరకు కవి చౌడప్పలు, గువ్వల చెన్నలు, వంకాయలపాటి వేంకట కవులు పుడుతూనే వుంటారు. జుగుప్సాకరమైన భావజాలాన్ని సృష్టిస్తూనే వుంటారు. సాంఘిక వ్యవస్థయొక్క పునాదులను మార్చుకొనే వరుసలోనే ఈ విధమైన సాహితీ దోరణులలో కూడా మార్పు వస్తుంది. ఆధునిక కాలములో అసలు మార్పంటూ లేదని కాదు. గ్రామీణ భూస్వామ్య వ్యవస్థలో ఈ భావాలకు, భాషణలకే ఈనాటికీ ఆదరణ కనిపిస్తూవుంది.

## సామెతల్లో స్త్రీ

స్త్రీలోకాన్ని దాస్యంతో ముంచి నాలుగు గోడల మధ్యలో బంధించి విద్యా విహీనురాలుగా లోకజ్ఞాన శూన్యురాలుగా ఉంచడానికి దుష్ట ధర్మకర్తలాదేశించారు. అవే నేడు - లోకోక్తులుగా, సామెతలుగా, ప్రజల్లో వాడుకలో ఉన్నాయి.

ఈ సామెతలు లోకోక్తులు. నానుడులు కవి భాషణలు మనము పరిశీలిస్తే మనకు తెలుస్తుంది మన సంస్కృతిలో స్త్రీ అపహాస్య ధోరణి ఎంత బలంగా పేరుకు పోయిందో.

"ఆడది-తిరిగి చెడును
మగాడు తిరగక చెడును"

అనే సామెత పై అభిప్రాయాన్ని ప్రకటిస్తుంది. అంతేగాక "భర్త మొదలగు పురుషులు స్త్రీలను తమ అధీనములో ఉంచుకొన వలయును. వారు ఏ సుఖమును అనుభవించుటకు వీలులేని అస్వతంత్రురాండ్రుగా తమ అధీనములో ఉంచుకొనవలయును" అని మనువు అన్నాడు అందుకే

"ఆడదాని బుద్ధి అపరబుద్ధి" అనే లోకోక్తులు వాడుకలోకివచ్చాయి. అంతేగాక అశ్లీలమైన సామెతలెన్నో వాడుకలోవున్నాయి. బాల్యవివాహాలను వితంతు వివాహాలనుఖండిస్తూ హేళనచేస్తూవచ్చిన సామెత చూడండి.

"తెగించిన దానికి తెడ్డే లింగం
విడిచిన దానికి వీరేశలింగం"

వితంతు వివాహాలను జరిపించి నందుకు మన దుస్సంప్రదాయపరులు వీరేశలింగంగారి మీద అపవాదాల నిప్పుకలు జల్లారు. భర్త చనిపోయిన తరువాత "వేరే పెళ్ళి చేసుకున్న స్త్రీ విడిచేసిన దానికింద లెక్కట, ఆవిడకు వీరేశలింగమే దిక్కట" ఈరోజు వితంతు వివాహాలు సంప్రదాయంగా మారినా, ఆ-సామెతలు మాత్రం మన నాలుకల మీద నుంచి పోలేదు. ఆ భావాలు మన మనస్తత్వం మీద పెత్తనం చేస్తున్నాయి. అయితే ఒక స్త్రీని గూర్చి మరొక స్త్రీ ఈ సామెతను పలకడం అనేది చాలా విడ్డూరంగా కనిపిస్తుంది.

ఈ సమాజంలో స్త్రీల ఒక్కొక్క మూఢాచారాన్ని దగ్ధమొనర్చడానికి ఒకొక్క సామాజిక సంస్కరణోద్యమం జరిగింది. అయితే ఈనాడు స్త్రీలు ఆ సామాజిక విప్లవాలనన్ని మరచిపోయి భజనలకు అంకితం కావడం పాత ఆచార సంప్రదాయ మౌఢ్య భావాల్లో మ్రగ్గి పోవడం విచారకరము. ఆ భజనలు విడచి లోకంలోకెళ్ళి ; కళ్ళెత్తి చూచి తమను అపహాస్యం చేస్తున్న లోకోక్తులను సామెతలను విడనాడ వలసివుంది.

ఇంకా ఆడవాళ్ళను అబద్ధాల కోరులుగా ప్రచారం చేశారు. వాళ్ళు నమ్మదగ్గవారు కాదని అబద్ధాలు చాలా నమ్మేటట్లుగా చెప్పగలరని దుయ్యబట్టారు.

"ఆడది బొంకితె గోడ బెట్టినట్లు
మగవాడు బొంకితె తడిక బెట్టినట్లు"

ఈ సామెత పల్లెపట్టుల్లో ఎక్కువుగా అంటూవుంటారు. ఈ విధంగానే; బొంకులాడి, రంకులాడి, అనే నానుడులుగూడా వాడుకలో ఉన్నాయి. ఈ సామెత వేమన పద్యాలలోనుంచే సామెతగా మారింది.

"ఆడుదాని బొంకు గోడ పెట్టిన యట్లు
పురుష వరుని బొంకు పూరి తడిక
స్త్రీల నేర్పు నుగల చీకాకు పరచురా"
(వేమన పద్యరత్నాకరం 601 పేజి)

అమృత మూర్తిని అనృత మూర్తిగా చిత్రించిన తీరు చాలా ద్వేష పూరితంగా ఉంది.

సామాజిక విప్లవమూర్తి వేమన వంటివాడుకూడా స్త్రీల విషయములో ఇట్లా వక్రంగా భాషించాడు.

ఆడు దనగ రోత, యది చూడగా రోత
తలచి చూడ తనకు తానె రోత
ఎంతవారికైన ఇంతియె బల్ఘాత
(వేమన పద్య రత్నాకరం 234 పేజీ)

అని ఈసడించడం చూస్తె దేశంలో సంస్కర్తలుకూడా స్త్రీల విషయంలో ఎట్లా పలికారో వేరుగా చెప్పనక్కర లేదు.

అంతేగాక, పురుషుల్లో కామం పుట్టడానికి స్త్రీలే కారణమని తెగనాడిన పద్యం వేమన స్త్రీ అసహనానికి ప్రతీక,

"ఆడుదాని జూడ నర్థంబు జూడగ
బమ్మకైన బుట్టు రిమ్మ తెగులు
బ్రహ్మ యాలి త్రాడు బండి రేవునతెంప"
(వేమన పద్య రత్నాకరం 29 పేజి)

అని హేళన చేశాడు. స్త్రీని మోహ మూర్తిగా, కామ స్వరూపిణిగా చిత్రిస్తూ పురుషులే చాలా ఉత్తములైనట్లుగా, వేమన ఈసడించడం చాలా జుగుప్సాకరంగా ఉంది.

కవి సార్వభౌముడైన శ్రీనాథుడు భర్త చనిపోయిన స్త్రీలను ఎంత హేళనగా ఎగతాళి చేస్తూ దీవిస్తున్నాడో చూడండి.

"ముండ ముండకు సంపత్సమృద్ధిరస్తు
పరచు తెంపికి నిత్య భాగ్య మస్తు
వదరు బోడికి నీప్సితా వాప్తిరస్తు
బలు వితంతుకు మైథున ప్రాప్తిరస్తు"
(తెలుగులో తిట్టు కవిత్వం 130 పేజి)

ఇంకా స్త్రీలను అపహాస్యం చేసిన చాటువులెన్నో శ్రీనాథుడు పలికాడు. అవి ఇప్పటికీ ప్రజల వాడుక భాషలో రాజ్యం ఏలుతూనే ఉన్నాయి. శ్రీనాథుడు, తెనాలి రామలింగడు స్త్రీని అపహాస్యం చేసిన రచనలు ఉదహరించుటకుకూడా జుగుప్సను కలిగిస్తాయి. కుల మతాలను ఖండించిన ప్రజాకవి వేమన స్త్రీల విషయంలో చాలా అపహాస్యంగా పలకడం నిజముగా విచారకరమైన విషయం.

"జారపురుషునకు జాజి పువ్వులతోడ
పాన్పు వేయును మన పాత లంజ
సొంత మగని మీద చింత నిప్పులు జల్లు"

ఈ విషయాన్ని రావూరిదొర స్వామి శర్మగారు ఎలా సమర్థిస్తున్నాడో చూడండి "ఈ విధంగా నిశ్శంకముగా నిష్పక్షపాతంగా హాస్యస్ఫోరకముగా లోకంలోని అసంగత చర్యలను వేమన విమర్శించుచూ తిట్టినాడు." (తెలుగులో తిట్టు కవిత్వం 93 పేజి)

విమర్శకుడు ఇట్లు సమర్థించుట సరియైన పద్ధతికాదు. సత్యాన్ని సత్యంగా. అసత్యాన్ని అసత్యంగా ఒప్పుకోవాలి. స్త్రీల విషయములో వేమన ఒక తిట్టు కవిగా కనిపిస్తాడు. స్త్రీలను అవమాన పరుస్తూ ఆతడు చేసిన రచనలు ఇప్పటికి సామెతలుగా చలామణి అవుతున్నాయి. ఆ ధోరణిని మనం తప్పక ఖండించాల్సి ఉంది.

నేటికి మనం "ఆడదాని మాట నీళ్ళమూట" అన్న సామెతలను వాడటం ఎంత సిగ్గుచేటో ఆలోచించండి.

వారిని అవమాన పరచే ధోరణు లన్నింటిని స్త్రీ ఉద్యమాలు ధ్వంసము చేయవలసి ఉంది.

మొత్తం మీద బాల్య వివాహాలను ఎదిరించి వితంతు వివాహాలను ఆచరించి విద్యాసంపత్తి నలవరచుకొని మూఢాచారాల దుష్ట సంకెళ్ళను ఒక్కొక్కటిగా తెగ్గొంచుకొని నానాటికీ ముందుకు పోతున్న స్త్రీ లోకం తనను అవమానించి అపహాస్యం చేసే సామెతలను; లోకోక్తులను; నానుడులను ప్రకటలను, దుష్ట కవితలను; నగ్న చిత్ర ప్రదర్శనలను సామాజిక గర్భం నుంచి నిర్మూలించుకొనే ఉద్యమాలు నడపవలసిన అవసరం ఎంతైనా వుంది. 

# సంస్కృత కావ్యాల్లో స్త్రీ

భారతదేశంలో అన్ని భాషల్లో వెలువడిన పద్య కావ్యముల మీద సంస్కృత కావ్యాల ప్రభావం స్పష్టంగా వుంది. సంస్కృత కావ్యాల్లో ప్రధానంగా వర్ణించబడింది స్త్రీయే. సంస్కృత కావ్యకర్తల్లో ప్రముఖుడు కాళిదాసు: ఈతడు రచించిన రఘువంశము బృహత్ కావ్యము, పందొమ్మిది సర్గల ఈ ప్రబంధము దిలీపుడు మొదలుకొని అగ్నివర్ణుని వరకు గల 29 మంది సూర్యవంశ రాజుల చరిత్రలను తెలుపుచున్నది. రఘువంశములో స్త్రీ అనేక చోట్ల ఉదాత్తంగాను, శృంగార పరంగాను వర్ణింపబడింది. పదునాల్గవ సర్గలో సీతాపరిత్యాగ ఘట్టము కరుణరస భరితంగా వర్ణింసబడింది. తరువాత గణతికెక్కిన కాళిదాసు కావ్యము కుమార సంభవము. ఇది 17 సర్గల మహాకావ్యము. దీనిలో పార్వతీ జననము, పార్వతీ పరమేశ్వర పరిణయము, కుమారస్వామి ఉదయము, తారకాసుర సంహారము వంటి ఘట్టములు శివ, పద్మ పురాణాల నుండి తీసుకొని వర్ణింపబడినవి. కుమార సంభవంలో పార్వతీ పరమేశ్వరులకు సంబంధించిన అనేక ఘట్టాలు పచ్చి శృంగారంగా వర్ణింపబడినవి. పార్వతిని కేవలం శృంగార భోగేచ్ఛగల మానినిగానే వర్ణించడం జరిగింది. దీనిలోని 8వ సర్గలో సంభోగ శృంగారాన్ని పచ్చిగా వర్ణించిన శ్లోకము చూస్తే తెలుస్తుంది.

శ్లో॥ ఊరు మూల నఖమార్గ రాజిభిస్తత్
క్షణే హృత విలోచనో హరః
వాససః ప్రశిథిలస్య సంయమం
కుర్వతీం ప్రియతమా మ వారయత్॥

ఈ విధమైన వర్ణనలు కుమార సంభవములో కొల్లలుగా కనిపిస్తాయి.

ఆ తరువాత ప్రసిద్ధి చెందిన కావ్యాల్లో "మేఘ సందేశం" ఒకటి ఇందులో శాపోపహతుడైన యక్షుడు అడవుల్లో కొండల్లో తిట

గుతూ తన ప్రియసికి మేఘుడిచేత సందేశం సంపడం చెప్పబడింది, ఇందులో ఉదాత్తమైన భావములు వున్నాయి. విప్రలంభ శృంగారం ప్రేను, ఉన్మాద అవస్థలోను వర్ణనలు బహు భంగుల వర్ణింపబడినాయి. దీనిలో చిత్రకూట పర్వతంనుండి అలకాపురి పట్టణంవరకు మేఘుడుపోయే మార్గం హృద్యంగా వర్ణింపబడింది. ఇవిగాక ఋతు సంహారము, శ్రుత బోధ శృంగార తిలకము, శృంగార రసాష్టకము, సేతు బంధనము జ్యోతిర్విదా భరణము, కర్పూర మంజరి, శ్యామలా దండకము, పుష్ప బాణ విలాసము, కాళిదాస ప్రహసనము, ప్రశ్నోత్తరమాల, కుంటేశ్వర దౌత్యం, రాక్షస కావ్యము, నవరత్నమాల మొదలగు అనేక కృతులు కాళిదాసుపేర ఉన్నాయి. ఇందులో పెక్కులు ఇతరులు వ్రాసి కాళిదాసు పేరు పెట్టినవే. వీటన్నింటిలో శృంగార పరంగానే స్త్రీ వర్ణించబడింది.

కాళిదాసు రచనల తరువాత పేరెన్నిక గన్న కావ్యము కిరాతార్జునీయము. దీనిని భారవి కవి రచించాడు. అరణ్యవాస కాలంలో కిరాత రూపమున నున్న శివునితో పోరాడి పాశుపతాస్త్రమును సంపాదించుట ఇందలి కథాంశము. దీనిని భారవి 18 పర్వముల కావ్యముగా రచించాడు. కావ్యము చిత్ర, యమక, బంధ కవిత్వములలో సంధింప బడినది. ఇందులో సురాంగనల జలక్రీడా పుష్పా పచయాది వర్ణనలు శృంగార రసభరితములు.

తరువాత ప్రసిద్ధి చెందిన కావ్యం శిశుపాల వధ. దీనినే మాఘకావ్యమందురు. ఇది ఇరువది సర్గముల మహా కావ్యము. కృష్ణుడు నాయకుడు, ప్రతి నాయకుడు శిశుపాలుడు. ఇది వీర రస ప్రధానము. శృంగార మంగరసము.

శ్లో॥ ఉపమా కాళిదాసస్య, భారవే రర్థ గౌరవం
దండినః పదలాలిత్యం, మాఘే సంతి త్రయోగుణాః

అను సూక్తి ననుసరించి కవితా లక్షణాలు ఉన్నప్పటికి స్త్రీ వర్ణన విషయంలో అందరిదీ శృంగార భావమే.

ఈ కావ్యము లన్నింటిదీ ఒకయెత్తు. శృంగార నైషధము నదొక యెత్తు. దీని గ్రంథకర్త హర్షుడు. ఇది ఇరువది రెండు సర్గముల

మహా కావ్యము. నల దమయంతుల చరిత్రమైన ఈ నైషధం "నైషధం విద్వ దౌషధం" అన్న ప్రఖ్యాతి గాంచినది. కావ్యము శృంగార రస భరితము. కావ్యమందెల్లెడల స్త్రీని నఖకుచ పర్యంతము వర్ణించడము కనిపిస్తుంది. కావ్యమంటే "శృంగార"మో, వీరమో అంగిరసములగా వుండాలనే అలంకార నియమమునననుసరించి కావ్యాలు వ్రాయబడ్డాయి. ఎక్కువగా శృంగార రసయుక్తంగానే కావ్యాలున్నాయి. శృంగార రస ప్లుతమైనస్థాయీ భావాధులన్నింట స్త్రీని వర్ణించేటప్పటికి ఆమెను కేవలం శృంగార రసోద్దీపితగానే చూడడం జరుగుతుంది. రసోద్దీపనకు సంబంధించిన సాత్విక వ్యభిచార భావములను గూర్చి ఆలంకారికులు ఈ విధముగా పేర్కొన్నారు.

ధనుంజయుడు—

"విభావై రనుభావై శ్చ సాత్త్వికై ర్వ్యభి చారిభిః
ఆనీ యమానఃస్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః"

మమ్మటుడు—

"వ్యక్తః సతైర్విభావాద్యైః స్థాయీభావో రసః స్మృతః"

భోజరాజు—

"చిరం చిత్తేఽ వతిష్ఠన్తే సంబధ్యన్తేఽ ను బన్ధి భిః
రసత్వం ప్రతి పద్యన్తే ప్రవృద్ధాః స్థాయినో ఽ త్ర తే"

రుద్రటుడు—

విభాను భావ సాత్త్విక వ్యభిచారి భావై రుపనీయమానః
పరిపూర్ణః స్థాయిభావో రస్యమానో రసః"

రాజాన కరుయ్యకుడు

"విభావాను భావ వ్యభిచారి భిః ప్రకాశితో రత్యా దిశ్చిత్త
వృత్తి విశేషో రసః"

వాగ్భటుడు—

"విభావై రను భావైశ్చ సాత్త్వి కై ర్వ్యభిచారి భిః
ఆరోప్యమాణ ఉత్కర్షం స్థాయీ భావః స్మృతో రసః"

వాగ్భటుఁడు నేమి కుమార తనయుడు—

"విభావాను భావై వ్యభిచారి భిశ్చా భివ్యక్తా రతిహాస....శమాః స్థాయినో భావాః. క్రమేణ శృఙ్గారహాస .... శాన్తా నవరసా భవన్తి"

ధర్మసూరి —

"విభావాభాను భావ వ్యభిచారి సామగ్రి సముల్లసిత స్థాయీ భావోరసః"

దండి భామ హోద్భటులు—

"రస వద్రసపేశలమ్, రసవద్ధర్శి తస్పష్ట శృంగారాది రసంయధా"

ఈ నిర్వచనాలన్నీ రసానికి సంబంధించిన సాత్విక వ్యభిచార సంచారీ భావాలను వివరిస్తున్నాయి. వీటి ననుసరించి స్త్రీని కేంద్రం చేసి కావ్యకర్తలు వర్ణించారేకాని స్త్రీకి హృదయం ఉందని, ఉదాత్తత ఉందని వ్యక్తిత్వం ఉందనివారు భావించలేదు. శృంగార రసమునకు ఆలంబనం నాయికానాయకులు రూపము, యౌవనము. హావభావాదికము, నూపురాంగదహారాధి భూషణములు, మదనమల యానిల చంద్రోద్యాన చకోర శుకపిక శారికా మధుకరాదులు, అనుభావములు, కటాక్ష వీక్షణములు భూరి క్షేపములు, గ్రీవా భంగములు మొదలైన అంగ వికారములు, సాత్త్విక భావములు, స్తంభ ప్రళయ రోమాంచ స్వేద వైవర్ణ్యాదులు, వ్యభిచారీ భావములు ఇవన్నీ కలిసి వారిద్దరిలో రతి కార్యమునకు ప్రేరేపించటమే కావ్య పరమార్థము.

సంభోగ విషయః ఇచ్ఛా విశేషో రతిః
(సంభోగ సంబంధమైన చిత్తవృత్తి విశేషము రతి.)

ఈ శృంగారము రెండు విధాలుగా చెప్పబడింది. 1. సంభోగ శృంగారము 2. విప్రలంభ శృంగారము. నాయికా నాయకులు కలిసియున్న దానిని వర్ణించుట సంభోగ శృంగారమైతే, విడిపోయి ఉన్న దానిని వర్ణించుట విప్రలంభ శృంగారము, మరలా ఈ విప్రలంభ

శృంగారము అభిలాష, హేతు, ఈర్ష్యా, విరహ, ప్రవాస హేతుకాలు సంభోగ శృంగారాన్ని వర్ణించే హర్ష నైషధానుసరణమైన ఒక శృంగార నైషధ పద్యాన్ని పరిశీలించండి.

పతిపాణి పల్ల వచ్యుత నీ విబంధన
వ్యగ్ర బాలా హస్త వనరు హంబు
ధవ కృతా ధర బింబ దశ నక్ష తివ్యథా
భుగ్న లీలావతీ భ్రూ లతంబు
ధరణి నాయక భుజా పరి రంభ మండలీ
గాఢ పీడిత వధూ ఘన కుచంబు
వర నాఖాంకుర మృదు వ్యాపార పులకిత
నీరజాక్షీ నితం బోరు యుగళి

అస్తి వామ్య భార మస్తి కౌతూ హలం
బస్తి ఘర్మ సలిల మస్తి కంప
మస్తి భీతి యస్తి హర్ష మస్తి వ్యథం
బస్తి వాంఛ మయ్యే నపుడు రతము

(శృంగార నైషధం 7-177)

ఈ విధమైన వర్ణనలతో కావ్యాలన్ని నిండిపోవడానికి కారణము స్త్రీని శృంగార పరంగా చూడమని అలంకార శాస్త్రాలు ఘోషించడమే. ఈ విధమైన కావ్య పఠనం మరింతగా స్త్రీపై కేవలం సౌందర్య భావంనే ఏర్పరచినది. కొన్ని పట్టుల అలంకార శాస్త్రముల పరిధి దాటి కామ శాస్త్ర ములకు లక్ష్య గ్రంథములా అన్నట్లు వర్ణించడము జరిగింది. నల దమ యంతుల రతికేళి పేరుతో కవి "కవిత్వాన్ని" వదిలిపెట్టి ఎంత భీభ త్సాన్ని సృష్టిస్తున్నారో చూడండి.

పరియాతా యాతరం హశ్చల కలిత రత శ్రాంతి నిశ్వాసధారా
పరి షద్వ్యా మిశ్ర భావ ప్రవిఘటిత మిథః ప్రాణభేదో దయం బై
యొరి మన్యక్షో జపాళీ యుగకరిమ కరీ యుగ్భుజా మధ్య చిహ్న
భరణ వ్యక్తైక భావో భయ విలసిత హృద్భాగమై నిద్ర వోయెన్

మరియును

సురత హరవశ్యంబులఁ జొక్కి చొక్కి
కేళి నిద్రా సుఖంబులఁ దేలి తేలి
మేలు కొని బాహ్య రతిలీల మించు మించి
దంపతులు గ్రీడ సల్పిరి తనివి పనక.

దంతక్షత వ్యథా దాయి కాస్యమునకు
    దంతక్షి తవ్యథ దండు వయ్యెఁ
గుచ కుంభ మర్ధన కూ్రర కర్మంబైన
    కరము పాదము లొత్తి కరుణ వడసె
దీప మార్చిన యప్డు దీప్తి సూపిన కల్ల
    మౌళి రత్నము | మొక్కి మాన్పి కొనియెఁ
నొత్తిన తప్పు పోనుడి పెఁ|గి డా|క్రాంతి
    న మృతంబు గురిసి దివ్యా భరణము

మోన గాకుండనపరాధములకుఁ దగిన
శాస్తి యన్నింటి కిబ్బంగి సంభ వించె
పతికిఁ బతికిన వ్వేళ పంఘ టిల్లు
శంబరా రాతి ధర్మ యుద్ధంబు నందు

(శృంగార నైషధం 7వ అశ్వాసం-188, 189, 190, 191)

హర్ష నైషధాన్ని మక్కికి మక్కిగా |వాసిన శ్రీనాధుని ఆంధ్రాను వాదాన్ని మనము చదువు చున్నప్పుడు, ఈ ఘట్టములో కవిత్వం లేదు, పవార్తత లేదు. సురత సంభోగాన్ని కామ శాస్త్రాను సరణంగా వర్ణించి కవి ఏ పరిస్థితికైనా దిగజారి పాఠకుణ్ని ఆనంద పెట్టడానికి |ప్రయత్నము చేస్తున్నాడు అని తెలుస్తుంది. ఈ కావ్యాల్లో స్త్రీ వ్యక్తిత్వాన్ని వెలిగించే సన్నివేశాలు లేకపోగా, ఆమెను భోగ, సంభోగ వస్తువుగా చిత్రించి, దానికి కవిత్వమని పేరు పెట్టారు. కవిత్వంలో ఉండవలసిన భావనా శక్తి ఉజ్వలిత ఇందులో లేవు. మొరటుదనం, స్త్రీని వీధిని సడ చేసి పచ్చి భోగాన్ని |ప్రదర్శింపజేసే ఈ వర్ణనలు స్త్రీని న్యూనత పరచేవే కాని మరొకటి కాదు.

సంస్కృతంలో ప్రసిద్ధి చెందిన మరొక గద్యకావ్యం "కాదంబరి" దీని రచయిత బాణభట్టు. ఈగ్రంథం స్త్రీరూప వర్ణనామయం. ఇందులోని కథ ఋషి కుమారుడైన పుండరీకుడు మహాశ్వేత అనే గంధర్వ కన్యను ప్రేమిస్తాడు. ఆ మహాశ్వేత ఈతని ప్రేమను చాలా కాలం తెలిసికొనలేదు. చివరకు పుండరీకుని స్నేహితుని వలన ఈ విషయాన్ని ఆమె తెలుసు కొని ఆతని చేరబోవు లోపల అతడు మరణిస్తాడు. అతని దేహమును తీసు కొనుపోవు దివ్య పురుషుడు మహాశ్వేతకు, ఈతడు మరల తిరిగి పుడ తాడు.ఎదురుచూస్తూ ఉండమని చెబుతాడు. ఆమె అతని కోసం తపస్సు చేస్తుంది. చంద్రాపీడుడనే రాజకుమారుడు మహాశ్వేతను చూస్తాడు. ఈమె స్నేహితురాలైన కాదంబరి ఈమె ననుసరిస్తున్న వార్త వస్తుంది. మహాశ్వేత, చంద్రపీడులు గంధర్వ లోకంలో ఆమెను చూడడానికి వెళతారు. అప్పుడు కాదంబరి ఇలా ఉన్నది—

తత్ర చ మధ్యభాగే పర్యంతరచిత మండలో పవిష్టేన చానేక సహస్ర సంఖ్యేన పరిస్ఫురదాభరణ సమూహేన కల్పలతానివహేనేవ కన్యకా జనేన పరివృతాం, నీలాంశుకప్రచ్ఛదపటప్రావృతస్య మహతః పర్యఙ్క స్యోపాశ్రయే ధవళో పధా నన్యస్త ద్విగుణ భుజలతా వష్టంభేనా వస్థితాం మహావరాహదంష్ట్రావలంబినీ మివ మహీం విస్తారిణీ దేహ ప్రభాజాల జలే, భుజలతా విక్షేప పరిభ్రమైః ప్రతరంతీభిరివ చామర గ్రాహిణీభి రుపవీజ్యమానాం నిపతిత ప్రతిబింబ తయా అధస్తాన్మణి కుట్టి మే షునాగై రివా ప్రహ్రియ మణాము పాంతే చ రత్న భిత్తిషు దిక్పాలైరివ పృథక్ నీయ మానా ముపరి మణిమండ పేష్వ నురై రి వోత్క్షిప్య మాణాం హృదయ మివ ప్రవేశితాం మహా మణిస్తంభైః ఆపీతామివ భవన దర్పణైః అధోముఖేన శ్రీమండప మధ్యోత్కీర్ణేన విద్యాధరలోకేన గగన తల మివారోప్యమాణాం చిత్ర కర్మచ్ఛ లేనావలోకన కుతూహలేన సంపుంజి తేన త్రిభువనేనేవ పరివృతాం భూషణరవ ప్రవృత్త శిఖి శత చిత్ర చంద్ర కేణ భవనే నాపి కౌతు కోత్పాదితాలోచన సహ స్రే ణేవ దృశ్యమానా మాత్మ పరిజనే నాపి దర్శనలోభా దుపా ర్జితవ్య చక్షుషే వానిమిషనయనేన నిర్వర్ణ్య మానాం, లక్షణై రపి రాగా విష్టైరి వా ధిష్ఠిత సర్వాం గామ్, అకృత పుణ్య మివ ముంచం తీం బాల భావా మదత్తా మపి మన్మథావేశ పరవశే నేవ గృహ్య మాణాం

యౌవనేన, అవిచలిత చరణరాగ దీధి తిభిరివ నిర్గతాభిః అలక్తక రస పాటలితలావణ్య జల వేణికాభి రివగళితాభిః నివసితరక్తాంశుకదశాశిఖాభి రివావలంబి తాభిః పాదా భరణ రత్నాంశు లేఖా సందేహ దాయినీభిః అతికోమలతయా నఖవివరేణ వమంతీభిరవ రుధిరధారావర్షమాజ్ఞు శిభిరుపేతా భ్యాం క్షితతిలతారాగణ మివ నఖమణిమండల ముద్వ హద్భ్యాం విద్రుమరసనదీ మివ చరణా భ్యాం ప్రవర్తయంతీం. నూపురమణికిరణ చక్రవాళేన గురునితంబభరఖిన్నో రుయుగళ సహాయతామివ కర్తు ముద్గచ్ఛతా స్పృశ్యమాన జఘనభాగాం, ప్రజాపతి కర దృఢని పీడితమధ్య భాగగళితం జఘనశిలాతల ప్రతిఘా తాల్లావణ్య జలస్రోత ఇవ ద్విధా గత మూరుద్వయం దధానాం, సర్వతః ప్రసారిత దీర్ఘ మయూఖమండలేన ఈర్ష్యయా వరపురుష దర్శన మివ ని రుంధతా కుతూహలేన విస్తార మివత్వతా స్పర్శసుఖేన రోమాంచ మివ ముంచతా కాంచీ దామ్నా నితంబ బింబస్య విరచితపరివేషాం ............ (1) ఇంకా కొన్ని పేజీల వరకు ఈ వర్ణనే కొనసాగింది! ఆమెకూర్చున్న మండపం దగ్గర నుండి ఆమె నఖశిఖ పర్యంతం సాగిన ఈ వర్ణన సంస్కృత వాఙ్మయంలో అపూర్వమైనదిగా కొనియాడ బడుతుంది. ఇటువంటి వర్ణనలో కాదంబరి హృదయం కాని, స్వభావం కాని వర్ణింప బడలేదు. స్త్రీ బాహ్య వర్ణనకు సమస్త శబ్ద జాలాన్ని గుమ్మరించి "బాణోఛిష్ఠం జగత్ సర్వం" అని పేరు గాంచాడు. అయితే అక్కడ క్కడ కొన్ని ఉదాత్తమైన భావాలు లేకపోలేదు, అవి చాలా తక్కువ. సంస్కృత కావ్య ప్రపంచంలో స్త్రీ ఆంగిక వర్ణన కిచ్చిన విలువ ఆమె స్వభావ వ్యక్తిత్వ చిత్రణలకు ఇవ్వలేదు. శబ్ద గాంభీర్యం, అలంకార వైదగ్ధ్యం. రస ప్లావితం వంటి విశేషణాల్ని స్త్రీ అంగిక వర్ణనకే గాని ఆమె సౌజన్య భావ చిత్రణకు కాదు. ఇందులో మహాశ్వేత ప్రేమతత్వం, కాదంబరీ మహాశ్వేతల స్నేహం నిర్మలంగానే వర్ణింపబడ్డాయి. కథలో మాయాజాలాలు, ఇంద్రజాలాలు మామూలే.

సంస్కృత కావ్యాల్లో ఆనాడు మాత్రం మనకు ఒక విషయం ద్యోతక మవుతుంది. రాచకన్యలు మాత్రం స్వయంవరంలో వరుణ్ని

---

(1) కాదంబరి—179 నుండి 182 పేజీ వరకు ఈ వర్ణన ఉంటుంది.

ఎన్నుకునేవారు, రఘు వంశంలో ఇందుమతీ స్వయంవరంలో ఎంత మంది రాజులను పరిచయం చేసినా, చివరకు ప్రతీపుని వంటివాడు అన్ని కోణాల నుండి నచ్చినా ఇందుమతి మాత్రం అజుణ్ణే ఎంచుకుంటుంది.

తస్యాః ప్రకామమ్ ప్రియదర్శినోపి
న సక్షితీ సోరు చైర్భ హూ వ
శరత్ ప్రవృష్టాంబుధరో పరో ధః
శశీవ పర్యాప్త కళోనళిన్యాః

(రఘు వంశం 6వ సర్గ 44వ శ్లోకం)

ప్రతీపుడు చూడ చక్కని వాడైనను పూర్ణచంద్రుడు పద్మములకు నచ్చనట్లు ఇందుమతీ హృదయమునకు నచ్చలేదు.

ఈ విధమైన శ్వేచ్ఛ మాత్రం ఉన్నట్లు కన్పిస్తుంది. హర్షనైషధములోకూడ దమయంతి నలుణ్ణి స్వయంవరంలోనే ఎన్నుకుంటుంది.

మొత్తమ్మీద సంస్కృత కావ్యాల్లో మహోన్నతమైన స్త్రీ హృదయాన్ని, వ్యక్తిత్వాన్ని నిర్లక్ష్యం చేసి. స్త్రీ బాహ్య సౌందర్య వర్ణనకు ప్రాధాన్యమిచ్చి స్త్రీలో సహజ సిద్ధమైన కరుణ, శాంతి రసాలను అభివ్యక్తం చేయకుండ, శృంగార రసాన్ని మాత్రం నిర్హేతుకంగా ఆవిష్కరించారు. ఈ సంస్కృత భాషా సాహిత్య ప్రభావం భారతీయ భాషా సాహిత్యాలన్నిటి మీద పడింది. ◐

# తెలుగు కావ్యాల్లో స్త్రీ

తెలుగు కావ్యాల్లో సంస్కృత కావ్యాను కరణములే ఎక్కువ. ప్రబంధాల్లో స్త్రీని గౌరవించాలనే నియమం లేదు. "కాంతా సమ్మితం కావ్యం" అనే నియమం ప్రకారం కాంత లేనిదే కావ్యమే రూపొందదని పేర్కొన్నారు. కాని ఆ స్త్రీకి గౌరవం ఇవ్వాలనే నియమాన్ని మాత్రం ఎక్కడా పాటించలేదు. ఆ స్త్రీని నఖశిఖ పర్యంతం వర్ణించి ఆనందించడమే కావ్యం పరమావధిగా భావించారు. స్త్రీని సంబోధించిన పదాల్లో పెక్కులు ఆమె అందానికి సంబంధించినవే. పడతి, రమణి, కాంతా, బాలా, కొమ్మా, జవ్వని - ఇటువంటివి ఎన్నైనా చూపవచ్చు. స్త్రీని వర్ణించేటప్పుడు కవి ఔచిత్యాన్ని మరచి వర్ణించడం తెలుగు కావ్యాల్లో పెక్కుచోట్ల మనం చూడవచ్చు. అందుకే ఈ ప్రబంధ పఠనం వలన స్త్రీ మీద శృంగార పరమైన దృష్టి ముఖ్యంగా కలుగుతుంది. అసలు తెలుగు ప్రబంధాల్లో శృంగార రసాత్మకంగా వ్రాయబడినవే ఎక్కువ. తెలుగు కావ్యాల్లో మొదటిది కుమార సంభవము. దీని రచయిత నన్నెచోడుడు. కుమార సంభవ కావ్యాన్ని పరిశీలిస్తే ఇది శృంగార రస ప్రధానంగా వ్రాయబడింది. ఇందు నాయకీ నాయకులు పార్వతి-శివుడు. వారి సంయోగ శృంగారాన్ని, విప్రలంబ శృంగారాన్ని వర్ణించడానికి కుమార సంభవ మూల కథనే కవి మార్చుకున్నాడు.

సంస్కృతంలో ఈ కావ్యాన్ని కాళిదాసు రచించాడు. తెలుగులో ఈ కావ్యం శృంగార రస భరితమైంది. శివ శక్తులు రెండు ఏనుగుల కామకేళిని చూసి, అనురక్తులైనట్లు వర్ణించాడు.

"ఆదిమూర్తులు శివశక్తుల చలమతులు
హరుడు సతియును సురతార్థులై రహీన
తరములగు మృగరూపముల్ దాల్చిరనిన
కాము మాయల నెవ్వారు నేమిగారు"

శివపార్వతులు మృగరూపం దాల్చడం కంటేకూడా, ఇక్కడ ఆ ఏనుగుల జంటనుచూసి అనురక్తులు కావడంలో శివపార్వతులలో పార్వతి చేముందంజగా వర్ణిస్తున్నాడు-

"హృదయాహ్లాదము తోడపాయక సదానేక ప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణిచూచి కౌతుకరతై కాలీనభావాఖిలా
షదృగత్యుజ్జ్వల దీధితుల్ పరపె నీశానాన నాబ్జంబుపైన్"

అంటే ఆదిశక్తిగా కొలుచుకొంటున్న పార్వతీదేవి నుద్దేశించికూడా స్త్రీ జంతు క్రీడనుచూసి కూడా భావోద్రేకురాలు అవుతుంది. కామమనేది స్త్రీకి మిక్కుటఁ అనేస్పృహ కలిగేటట్లు వర్ణిస్తున్నాడు. ఇవన్నీ కల్పిత కధలే అయినప్పటికి స్త్రీ-దేవతైనా, శక్తిఅయినా ఆమె కామస్వరూపిణి ఆమెను అదుపులో నుంచుకోవాలి అనేది అంతరార్థంగా ప్రబోధిస్తున్నాడు. కుమారసంభవము పేరుకి శివశక్తుల, పార్వతీ పరమేశ్వరుల కధనమే గాని. అడుగడుగునా పచ్చిశృంగారం అందులో స్త్రీని న్యూనత పరిచే వర్ణనం కన్పిస్తుంది. ఈశ్వరుని దృష్టిని పార్వతి మీదకు మరల్చే సందర్భంలో-

కామినులులేక లోకులఁ
గామునికెట్లగు మనోవికారులఁజేయన్
గామవికారము లేకయుఁ
గామినులకు జనులనెట్లు గనిపింపనగున్"

(కుమారసంభవం- 5ఆ-18వ.)

స్త్రీని 'కామిని'గా భావించటం, పురుషులకు కామవికారం కలిగించే సాధనాలుగా స్త్రీని భావించడం స్త్రీని న్యూనతపర్చడఁకాక మఱొకటికాదు.

అసలు తెలుగు కావ్యాలు, సంస్కృతంలో వ్రాయబడిన పౌరాణిక ప్రబంధ పాత్రలకే ఎక్కువ పరిమితం కావడం వలన ఆనాటి సామాజిక స్త్రీ పాత్రలు కావ్యాల్లో లేవు. వర్ణింపబడిన ఆ కల్పితపాత్రలుకూడా సమా

జానికి స్ఫూర్తినిచ్చేవి కాక, పాఠకునికి ఆనందం కలిగించడం కోసం, ఏ స్థాయికయినా పాత్రను దిగజార్చి వర్ణన చేయడం కనబడుతుంది. స్త్రీని కేంద్రంగా చేసి ఎంతటి నీచ రచనకైనా కవి సిద్ధపడడం మనకు ఈ కావ్యాల్లో కనబడుతుంది. పార్వతీ పరమేశ్వరులకు సంబంధించిన రతి క్రీడ పేరుతో 9వ ఆశ్వాసంలో 143వ పద్యం నుండి 152వ పద్యం వరకు విచ్చలవిడిగా వ్రాయడం జరిగింది ఆ పద్యాలు ఉదహరించడాని క్కూడ జుగుప్స కలుగుతుంది. ఈ విధంగా కుమారసంభవంలో సందర్భ రహితంగా 'స్త్రీ'ని న్యూనత పరిచే అనేక వర్ణనలున్నాయి. ఒక ప్రక్క పార్వతిని ఆరాధ్యదైవం అంటూనే ఆమె కుచనఖాలు హద్దుపద్దూ లేకుండా వర్ణించడం కద్దు.

"ఉరుకుచాగ్రంబు లొండొంటి నొత్తుదేర
నెదురు కౌగిలింపగ నసువెట్లు గాక
కెలని కొఱగుచుఁ గుచటుల బలిమినొత్త
నందికేలెట కేనియు నందికొనిరి."

(కుమార సంభవము 9ఆ 173వ పద్యం)

ఈ పద్యంలో పార్వతిని కేవలం పచ్చి శృంగార భావంతో వర్ణించడం జరిగింది.

స్త్రీని గౌరవంగా కొలిచినట్లు చెప్పబడుతున్న నినాదాలు అసత్యాలని కావ్యప్రబంధ పరిశోధన వలన మనకు సువ్యక్తం అవుతుంది.

## మనుచరిత్ర - స్త్రీ వర్ణన

మనుచరిత్ర అని పిలవబడే స్వారోచితమను సంభమనే ప్రబంధాన్ని రచించిన కవి, ఆంధ్రకవితాపితామహుడిగా పేరొందిన అల్లసాని పెద్దన. ఈయన శ్రీకృష్ణ దేవరాయల ఆస్థాన కవి శృంగారం ప్రధానంగా మనుచరిత్రను వ్రాసి, వరూధిని వంటి పాత్రలను శృంగార రస భరితంగా చిత్రించి, కవిత్వం పరమావధి స్త్రీనిబహుభంగుల వర్ణించడమే అని ప్రచారంచేశాడు.

అసలు ఈయన దృష్టిలో కవిత్వం ఎలావుండాలంటే-

"రాతిరియుం బవల్ మఱపురాని హొయల్ చెలి యాఁడుఁబ్ర ని
ద్రా తని తీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్
బాఁతిగఁబై కొనన్వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ
కూఁత లనన్వలెన్ పొగసు కోర్కులు రావలె నాలకించినన్
జేతి కొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్నిమే
ల్మాఁతల చన్నుదోయివలె ముచ్చట గావలెఁ బట్టి చూచినన్"

అందమైన కన్నెపిల్లల చన్నుదోయిని స్పృశించినట్లు కవిత్వం ఉండాలి అంటున్న పెద్దన్నగారు శృంగార రస పోషణ పేరుతో స్త్రీని నిస్సిగ్గుగా వర్ణించడం జరిగింది.

ఇందులోని కథానాయకుడు ప్రవరుడు. ఇతన్ని మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి, భాషాపరశేషభోగి. వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పర తంత్రుడని వర్ణించాడు.

ఈ మహా పండితుడు ఎవరో యోగి తనకాళ్ళకు పసరుపూస్తే హిమాలయ పర్వతాలకి చేరాడు. అక్కడ ప్రవరుడికి సిద్ధుడు పూసిన పసరు కరగిపోయి, ఏమి దిక్కుతోచని పరిస్థితుల్లో 'మృగమదసౌరభవిభవద్విగుణీత ఘనసార సాంద్రవీటి గంధస్థగితేతర పరిమళమై మగువ పొలుపు దెలుపు నొక్క మారుతము' వచ్చింది.

"అతఁడావాతపరంపరా పరిమళ వ్యాపారలీలన్ జనా
న్వీత మిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శత పత్రేక్షణ జంచరీక చికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్"

ఆ నిష్ఠాగరిష్ఠుడు వరూధినిని చూసినప్పటి తీరు ఇందులో వర్ణించబడింది. ఆమె కన్నులు, ఆమె ముఖము, ఆమె అంగాంగములు చూడడం ఇక్కడ వర్ణించబడింది.

ఆ తరువాత ఆమె వీణ వాయిస్తున్న తీరును అంగాంగ వర్ణనా ప్రదర్శనోద్దేశ్యంతో వ్రాశాడు.

"శత నితం బాభోగ ధవళాం శుకములోని
యంగధట్టపు కావి రంగు వలన"

వంటి పద్యాల్లో స్త్రీల స్థాయిని పూర్తిగా తగ్గించడం జరుగుతుంది. ఇది కథే కావచ్చు. కాని ఇటువంటి వర్ణనలు స్త్రీల మీద గౌరవాన్ని పోగొట్టడానికి పాఠకుణ్ని తాత్కాలిక ఆనందానికి గురి చేయడానికే పనికి వస్తాయి.

వరూథిని ప్రవరుణ్ని చూచి—

"అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపగా, కాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పల పంక్తుల గుమ్మరింపఁగా
గుబ్బ మెఱుంగు జన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నల కూబ రసన్నిభు నద్ధరామరున్"

"చూచి ఝళంఝుళత్కటక సూచితవేగ పదారవిందయై
లేచి, కుచంబులున్ దుఱుము లేనడు మల్లల నాడ నయ్యెడన్
బూచిన యొక్క పోఁక నును బోదియఁజేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయు పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్

ఈ వరూధిని ప్రవరుణ్ని చూచి, ఇన్నిరకాల హావభావాలు వ్యక్త పరచడానికి కారణం? ఆమె వార కాంత (?) భూలోకంలోనే కాక - స్వర్గలోకం ఒకటుందని, ఆస్వర్గలోకంలో దేవ వేశ్యలు ఉన్నారని, ఆ స్వర్గలోకం హిమాలయ పర్వతాలకు దగ్గరలో వుందని, ఆ హిమాలయ పర్వతాల మీదకు వారు వచ్చి పోతుంటారని, అక్కడ తపస్సు చేసుకొనే వారినికూడా వారు తమ అందచందాలతో, హావ భావాలతో పరీక్షిస్తూ వుంటారని ఈ పౌరాణిక ఆధార గ్రంథాల్లో ఉల్లేఖిస్తూ వుంటారు. ఇవన్ని అసత్యాలే అయినప్పటికీ దేవకన్యల హావ భావాలను వర్ణించే పేరుతో స్త్రీలను చాలా చులకన భావంతోవర్ణించడం జరుగుతున్నది. అయితే యిటువంటివారి శృంగార చేష్టలను వర్ణించడానికి అలంకార శాస్త్రాలు ఈ విధముగా పేర్కొంటున్నాయి.

భావ, హావ, హేలా, విలాస, మాధుర్య, ధైర్య
విభ్రమ, లీల కిలకించిత, మోట్టాయిత, లలిత
బిబ్బోక, విచ్ఛిత్తి, విహృత, చకిత, హసిత,
కుట్టమిత, కుతూహలములను పదునెనిమిది
శృంగార చేష్టలు...............అని ప్రతాపరుద్రీయం పేర్కొంది.

"యౌవనే సత్యజాస్తా సామష్టా వింశతి సంఖ్యకాః
శోభా కాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా
ఔదార్యం ధైర్యమిత్యేతే సప్తైవస్యుః యత్నజాః

లీలా, విలాసో, విచ్ఛిత్తి, ర్బిబ్బోకః, కిలికించితం
మోట్టాయితం, కుట్టమితం, విభ్రమో, లలితం, మదః
విహృతం, తపనం, మౌగ్ధ్యం, విక్షేపశ్చ, కుతూహలం,
హసితం, చకితం, కేళిరిత్యష్టాదశ సంఖ్యకాః
స్వభావజాశ్చ — భావా ద్వాదశ పుంసామపి"

అని సాహిత్య దర్పణం. ఈ శృంగార చేష్టలను వరూధిని వంటి పాత్రలకు సమన్వయం చేస్తారు. ఆ శృంగార భావాల ద్వారా పాఠకుడకి రసానందం కలగాలట. అందుకే వరూధిని చూపుల్లో వచ్చిన మార్పులను ఈ విధంగా వర్ణిస్తున్నాడు పెద్దన.

మునుమున్ పెట్టెడుకొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతన్
జొనుపన్ గోర్కులు క్రేళ్లు ద్రిప్ప మదిమెచ్చుల్ ఔప్ప లల్లార్పన
త్యనుషంగస్థితి చ్ఛపా జిటాసఁగనొయ్యారంబునన్ జంద్రికల్
దనుకన్ జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్ర పద్మంబులన్.

ఈ పద్యంలో చూపులు ముందు సంకోచము పొంది, తరువాత విస్తృతములై, మనసులోని కోరికల వలన తుళ్ళి పడుతున్నవట.

ఈ వర్ణనలు ద్వారా ఆనందాన్ని పొందే పాఠకులు ఏ సంస్కృతికి చెందినవారో మనం తెలిసికోవచ్చు. తరువాత వరూధినిని ప్రవరుడు "ఎవ్వతెవీవు, భీతహరిణేక్షణ" అని సంబోధించి దారి అడగడం. వరూధిని "ఇంతలు కన్నులుండ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర" అని

సమాధానం చెప్పడం, ఆతనిపై మరులు గొని "నిక్కము దాపనేల ధరణీ సురనందన యింక నీ పయిన్ జిక్కె మనంబు నాకని" విన్నవించడం, ఆతడు నీతులు వల్లించడం వరూధిని చివరకు కామశాస్త్ర రహస్యాన్ని ఈ విధంగా బోధించడం జరుగుతుంది.

ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపకళికా శ్రీ దోఁప, నెందెందుఁ బో
కెందే నింద్రియములే సుఖంబుఁగను నా యింపే పరబ్రహ్మ,'మా
నందో బ్రహ్మ' యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.

ఈ పద్యంలో ఎక్కడ పంచేంద్రియాలు రసానుభూతిని పొందుతాయో ఆ యింపే పరబ్రహ్మ, ఇంక వేరే లేదనే ప్రబోధాన్ని వరూధిని చేత చేయించడం వలన పురుషులు నిష్ఠాగరిష్టులు అయితే - స్త్రీలు తమ కామ వాంఛను శాస్త్రంగా బోధించి లొంగదీసు కోవడానికి ప్రయత్నిస్తారనే అర్థాన్ని బోధించడమే కాక, ఆతడు లొంగక పోయినప్పుడు ఈమె బలవంతం చేసిందని ఈ విధంగా వర్ణిస్తున్నాడు.

ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప 'హా! శ్రీహరీ'
యంచున్ బ్రాహ్మణుఁ డోరమో మిడి తదీయాంసద్వయం బంటి పో
మ్మంచున్ ద్రోచెఁ; గలంచునే సతుల మా యల్ ధీర చిత్తంబులన్?

అంటే వరూధిని ప్రవరుణ్ణి బలవంతం చేసినా అతడు లొంగలేదు. "సతుల మాయలు ధీర చిత్తాలను కదల్చలేవు" అని ప్రబోధిస్తూ, స్త్రీని న్యూనత పరచడమే కాకుండా అపహాస్యం చేస్తున్నాడు.

ఆర్య సంస్కృతీ ప్రభావంతో వ్రాసే ఏ ప్రబంధంలోనైనా, కావ్యములోనైనా స్త్రీల పరిస్థితి ఈ విధంగానే ఉంటుంది. స్త్రీని విలాస వస్తువుగా చూడడం, ఆమెను అనేక విధాల శంకించడం, అసలు పురుషుణ్ణి లొంగదీసుకునేది స్త్రీ యేనని ప్రచారము చేయుడము ఆర్య సంస్కృతిని అంటే హిందూ సంస్కృతిని ప్రచారం చేసే కవులకు పరిపాటి. అల్లసాని పెద్దన్న ఈ కోవకు చెందినవాడే. ఈ ప్రవర వరూధిని కథలో దూరం పోయే కొలది ఇంకా జుగుప్సాకరమైన సన్నివేశాలున్నాయి. ప్రవరుడు

అగ్ని దేవుని సహాయంతో ఇంటికి చేరడం, గంధర్వుడు మాయా ప్రవరుడి వేషంలో రావడం వారిద్దరి సంయోగం వలన "స్వరోచి" జననం, వాని ద్వారా "స్వారోచిష మనువు" కలగడం — వీడు మానవ సమాజానికి మూలమని చెప్పడం. అందుకే దీనికి "మను చరిత్ర" అని పేరు రావడం జరిగింది.

ఈ కథంతా అభూత కల్పనయే. ఆ అభూత కల్పనలో స్త్రీని న్యూనత పరిచి, ఆమె సర్వాంగ వర్ణనం వలన పాఠకునికి ఆనందము కల్పించడమే ముఖ్యోద్దేశంగా పెద్దన వ్రాయడం చూస్తుంటే ఈనాడు "క్యాబరే" డ్యాన్సులు ఏర్పరచి వారి అంగాంగ ప్రదర్శనతో ప్రేక్షకులను ముగ్ధులను చేస్తున్న వారికి ఆనాటి ఈ పెద్దలే ఆదర్శమని తోస్తున్నది.

ఏది ఏమైనా, వేద భూమి, కర్మ భూమి, పుణ్య భూమిగా చెప్పబడుతున్న భారత భూమిలో స్త్రీని అన్ని కోణాల్లో, అన్ని రంగాల్లో, అన్ని రూపాల్లో అవమానించి ఆనందించారని ఈ అంశాలు ద్వారా మనకు సువ్యక్త మవుతుంది.

# అలంకార శాస్త్రము స్త్రీ

సంస్కృతాలంకార శాస్త్రాలను అనుసరించి వ్రాయబడిన కావ్యాలంకార శాస్త్రాదుల్లో స్త్రీకి సంబంధించి అనేక అంశములు వర్ణింప బడినాయి. వాటిని పరిశీలిస్తే మనకు అనేక సత్యాలు బయటకు వస్తాయి. కావ్యాలంకార సంగ్రహంలో నాయికా భేదాలను గురించి తెలుపుతూ భట్టుమూర్తి (రామరాజ భూషణుడు)- నాయికలు - స్వీయ, అన్య, సామాన్య అనీ, మరలా స్వీయను, ముగ్ధ, మధ్య, ప్రౌఢ అనీ మరియు ఈ మధ్యను - మధ్యాధీర, మధ్యా అధీర, మధ్యాధీరాధీర అని. ప్రౌఢను - ప్రౌఢధీర, ప్రౌఢాధీర, ప్రౌఢధీరాధీర అని వర్ణించడం జరిగింది.

"ధారుణి మధ్యయుఁ బ్రౌఢయు
ధీరాధీరాది భేద దీప తలై వే
ర్వేరను జ్యేష్ఠ కనిష్ఠ యు
నై రంజిలి ద్వాదశాఖ్యల గుదురు వరుసన్"

(కావ్యాలంకార సంగ్రహం 2ఆ. 32 ప)

మధ్య ప్రౌఢలు - ధీర, అధీర, ధీరాధీరాది భేదములచే నిట్లారు విధములవుతారు. ఆ ఆరుగురును - జ్యేష్ట, కనిష్ట భేదములచే మొత్తం పన్నెండుగురు అవుతారు. ఈ నాయిక లందరు నాయకుని కోసం తపించే విధానము వలన వివిధ నామములు పొందారు.

నిజంగా అలంకార శాస్త్రంలో స్త్రీ అనేక విధాలుగా న్యూనతకు గురి అయింది. ఈ నాయికలందరికీ శృంగారం తప్ప మరొక పరమావధిలేదు.

ఈ శృంగార రసం ప్రధానంగాగల నాయికలను మరలా ఎనిమిది విధాలుగా విభజిస్తున్నాడు.

1. స్వాధీన భర్తృక : భర్త తన యధీనము నందున్న యువతి.
2. వాసక సజ్జిక : "వాసకం వాస స్థానం సజ్జయ తీతి వాసక సజ్జా" అనేదాన్ని బట్టి భర్త వచ్చే సమయానికి గృహాన్ని తనసె అలంకరించుకొనే యువతి.

3. విరహోత్కంఠిత : పతి చెప్పిన వేళకు రాకుండ ఆలశ్యం చేయగా మిక్కిలి తహతహపాటు చెందునది.

4. విప్రలబ్ధ : సంకేత స్థలానికి తన ప్రియుడు రాకపోవడాన్ని చూచి స్మరార్తి (మదన బాధ) ని పొందునది.

5. ఖండిత : ప్రియుడు పరకాంతతో రాత్రంతా గడిపి సంభోగ చిహ్నలతో ఉదయాన ఇంటికి రాగా విచారించునట్టి స్త్రీ.

6. కలహాంతరిత : కోపగించి, భర్తను దూషించి, వెడలగొట్టి, అతడు వెళ్ళిన తరువాత పశ్చాత్తాపపడు స్త్రీ.
(కలహేన అత్యాంతా వ్యవహితా అర్థాత్ ప్రాణనాథతః)

7. ప్రోషిత భర్తృక : భర్త పరదేశగతుడు కాగా వరుల పంచన ఉంటూ కృశించునది.

8. అభిసారిక : సంకేత స్థలానికి ప్రియుణ్ని వెదుక్కుంటూ పోవునది, ప్రియుణ్ని తన వద్దకు రప్పించుకునేది. (అభిసరతి, అభిసారయ తీత్యభి సారికా)

వీటికి ఉదాహరణలు స్త్రీని చాలా న్యూనత పరిచే విధముగా ఉన్నాయి.

నాయికను, ఆమె అవయవాలను ఏయే వస్తువులతో పోల్చాలో కూడా అలంకార శాస్త్రములో నిగదించి వున్నారు. దానికి భిన్నముగా పోల్చకూడదు.

స్త్రీని చంద్రికళ. సరోజమాల, శిరీషం, విద్యుత్తు, తార, కన కలత, రత్నశలాక, దమనకయష్టి మొదలగు వానితో పోల్చాలట. అలాగే—

తనుద్యుతిని (శరీర కాంతి) గోరోచనా, స్వర్ణ, విద్యుత్, చంపక, కనక, కేతకీ ప్రభుతులతో—

కచము (వెంట్రుకలు) లను తమస్సు, శైవాలము, మేఘము, బర్హిపింఛము, భ్రమరములు, చామరములు, యమునా తరంగములు, నీలరత్నములు, నీలాబ్జములు, ధూపము, ధూమము మొ॥ వానితో

వేణిని (జడను) సర్ప, భృంగావళి, దండము (వేణీదండము) మొ॥ వానితో

ధమ్మిల్లమును రాహువు మొ॥ వానితో

సీమంతమును మార్గము, దండము మొ॥ వానితో

లలాటమును అర్ధ చంద్ర, హేమ పట్టికలు మొ॥ వానితో

కనుబొమ్మలను వల్లీ, స్మరచాపము, తరంగము, భృంగావళి, సర్పి, కృపాణకము, పల్లవము మొ॥ వానితో

కపోలమును చంద్ర, ఆదర్శములు మొ॥ వానితో

ముఖమును చంద్ర, పద్మ, దర్పణము మొ॥ వానితో

నాసికను తిలప్రసూనము (నువ్వుపువ్వు), సంపెంగమొగ్గ మన్మథ తూణీరము, వంశము (నాసావంశము) పాటలీ పుష్పం మొదలగువానితో

కంఠమును శంఖము మొ॥ వానితో

నేత్రములను మృగనేత్ర, పద్మ, కుముద, ఝషము ఖంజన, చకోరనేత్ర, కేతకాళి, మన్మథ బాణములు మొదలగు వానితో

అధరమును ప్రవాళము, బింబము, బంధూకము, (మంకెన పువ్వు), జపాపుష్పం, పల్లవము మొ॥ వానితో

దంతములను ముక్తా, మాణిక్య, నారంగ బీజ, దాడిమ బీజ కుంద కోరకములు మొ॥ వానితో

వాక్కులను మధురములైన హంస, శుక, పిక, శారికా, వేణు వీణా వాదములు మొ॥ వానితో

బాహువులను విద్యుల్లతలు, మృణాళములు, వల్లరులు మొ॥వానితో

కరములను పద్మము, పల్లవము విద్రుమము మొ॥ వానితో

నఖములను చంద్రికళలు, కుందకోరకములు, తారలు మొ॥వానితో

స్తనములను పూగములు (పోకలు), తమ్మి మొగ్గలు, బిల్వ ఫలములు, తాటికాయలు, పూగుత్తులు, కరికుంభములు, కొండలు, కుండలు, చక్రములు, దబ్బపండ్లు, దానిమ్మపండ్లు మొ॥ వానితో

నాభిని పాతాళము, అవర్తము, హ్రదము, కూపము, నదము మొ॥ వానితో

వళులను పాశములు, తరంగములు, సోపానములు, నిచ్చెన మొదలగు వానితో

పృష్ఠమును కాంచన పట్టము మొ॥ వానితో

నడుమును ముష్టి గ్రాహ్యముగా, సూదిమొన, శూన్యము, అణువు వేది, సింహపు నడుము మొ॥వానితో

జఘనమును పులినము మొ॥వానితో

నితంబమును పీఠము, తపనీయశిల, చక్రము, భూమి మొదలగు వానితో

ఊరువులను కరిహస్తము, కదళీ కాండము, కరభము (మణికట్టు మొదలుకొని వేళ్లు వరకు నుండు చేతి వెనుకటి భాగము) మొ॥ వానితో

చరణమును పల్లవ, పద్మ, స్థలపద్మ, ప్రవాళము మొదలగు వానితో

అంగుష్ఠ నఖమును పూర్ణచంద్రుడు మొదలగు వానితో

గమనమును గజగమనము, హంస గమనము మొ॥వానితో

కటాక్షములను యమునా తరంగములు, భృంగావళి, విషము, అమృతము మొ॥వానితో

హాసమును వెన్నెల, చంద్రుడు, పుష్పము, పీయూషము, ఫేనము (నురుగు), కైరవము మొ॥వానితో

శ్వాసమును పరిమళముతోను

నూపురధ్వనిని హంస, సారస ధ్వనులతో పోల్చవచ్చును.

ఇక శరీరము దాని అవయవముల గుణ విశేషములను ఇట్లు వర్ణించాలి.

శరీరమునకు — సౌందర్యము, మార్దవము, అతికోమలత, కాంతి ఔజ్జ్వల్యము, అబలత్వము మొ॥ వర్ణ్యములు.

కపోలమునకు — స్వచ్ఛత వర్ణ్యము.

కంఠమునకు — దీర్ఘత్వము, త్రిరేఖత్వము, వర్ణ్యములు.

నేత్రములకు — స్నిగ్ధత, విశాలత, లోలత, అపాంగ దీర్ఘత, నీలత, ప్రాంత లౌహిత్యము, శీతత్వము, నిబిడ పక్ష్మతయు వర్ణ్యములు.

ఈ విధంగా స్త్రీల అంగాంగాలు ఉపమేయాలుగా ఈ అనేకాలైన ప్రాకృతికాలు ఉపమానాలుగా పోల్చబడి సమన్వయం చేయబడడాన్ని అలంకార శాస్త్ర మంటారు.

ఈ ఉపమేయాలకు ఆ ఉపమానలకు ఏమీ సంబంధం వుండదు. ముక్కుకు సంపెంగి పువ్వుకు సమన్వయం చేయడానికి కవులు అనేక తంటాలు పడ్డారు. ఈ అలంకారాల వలన స్త్రీకి ఉన్న సహజమైన సౌందర్యం న్యూనతపడి కొన్ని చోట్ల వికృతంగా తయారయిన సందర్భాలు వున్నాయి. ఈ ఉపమానాలు తప్ప మరేవీ పోల్చకూడదనే నియమంతో ప్రతి కవి పోటీపడి ఈ ఉపమానాలనే అటూ ఇటూ తిప్పి స్త్రీ ఆంగిక వర్ణనలతో ఆడుకున్నారు.

అలంకార శాస్త్రంలో ఎక్కడ స్త్రీకి ఉదాత్తతను ఔన్నత్యాన్ని తీసుకురానడానికి సూత్రాలు లేవు. ఆమెను నఖశిఖ పర్యంతం వర్ణించి ఆనంద పడడమే ఇక్కడ మనకు సాక్షాత్కరిస్తుంది.

ఈ సంస్కృత అలంకార శాస్త్ర ప్రభావం భారతీయ భాషలన్నింటి మీద పడింది. అన్ని భాషల్లోని కావ్య కన్యలు ఈ విధంగా మూసపోసిన బొమ్మల్లా తయారయ్యారు.

దీని వలన సమకాలీనత, సహజత్వం, కోమలత్వం అన్నీ పోయినవి. స్త్రీ అంగాంగ విన్యాసమే మిగిలింది.

కావ్య ప్రయోజనాల్లోకూడా స్త్రీని గౌరవించాలనే నియమం ఎక్కడా కనిపించడం లేదు.

## ప్రసిద్ధమైన కావ్య లక్షణాలు :

1. ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం (దండి) మనోహరమగు అర్థంతో అలంకృతమైన పదసముదాయమే కావ్యం.

2. శబ్దార్థౌ సహితౌ కావ్యం (భామహుడు) సరైన శబ్దములతో అర్థములతో కూడినది కావ్యం.

3. తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాపి (మమ్మటుడు)
దోషరహితము, గుణ సహితములు అయిన శబ్దములు అలంకార యుతములు కాకపోయినను కావ్యమే.

4. వాక్యం రసాత్మకం కావ్యం. (విశ్వనాధుడు)
రసాత్మకమైన వాక్యమే కావ్యము.

5. రమణీయార్ధ ప్రతిపాదక శ్శబ్దః కావ్యం (జగన్నాధుడు)
రమణీయమైన అర్ధాన్ని ప్రతిపాదించే శబ్దమే కావ్యం.

ఈ విధంగా పరిశీలిస్తే కావ్య లక్షణాలు ఎన్నో ఉన్నాయి. కానీ "స్త్రీ"ని గౌరవంగా చూడడం కూడా కావ్య లక్షణమే — అని చెప్పిన సిద్ధాంత కర్త మాత్రం లేడు.

ఈ విధంగానే రస చర్చలో కూడా అంతే. రసాలు, ధ్వనులు, అలంకారాలు, వ్యంగ్యాలు అన్నీ పాఠకున్ని సంతోష పెట్టడానికి వుద్దేశించినవే కాని మరి యితరము కాదు. కావ్యంలో స్త్రీ కూడా పాఠకున్ని సంతోష పెట్టే ఒక వస్తువుగా మాత్రమే ఉపయుక్తమయింది. స్త్రీకి వ్యక్తిత్వాన్ని, సహజత్వాన్ని, ఔన్నత్యాన్ని కలిగించడానికి అలంకార శాస్త్రాలు ఏ విధమైన ప్రయత్నము చేయలేదు. అందువలన అలంకార శాస్త్ర బద్ధులై రచించే ఈ కవులంతా స్త్రీ విషయంలో చాలా న్యూనతా భావంతో వ్యవహరించారు. అందువలన పాఠక లోకం కూడా తమకు ఆనందం కలిగించేదిగానే స్త్రీని భావించడం జరిగింది. సంస్కృత కావ్య ప్రపంచంలోను, దాని ప్రభావం ఉన్న ఇతర భాషా కావ్యాల్లోను ఇదే జరిగింది. ఈ తిరుగులేని సత్యాన్ని మనకు అలంకార శాస్త్రాలు అద్దంపట్టి చూపుతున్నాయి. ○

# వీర శైవం—స్త్రీ

దక్షిణ భారతాన్ని ఒక కుదుపు కుదిపిన మత సంస్కరణోద్యమం వీరశైవం. అతి ప్రాచీన వైదిక శాఖల్లో శైవం ఒకటైనప్పటికీ ఒక ఉద్యమ రూపం ధరించింది వీరశైవుల కాలం లోనే.

హిందూ వ్యవస్థ మోక్షానికి, జ్ఞాన, భక్తి, కర్మ మార్గాలను పేర్కొంది. మోక్షము ఉన్నదనే మూఢ నమ్మకంతో జ్ఞాన మార్గాన్ని కొందరు కర్మమార్గాన్ని కొందరు అనుసరించారు. సామాన్య జనులకు భక్తిమార్గం అనుసరణీయంగా వుండేది.

అందువలన పెక్కురు వీరశైవ భక్తులు మూఢ భక్తి ప్రియులుగా జీవితాన్ని గడిపారు. తమిళంలో "పెరియ" పురాణమనే గ్రంధము అరవై మువ్వురి శివ భక్తుల కథలు తెలుపుతూ వుంది. ఆంధ్ర సాహిత్యంలో బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర శివ పురాణము, హర విలాసము, కాశీఖండం, భీమ ఖండం, శివరాత్రి మహాత్మ్యం, శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యం చాలా ప్రసిద్ధి చెందినట్టివి. ఈ కథల ద్వారా వారి భక్తియే గాక వారి సంస్కరణ దృష్టి, స్త్రీల సంస్కరణకు వీరశైవం కృషి మనకు అభివ్యక్తం కాక మానవు. ఈ ఉద్యమం దక్షిణ భారత దేశంలో పరివ్యాప్తమయ్యే క్రమంలో ఆంధ్రదేశంలోకూడా అనేక గ్రామాలను ప్రభావితం చేసింది. శైవ మత సూచక గ్రామాలైన సరిగనూరు, జంగాలపల్లె, తంబళ్ళపల్లె, వీరూరు, వీరపల్లె ఈ విషయాన్ని ఋజువు చేస్తున్నాయి.

వీరశైవ ప్రచారకుల్లో బ్రాహ్మణారాధ్య శాఖలతో పాటు, శూద్ర కులాల వారు కూడా వున్నారు.

"It is therefore reasonable to think that Virasaivam was almost limited to a few Communities in the population; the Aradhyas among Brahmins and the Jangamas and some sections of the sales (weakers) and Balijas. The View that at the time of the Muslim invasions, the people in Andhra were United in their Church. 233 embodying the teachings of Basava and Pandita; seems to far from the truth.''[1]

(అందువల్ల జన బాహుళ్యంలో బ్రాహ్మణులలోని ఆరాధ్యులు, జంగములు, బలహీనవర్గాలోని బలిజలు వంటి బహు కొద్ది కులాలకు మాత్రమే వీరశైవం పరిమితమై యున్నదని భావించటం సబబు. ముస్లిం దండయాత్రల కాలంలో ఆంధ్ర ప్రాంతంలోని ప్రజలు బసవ, పండితుల బోధనలలో పూర్తిగా మునిగిపోయి వీరశైవ మతాలలో కలిసికట్టుగా వున్నారనేది వాస్తవానికి దూరంగా వున్నట్లు కన్పిస్తున్నది.)

వీరశైవులను లింగాయుతులని కూడా అంటారు. వీరు బ్రాహ్మణాధికారాన్ని ధిక్కరించారు. మతాధిపత్యం మీద ఎదురు తిరిగారు. వేదాలు ప్రబోధించిన పునర్జన్మ సిద్ధాంతాన్ని ప్రశ్నించారు. శివుణ్ణి గౌరవించే సామాజిక గుర్తుగా వారు లింగాన్ని ధరించారు. సాంఘిక స్పృహను కల్గించారు. సాంఘిక సంస్కరణకు పూనుకున్నారు.

వీరశైవం స్త్రీలకు ప్రాతినిధ్యం ఇచ్చింది. స్త్రీలకు సమానస్థాయిని కలుగ జేసింది. స్త్రీలు అనేక సాంఘిక సంస్కరణలకు పూనుకున్నారు. వీరశైవం అంతరించే కాలంలో వీరశైవులు బ్రాహ్మణాధిక్యతకు లోనయ్యారు. ఈ విషయాన్ని రొమిల్లా థాపర్ ఇలా వివరించారు.

The Lingayatas had a strong element of social Conscience and encouraged certain social practices disappeared of by the brahmans, such as late post puberty marriages and the rema-rriages of widows. Not surprisingly the lingayatas themselves came under attack from the Brahmans. Their more liberal social attitudes brought them the support of the lower Castes.''[2]

---

1. Religion in Andhra (1973)
   Dr. B. S. L. Hanumantha Rao, M. A; P.H.D. Page - 292

2. A History of India. Vol-1 (1966)
   Romila Thaper Page - 216

లింగాయతులు బలమైన సాంఘిక స్పృహ కలిగియుండి, బ్రాహ్మ ణులు ఆమోదించుటకు నిరాకరించిన కొన్ని సాంఘిక ఆచారాలైన రజస్వలా నంతర వివాహాలు, వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించారు. కానీ కొన్నాళ్ళ తరువాత లింగాయుతులును బ్రాహ్మణ ప్రాబల్యానికి లొంగి పోయారు. స్వేచ్ఛాయుతమైన లింగాయుతుల సామాజిక వైఖరి వలన నిమ్న కులాల వారి మద్దత్తు వారికి లభించింది.

వీరశైవంలో ప్రసిద్ధి చెందిన స్త్రీలు సాంఘిక అసమానతల మీద పెద్ద ఎత్తున యుద్ధం చేశారు. ఆ కథలలోని అభూత కల్పనను ప్రక్కన పెడితే వారు ఆనాటి బ్రాహ్మణ వ్యవస్థ మీద తిరుగులేని సమరం కావించా రనడానికి నిదర్శనమైన అనేక కథలు వున్నాయి.

## గుడ్డవ్వ కథ

ఒక ఊరిలో ఒక వృద్ధురాలైన మాల గుడ్డవ్వ శివ భక్తురాలై వుంది. ఆమె గుడ్డితనంతో, కుష్టు వ్యాధితో బాధపడుతూ వుంది. ప్రతి దినం మాల వాడలోనే బిచ్చమెత్తే ఆ గుడ్డవ్వ ఒక రోజు దారితప్పి బాపన వీధికి పోయింది. అక్కడ బ్రాహ్మణులు ఆమెను చూచి ఓసి ! పాపినీ, పూర్వ జన్మమున ఏ పాపమొనర్చితివో, అష్ట దారిద్ర్యములు నీకే పట్టి నవి. కడజాతిలో పుట్టితివి. కన్నులు లేవు. ధనము లేదు. దిక్కులేదు. ఆ మహావ్యాధి పీడిత శరీరముతో నిన్ను చూచిన మాత్రమున మాకు రౌరవాది నరకములు ప్రాప్తించును. నీది అంటువ్యాధి మా కందరకూ అంటించుటకు ఈ వీధికి వచ్చితివా ! పో పో....అని కర్కశ హృదయులై నిష్ఠూరంగా పలికారు. ఈ ప్రత్యక్ష నిందాపూర్వకమైన అవమానమును భరించలేక ఆమె ఆ ప్రక్క గ్రామంలో వెలసియున్న సోమేశ్వరస్వామి సన్నిధికి తీవ్రమైన భక్తితో ఆక్రందిస్తూ దొర్లుకుంటూ పోయింది. ఆమెకు శివుడు ప్రత్యక్షమై, ఆమె శరీరాన్ని బాగుచేసి, కళ్ళు ఇచ్చి ఆమెను దూషించు బ్రాహ్మణులందరికీ కుష్టువ్యాధి వచ్చేటట్లు శపించాడని, ఆమెకు వరములిచ్చు శక్తిగూడా వచ్చిందని, ఆ శక్తితో తనను వేడు కున్న విప్రులకు కుష్టువ్యాధిని పోగొట్టిందని కథ.

ఈ కథను బసవడు రాజుకు ఇలా విన్నవిస్తున్నాడు. "ఈ కథ ననుసరించి మా వీరశైవ మత సిద్ధాంతము ననుసరించి ఈశ్వరుడే అంద

రకూ తండ్రి, పార్వతియే జగజ్జనని, భక్తులందరూ చరలింగ రూపులు. వారిలో హెచ్చుతగ్గులు లేవు." ఈ కథ ననుసరించి ఇందులో వున్న మాయలు అభూత కల్పనలు ప్రక్కన పెడితే బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని స్త్రీలు ఎదిరించారనేది స్పష్టంగా తెలుస్తుంది.

## సూరసానమ్మ కథ

పోరండ్ల అనే అగ్రహారంలో సూరసానమ్మ అనే అవ్వ మహా శివ భక్తురాలు వుంది. ఆమె భర్త మరణించిన తర్వాత కూడా శివ భక్తురాలుగా వుండి జంగమారాధనలు చేస్తుంది. అయితే ఆమె వర్ణ విభేధము పాటించ కుండా రుద్రాక్షమాలలు ధరించిన వారందరినీ భోజనానికి పిలిచి పూజించటం అక్కడి బ్రాహ్మణులకు కంటగింపైంది. వారందరూ ఆ నగరాన్ని పాలించే రాజు దగ్గరకు పోయి ఇలా విన్నవించుకున్నారు. రాజా ! "నేటికి మన నగరమున కొన్ని వుత్పాతములు పుట్టినవి. సూరసానవ్వ అను ఒక వితంతువు పైకి సాధు వేషమును ధరించి విధవాసదాచారములను విడనాడి మాఅందరకు తలవంపులుతెచ్చు కూడని పనులు చేయుచున్నది. ఆమెకు మతి తప్పెనో, ఉమ్మెత్తకాయలు ఏమయినా తిన్నదో అది మరి ఎట్టి వికారమో మేము చెప్పజాలము. శరీర మంతయు బూడిద పూసుకొనును. తల యందు, చెవుల సందుల యందు చేతులకు రుద్రాక్షలు, పటికపు పూసలు ధరించును. ఎట్టి కడజాతి పురుషుడైనా వీధిలో కనబడిన వానికి షోడశోపచార పూజలుకావించి ఒక దినమో రెండు దినములో అతనికి అతిధ్యమిచ్చును. ఆమె ప్రవర్తన ఇట్లు అనుమానాస్పదముగా వుండుటయే కాక సంప్రదాయ విరుద్ధముగా బాపనవాడను సానివాడగా నొనర్చుచూ తన పేరు సార్ధకమొనర్చుకొనుచున్నది. బ్రాహ్మణ అగ్రహారము మాలలకు నిత్య నివాసమైపోయింది. మాలవానినిగూడి ఆమె ఇంటిలో నుండగా నీకు చూపెదము, చూచి దండింపుము" అని విన్నవింపగా ఆ రాజు ఆ విధంగానే మాకు ఆమెను కులబేధం లేకుండా ఆతిధ్యం ఇచ్చునప్పుడు పట్టి చూపండి, దండిస్తాను. అని చెప్పాడు.

రెండు మూడు రోజుల తర్వాత ఒక మాలడు అగ్రహారపు వీధిలో ప్రవేసించి సూరసానమ్మ ఇంటికి వెళ్ళగా సూరసాని అతనిని దూరంగా

మండగానే చూచి ఎదురు వెళ్ళి పాదాభివందనం ఆచరించి ఇంటికిగొని పోయెను. ఇంటికి చేరినంత ఆ మాల ఆ ఇంటి అరుగు మీద కూర్చుండి ఎదురుగా వీధివైపు గోడలో నున్న చిలకకొయ్యకు ఆరెలను, మోకులను తగిలించి కత్తిని అరుగుపై వుంచెను. ఇంతలో అవ్వ లోనుండి పాదోదకము గొనివచ్చి ఆతని పాదములు కడిగి ఆచమించి శిరస్సు దాల్చి లోనికి గొనిపోయి యథాప్రకారముగా మజ్జనార్చన భోజన విధులతో అతనిని తృప్తిపరచు చుండెను. బయట చేరిన బ్రాహ్మణులు ఆ ఇంటి చుట్టు ముట్టి వీధి తలుపులు, దొడ్డి తలుపులు అన్నీ బంధించి తాళాలు వేశారు. ఈ విషయాన్ని రాజుకు చెంపేశారు. రాజుని, సభాపతిని అక్కడకు తీసుకొచ్చారు. అయితే సూరసానమ్మ తను భక్తుడుగా భావించిన మాలవానికి ఆతిథ్యాన్ని సజావుగా అందించింది. బయటవున్న బ్రాహ్మణులు గందరగోళం చేస్తుండగా అంత్యజుడు, అంత్యజుడు అని అరుస్తుండగా ఆమె ఒక కిటికీ తలుపు తెరచి వారందరితో ఇలా అంది. "అయ్యలారా ! అంత్యజుడు అని గోల చేయుచున్నారు. ఇచ్చటికి అంత్యజుడు ఎట్లు వచ్చును. ? మీవంటి అగ్రజన్ములు మావంటి హరభక్తుల, భక్తురాండ్ర గృహమునకు రాజెల్లరు. రుద్రభక్తుల ఇండ్లయందు ప్రత్యక్ష రుద్రులు కాక క్షుద్రులు ఎట్లుండెదరు. మహేశ్వరుల మందిరములందు మా మహేశ్వరులే కాక మనుజులుందురా ? ఆ భవరహితుని భృత్యుల ఇండ్లలో భవరహితులే గాని భవులుందురా ? పరమేశ సద్భక్తిపరులను నిందించి నరకమున గూలబోవుచున్న మిమ్ము ఏమనగలను ? మా ఇంటిలో నున్నవాడు మహేశ్వరుడు. ఆయనను మీరు చూడ శక్తులా ? లోకైకనాథుడే లోపల నున్నాడు. మీరు ఆలకింపగలరే ? లోచనత్రయుడు లోనున్నవాడు. మీకు గోచరుడగునే ? ఇచ్చట శర్వుడే విజయము చేసియున్నాడు. కర్మ చండాలురైన మీకెరుగ వశమే ? వశమైన చొరండి చూడుడి చూచి పట్టుకొనుడు" అని తలుపులు తెరచెను. బ్రాహ్మణులందరూ ఇంట్లోకి జొరబడి ఆ మాలవానిని వెదికివెదకి ఎక్కడా కనిపించక ఏమే....సానీ ? ఆ మాదిగ కొయ్యనెక్కడ దాచితివి ? ఎక్కడికంపితివి ? చెప్పు చెప్పుమని వేధించిరి. అందులకు అవ్వ కోపించి "మీకు కీడు కొవ్వినది. మాట మాటకి మాలమాదిగ అని పేలుతున్నారు. శివభక్తశిఖామణి అయిన కెంబావి భోగయ్యగారి చరిత్ర మీరు వినలేదా? ఒకప్పుడు శివుడు మాలవాని వేషంలో వచ్చి భోగయ్య ఇంట్లో ఆవు

మాంసం తినలేదా? మీవంటి బ్రాహ్మణులు భోగయ్యను అవమానించ బోయి చివరకు ఆయన పాదాల మీద పడలేదా? అంతేకాదు. సామవేది అను ఒకశివభక్తుడు మహాయజ్ఞము చేస్తున్నాడు. ఆతని మనస్సు తెలుసు కోవడానికి శివుడు మాలవాని రూపంలో ఆవుపెయ్యను మెడమీద ఎక్కించుకొని ఆయన వెనుక పార్వతి మాల స్త్రీ రూపంలో వెంట రాగా యజ్ఞావరణములో ప్రవేశించాడు. అక్కడుండే బ్రాహ్మణులందరూ మాల వాని రాకవలన యాజ్ఞశాల అపవిత్రమైనదని భావించి దూరంగా పోయి నిలిచారు. ఆ సామవేది అంత్యజులకు ఎదురేగి పూజించగా శివుడు వారిని అనుగ్రహించాడు.

కావున ఓ! బ్రాహ్మణులారా! మీరు గర్వపడకండి. మీ అహం కారమే విషతుల్యమై మిమ్మల్ని చంపుతుంది. ఓ! బ్రాహ్మణులారా! భక్తుడైనవాడు ఏ కులం వాడైతేనేమి? భక్తుని రక్షించు నిమిత్తము పరీక్షించు నిమత్తం పరమేశ్వరుడు అనేక రూపాలెత్తుతున్నాడు కదా." అని విన్నవించి అంతకుముందు మాలవాని రూపంలొ శివుడు భోజనము చేసిన చోట శివలింగ ప్రతిష్ఠాపనను వారందరికి ఆమె చూపినది. అం తట వారందరూ సూరసానమ్మకు నమస్కారము చేశారు. ఈ కథను బట్టి శైవ స్త్రీలు కులతత్వం మీద, అస్పృశ్యత మీద తీవ్రమైన యుద్ధం ఆనాడు చేశారని మనకు తెలుస్తుంది.

## బసవేశ్వరుని సంస్కరణలు

బసవేశ్వరుడు పురుషులు స్త్రీలకంటె ఏ విధంగానూ అధికులు గారని వాదించాడు. స్త్రీలను గౌరవంతో, దయతో చూడాలని ఉద్బోధించాడు.

అతడు ప్రచారం చేసిన మరికొన్ని సిద్ధాంతాలివి:—

1. బాల్య వివాహాలు జరుగకూడదు.
2. వితంతువులను తగలబెట్టడం మహా పాపం.
3. తల్లిదండ్రులు పెళ్ళి నిశ్చయం చేయవచ్చు కాని పెండ్లి చేసుకోబోయే వారి అనుమతి తీసుకోవాలి.
4. ఏ వివాహమూ నిర్బంధముగా చేయకూడదు.

5. వితంతువు మరలా వివాహము చేసుకోవాలనుకుంటే అందుకు అనుమతించాలి. పిల్లలుంటే వారిని భర్త తాలూకు బంధువులకు ఇప్పించ వచ్చు.

6. విడాకులు కొన్ని షరతులకు కట్టుబడి అనుమతించవచ్చు.

వీరశైవ యుగంలో అనేకమంది ప్రసిద్ధి చెందిన స్త్రీలున్నారు. వీరు కేవలం భక్తులేకాక సాంఘిక దురాచారాలమీద పెద్ద ఎత్తున యుద్ధం చేశారు. దుగ్గాలదేవి, సకలవ్వ, రెమ్మవ్వ, కాలవ్వ, బుడ్డవ్వ, కేతవ్వ, బసవమ్మ, ప్రమదమ్మ, అక్కవ్వ, హోడవ్వ, వినులవ్వ, బిజ్జ మహాదేవి మొదలగు వారెందరో స్త్రీలు అనేక సాంఘిక దురాచారాలకు తిరగబడ్డారు. అయితే వీరశైవ యుగంలో స్త్రీల మూఢభక్తి వారిని అనేక సందర్భాలలో మతిలేకుండాచేశాయి. శివుని కోసం బిడ్డల నివ్వడం, జంగముల మోసాల్లో ఇరుక్కు పోవడం, కఠోర నిష్ఠచేసి ప్రాణాలివ్వడం ఇటువంటివెన్నో దురాచారాలకు వారాహుతి అయ్యారు. అయినప్పటికి భారతదేశంలోని మత సంస్కరణోద్యమాలలో వీరశైవానికి ఒక ప్రాధాన్యత వుంది. అందులో స్త్రీలపాత్ర గణనీయమైంది.



# సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమం - స్త్రీ

సంస్కృతికి మూలం స్త్రీ. ఆ స్త్రీ జీవనంలోని మార్పుకు మూలమైన చైతన్యమే పునరుజ్జీవనం. మొత్తం సామాజిక వ్యవస్థలో కొన్ని మార్పులకు మూలమైన ఈ యుగం స్త్రీ వ్యవస్థా వికాసానికి కూడా మూలమైంది. ఈ మూలమైన అంశాలను గూర్చి చర్చిద్దాం.

ఆంగ్లేయుల పరిపాలనా ప్రారంభ కాలానికి భారతదేశంలో స్త్రీల పరిస్థితి అన్ని రంగాలలో అధ్వాన్నంగా వుంది. బాల్య వివాహాలు, సతీ సహగమనాలు, శిశు హత్యలు, పరదా పద్ధతులు, బహు భార్యత్వం, అవిద్యతో స్త్రీలు అణచబడి వున్నారు. ముఖ్యంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల స్త్రీలు అమానుషమైన కట్టడులకు గురయ్యారు. హిందూమత పాశవిక ఉక్కుపాదం క్రింద అణచబడ్డారు.

ఇలా దుర్భర పరిస్థితుల్లో వున్న స్త్రీ విముక్తికై పోరాడిన సంస్కర్తలను రెండు వర్గాలుగా విభజించ వచ్చు. మొదటి వర్గం పాశ్చాత్య సాంస్కృతిక విప్లవాల ప్రభావంలో సంస్కరణోద్యమాలు నడిపినవారు. వారిలో ముఖ్యులు రాజా రామ్ మోహన్‌రాయ్, రెనడే, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌లు.

వీరు స్థాపించిన సంస్థలలో ముఖ్యమైనది బ్రహ్మ సమాజం. ఇంకా సయ్యద్ అహ్మద్‌ఖాన్, అమర్ అలి, మహమ్మద్ ఇక్బాల్ మొదలైన మహమ్మదీయులూ వున్నారు. సనాతన ధర్మలైన దయానంద సరస్వతి వంటి వారు రెండవ వర్గానికి చెందుతారు. అనిబిసెంట్ దివ్యజ్ఞాన సమాజం వంటి సంస్థలు వాటి పరిధుల్లో అవి పనిచేశాయి.

ఈ దురాచారాలన్నింటిలో సతీ సహగమనం అమానుషమైంది. మనిషిని నిలువునా కాల్చి ఆనందించే దుర్మార్గపు ఆచారం అది. దీని పూర్వాపరాలు పరిశీలిద్దాం.

# సతీ సహగమన దురాచారం

"సతి" దురాచారం మధ్య ఆసియా నుండి భారతదేశానికి వలస వచ్చిందని కొందరు పరిశోధకుల అభిప్రాయం. గ్రీస్‌లో జరుపబడు మరణానంతర క్రియలకు, సహగమనాచారమునకు సన్నిహిత సంబంధము వున్నట్లు పరిశోధకులు భావిస్తున్నారు. స్లావోకి జాతివారిలోను, ఇండో-జర్మానిక్ వారిలోను ఈ దురాచారం ఒకప్పుడు ఉండేది. ఈ దురాచారం పెక్కు ఆఫ్రికా జాతుల్లోను, అమెరికా ఖండంలోని రెడ్ ఇండియన్ జాతుల్లోను కనుపించేది. ఆర్యులు ఇండో యూరోపియన్ యుగములో వున్నప్పుడు, భారతదేశానికి రాకపూర్వం, ఈ సతీ సహగమన పద్ధతిని పాటించారనడానికి ఆధారాలు వున్నాయి. అయితే భారతదేశంలోకి ప్రవేశించే నాటికే ఆర్యులు దాన్ని పాటించడం మానివేశారు. "అవేస్తా"లో దాని ప్రస్తావన మనకు కనిపించదు.

అలాగే ఋగ్వేదంలో పేర్కొన్న "ఫ్యూనరల్" మంత్రాల్లో సతి ప్రస్తావనే లేదు. సతీ సహగమనం అమల్లోనే వుండివుంటే ఈ మంత్రాల్లో దాని ప్రస్తావన ఉండి వుండాలి. లార్డు విలియం బెంటింగ్ "సతి" పద్ధతిని రద్దుచేసిన రోజుల్లో సతి శ్రుతి బద్ధమా? కాదా? అని చర్చ జరిగింది. భార్య చితిమీదికి ఎక్కడాన్ని గూర్చి ఋగ్వేద మంత్రాలు ప్రస్తావించాయని కొందరు వాదించడం జరిగింది. "అగ్రి" అనే మాటను "అగ్ని" గా తప్పుడు పద్ధతిలో మార్చితే తప్ప ఋగ్వేద మంత్రం దాన్ని ప్రస్తావించిన దనడానికి వీలులేదు. ఈ అగ్రి అనే మాట వున్న శ్లోకం కూడా, భర్త శవాన్ని దహనం చేసే ముందు శవం దగ్గరకు వెళ్ళి భార్య తలంటు పోయడం గురించి మాత్రమే ప్రస్తావించింది తప్ప భర్త చితి మీదపడి తనకుతానుగా ఆత్మాహుతిని గురించిన ప్రస్తావన లేనేలేదు.

నారాయణీయ తైత్తరేయ ఉపనిషత్తులోని 84వ అంకములోని ఒక శ్లోకాన్ని బట్టి అగ్ని దేవుణ్ణి గూర్చి విధవ ప్రార్థించడం తాను అనుగమన వ్రతాన్ని పాటిస్తున్నట్లుగా చెప్పుకోవడం. తద్వారా ఆ వ్రత ఫలాన్ని తాను పొందనున్నట్లుగా భావించడం గురించి ప్రస్తావనవుంది. అయితే ఈ ప్రస్తావన ఆఖ్యశాక నుండి ఉదహరించ బడింది. కాని ఆఖ్య శాక నుండి ఉదహరించినట్లుగా నారాయణీయ ఉపనిషత్తు పేర్కొన్నప్ప

టికీ ఈ నారాయణీయ ఉపనిషత్తు అనేది వేద కాలానంతరపు రచన. ఒక్క ఆఖ్యశాఖను మాత్రమే మూలంగా పేర్కొన్నారు గనుక వేదకాలంలో "సతి" ఆచారం వుందని అంతమాత్రాన్నే ఆమోదించలేము. కాని ప్రాచీన "సతి" ఆచారాన్ని తెలుపు నియమాలు కొన్నింటిని వైదిక యుగమునాటి దహనముచేయుక్రియకు సంబంధించిన సమాచారమును అధర్వణవేదము తెలుపు చున్నది. తన భర్త చితిపై విధవరాలు పడుండే ఆచారం ఆనాటికీ ఉన్నట్లు అధర్వణవేదము తెలుపు చున్నది. ఏమైనప్పటికీ చితినుండి క్రిందికి రమ్మనడం జరిగేది. ఆమె సంపన్న జీవితమును కలిగి ఉండవలయునని, సంపదలతోను, సంతానముతోను ఆనందమును పొందవలయునని ప్రార్థన చేయబడేది.

ఇయం నారీ పతిలోకం వృణానాని వధ్యతే ఉపత్వా మర్త్య ప్రేతమ్।
ధర్మ పురాణ మనుపాలయన్తి తస్యప్రజాం ద్రవిణం చహధత్త॥

(అధర్వణవేదం XVIII 2, 1)

కాబట్టి వైదికయుగం విధవరాలు తనను తాను బలిచేసు కొనవలెనని గాక పునర్వివాహిత కావలెనని కోరినట్లు స్పష్టమవు చున్నది.

వైదికయుగంలో సతి ఆచారం తెగిపోవుటకుగల కారణములను మాత్రం వూహించవచ్చును. బహుశా వైదిక ఆర్యులపై ద్రావిడుల మాతృస్వామిక సంస్కృతీ ప్రభావం కొంతపడి, మనిషిని కాల్చడం అమానుషమనిపించి వుండవచ్చు. నాటి భారత జాతుల్ని ఎదుర్కొనడం కోసం అల్ప సంఖ్యాకులుగా గాకుండ స్త్రీలు కూడా బ్రతకడం అవసరమై వుండవచ్చు. వారి రాజకీయ ఆధిపత్యమును సుస్థిరం చేసికోవడంకోసం వారు "సతి"ని ఆచరించడం మాని, దాని నమూనాను మాత్రమే ఆచారబద్ధంగా కనబరచారు. విధవరాండ్రను దహనం చేయడంకంటే వారు సజీవులుగా ఉండటం వలననే వైదిక ఆర్యులకు ప్రయోజనం వున్నట్లు వారుగమనించారు.

ఏది ఏమైనా వైదికార్యులు భారతదేశానికి వచ్చిన ప్రారంభ కాలములో ఆర్థిక సాంఘిక రాజకీయ కారణాల వలన "సతి"ని ఆచరించడం మానివేశారు. అందువలననే క్రీ॥ పూ॥ 400 సం॥ వరకు సతీ సహగమనమునకు సంబంధించిన ఏ గుర్తులు మనకు కనిపించడం లేదు. క్రీ॥ పూ॥ 1700 నుండి 700 వరకు వైదిక సాహిత్యం "సతి" ఆచారం పట్ల

స్థానం వహించింది. క్రీ॥ పూ॥ 600 నుండి 300 కాలం నాటికి గృహ్య సూత్రాలు అనేక శ్రాద్ధ కర్మలను వర్ణించినప్పటికీ అవి సతీ సహగమన మును పేర్కొనలేదు.

గృహ్య సూత్రములలో శ్రాద్ధకర్మల వివరములలో భర్త చితిమీద పరుండిన విధవరాలిని నమ్మకస్తుడైన ముసలి సేవకుడుగాని, లేక ఆమె భర్తయొక్క సోదరుడు, శిష్యుడుగాని చితి నుండి తిరిగి తీసుకువస్తారు. దీనిని బట్టి ఆమె బాధ్యతను వారు వహించడం జరుగుతుంది. చితినుండి తిరిగి వచ్చునపుడు తన భర్త చేతి వస్తువులైన ఆభరణములు, బంగా రము, ధనుస్సు మొదలైన వాటిని తీసి తెచ్చుకుంటుందని తెలుస్తుంది. దీనికి పూర్వ యుగంలో ఇవి వానితోపాటు దహింప బడేవని తైత్తరీయ ఉపనిషత్తును బట్టి తెలుస్తుంది. విధవరాలు ఆమె బంధువులు సుఖసౌభాగ్య జీవితమును గడుపుదురనే ఆశ "దహన కర్మ కాండ" మంత్రాల్లో వ్యక్త మయ్యేది.

"సతీ సహగమన ఆచారాన్ని" కౌటిల్యుడుగాని, మెగస్తనీస్‌గాని పేర్కొనలేదు. క్రీ॥ పూ॥ 1000 నుండి క్రీ॥ పూ॥ 400 సం॥ వరకున్న ధర్మసూత్రకారులు మనువు, యాజ్ఞవల్క్యుడు, తత్పూర్వపు స్మృతి కర్తలు "సతీ" సహగమనం ఆచరణలో వున్నట్లు పేర్కొనలేదు. విధవ రాండ్రకు విధులను, శాసనములను, కట్టడులను మాత్రం చేశారు.

భారతదేశంలో ఋగ్వేదకాలంలో సహగమనాచారం ఉన్నట్లు ఆధారాలు లేవు. అధర్వణవేదంలో దాని ఉల్లేఖనాలు వున్నాయి. మహా భారతంలో మాద్రి సహగమనాన్ని ఆచరించడాన్ని బట్టి ఆ కాలంలో సతీ సహగమనం కొన్ని వర్గాల్లో వున్నట్లు వ్యక్తమవుతోంది. కురుక్షేత్ర యుద్ధా నంతరం రాణులెవ్వరూ ఈ ఆచారాన్ని పాటించలేదు.

పౌరాణిక వాఙ్మయములో సహగమన వృత్తాంతం కనిపిస్తూ వుంది. క్రీ॥ పూ॥ 327 లో అలగ్జాండర్ భారతదేశంపై దండయాత్ర చేసిన కాల ములో పాంచాలంలో "సతి" దురాచారం కనిపించింది. మధ్య యుగాల్లో ఈ దురాచారాన్ని కనుగొన్న అనేక విదేశీ యాత్రికులు సతీ సహగమన దురాచార సన్నివేశాలను వర్ణించారు.

"మద్రాసు మచిలీపట్నాల మధ్య కరేడు అనేచోట భేరే సహగమ నం చేసే స్త్రీని చూశాడు. ఆమెతో మాట్లాడాడు. బ్రాహ్మణుల దుర్బోధలు

ఎందుకు వింటావన్నాడు. అది విని బ్రాహ్మణులకు కోపం వచ్చింది. ఆమె మాత్రం నవ్వి తన జీవితంలో ఎప్పుడూ కలగనంత ఆనందంగా వుంది అన్నది అన్నాడాయన. "ఆ పిచ్చిపిల్ల చేతులెత్తి అందరికీ నమస్కరించింది. తన తలలో ముడుచుకున్న పువ్వులు కొన్ని తీసి నాకిచ్చింది. ఎగిరి గంతేసి నిప్పుల్లోకి ఉరికింది" అన్నాడు భేరే.

ఆయన వర్ణించిన దానిని బట్టి సహగమనం ఇచ్ఛాపూర్తిగా జరుగుతున్నదనేది సగం మాత్రమే నిజమని, బ్రాహ్మణులు దానికి ముందు వారిచేత ఏదో తాగించి, అర్ధ ఉన్మాదావస్థకు తెస్తున్నారని అర్థమవుతుంది. మహమ్మదీయ ఉద్యోగులు మంచి మాటలతో వారినాపనినుంచి మళ్ళించ ప్రయత్నించి విఫలులు అవుతున్నారని, దేశీయ సామంతులు నవాబుకు పెద్దపెద్ద మొత్తాలు, నజరానాలు చెల్లిస్తుండం చేత బలపూర్వకంగా ఈ చర్యను నిరోధించలేక పోతున్నారని భేరే అభిప్రాయం.

కొందరు స్త్రీలు సతి చేయ నిరాకరించినపుడు బ్రాహ్మణులు బలవంతంగా వారిని మంటలలోకి తోసేస్తుంటారని, అటువంటి సందర్భంలో ఒకమారు కొందరు ఇంగ్లీషు నావికులు ఒకామెను కాపాడారని భేరే వ్రాశాడు.

బెర్నియర్ స్వయంగా ఆరు సహగమనాలు చూశాడు. ఏడోదాన్ని గురించి విన్నాడు.

భర్తతో చనిపోవడం పుణ్యమని, ప్రతిష్టాకరమని తల్లులు కూతుళ్ళకు బోధిస్తారు. గౌరవంగా బ్రతకాలనుకొనే వారెవ్వరూ సంప్రదాయాన్ని ధిక్కరించలేరు అంటూ ఆయన ఈ సహగమనాలకు కారణం చెప్పాడు.

ఈ విధంగా పాశ్చాత్యుల మనస్సులను ఈ అమానుష చర్య కదిలించి వేసింది. బ్రిటీష్‌వారు రాజ్యం చేసేనాటికి ఈ దురాచారం వేయి శిరస్సుల నాగుగా శతవిధాల స్త్రీలను కాటువేసి ఆయువులు పీల్చుకుంది.

అయితే ఏ సాంఘిక దురాచారాన్నైనా రూపు మాపాలంటే. చిత్తశుద్ధి గలిగిన సాంస్కృతిక విప్లవోద్యమం కావాలి. ఆ ఉద్యమానికి తీక్షణత, తీవ్రత, అవగాహన కలిగిన నాయకత్వం కావాలి. ఆ నాయకునికి అచంచల దీక్ష, పట్టుదల, కార్యదక్షత, అవిశ్రాంత కృషికావాలి.

సతీ సహగమన నిర్మూలనంలో గుండె కరిగి, కదిలి చైతన్య జ్వాలలా పనిచేసిన నాయకులను గూర్చి అవలోకిద్దాం.

## సాంఘిక సంస్కర్త రాజారామమోహన రాయలు :-

రాజారామ మోహన్‌రాయ్ 1772వ సంవత్సరం మే నెల 2వ తేదీన తారిణీదేవి, రమాకాంత రాయలకు జన్మించాడు. రమాకాంత రాయలది వంగదేశములోని రాధానగరము రామమోహనరాయలు చిన్నతనం నుండి సంప్రదాయము, భక్తి కలిగి చురుకైన విద్యార్థిగా తొమ్మిదవ సంవత్సరానికి సంస్కృతము, వంగభాషలను కొంతవరకు అభ్యసించాడు.

తరువాత తండ్రి చేసిన చొరవతో, పారశీక అరబ్బీ భాషలను చదవటానికి పాట్నా వెళ్ళాడు. అరబ్బీ భాషలో మహా పండితులైన మౌల్వీలు అతనికి మంచి పునాదిని వేసి హేతు బద్ధంగా ఆలోచించటం నేర్పారు. ఖురాన్ గ్రంథాన్ని లోతుగా అధ్యయనం చేసే అవకాశం రాయ్‌కి కలిగింది. అరబ్బీ భాషలో అనువదింప బడిన అరిస్టాటిల్ గ్రంథాలను అధ్యయనం చేయటానికి మౌల్వీలు అతనిని ప్రోత్సహించారు. తత్వశాస్త్ర అధ్యయనం వలన రామమోహన్‌రాయ్‌కి విగ్రహారాధన వంటి మత విధానాలు అహేతుకమైనవిగా కనిపించాయి.

రామమోహన్ రాయ్ ఆలోచనా పరుడుగా ఇంటికి వచ్చాడు. సంప్రదాయము, ఆచారము విగ్రహారాధనతో గూడు కట్టుకున్న తన యింటిలో జరిగే కర్మ కాండ అంతా అతనికి దురాచారంగా కనిపించ నారంభించింది. కళ్ళుమూసుకొని, తల వంచి కర్మకాండను ఆచరించ టానికి అతని మనస్సు అంగీకరించలేదు. అతనిలో తీవ్రమైన సంఘర్షణ ప్రారంభమైంది.

రాజారామ్ మోహన్‌రాయ్ పరిష్యన్ భాషలో తన 16వ యేట విగ్రహారాధనను, మూఢాచారాలను ఖండిస్తూ "తుఫాతుల్ మువాహిద్దీన్" అనే గ్రంధాన్ని వ్రాశాడు. అరబ్బిక్ భాషలో ఆ గ్రంధానికి పీఠిక వ్రాశాడు. ఆ గ్రంథం జీవిత సంఘర్షణ నుండి వెలువడింది కనుక మూఢాచారాల మీద బలమైన తిరుగుబాటు జండా ఎగురవేయ గలిగింది. ఇక దీనితో మత ధర్మాన్ని రక్షించ వలసిన కుమారుడు ఈ విధంగా

డు.గుజాయిదారుడు కావటం తండ్రి సహించలేక పోయాడు. అసహనం అగ్గిగా రగిలింది. రామమోహనుడు ఇంటినుండి తరమ బడ్డాడు.

ఉద్యమ కారులకువచ్చే ప్రతికష్టం వారికి అనుభవ బలాన్ని చేకూర్చుతుంది. ఇంటినుండి తరమబడిన రామమోహనుడు హిమాలయముల మీదుగా కడుదూరము ప్రయాణముచేసి టిబెట్ వెళ్ళిలామాబుద్ధిజం అధ్యయనం చేశాడు. హేతుబుద్ధితో వారిలో ఉండే మౌఢ్యాన్ని ఎదుర్కొనడానికి ప్రయత్నించాడు. కరుడుగట్టిన మతభావాలు గల లామాలు అతనిని చంపడానికి ప్రయత్నించారు. అయితే అక్కడి దయార్ద్ర హృదయులైన స్త్రీలు అతనిని రక్షించి పంపివేశారు. స్త్రీలపట్ల కరుణ భావం ఆయనలో అంతకంతకు మిక్కుటమౌతూవచ్చింది. వారికితగిలించిన దాస్య శృంఖలాలు త్రెంచాలనే నిశ్చయం బలపడింది. తన పర్యటనలో అనేక మంది సాంగత్యం వలన తాను అనేక విషయాలు గమనించగలిగాడు. భారతీయతత్వశాస్త్రాన్ని అధ్యయనంచేయాలని కుతూహలముతో వేదాలు ఉపనిషత్తులు, దర్శనాలు అధ్యయనం చేశాడు.

ఉపనిషత్తుల లోని తర్కం ఆయనకు నచ్చింది. విశ్వ మానవుని నిరూపించడం కోసం వాటిపట్ల తపన ఆయన్ని ముగ్ధుడ్ని చేసింది. అయితే భౌతికదర్శనాలు అతడు క్షుణ్ణంగా చదివినట్లు కనపడదు. ఏకేశ్వరత్వాన్ని, పరిశుద్ధ ఆస్తికత్వాన్ని అతడు బోధించాలని నిర్ణయానికివచ్చాడు. ఏకేశ్వరత్వానికి భిన్నమైన ఆస్తిక సిద్ధాంతాలను ఖండించబూనుకొన్నాడు. దురాచారాలను కూకటి వేళ్ళతో శాస్త్రచర్చలతో పెకలించ పూనుకట్టాడు. ఆయన ప్రపంచ దేశాల తాత్విక రంగాలను కూడా అధ్యయనం చేయడానికి గ్రీకు, హిబ్రూ, లాటిన్ భాషలను అభ్యసించాడు. 1803లో ఆయన తండ్రి మరణించారు.

రాజారామోహనుడు తూర్పు ఇండియా వర్తక సంఘపు ఆర్థిక శాఖలో దివానుగా భగత్పాల్, రాంఘర్, జేస్‌పూర్ ప్రాంతాలలో పని చేసి రంగపూర్ కలెక్టరు అయిన జాన్‌డిగ్బీ దొరగారి వద్ద 1809 లో దివానుగాచేరాడు. జైనపండితుల సహాయముతో కల్పసూత్రాన్ని అధ్యయనం చేశాడు. సంస్కృత పండితులకు రాజారామ్మోహనుడంటే భయంప్రారంభమయింది. ఆయన నిశితమైన పరిశీలన, దురాచారాలను ఎదిరించే

నిజాయితీ ప్రతివాదులను భయకంపితులను చేశాయి. తండ్రిమరణించిన అనంతరము కూడా తల్లి ప్రత్యర్థులతో చేరి రామమోహనుని తీవ్రంగా గర్హించింది. ఆస్థిలోభాగంలేదని, వంశగౌరవాన్ని నాశనముచేసిన అతడు నాకొడుకు కాదని వాదించింది. ఇంత సంఘర్షణలో ఉన్న రోజులలోనే వదినను బలవంతముగా సతీసహగమనం చేయించడం రాయ్‌కళ్ళారా తిలకించడం జరిగింది. ఇన్ని సంఘర్షణల మధ్యలో రామమోహనుడు రాటుతేలాడు. 1814 లో పదవీ విరమణ చేసి తన యుద్ధరంగాన్ని కలకత్తాకు మార్చాడు.

పట్టుదలతో ఆయన ప్రారంభించిన ఈ మహోద్యమం ముందుకు సాగింది. మరోప్రక్క ఆనాడు "సతి" దురాచారం ఎంతోబలంగా ప్రజల్లో పాతుకుని వుంది. 1815వ సంవత్సరం మొదలు1825వ సంవత్సరం వరకు ఒక కలకత్తా నగరంలోనే దాదాపుగా 5వేలమంది ముక్కుపచ్చలారనితల్లులు బుగ్గిలో కలసిపోయారు. ఈ మారణ హోమాన్ని రాజారామ్‌మోహన్‌రాయ్ ఉపన్యాసాలద్వారా, కరపత్రాలద్వారా, చిన్నచిన్న గ్రంథాల ద్వారా వ్యతిరేకించారు. ప్రభుత్వానికి ఎన్నోసార్లు సజీవ దహనాన్ని నిషేధిస్తూ చట్టం చేయవలసిందిగా మహజర్లు పంపారు. రాజారామ్‌మోహన్‌రాయ్ నిరంతర పోరాటానికి హిందూ మతఛాందసులు గ్రంథాలు రాశారు, కులభ్రష్టుడని దుమ్మెత్తిపోశారు. అయినా ఆయన జంకలేదు రాయ్‌గాలిలో యుద్ధముచేయలేదు. శాస్త్రబద్ధంగా దీన్ని ఖండించడానికి కృషిచేయడమే గాక ప్రజలకు ఆ విషయాన్ని తెలియ జెప్పాడు.

విలియం బెంటింగ్ 1828 జూలై 4వ తేదీన భారత దేశానికివచ్చాడు. అంతకు ముందటిపాలనా ప్రతినిధులు భారతదేశ ఆచార విషయాలలో జోక్యం కలిగించుకోలేదు. కానీ బెంటింగ్ సతీసహగమనం విషయం వరకు మానవతా దృష్టితో పరిశీలించారు. 1829 నవంబర్‌లో ఆయన సతీసహగమన నిషేధ పత్రాన్ని ప్రకటించారు. అయితే సాంప్రదాయవాదులు సంతకాలు సేకరించి సతీసహగమన నివారణచట్టాన్ని వ్యతిరేకించ ప్రయత్నించారు. ఈ చర్యకు సత్యాగ్రహుడైన బెంటింగ్ నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. "ఇందుమూలంగా అందరికి తెలియజేసేది ఏమిటంటే, ఈ నిబంధన అమలులోకి వచ్చింది మొదలు హిందూ వితంతువు దహనానికి సజీవ సమాధికి సహకరించిన, లేక ప్రోత్సహించిన నేరం మోపబడిన మనుష్యులందరూ ఆత్మత్యాగంచేసిన స్త్రీ తన ఇష్టం

తోనే చేసిందా, లేక బలవంతంగా చేసిందా అనే ప్రసక్తి లేకుండా కావాలనే హత్యచేసిన దోషులుగా పరిగణింపబడి శిక్షార్హులవుతారు." వారికి జరిమానా, లేక ఖైదు లేక రెండుశిక్షలు విధిస్తారు. రామమోహనరాయలు సంస్కృతంలోవున్న ఉపనిషత్తులను ఆంగ్లేయులు అర్థంచేసుకోలేక పోతున్నారని, ఇంగ్లీషులో కఠోపనిషత్తు, కేనోపనిషత్తు, ఈశావాస్యోపనిషత్తు మొదలగునవి అనువాదంచేశాడు. సంస్కృతపాఠశాలల నిర్మాణాన్ని నిరశించాడు "మా వెర్రి వేదాలు, మా పుక్కిటిపురాణాలు మమ్ము సముద్ధరించలేవు. మాకు మీ క్రొత్త వైజ్ఞానిక శాస్త్రాలను ఇవ్వండి." అని ప్రభుత్వానికి విన్నవించాడు.

1831 సెప్టెంబరు 7న నాల్గవ విలియంను ఆయన కలుసుకున్నాడు. బ్రిటీష్ పార్లమెంటులో సతీసహగమనం బిల్లు చర్చించబడింది. సతీసహగమనం చట్టబద్ధంగా నిషేధించబడింది. ఆయన కృషి సఫలీకృతమైంది. అయితే హిందూమతవాదం పూర్తిగా అంతరిస్తేకాని సతీసహగమనం పూర్తిగా పోదనియిటీవల రాజస్తాన్‌లో జరిగిన రూప్‌కన్వర్‌ని అమానుషంగా దగ్ధం చేయడం నిరూపించింది. రాజారాయ్‌మోహన్‌రాయలు కొన్నిపరుధుల్లో పనిచేసినా ఆనాటికి అదిఒకముందడుగే.

భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంలో రాజారాంమోహన్ రాయ్‌ల తర్వాత ఈశ్వర చంద్ర విద్యాసాగర్ పాత్ర మరచిపోలేనిది. 1820వ సంవత్సరంలో నిరుపేద కుటుంబంలో జన్మించి నిరంతర శ్రమతో అధ్యయనం చేసి 1857 నాటికి ఒక సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ పదవికి ఎదిగాడు. 1851వ సం॥న విధవా వివాహం శాస్త్రీయం అని సిద్ధాంతీకరించి విధవా వివేకము పేరనొక చిన్నగ్రంథమును వ్రాశారు. 1865వ సం॥ డిశంబరు 7వ తేదీన కలకత్తాలో తన యింటిలోనే మొదటి స్త్రీ పునర్వివాహము జేశాడు. 1891వ సంవత్సరం జులై 29వ తారీఖున విద్యాసాగరుడు మరణించే వరకు ఆయన స్త్రీ విముక్తోద్యమం కోసం నిరంతరం శ్రమించాడు.

## బ్రహ్మసమాజం - పరివ్యాప్తి

1828వ సంవత్సరం ఆగష్టు 28వ తారీకున కలకత్తా నగరంలో రాజారామ్ మోహన్‌రాయ్ బ్రహ్మసమాజాన్ని స్థాపించాడు. 1830 జనవరి

23న బ్రహ్మసమాజ మందిర ప్రతిష్ఠాపన చేశాడు. రామమోహనుడు స్వదేశము విడిచిన తరువాత ద్వారకానాథుడు బ్రహ్మసమాజ పరివ్యాప్తికై కృషిచేశాడు. అతని కుమారుడు దేవేంద్రనాథ ఠాగూర్ అకుంఠిత దీక్షతో బ్రహ్మ సమాజాన్ని చైతన్యవంతంగా ముందుకు తీసుకుపోయాడు. ఆయన తత్వబోధిని సభను స్థాపించి, దానిద్వారా రామమోహనుని గ్రంథాలను పెక్కింటిని ప్రచురించాడు. దేవేంద్రనాథుని ప్రతిభ ప్రభావం కేశవ చంద్రసేన్ అను ధీమంతుని ఆకర్షించింది. కేశవ చంద్రసేనుడు 1859వ సంవత్సరం నుండి బ్రాహణాధిపత్యాన్ని యెదుర్కొని కులాచారాలను రూపు మాపుటకు కృషిచేశాడు. 1864వ సం॥లో కేశవ చంద్రసేనుడు మద్రాసు, బొంబాయి నగరాలలో పర్యటించి బ్రహ్మ సమాజమును ప్రచారం చేశాడు. మద్రాసులో వేద సమాజమును స్థాపించి, బ్రహ్మ సమాజాభివృద్ధికై కృషిచేశాడు. 1870లో కేశవ చంద్రసేన్ ఇంగ్లండుకు వెళ్ళాడు. స్వదేశానికి తిరిగి వచ్చి భారతీయ సంస్కరణ సంఘం (The Indian reform Association)ను స్థాపించాడు. వయోజన స్త్రీల పాఠశాలను ఒక దానిని నెలకొల్పి 'మద్-నాగరల్' అనుపత్రికను కూడా నడిపాడు. బ్రహ్మసమాజ ఉద్యమ ప్రభావం వలన అనేక చట్టాలు అమలులోకి వచ్చాయి. స్త్రీల మొత్తం జీవనవ్యవస్థలోనే ఎన్నో మార్పులు సంభవించాయి. భారతీయ సాంస్కృతి కోద్యమంలో బ్రహ్మసమాజ పాత్ర మరువరానిది. ఆంధ్ర దేశంలో గూడ బ్రహ్మసమాజం గణనీయమైన పాత్ర నిర్వహించింది. బ్రహ్మసమాజ ఉద్యమ సంస్కృతి నుంచి అత్యుత్తమమైన వ్యక్తిత్వాలు ఆంధ్రదేశంలో ఆవిర్భవించాయి. అందులో ప్రధానమైన సామాజిక శక్తి కందుకూరి వీరేశలింగం.

## కందుకూరి వీరేశలింగం

శ్రీ కందుకూరి వీరేశలింగం స్త్రీ విముక్త్యోద్యమ నిర్మాత, సాహిత్యవేత్త, నూత్న సాంస్కృతిక శక్తి. ఆయన సతీ పునర్వివాహాన్ని వైదిక శాస్త్రగ్రంథాలనుండే ఎన్నో ప్రమాణాలు చూపించి నిరూపించాడు. ఆయన బాల్య వివాహాలను వ్యతిరేకించాడు. స్త్రీ విద్యకై ఆచరణాత్మకంగా ముందుకు వచ్చాడు. తానే అనేక పాఠశాలలు నిర్వహించాడు. అద్వితీయ ప్రతిభా సంపత్తితో ఆయన రచనా రంగంలో అనేక నూత్న పోకడలు చూపించి స్త్రీ విముక్త్యోద్యమం కోసం ప్రధానంగా తన రచనా శక్తిని కుమ్మరించాడు.

స్త్రీలను చైతన్య పరచుటకు తెలుగులో మంచి సాహిత్యం లేక పోవటం గమనించి వీరేశలింగంగారు 1883లో స్త్రీల కొరకు 'సతీ హిత బోధిని' అనే పత్రికను ప్రారంభించారు. 1883లోనే స్త్రీల ఉపయోగార్థం 'సత్యవతీ చరిత్ర' అనే చిన్న ప్రబంధాన్ని వ్రాశాడు. ఈ పుస్తకం ఆనాడు బాగా ప్రసిద్ధి చెందింది. ఈ పుస్తకం తమిళ, కన్నడ, ఇంగ్లీషు భాషల్లోకి ఆనాడే అనువదించబడింది.

1884లో ఆయన స్త్రీలలో చైతన్యం దీసుకు రావడం కోసం 'చంద్రమతీ చరిత్ర'ను వ్రాశారు. ఈ పుస్తకాలను ప్రజలు ఆదరించడం వలన ఉత్సాహం పొంది 1887లో 'సత్యసంజీవిని' అనే నీతి బోధకమైన గ్రంథాన్ని వ్రాశారు. ఆ తరువాత ఆయన 1891లో "సత్యరాజపూర్వదేశ యాత్రలు" అనే గ్రంథం మొదటి భాగాన్ని బయటకు తీసుకువచ్చారు. నిరంతరం ఆయన సాహితీకృషిలో నుండి వచ్చిన ఈ గ్రంథాలు సంప్రదాయక లోకంలో కల్లోలాలను రేపాయి. స్త్రీలోకంలో నూత్నమైన ఆలోచనలను కలిగించాయి.

శ్రీ కందుకూరివారు కేవలం బృహద్గ్రంథాలనేగాక అనేక సాహితీ ప్రక్రియల్లో ఆయన స్త్రీలను జాగృత పరచారు. ఈ కృషిలో భాగంగా ఆయన 1897లో "శ్రీ విక్టోరియా మహారాణిగారి చరితము" అనే గ్రంథాన్ని సచిత్రంగా ప్రకటించారు. స్త్రీలకు శరీర భాగాలపైన సరైన అవగాహనలేదని గమనించి "దేహారోగ్య ధర్మబోధినీ" అనే గ్రంథాన్ని వ్రాశారు. అంతేగాక 1896లో "పత్నీ హిత సూచని" అనే పుస్తకాన్ని, 1899లో "స్త్రీ నీతిదీపిక" అనే గ్రంథాన్ని ఆయన వ్రచురించారు.

ఈ విధంగా కందుకూరి స్త్రీల వికాసం కోసం అభ్యుదయం కోసం విశేషంగా రచనలు చేశారు. ఆయన రచనా శక్తితో స్త్రీలలో సామాజిక చైతన్యాన్ని తీసుకు రాగలిగారు. స్త్రీ దురాచారాలను కొంతవరకు రూపుమాపగలిగారు.

కందుకూరి బహుముఖంగా చేసిన కృషి ఆంధ్రదేశంలో ఆ తరువాత నడిచిన అన్ని సాంఘిక, సాంస్కృతిక ఉద్యమాలకు ఊపిరిగా నిలిచింది. ఈ క్రమంలో ముందుకు వచ్చిన సాహితీ వేత్తల్లో గురజాడది చెరగని స్థానం.

## గురజాడ-కన్యాశుల్కం

గురజాడ అప్పారావుగారు "కన్యాశుల్కం" నాటకం ద్వారా స్త్రీలను అమ్ముకునే నీచమైన ఆచారంపై బలమైన తిరుగుబాటు తెచ్చారు. ఆయన ఆ నాటకాన్ని సజీవ పాత్రలతో చిత్రించాడు. సమాజంలో వుండే పాత్రలనే ఆయన తీసుకొని ఆ పాత్రలన్నింటికి ప్రాణం పోశాడు. గురజాడ కన్యాశుల్కంలో శిల్పించిన పాత్రలు సమాజంలో ఒక బలమైన చర్చను తీసుకు వచ్చాయి. గిరీశం, మధురవాణి, సౌజన్యారావు, లుబ్ధావధాని, అగ్నిహోత్రుడు, రామప్ప, మీనాక్షి, బైరాగి, వెంకటేశంవంటి అన్ని పాత్రలు సమాజంలోవుండే చెడుకి మంచికి జరిగే సంఘర్షణ మధ్యన పుట్టినవే. ఆనాటకం ప్రభావం సమాజం మీద, సాహిత్యంమీద బలంగా పడింది. ఒక అర్ధ శతాబ్ది స్త్రీ సామాజిక పరిణామంలో ఈ నాటకం ప్రభావం వుందంటే ఆ నాటకంలోని వైశిష్ట్యాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. స్త్రీ సంస్కరణోద్యమాలకు గురజాడ "కన్యాశుల్కం" నాటకం కూడా "ఊతాన్నిచ్చిందనుట చారిత్రిక సత్యం.

## తెలుగునేలలో బ్రహ్మసమాజ ప్రముఖులు

కందుకూరి, గురజాడల కృషితో పాటు ప్రసిద్ధులైన సంస్కర్తలు వారికి ముందు, వారితో, వారి తరువాత ఆంధ్రలో బ్రహ్మ సమాజోద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్ళారు. వీరిలో ప్రముఖులు శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు. ఆయన బ్రహ్మ సమాజాన్ని ఆంధ్రలో పొదుకొల్పడంలో అనన్య సామాన్యమైన కృషి గావించారు. 1862వ సంవత్సరంలో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు మచిలీపట్నంలో జన్మించారు. శ్రీ విముక్తోద్యమంలో వారిపాత్ర గణనీయమైంది. బ్రహ్మ సమాజం ప్రభావంతో రాజకీయ నాయకుడు డా॥ పట్టాభి సీతారమయ్య, పండితుడు విద్యావేత్త డాక్టర్ వేమూరి రామకృష్ణారావు, పత్రికా సంపాదకుడు ముట్నూరి కృష్ణారావు, బహుముఖ రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహం స్త్రీ విముక్తి-ఉద్యమంలో భాగం పంచుకున్నారు. ఆంధ్రదేశంలో బ్రహ్మ సమాజం బలమైన సంఘ సంస్కరణను ముందుకు నడిపించింది.

## దేశవ్యాప్తంగా బ్రహ్మసమాజాలు

పశ్చిమ బెంగాల్‌లో బ్రిహ్మసమాజం, అస్సాం, మేఘాలయాల్లో గౌహతి బ్రిహ్మసమాజం, బీహార్ బంకిపూర్ బ్రిహ్మసమాజం, ఒరిస్సాలో ఉత్కల్ బ్రిహ్మసమాజం, కర్నాటకలో బెంగుళూర్ బ్రిహ్మసమాజం, కేరళలో అల్లెపి బ్రిహ్మసమాజం, తమిళనాడులో దక్షిణ భారత బ్రిహ్మసమాజం, బంగ్లాదేశ్‌లో బంగ్లాదేశ్ బ్రిహ్మసమాజం, ఆంధ్రప్రదేశ్‌లో బ్రిహ్మసమాజం ఆవిర్భవించి కృషిచేశాయి. వీటన్నింటి కృషి వలన సతీ సహగమన నిషేధం, వితంతు వివాహాలు, స్త్రీ విద్య అభివృద్ధిచేయడం జరిగింది. బ్రిహసమాజం రానురాను అనేక కోణాల్లో నీరసపడి స్త్రీ విముక్తి కంటే ప్రార్థన విధానాలకే మొగ్గుచూపి, చీలికలకు గురై నామమాత్రంగా ఈనాడు మిగిలింది.

## హిందూ సంస్కరణవాదంగా మిగిలిన ఉద్యమం

హిందూ మత సంస్కరణోద్యమంగా సాగిన ఈ ఉద్యమం అగ్రవర్ణ స్త్రీలకే పరిమితమైంది. హిందూమత ఛాందసభావాలు క్రింది కులాల స్త్రీలలో కూడా ఏదో ఒక రూపంలో పెత్తనం చేస్తూనేవున్నాయి. కాని సతీ సహగమనాల వంటి క్రూరమైన ఆచారాలను క్రింది కులాల వారు పాటించలేదు. హిందూమత పునాదిని దెబ్బతీయకుండా సాగిన ఈ ఉద్యమం రానురాను దాని అంతఃశక్తి కోల్పోయింది, నాయకుల్లోవున్న త్యాగ నిరతి అనుయాయుల్లో తగ్గింది. సామ్రాజ్యవాద వ్యతిరేక భావం లేక పోవడం వలన ఉద్యమ పరిధి తగ్గింది. కులంపునాదులను కదపక పోవడం వలన, మరలా హిందూపునరుద్ధరణ వాదం ఈ ఉద్యమాన్ని మింగడానికి ప్రయత్నించింది.

అయితే ఈ సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ కారులు ప్రబోధించిన మానవతావాదం తరువాత భారత దేశంలో నడిచిన అన్నిపురోగామి ఉద్యమాలకు ఒక సిద్ధాంత ఆయుధ మయ్యింది.

# మహాత్మాఫూలే - స్త్రీ విముక్తోద్యమం

మరాఠా రాజ్యంలో అతిదారుణమైన పీష్వాల పరిపాలనలో నుగ్గిపో యిన స్త్రీజాతికి విముక్తి బాటలు నిర్మించినవారిలో మహాత్మఫూలే అగ్ర గణ్యులు.

అగ్రవర్ణ ఆధిపత్యానికి, హిందూ నియంతృత్వానికి, బ్రాహ్మణ సం స్కృతీ జటిలత్వానికి కంచుకోట అయిన మరాఠా రాజ్యం స్త్రీలను అతిదా రుణంగా అణచింది. రోజు 40 వేలమంది బ్రాహ్మణులకు షడ్రసోపేతాన్నా న్ని వడ్డించిన పీష్వా రాజ్యం బ్రాహ్మణత్వానికి పతాకాలెత్తి వర్ణవ్యవస్థా విషవృక్షాన్ని పెంచి పోషించి విషయలంపటత్వానికి అర్రులు చాచింది. ఆనాటి ఉన్నత వర్గాల పాలనలో మహిళల పరిస్థితి దయనీయంగా ఉం డేది. విషయలోలుడైన పీష్వా బాజీరావు వస్తున్నాడని విన్ననాటి సాయంత్రం పాయ్ నగరంలోని కొందరు స్త్రీలు ఆత్మహత్య చేసుకునే వారట. ఎంత దారుణమైన వేధింపులేకపోతే స్త్రీలు ఆత్మహత్య చేసుకునే వారో?. చరిత్ర గర్భంలోదాగివున్న ఆస్త్రీలోకం గుండెహొదలు ఆలోకిస్తే మనకు ఎన్ని గాథలు వినిపిస్తాయో! ఆ రాజ్యంలో క్రింది వర్ణాల స్త్రీలు అసలు చెప్పులే వేసుకోకూడని పరిస్థితుల్లో వున్నారంటే స్త్రీల వేధింపు ఏ మేరకు అమలు జరిగిందోమనకు స్పష్టంగా అర్థమౌతుంది. ఇటువంటి దారుణనమై రాజ్యం 1898లో అంతరించినపుడు సహృదయులెవరు ఒక కన్నీటిబొట్టుకూడా రాల్చలేదు. ఆదుష్టునికి తగిన శాస్తి జరిగిందని మహిళలు ఆనందించినట్టు ధనుంజయ్‌కీర్ వ్యాఖ్యానించారు.

బ్రిటీష్‌వారు విద్యను అందరికి అందుబాటులోకి తెచ్చేప్రయత్నం చేశారు. ఆకృషిలో భాగంగా 1830 ప్రాంతంలో 6సం॥ ఆడపిల్లలకుకూడా చదువు నేర్పించాలనే ప్రయత్నాలు జరిగాయి. కొంతమంది ఉత్సాహ వంతులు బ్రిటీష్ అధికారులతో సంప్రదించి పీష్వాగారి పాతభవనంలో ఆడపిల్లలబడి ఏర్పాటు చేశారు. కాని వారి ప్రయత్నం వ్యర్థమైపోయిం ది. కొంత మంది అమ్మాయిలు రహస్యంగా వచ్చి చదువుకున్నారు. తరువాత వాళ్ళుమానేశారు. ఇటువంటి రాజ్యంలో ఒక "మాలి" కులంలో పుట్టిపెద్దగ నడించిన జ్యోతిరావ్ ఫూలే తన సాంఘికజీవిత సంఘర్షణనుండి

సాంఘిక ఉద్యమకారుడయ్యాడు. 1827లో జన్మించిన పూలే చిన్నతనములోనే తల్లిని కోల్పోయాడు. 1847కి ఇంగ్లీషు బడిచదువును పూర్తిచేసిన పూలేను బ్రిటిష్ పాలకుని వ్యతిరేకించిన మరాఠీ పోరాట వీరులవలన ప్రభావితం అయ్యాడు. స్టువర్ట్ మిల్ వ్రాసిన "అకిన్‌బర్టి" పుస్తకం కూడా ఆయన్ని కార్యాకారణ వివేచన వైపు నడిపించింది.

మరాఠీలోని సంస్కర్తల్లో బాల్‌శాస్త్రి, జింబేకర్, బాన్‌మహాజన్ దాదోబ పాండురంగ తార్కాడ్కర్ (1814-1882) నానాశంకర్ సేట్ (1803-1865) గోపాలరావ్ హరిదేశ్‌ముఖ్ (1823-1892) పేర్కొనదగిన వారు. వీరందరి ప్రేరణ పూలేకి ఉపకరించాయి. విద్య మానవుణ్ణి వికాసవంతుణ్ణి చేస్తుంది. మానవుణ్ణి వెలిగిస్తుంది. అని జ్యోతిబా పూలే భావించారు. అందునా స్త్రీ విద్య నభ్యసించకపోవడం వల్లనే మూఢాచారాల్లో చిక్కుకుపోయింది అని భావించి 1848 ప్రాంతంలోపూషేట్ వారిపేర్లలో బిడెగారి ఇంటిదగ్గర ఒక పాఠశాల ప్రారంభించాడు. ఇది భారతదేశంలోనే స్త్రీ విముక్తోద్యమానికి అ అలు దిద్దిన పాఠశాల.

ఈ పాఠశాలను ప్రారంభించడానికి పూలేకు ఉన్న ఆత్మ విశ్వాసం ఎంతబలమైనదో ఇక్కడ అభివ్యక్త మౌతుంది. భారతీయ సమాజంలో వున్న ప్రధాన సమస్యను గుర్తించడంలో ఇక్కడ జ్యోతిబాపూలే తీసుకున్న నిర్ణయం ఆయన శాస్త్రీయమైన అవగాహన రుజువు చేస్తావుంది. స్త్రీని హిందూ సాంస్కృతిక సంకెళ్ళనుండి విముక్తి చేయడానికి జోతిబా తీసుకున్న ఈ నిర్ణయం స్త్రీ భవిష్యత్తుకు బాటలు వేసింది.

అయితే ధర్మశాస్త్రాలన్నీ స్త్రీకి విద్యను నిషేధిస్తుంటే, శూద్రులకు కూడా విద్యను నిషేధిస్తుంటే ఒక శూద్రుడు స్త్రీలకు పాఠశాలను తెరవడమా అని బ్రాహ్మణులు తీవ్రంగా తిరుగుబాటు చేశారు. బ్రాహ్మణుల తిరుగుబాటును మనం తక్కువ అంచనా వేయడానికి వీలులేదు. అందునా వారి సంప్రదాయపు కుదురు కదిలేటపుడు వాళ్ళు విజృంభిస్తారు. ఎన్నిరంగాల నుండి అపహాస్యం పాలు చేయాలని చూస్తారు!.

బ్రాహ్మణ్యం ఉక్కుగోళ్ళు పెంచుకొనివున్న "పూనా"లో ఈ సాంస్కృతిక తిరుగుబాటు ఒకసారి కుదుపు కుదిపిందనుటలో అతిశయోక్తి లేదు. అయితే జ్యోతిబా వెనుకాడ లేదు. ఆ స్కూలును మరింత అభివృద్ధి చెయ్యడానికి పూనుకొని తన భార్యయైన సావిత్రిభాయిని ఉపాధ్యాయినిగా తయారుచేసి పాఠశాలను నిరాటంకంగా సాగించాడు. భర్తకు తగిన

పట్టుదల, సంస్కార గుణముగల మేశాలి ఆమె. జ్యోతిభా బ్రాహ్మణుల వ్యతిరేక దుమారాన్ని తట్టుకో గల ఆత్మస్థైర్యాన్ని కలిగిముందుకు నడి చాడు. భారతదేశంలోనే ఒక వ్యక్తిగా బాలికల పాటశాల తెరిచిన మొదటి వ్యక్తి జ్యోతిబాపూలే.

ఆంగ్లేయ పాలకులు బాలికల పాఠశాలను 1819లో కలకత్తాలో ప్రారంభించారు. 1824లో అమెరికన్ మిషన్‌వారు బాలికల పాఠశాల తెరిచారు. అమెరికన్ మిషన్‌వారే 1840లో కూడా బాలికాపాఠశాల తెరి చారు. అత్యంత సాహసపూరితంగా తెరిచిన పాటశాలను మూయించటా నికి హిందూ బ్రాహ్మణులు జోతిబాపూలె లేకుండాచేసి జ్యోతిబా పాఠశాల నడపలేని స్థితికితెచ్చారు.

అయితే పట్టుదల, త్యాగం వున్న వ్యక్తుల కృషిని ఎవరు అడ్డగించ గలరు. ఆర్థిక పరిస్థితి కొంత చక్కబడిన తరువాత ఆయన ఎక్కడా ఇల్లు దొరకక పోయినా పట్టుదలతో పాఠశాల ప్రారంభించాడు. ఈ కృషిలో పూలే అత్యంత శ్రమతో ముందుకు పోయారు. తన భావాలతో కలసివచ్చే మిత్రులతో కలసి స్త్రీవిద్యాసంస్థను రూపొందించాడు. పూనాలో పలుచోట్ల ఈ సంస్థ పాఠశాలలు తెరిచింది. బాలికలనే కాక నిమ్న జాతు లకు కూడా ఈ పాఠశాలలు అవకాశం కల్పించాయి. తరతరాలుగా పేరుకు పోయిన అంధకారాన్ని ఛేదించిన ఈ విద్యాభాస్కరుడు భారతీయుల గుండెల్లో వ్రాసుకోవలసిన చిరస్మరణీయుడు.

ఈ మహనీయుని కృషిని గుర్తించి ప్రభుత్వం 15-11-1852న దుశ్శాలువాతో సత్కరించింది. ఆరోజుల్లో దానిఖరీదు 193రూ॥లు. సన్మానా లకు, సత్కారాలకు పేమే అర్హులమని విర్రవీగే బ్రాహ్మణ్యం ఒక సం స్కర్తకు ఉద్యమ కారుడికి జరిగిన సన్మానానికి ఈర్ష్యాద్వేషాలతో కుత కుతలాడడంజరిగింది. జ్యోతిబాపూలే ఇచ్చిన ఈ స్ఫూర్తితో బొంబాయిలో స్త్రీ విద్యను ప్రోత్సహించే మరొక సంస్థ రూపొందింది. ఈ సంస్థ పేరు "స్టూడెంట్స్‌లిటరరీ సైంటిఫిక్ సొసైటీ". ఈ సంస్థ 18-10-1849 నాటికి 4గుజరాతీ పాఠశాలలు నాలుగు మరాఠీపాఠశాలలు ప్రారంభించింది. కల కత్తాలో కూడా సంస్కరణాభిలాషుల ప్రోత్సాహంతో స్త్రీ విద్యాసంస్థల నిర్మాణంలో కొంతకృషి జరిగింది.

బ్రాహ్మణ్యాన్ని ఎదుర్కొని జ్యోతిబాపూలే స్థాపించిన బాలికా పాఠశాలలు అభివృద్ధి చెందడమేకాకుండా విజయవంతంగా పరీక్షలునిర్వ హించాయి. విద్యా ప్రోత్సాహకుల మెంపరిసో జ్వలింపజేసి ఆపాఠశాలలు

ష్ణనాదులను గట్టిపరుచుకో గలిగాయి. 1853 నాటికి 275 మంది వరకు విద్యార్థినులు పెరగడమే దీనికి నిదర్శనం.

జ్యోతిబాఫూలేకి పూనాలో వస్తున్న ప్రతిష్టకు కన్నుకుట్టిన బ్రాహ్మణులు ఆయనమీద తీవ్ర వ్యతిరేకతను కనపరిచారు. కొద్దిమంది బ్రాహ్మణులు ఆయన కృషికి సహకరించిన వారుకూడా వున్నారు. మహాత్మా పూలేమీద హిందూ ఛాందసులు హత్యాప్రయత్నం చేశారు. ఛాందసులైన రామోశీదోండీరామ్, నామ్‌దేవ్ కుంచర్లను ప్రోత్సహించిపంపారు. అయితే వాళ్ళు కత్తులుతీసుకుని ఇంటిలోకి వెళ్ళికూడా వారిని పొడవకుండానే తిరిగివచ్చారు. ఉద్యమకారుడు అనేకసార్లు మృత్యువుని ఎదుర్కొనవలసి వస్తుంది.

వితంతువుల వివాహసమస్య బ్రాహ్మణ వ్యవస్థకు శిరోభారమైంది. సతీసహగమన నిషేధం సృష్టించిన ఈ సమస్యకు పరిష్కారం కోసం బ్రాహ్మణులలోనే సంస్కర్తలు బయలుదేరినా ఈ సమస్య ఆచరణాత్మకంగా 1850లో ఒకటి, [illegible]లో ఒకటి వివాహాలు పూలే ప్రోత్సాహంతో పూనాలో జరిగాయి. ఈ కృషిలో భాగంగా విష్ణుశాస్త్రిపండిట్ ముందుకు నడిచాడు. నిరాశ్రయులైన వింతతువులకు వారికి పుట్టిన సంతానాన్ని రక్షించడానికి ఒక శరణాలయాన్ని పూలే నిర్మించారు.

తానొక వ్యక్తిగా బయలుదేరి వ్యవస్థగా రూపొంది సాంఘిక సంస్కరణలో ఉజ్వల పథంలో గమించిన జ్యోతిబాపూలే "సత్యశోధక్ సమాజ్" అనే సంస్థను స్థాపించి సాంఘిక న్యాయం కోసం, స్త్రీ విముక్తి కోసం, బ్రాహ్మణులు స్థాపించిన అన్ని సంస్థలకంటే ముందుకునడిపిచాడు.

ఈ విధంగా జ్యోతిరావ్ పూలే స్త్రీ విముక్తి ఉద్యమంలో గావించిన కృషి అపారమైంది. భారతీయ సంస్కృతిలో స్త్రీ విముక్తి ఉద్యమానికి నూతనశకాన్ని రూపొందించిన జ్యోతిరావ్ పూలేని అధ్యయనంచేయని ఏ సంఘం, ఏ ఉద్యమం, సరైన అవగాహనతో ముందుకు పోజాలదు. బ్రహ్మసమాజానికి ఆర్య సమాజానికి ఇచ్చినప్రచారం మహాత్మాపూలే ఉద్యమానికిచరిత్రకారులు ఇవ్వడంలేదు. చరిత్రరూపొందించే వారి కూడా అగ్రవర్ణులే ఎక్కువ కాబట్టి శూద్రులు అస్పృశ్యుల ఉద్యమాలకు, ఉద్యమకారులకు చరిత్రలో సరైన స్థానంలేదు. జ్యోతిరావ్ పూలే భారత భూమిలో స్త్రీ విముక్తి ఉద్యమానికి విముక్తి భానుడు. అ దారిలో ఆవిర్భవించిన మరో సూర్యుడే అంబేద్కరుడు.

పట్టుదల, సంస్కార గుణముగల ధీశాలి ఆమె. జ్యోతిభా బ్రాహ్మణుల వ్యతిరేక దుమారాన్ని తట్టుకో గల ఆత్మస్థైర్యాన్ని కలిగివుండుకు నడి చాడు. భారతదేశంలోనే ఒక వ్యక్తిగా బాలికల పాటశాల తెరిచిన మొదటి వ్యక్తి జ్యోతిబాపూలే.

ఆంగ్లేయ పాలకులు బాలికల పాఠశాలను 1819లో కలకత్తాలో ప్రారంభించారు. 1824లో అమెరికన్ మిషన్‌వారు బాలికల పాఠశాల తెరిచారు. అమెరికన్ మిషన్‌వారే 1840లో కూడా బాలికాపాఠశాల తెరి చారు. అత్యంత సాహసపూరితంగా తెరచిన పాటశాలను మూయించడా నికి హిందూ బ్రాహ్మణులు జోతిబాపూలె లేకుండాచేసి జ్యోతిబా పాఠశాల నడపలేని స్థితికిచెట్టారు.

అయితే పట్టుదల, త్యాగం వున్నవ్యక్తుల కృషిని ఎవరు అడ్డగించ గలరు. ఆర్థిక పరిస్థితి కొంత చక్కబడిన తరువాత ఆయన ఎక్కడా ఇల్లు దొరకక పోయినా పట్టుదలతో పాఠశాల ప్రారంభించాడు. ఈ కృషిలో పూలే అత్యంత శ్రమతో ముందుకు పోయారు. తన భావాలతో కలసివచ్చే మిత్రులతో కలసి స్త్రీవిద్యాసంస్థను రూపొందించాడు. పూనాలో పలుచోట్ల ఈ సంస్థ పాఠశాలలు తెరిచింది. బాలికలనే కాక నిమ్నజాతు లకు కూడా ఈ పాఠశాలలు అవకాశం కల్పించాయి. తరతరాలుగా పేరుకు పోయిన అంధకారాన్ని ఛేదించిన ఈ విద్యాభాస్కరుడు భారతీయుల గుండెల్లో వ్రాసుకోవలసిన చిరస్మరణీయుడు.

ఈ మహనీయుని కృషిని గుర్తించి ప్రభుత్వం 15-11-1852న దుశ్శాలువాతో సత్కరించింది. ఆరోజుల్లో దానిఖరీదు 193రూ॥లు. సన్మానా లకు, సత్కారాలకు మేమే అర్హులమని విర్రవీగే బ్రాహ్మణ్యం ఒక సం స్కర్తకు ఉద్యమ కారుడికి జరిగిన సన్మానానికి ఈర్ష్యాద్వేషాలతో కుత కుతలాడడంజరిగింది. జ్యోతిబాపూలే ఇచ్చిన ఈ స్ఫూర్తితో బొంబాయిలో స్త్రీ విద్యను ప్రోత్సహించే మరొక సంస్థ రూపొందింది. ఈ సంస్థ పేరు "స్టూడెంట్స్‌లిటరరీ సైంటిఫిక్ సొసైటీ". ఈ సంస్థ 18-10-1849 నాటికి 4గుజరాతీ పాఠశాలలు నాలుగు మరాఠీపాఠశాలలు ప్రారంభించింది. కల కత్తాలో కూడా సంస్కరణాభిలాషుల ప్రోత్సాహంతో స్త్రీ విద్యాసంస్థల నిర్మాణంలో కొంతకృషి జరిగింది.

బ్రాహ్మణ్యాన్ని ఎదుర్కొని జ్యోతిబాపూలే స్థాపించిన బాలికా పాఠశాలలు అభివృద్ధి చెందడమేకాకుండా విజయవంతంగా పరీక్షలునిర్వ హించాయి. విద్యా ప్రోత్సాహకుల సెంవరిసో జ్వలింపజేసి ఆపాఠశాలలు

పునాదులను గట్టిపరుచుకో గలిగాయి. 1853 నాటికి 275 మందివరకు విద్యార్థినులు పెరగడమే దీనికి నిదర్శనం.

జ్యోతిబాఫూలేకి పూనాలో వస్తున్న ప్రతిష్టకు కన్నుకుట్టిన బ్రాహ్మణులు ఆయనమీద తీవ్ర వ్యతిరేకతను కనపరిచారు. కొద్దిమంది బ్రాహ్మణులు ఆయన కృషికి సహకరించిన వారుకూడా వున్నారు. మహాత్మాఫూలేమీద హిందూ ఛాందసులు హత్యాప్రయత్నం చేశారు. ఛాందసులైన రామోశీదోండీరామ్, నామ్‌దేవ్ కుంచర్లను ప్రోత్సహించిపంపారు. అయితే వాళ్ళు కత్తులుతీసుకుని ఇంటిలోకి వెళ్ళికూడా వారిని పొడవకుండానే తిరిగివచ్చారు. ఉద్యమకారుడు అనేకసార్లు మృత్యువుని ఎదుర్కొనవలసి వస్తుంది.

వితంతువుల వివాహసమస్య బ్రాహ్మణ వ్యవస్థకు శిరోభారమైంది. సతీసహగమన నిషేధం సృష్టించిన ఈ సమస్యకు పరిష్కారం కోసం బ్రాహ్మణులలోనే సంస్కర్తలు బయలుదేరినా ఈ సమస్య ఆచరణాత్మకంగా 1850లో ఒకటి, 1864లో ఒకటి వివాహాలు ఫూలే ప్రోత్సాహంతో పూనాలో జరిగాయి. ఈ కృషిలో భాగంగా విష్ణుశాస్త్రిపండిట్ ముందుకు నడిచాడు. నిరాశ్రయులైన వింతతువులకు వారికి పుట్టిన సంతానాన్ని రక్షించడానికి ఒక శరణాలయాన్ని ఫూలే నిర్మించారు.

తానొక వ్యక్తిగా బయలుదేరి వ్యవస్థగా రూపొంది సాంఘిక సంస్కరణలో ఉజ్వల పథంలో గమించిన జ్యోతిబాఫూలే "సత్యశోధక్ సమాజ్" అనే సంస్థను స్థాపించి సాంఘిక న్యాయం కోసం, స్త్రీ విముక్తి కోసం, బ్రాహ్మణులు స్థాపించిన అన్ని సంస్థలకంటే ముందుకునడిపించాడు.

ఈ విధంగా జ్యోతిరావ్ ఫూలే స్త్రీ విముక్తి ఉద్యమంలో గావించిన కృషి అపారమైంది. భారతీయ సంస్కృతిలో స్త్రీ విముక్తి ఉద్యమానికి నూతనశకాన్ని రూపొందించిన జ్యోతిరావ్ ఫూలేని అధ్యయనంచేయని ఏ సంఘం, ఏ ఉద్యమం, సరైన అవగాహనతో ముందుకు పోజాలదు. బ్రహ్మసమాజానికి ఆర్య సమాజానికి ఇచ్చినప్రచారం మహాత్మాఫూలే ఉద్యమానికిచరిత్రకారులు ఇవ్వడంలేదు. చరిత్రరూపొందించే వారిలో కూడా అగ్రవర్ణులే ఎక్కువ కాబట్టి శూద్రులు అస్పృశ్యుల ఉద్యమాలకు, ఉద్యమకారులకు చరిత్రలో సరైన స్థానంలేదు. జ్యోతిరావ్ ఫూలే భారత భూమిలో స్త్రీ విముక్తి ఉద్యమానికి విముక్తి భానుడు. ఆ దారిలో ఆవిర్భవించిన మరో సూర్యుడే అంబేద్కరుడు.

# చలం - స్త్రీ

సంస్కరణోద్యమాలు, భావ విప్లవోద్యమాలు చేయలేని పనిని ఆంధ్ర సాహిత్యంలో స్త్రీ పట్ల చలం కలం చేసింది. చలం స్త్రీ చుట్టూ పేర్చిన ఇనుప కవాటాలను, స్త్రీకి తగిలించిన ఇనుప కచ్చడాలను ఛేదించడానికి తన కలంతో అవిరామ సమరం గావించాడు. చలం ప్రభావం మధ్యతరగతి స్త్రీ మీద పడింది. మధ్యతరగతి స్త్రీ సాగిస్తున్న నిర్జీవజీవితం మీదచలం సజీవమైన విశ్లేషణలుచేశాడు.

సీత, దమయంతుల, సావిత్రుల పాతివ్రత్యాలనే మళ్ళీ మళ్ళీ పాడుతున్న పండిత మాన్యుల పితృస్వామిక స్వభావాన్ని ఎండగట్టి సామాన్యస్త్రీలు పైగా వేశ్యలు అనుచు ఈసడిస్తున్న వారి హృదయ నైర్మల్యాన్ని, విశాలత్వాన్ని, సౌందర్యాన్ని, ఆకాంక్షని, ఆదర్శాన్ని ఎంతో మహోన్నతంగా వివరించాడు. సమాజంలో వున్న స్త్రీలలో ఎవరికి ఇంకా హృదయం బ్రతికివుంది. ఎవరికి ఇంకా కృతజ్ఞత నిలిచివుందో ప్రకృతిలో వున్న నిర్మల సౌందర్యాలను ప్రీతికిస్తున్న సహజమైన స్త్రీలు ఎవరో? అసలు ప్రేమలు, కామాలు, స్వేచ్ఛలు, లోపాలు, సుగుణాలు ఆయన రచనల్లో సజీవచిత్రాలయ్యాయి.

మధ్యతరగతి స్త్రీ ప్రాకులాడే ఆడంబరాలను అణచివేత మాటున అణగారి పోతున్న నిజజీవితాన్ని పైపైనవ్వులతో కాపాడుకుంటూ, శరీరాన్ని ఉత్తమాంసపు ముద్దలాగా చూసే శరీరక అధిపతుల అనుమానాలను భీత్కారాలను నాలుగు గోడలమధ్యనే దాచుకొని బ్రతుకుతున్న స్త్రీలను గూర్చి చలం "స్త్రీ శరీరం ఉత్తమాంసపు ముద్ద అయిన మాట నిజమే, శరీరపుకాంతి, మృదుత్వం, శృంగాం, ఆహ్లాదం ఇవన్నీ అంత కన్న నిజాలు. ఆ మాంసం సంగతే మనస్సులో పెట్టుకొని ఈ విలువల్ని చూడలేని మనిషికన్నా దౌర్భాగ్యుడు వుండడు అన్ననగ్న సత్యాన్ని బయటకీడ్చాడు.

సాంఘిక వ్యవస్థలో అత్యున్నతులుగా ప్రకటించుకున్న బ్రాహ్మణ స్త్రీల మడుల్లో, తడుల్లో, ఆచారాల్లో, సాంప్రదాయాల్లో నలిగి పోతున్న

నశించిపోతున్న స్త్రీత్వాన్ని గూర్చి చలం ఆక్రందించాడు. బ్రాహ్మణ్యం లో అనుభవించలేని నిజమైన జీవితాన్ని సహజంగా, ప్రాకృతికంగా అమీర్‌తో అనుభవించి చూపించిన స్త్రీనిసహజంగా వర్ణించాడు. కృత్రిమ వ్యవస్థలో సహజవ్యవస్థల్లో జీవించేతీరులో అభివ్యక్తమయ్యే ఆనందాలు స్వేచ్ఛలు అత్యద్భుతంగా చిత్రించాడు.

బ్రాహ్మణ్యం మీద ఆయన విసిరిన సాహిత్య స్వేచ్ఛా ప్రభంజనం ధాటికి వంటిళ్ళలో మగ్గుతున్న బాలవితంతువుల ముసుగులు జారిపోయాయి. వారిని పునర్జీవం కోసం తపింప చేశాయి. తులసీపీఠాలు బృందావనాలుగా మారాయి. సంఘసంస్కరణ పేరుతోసంకెళ్ళు ఛేదించడం ఒకవంతయితే స్త్రీలోని స్త్రీత్వాన్ని, సౌకుమార్యాన్ని, మానసిక స్పందనలను, ఆకాశాన్ని, నక్షత్రాలను, సముద్రాన్ని, కెరటాలను చుట్టుపెట్టి బయటకు లాగి అనురాగాన్ని ఆప్యాయతను పండించడం మరొకవంతు. అది చలం చేశారు.

అణచివేతని, అధికారాన్ని ఆయన ప్రశ్నించేతీరు, విశ్లేషించే పద్ధతి ఎంతోవున్నతమైనది. రెండుమూడు దశాబ్దాలు చలం పుస్తకాలు గుండెల్లో పెట్టుకొని చదివారుస్త్రీలు. అలాస్త్రీలు చదవడానికి కారణం తమలో అణగారివున్న స్త్రీని వారు చలంభాషణలో చూశారు. ఆయన శైలి స్త్రీ పాఠక లోకాన్ని పెంచింది. ఆ తరువాత బీనాదేవిని, రంగనాయకమ్మని నవలా కథాసాహిత్యాన్ని స్త్రీలుసొంతంచేసుకోవడానికి ఆయనద్వారాలుతెరిచాడు.

ఆయన వ్యక్తిస్వామ్యాన్ని ప్రశ్నించారు. వ్యక్తి ఆస్తిచుట్టూపేరుకుంటున్న కృత్రిమ ఇంద్రజాలాలమీద శాస్త్రీయ విమర్శలు చేశారు. మధ్యతరగతి స్త్రీలను నిలదీసి ప్రశ్నించి అవును 'మేము ఏదో అసంతృప్తితో జీవిస్తున్నాం' ఈ అసంతృప్తిని ఛేదించేది ఎలా అనే అన్వేషణకు వారిని పురిగొల్పాడు. సంసారం పేరుతో సాగే నిర్బంధంమీద చలంవిరుచుకుపడ్డాడు. భర్తలలో అనవసరంగా పొడచూపుతున్న అనుమానాల్ని, ద్వేషాల్ని, వేధింపుల్ని మరోపురుషుడితో స్నేహంగా మాట్లాడినా, భావ బంధువుగా చూసినా సహించలేక పోవడాన్ని, పాతివ్రత్యం పేరుతో కుంచించుకు పోతున్న స్త్రీల మనస్తత్వాన్ని ఆయన మనస్తత్వ శాస్త్రవేత్తగా వ్యాఖ్యానించారు.

ఆలోత్రైన వ్యాఖ్యానాలు చాలామంది స్త్రీలను కదిలించాయి. ప్రేమను గురించి కామం గురించి ఆయన తన గ్రంథాల్లో సుదీర్ఘమైన చర్చకొనసాగించాడు. ప్రేమకు, కామానికివున్న అవినాభావ సంబంధం మీద ఆయన చేసిన వివరణలు వాస్తవికమైనవి.

ప్రేమంటే ఏమిటి? కామమంటే ఏమిటి? ప్రేమకు పవిత్రతను అంటగట్టి కామానికి అపవిత్రతను అంటగట్టి అర్థంలేని త్యాగాలను ప్రబోధిస్తున్న అభూత వాదులను ఆయన ప్రశ్నించాడు. సంసారాల పేరుతో సాగుతున్న నిబద్ధీకృత వ్యభిచారాన్ని, వేశ్యా జీవితంలో పొడచూపే ప్రేమభావాన్ని ఆయన ఎంతో లోతుగా విశ్లేషించాడు. "భార్యాభర్తల మధ్యరాని సుఖం, ఆనందం ప్రియులకి కలుగుతున్నాయని రోజూ రొటీన్‌లో శవాలమల్లె బ్రతుక కుండా ఏదైనా సుఖానికై ప్రయత్నించారా మండి పడతారు మనుషులు". అని సమాజం పైకి చెప్పడానికి, చర్చించ డానికి భయపడే అంశాలను ఆయన తన "మ్యూజింగ్స్" లో చర్చించు కుంటూ పోయారు.

"అట్లానే సంసారం లేనిస్త్రీలూ, సరైన సంసారం లేనివాళ్ళూ, ఏమీకోరక, ప్రత్యుపకారం ఆడక్కుండా మోహానికి తమని తాము ఇచ్చుకున్న స్త్రీలు వున్నారు. పతివ్రతలు ఎవరిపాద ధూళిని తలధరించడానికి పనికిరారో, అటువంటి శృంగార మూర్తులు, అట్లాంటి శోభాన్వితలు వేరెరిగిన తాయారు, మేరీవంటియువతులు Not for Money, Not for contract అంటుంది "VOYAGE" అనే పుస్తకంలో దెరపీ"

ఈ విధంగా సాహసంచేసి సమాజంలో తినిపారేసిన విస్తరాకులుగా భావిస్తున్న స్త్రీల మీద కరుణతో, దయతో కాక వాస్తవ పరిశీలనలో అంతరాంతరాల్లోని మానవత మీద చర్చకొనసాగించారు చలం. అందుకే శాస్త్రబద్ధంగా వ్రాసిన స్త్రీ రచనల కంటే చలం వెయ్యిరెట్లు స్త్రీలను కదిలించాడు.

చలం "శాంతి"ని గూర్చి వ్యాఖ్యానిస్తూ "నిద్రా అలసటా కాదు. దానికన్నా కాల్చే సమరం చాలా ఆరోగ్యం" "శాంతిఅంటే నిజమైన చుట్టు ఆనందాన్ని వెలిగించే శాంతి" స్త్రీలో నిద్రాణమైవున్న అణగారిపోతున్న సహజ ప్రకృతులను మేల్కొల్పడానికి గడ్డిపువ్వులకు నీళ్ళుపోసి పెంచి

మందార వనాలకంటే గులాబివనాల కంటే ఇవే అందమైనవి అని నిరూపించాడు. వెన్నెలని అనుభవించలేని వారిని సముద్రం ఒడ్డున కూడా అగ్ని వలయాల్లో జీవించేవారిని ఆయన తరచి తరచి చూసి ప్రకృతికి హృదయానికి వున్న సంబంధాన్ని పునర్జీవింపజేసే కృషిలో అక్షరాలకు ఆయువు పోశాడు.

హిందూజాతి కుటుంబపద్ధతి మీద ఆయన వ్యాఖ్యానిస్తూ- "అందువల్లనే గొప్ప జ్ఞానంగల మతస్థాపకులు, ఈలోకంలో ఏ పద్ధతి శాశ్వతంగా స్థాపనచేయలేమని తెలుసుకుని మానవులకు స్థిరమైన సుఖాన్ని పరలోకానికి పెట్టి, ఓదేవుణ్ని దానికి ప్రెసిడెంటునిచేశారు. మానవజాతిని ఉద్ధరించేందుకు ప్రవక్తల్ని నియమించారు. వర్ణాశ్రమాలు స్థాపించి, ధర్మాలు నిర్దేశించి, కలకాలం క్షేమంగా ఉంచాలని చేసిన ధర్మనిర్మాతల హిందూ జాతి ఏమయ్యిందో చూడండి. చాలా తెలివితో ఈనాడు కొత్తగా మాట్లాడుతున్న సైక్లాజికల్, సోషియాలజికల్, జియోగ్రాఫికల్, బైలాజికల్, ఎకనమిక్ ఫ్యాక్టర్స్ అన్నిటిని గుర్తెరిగి చాలాసమర్థతతోప్రజాక్షేమం స్థిమితం, సుఖం అన్నీ వాంఛించిఏర్పరచినపద్ధతిలాగాకనబడుతుంది. హిందూ జాతి కుటుంబ పద్ధతి. కాని అంతకన్నా వెయ్యిరెట్లు గొప్ప పద్ధతిని కనిపెట్టి కటాక్షించినా నిలువలేదు మానవజాతి ఒకచోట. అదే మానవుల బలం. బలహీనంకూడా" అంటాడు చలం. కాబట్టి వ్యవస్థను స్థిరీకృతంచేసి ఒకచోట నిలవేయాలనుకోవడం, అలాగే చేయాలని ప్రయత్నించిన వ్యవస్థలో ప్రధానమైన హిందూ కుటుంబ వ్యవస్థను చలం చాలా నిశితంగా విమర్శించడమే గాకుండా, స్త్రీకి పరిణామం మీద ఉత్సుకతను, మార్పుమీద ప్రేమను కలిగించాడు.

స్త్రీ అనుభూతి వాదులమీద ఆయన చురకలు ఎంతో విలువైనవి. చాలా మంది స్త్రీగురించి చర్చించే వారికి, చదివే వారికి చెంపదెబ్బలు వేస్తాడు. చివరికి చలానికి కూడా! "కాని ఈ నాగరికతలో తేలుతూ నిజమైన వస్తువుల్ని వదిలి, నీడల్ని అనుభవిస్తున్నామా! స్త్రీని వదిలి శృంగార కావ్యాల్ని, చలం కథల్ని చదివినట్టు నిజంగా మనం అనుభవిస్తున్నామనుకున్న విలువలే, పైకి చెప్పుకు తిరిగే అందాలే మనల్ని లోపల్నించి ఇన్‌ఫ్లూయెన్స్ చేస్తే ఇంకా ఈ సంకుచితత్వాలు, ఈర్ష్యలు, నీచత్వాలు మిగిలి ఉంటాయా? అని ప్రశ్నించారు.

స్త్రీని ప్రతిబింబించడం కోసం, కదిలించడం కోసం, స్వేచ్ఛలో. ప్రణయంలో నిజంలో పునరుద్భవింపచేయడం కోసం ఆయన శిల్పించిన చైతన్యాలు కదలి కదలి ప్రవహించాయి. చలం శైలిలో వున్న ప్రవాహశీలత స్త్రీ లోకాన్నే కాదు, స్త్రీని గౌరవించాలి స్త్రీకి వ్యక్తిత్వం తేవాలి అని ఆకాంక్షిస్తున్న పురుషలోకాన్ని కూడా కదిలించి వారిలోవున్న చీకటిని అంటే తాము బయటకు చెబుతున్న వాటిని, తమ భార్యలపట్ల అనుసరించ లేకపోతున్న నిజాన్ని గుర్తింపజేసాయి. చలం కమ్యూనిజంలో ఒక రకమైన వ్యవస్థీకృత సమాజంవుంది. వారు దేహశ్రమనే గుర్తించారుగాని, దేహాన్ని, హృదయాన్ని గుర్తించలేదని చర్చపెట్టాడు. అయితే కమ్యూనిస్టు ఉద్యమాలలో ముందుకు వచ్చిన స్త్రీలు, చలంని సొంతం చేసుకోవడంలో విజయవంతమయ్యారు. కమ్యూనిస్టు చైతన్యాన్ని, చలం ప్రవచించిన స్వేచ్ఛని సమన్వయంచేయడానికి ప్రయత్నించారు. చలం తానువేసిన ప్రశ్నల విషయంలో తానురేపిన సంచలనానికి ప్రభావితమైన సమాజం విషయంలో ఒకదశలో శాస్త్రీయమైన పురోగమనాన్ని రూపొందించలేక వ్యక్తిగా విఫలుడై రమణాశ్రమానికి చేరాడు. హిందూ ఆచార సమాజం వెక్కిరింపుకు గురయ్యాడు కూడా.

రంగనాయకమ్మ చలం కృషికి కొనసాగింపుగా మారుతున్న సమాజంలో స్త్రీ స్వేచ్ఛపై వచ్చిన అనేక అనుమానాలకు సమాధానాలుగా రచనలు సాగించింది. రంగనాయకమ్మకు చలంలోవున్న మృదుత్వం లేకపోయినా స్త్రీ విముక్తికి సంబంధించి ఆమె నిజాయితీ, సూటిదనం చాలామందిని కదిలించింది.

చలం తిరోగమనం, ఆయన తిరోగమించిన తరువాత చేసిన రచనలు స్త్రీలపై పెద్ద ప్రభావాన్ని చూపలేదు. చలం జీవితంలోని ముగింపు ఆయనకు చీకటి యుగమే. అందుకే అరుణాశ్రమంలోని చలం రచనలు "అచలం" గానే వున్నాయి. స్త్రీలు అక్షరాలు నేర్చుకున్న మొదటి యుగంలో కలం ఝళిపించిన చలం రచనలమీద వాటికి సంబంధించిన స్త్రీల ప్రతిస్పందనలమీద సరైన అంచనా లేకుంటే ఆ తరువాత ఆంధ్రలో మధ్య తరగతి స్త్రీలోకంలో వచ్చిన మార్పులకు సంబంధించిన చీకటి వెలుగుల మీద సరైన అవగాహన రావడం కష్టం. —○—

# తెలంగాణపోరాటంలో - స్త్రీ

భారతదేశంలో చారిత్రాత్మకమైన కర్షక రైతాంగ పోరాటాలలో తెలంగాణా పోరాటం అత్యున్నతమైంది. 1945 నుండి 1951 వరకు తెలంగాణా ప్రజల వీరోచితమైన సాయుధ పోరాట చరిత్ర భారతదేశ పోరాట చరిత్రలో రక్తాక్షరాలతో లిఖింప బడింది. ఈకాలంలో హైద్రాబాద్ సంస్థానంలో భూస్వాముల మీద, జమీందారుల మీద, రజాకారుల క్రూరత్వం మీద, తెలంగాణా లోని శ్రామిక వర్గం చేసిన తిరుగుబాట్లు, ఆతరువాత భారతసైన్యం మీద చేసిన పోరాటం, అందులో "స్త్రీ"ల పాత్ర తెలంగాణా మాగాణంలోని ప్రతిపొరల్లో చారిత్రక చిహ్నంగా నిలిచిపోయింది. ఆనాడు భూమి కోసం, అధిక వేతనాల కోసం, భూస్వాముల ధాన్యాన్ని, పశువుల్ని పంపిణీ చేసుకోవటం కోసం జరిగిన పోరాటంలో స్త్రీలు పురుషులకు తీసిపోలేదు. భర్తలతోపాటు. అన్నదమ్ములతో పాటు వారు దళాలలో చేరి, అడవుల్లో, కొండల్లో, గుట్టల్లో నడుస్తూ, తడుస్తూ, అనేక కష్టాలను, నష్టాలను, ఇబ్బందులను ఎదుర్కొంటూ, సహజంగా అనుభవిస్తూ, నైజాం రజాకార్ వ్యతిరేక పోరాటంలోను, నెహ్రూ సైన్యాలకు కాంగ్రెస్ రజాకార్ వ్యతిరేక పోరాటాలలోను ప్రజా ఉద్యమ దళాలలో కొరియర్లుగా, ఆంపోషన కారులుగా కీలకమైన పాత్ర వహించారు.

నిజాం రాజ్యంలో భూస్వామికి భూమి మీదేకాక ఆభూమిని ఆశ్రయించుకొని బ్రతికే ప్రతిమనిషిమీద హక్కు వుండేది. తెలంగాణా జమిందారులు రైతుల, వ్యవసాయ దారుల కుటుంబాల వారినిమొత్తం బానిసలుగా, భావించి వారిమీద పెత్తనం సాగించేవారు. "పెద్ద భూస్వాములుగా తెలంగాణా జమిందారులు రైతులను, స్త్రీలు, పురుషులు, పిల్లలనే తేడా లేకుండా, తమ స్వంత ఆస్తిగా పరిగణించే వాళ్ళు. ఆవ్యవస్థలో స్త్రీలు పురుషులకంటే రెట్టింపు బాధలు పడ్డారు. భూస్వామి ఏస్త్రీమీదనైనా మోజుపడ్డాడంటే ఆమెఅతనికి లొంగిపోవలసిందే. ఒకస్త్రీ పెళ్ళి చేసుకుంటే మొదటిరాత్రి భూస్వామితో గడపాల్సిందే. ఆడ బావలుగా. బానిస స్త్రీలుగా భూస్వామి అవసరాలన్ని అతని కుటుంబ అవసరాలన్నీ తమ చాకిరితో తీర్చావలసిందే".[1]

---

1. మనకు తెలియని మనచరిత్ర — VI, VII ( ౬8 )

తెలంగాణాలోని సుమారు 10,000 గ్రామాలలో 2,000 వరకు జాగీరు గ్రామాలు ఉండేవి. జాగీరు గ్రామాలలో 40 రకాల పన్నులు చెల్లించ వలసి వచ్చేది. "నిజాం నవాబుకు సొంత పరివారమూ సొంత సైన్యము, సొంత అధికార వర్గమూ ఉండేవి. రైతులూ, సామాన్య ప్రజలు పన్నులు చెల్లించుటేకాక, వీరి భోగలాలసత్వానికి అవసరమైన పనులు ఉచితంగానో, నామమాత్రమైన పరిహారంతోనో చేయవలసి వచ్చేది. గ్రామాలనుంచి సప్లై అయ్యేగొర్రెలు, మేకలు, కోళ్ళు, వంట చెరకు మొదలగువన్నీ వారికి అందించవలసి వచ్చేది. ఒక మాటలో చెప్పాలంటే ఒక చట్టమూ, ఒక పరిపాలనా విధానమూ లేకపోవుట వలన ఆయన సామంతులూ, భూస్వాములూ పెత్తందారులూ ఎవరి శక్తికొలది వారు ప్రజలను కొల్లగొట్టి అనుభవించేవాళ్ళు"[1] ఈ అణచివేతలో స్త్రీలు ఎక్కువ బాధింపబడేవారు.

**1713**వ సంవత్సరంలో ఔరంగజేబు డక్కన్ ప్రాంతానికి సుబేదారుగా "అసఫ్‌జా" ని నియమించాడు. నిజాం ఉల్-ముల్క్ అని బిరుదు సంపాదించిన అసఫ్‌జా తనను స్వతంత్ర పరిపాలకుడుగా ప్రకటించుకొని, అసఫ్‌జాహి వంశాన్ని స్థాపించాడు. అసఫ్‌జాతో పాటు దక్కన్ ప్రాంతానికి వచ్చిన హిందువులు, ముస్లిలు జాగీరులనుపొంద. అతని సైన్యంలో రెవిన్యూ ఆఫీసర్‌గా పదవులు పొందారు. ఈ జాగీరులు వంశపారంపర్యంగా వచ్చాయి. ఈ జాగీరునుండి భూమిశిస్తు వసూలు చేసుకునే హక్కుమాత్రమే కాకుండా ఎక్సైజు, చాపలు, అడవుల మీద కూడా హక్కు సంపాదించారు. పైగా పోలీసున్యాయ వ్యవస్థను కూడా వీళ్ళే నిర్వహించేవాళ్ళు, ఈజాగీరుదార్లు రాకముందునుంచే కొందరు హిందూ ప్రభువులు కూడా సంస్థానాధిపతులుగా కొంత ప్రాంతాన్ని పాలిస్తుండే వాళ్ళు. ప్రతి సంవత్సరమూ నిజాంకు నజరానాలు సమర్పించు కున్నందుకు ప్రతిఫలంగా నిజాం వాళ్ళ హక్కుల్ని గుర్తించేవాడు. ఈ సంస్థానాధి పతులకు కార్య నిర్వాహణాధికారాలు కూడా చాలా వుండేవి. నిజాం తనకు సేవ చేసిన వాళ్ళకు బహుమతిగా, ఈనాంగా కొంత భూమి ఇచ్చేవాడు. ప్రతి గ్రామంలోను ఇటువంటి ఈనాం

---

1. తెలంగాణా ప్రజల సాయుధ పోరాట చరిత్ర (1946-51) మొదటి భాగం — పేజి - 10 దేవులపల్లి వెంకటేశ్వరరావు,

భూములుండేవి. తన స్వంత ఖర్చులకోసం సర్ఫేఖాస్ ( Sarf-A-Khas ) అనే భూములను నిజాం తన స్వంత పరిపాలన క్రింద వుంచుకునేవాడు. ఇది హైదరాబాద్ రాష్ట్రమంతటా వుండేవి. **7430** గ్రామాలు అంటే మొత్తం రాష్ట్రంలో **40%** ప్రాంతం జాగీర్లు, సంస్థానాలు, సర్ఫేఖాస్ క్రింద వుండేది. మిగిలిన **60%** భూమిని "ఖాల్సా" లేక "దివాని" అనే వారు. ఈ భూమి నిజాం ప్రభుత్వపాలన క్రింద వుండేది. ఇక్కడ రైతు వారి పద్ధతి అమలులో వుండేది. ప్రభుత్వ అధికారులు పన్నులు వసూలు చేసేవాళ్ళు"[1]

తెలంగాణా గ్రామాల్లో దేశముఖులు, పటేల్ పట్వారీలు ఇతర భూస్వాములు, ప్రజలను తీవ్రంగా పీడించేవాళ్ళు. సాంఘిక, ఆర్థిక జీవనం మొత్తం భూస్వామ్య పెత్తందారీ క్రింద విల విల్లాడుతూ వుండేది. భూస్వాముల, ధనికరైతుల స్త్రీలు మినహా మధ్యతరగతి, పేదరైతులు, కౌలుదారులు, వ్యవసాయకూలీలు, వెట్టిచాకిరిలో ఉన్న క్రింది కులాల వారు, గిరిజనులు, గిరిజనస్త్రీలు అమానుషమైన అణచివేతకు గురయ్యే వారు.

నిజాం పరిపాలనలో పోలీసులకు, ప్రభుత్వ అధికారులకు చేసే వెట్టి చాకిరిలో స్త్రీలు పాల్గొన వలసి వచ్చేది. దొరల ఇళ్ళల్లో వెట్టి చాకిరిని గూర్చి దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు తన "తెలంగాణా ప్రజల సాయుధ పోరాట చరిత్ర"లో ఇలా వివరించారు. దొరల, పటేలు-పట్వారీల ఇళ్ళలో స్త్రీలూ, పురుషులూ వెట్టిచాకిరీ చేయవలసి వచ్చేది. ఊడ్చి చల్లటం, బట్టలు ఉతకటం, వాళ్ళ ఇళ్ళలో అవసరమయిన కారం, పిండి పొడులు తయారుచేసే బాధ్యత స్త్రీలది. పురుషులు ప్రతిరోజు లాంతర్లు శుభ్రంచేసి, కిరోసిన్ నింపి వెలిగించే వారు. ఇతర గ్రామాల్లో ఉండే బంధువులకు ఉత్తరాలు తీసుకెళ్ళి జవాబులు తెచ్చేవారు. పయనమై వెళుతున్నపుడు బండ్లను తోలేవారు, బండ్లవెంట నడిచేవారు. (ఆకాలంలో బండ్ల రవాణాసాధనాలు) ఈ పనులన్నింటికి దొరలు 'బిచ్చాల'నీ "మామూళ్ళ"నీ సంవత్సరం పేరిట కొంత పరిహారం ముట్టజెప్పేవారు. కొన్ని సందర్భాలలో ఇనాం భూములకు చెల్లించేశిస్తును దొరలే చెల్లించే వారు.

---

1. మనకు తెలియని మన చరిత్ర — పేజి VII

దొరల వ్యవసాయపు పనుల్లో కూడా వెట్టిచాకిరి ఉండేది. "తెగ"లనే పేరుతో మాదిగలు సంవత్సరమంతా పనిచేసేవారు. పాలేర్లకు కావసిన చెప్పులు, మోట బొక్కెనలకు తొండాలు తయారుచేసి ఇచ్చేవారు. చని పోయిన పశువులతోళ్ళను తీసి, శుభ్రంచేసి, తొండాలకు, చెప్పులకు, ఇతర పనిముట్లు కొన్నింటికి ఉపయోగించేవారు.

ఈ వెట్టిచారిని గురించి కామ్రేడ్ సుందరయ్యగారు "వీర తెలంగాణా విప్లవ పోరాటం గుణపాఠాలు" అన్న తన గ్రంథంలో కళ్ళకు కట్టినట్లు వివరించారు. ప్రతి హరిజన కుటుంబమూ వెట్టిచాకిరి చేయటానికి కుటుం బంలోని వారినొకరిని కేటాయించవలసివచ్చేది. చిన్న పల్లెల్లో ప్రతి ఇంటి నుండి ఒక మనిషిని పంపటం జరిగేది. పటేల్ పట్వారీ. మాలీ పటేల్ లేదా దేశ్ముఖ్ ల ఇళ్ళలో గృహసంబంధమైన పనులు చేయటం పోలీసుస్టేషన్కు, తాలూకా ఆఫీసులకు రిపోర్టులు మోసుకువెళ్ళటం గ్రామ చావిడికి, బందలదొడ్డికి కాపలా కాయటం రోజువారీ పనిలో భాగమే. ఇవికాక గ్రామ చావిడికి ఎవరైనా అధికారివచ్చినపుడు వాళ్ళకు మరింత ఎక్కువ పనిఉండేది. చిలుకూరు గ్రామంలో ప్రతిరోజు **16** మంది హరిజనులు వెట్టిచాకిరి చేస్తుండేవారు. అడవులనుండి కట్టెలు కొట్టి తెచ్చే వారు. టపామోసుకెళ్ళేవారు, టపాలనుగాని, ఇతర సరఫరాలనుగాని మోసుకెళ్ళినందుకుగాను వారికి రెండున్నరమైళ్ళకు ఒక్క అణా చొప్పున ఇవ్వబడుతున్నట్లు కాగితాల మీద వుండేది. అయితే ఆచరణలో అది కూడా ఇచ్చేవారుకాదు. ఈ విధానాన్ని "కోసుకు పీసం" అనేవారు.

చర్మకారులుగా పనిచేసే హరిజనులు, తోళ్ళను పదును చేసి, చెప్పులు కుట్టినందుకు, వ్యవసాయ పనులకు, నూతులనుండి నీరుతోడ టానికి అవసరమైన తోలుపరికరాలు తయారుచేసి నందుకు అరకలకు పట్టెళ్ళు తయారు చేసినందుకు భూస్వాములు ఏమీచెల్లించే వారుకాదు. హరిజనులు భూస్వాములకు వాటిని ఉచితంగానే సరఫరా చేయవలసి వచ్చేది. మిగతా రైతాంగం మాత్రం, ఆ హరిజనులకు ధాన్యం రూపం లోనో, ఇతర వ్యవసాయ పంటల రూపంలోనో నిర్ణీతమైనమేర చెల్లించే వారు.

బోయలు, బెస్తలు, రజకుల వంటి మరికొన్ని ఇతర కులాలవారు భూస్వాముల కుటుంబాలకు చెందిన పురుషులను, స్త్రీలను పల్లకిలలోను,

మీనాలోను, ఎక్కించుకొని తమ భుజాలమీద మోసుకువెళ్ళ వలసివచ్చేది. కల్లుగీతకార్మికులు, చేనేత పనివారు, దేశముఖ్ల, గ్రామాధికారుల ఇండ్లకు కల్లును, బట్టలను సరసరా చేయవలసివచ్చేది. ఈ మొత్తం అణగద్రొక్కబడ్డ వెట్టిచాకిరీలో స్త్రీలపాత్ర దయనీయంగా వుండేది. ఈ ఫ్యూడల్ దోపిడీలోకెల్ల దారుణమైనది భూస్వాముల ఇళ్ళల్లోకి బానిసలుగా బాలికలను పంపించటం. భూస్వాములు తమకుమార్తెల పెండ్లిండ్లు చేసినపుడు బానిసలుగా బాలికలను బహూకరించి పెండ్లి జరిగిన తన కుమార్తెలతోపాటు వారి అత్తవారిండ్లలో పనిచేయటానికి పంపేవారు. భూస్వాములు ఈబానిస యువతులను ఉంపుడు కత్తెలుగాకూడా ఉంచుకునేవారు. ఈ విధంగా తెలంగాణా వెట్టిచాకిరీలో శతాబ్దాలు స్త్రీలు సాంఘిక, సాంస్కృతిక, ఆర్థికాది అన్ని రంగాలలోనూ దమనకాండలకు గురిఅయినారు. ఈ విషయాలన్నింటిని కామ్రేడ్ సుందరయ్యగారు, కామ్రేడ్ దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు, కామ్రేడ్ రావి నారాయణరెడ్డిగారు మొదలుగాగల "తెలంగాణాపోరాట చరిత్ర"ను వ్రాసిన వారందరూ తెలంగాణా ప్రజల జీవన విధానంలోకి ఆచరణాత్మకంగా చొచ్చుకుపోయి వారి బాధలగాధల తీవ్రతను చిత్రీకరించారు.

మరీముఖ్యంగా తెలంగాణా సాంఘిక పరిస్థితులు, స్త్రీలను నీచాతి నీచమయిన వెట్టిచాకిరికి గురిచేశాయి. స్త్రీలు ఏవిధమైన అలంకారం చేసుకోవటానికి వీలులేని అణచివేత వుండేది. పిల్లలకుపాలు ఇవ్వలేని పరిస్థితులు, భర్తతో కాపురం చేయలేని పరిస్థితులు, వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోలేని పరిస్థితులు, తెలంగాణా మాగాణగచ్చపొదల్లా స్త్రీల జీవితంలో అడ్డు పడేవి. ఆడవాళ్ళను చెరచటం భూస్వాముల హక్కు భుక్తంగా వుండేది. స్త్రీ వ్యక్తిత్వాన్ని, అభ్యున్నతిని తమఅరాచకత్వానికి ఎర చేసి, తెలంగాణా భూస్వామ్య వర్గం మీద స్త్రీలు విచ్చు కత్తుల్లా దూసుకుపోయారు. రాత్రుళ్ళు పగళ్ళు భర్తలకు తండ్రులకు, అన్నలకు బాసటగానిలిచి సాయుధ పోరాటంలో సాహస చర్యలు గావించారు. రజాకార్ నైజాం పోలీసులు సహాయ్రసైన్యం జరిపిన అమానుష చిత్రహింసలకు స్త్రీలే ప్రధానంగా గురి అయినారు. పోలీసు మూకలు, తమ్ముళ్ళను హింసిస్తుంటే భర్తలను చంపుతుంటే తండ్రులను వెంటాడుతుంటే ఆత్మస్థైర్యంతో నిలిచి, గెరిల్లా దళాలకు ఊపిరులు పోసి, సాయుధ పోరాట విజయాలకు మూలమయ్యారు. ప్రాచీన సమాజాలలో యుద్ధ తంత్రానికి

మూలభూతు లయిన స్త్రీలు మహోసాత సాయుధపోరాటంలో అద్వితీయమైన త్యాగాలు నిర్వహించారు. ఏసమాజం లోనైనా ఒక విస్తృతమైన సాంస్కృతిక జగత్తును నిర్మించటానికి నూతన సామాజిక వ్యవస్థ నిర్మాతలుగా స్త్రీలే ముందుకు వస్తారు. స్త్రీలు ప్రాతినిధ్యం వహించని పోరాటాలు నిస్తేజాలై కుప్పకూలి పోతాయునేది చారిత్రక సత్యం. "Without social revolution there can be no women's liberation with out women's liberation social revolution is incomplete'[1]

తెలంగాణా పోరాటంలో స్త్రీలు గణనీయమైన పాత్ర వహించటానికి పూర్వం **19**వ శతాబ్దం చివరి దశలో సాంస్కృతిక సంస్కరణోద్యమాలు నిజాం సంస్థానంలో తీవ్రమైన ప్రభావాన్ని నెలకొల్పాయి. గ్రంథాలయ ఉద్యమాలు, పత్రికలు, పాఠశాలలు స్త్రీ చైతన్యానికి కొంత కృషి చేశాయి. అయితే ఈ కృషి మధ్యతరగతి స్త్రీలకే ఎక్కువ పరిమితమైనది. ఆంధ్ర జనసంఘం, ఆంధ్రమహాసభగా రూపొంది సాంఘిక, రాజకీయ ఉద్యమంగా ముందుకు నడిచింది. మహిళా సంఘాలు మధ్యతరగతి స్త్రీలను కదిలించటానికి కృషిచేశాయి. అఖిల భారత మహిళా కాన్ఫరెన్స్ ఆంధ్ర మహిళాసభ, కొంత ముందుకు నడిచాయి. ఆంధ్ర మహిళా సంఘంలో మధ్య తరగతి నుండి కొంచెం ముందుకు నడిచి రైతు స్త్రీలను ఉద్యమించటానికి దోహద పడింది. ఆంధ్రమహాసభలోచేరి పని చేసిన కమ్యూనిష్టులలో పెక్కురు స్త్రీల చైతన్యం కోసం కృషి చేశారు.

ఆంధ్ర మహాసభ 1940లో 7వ మహాసభ జరుపుకుంది. 1944లో భువనగిరి సమావేశంలో చీలిపోయింది. అందు నుండి మితవాదులు తొలిగిపోయిన తరువాత అది ప్రజాభిప్రాయాలు సంతరించుకొని కొంత ముందుకు వెళ్ళింది. ఆంధ్రమహాసభ ఇచ్చిన చైతన్యంతో పాలకుర్తికి చెందిన రజక స్త్రీ ఐలమ్మ ఆమె పంటను రక్షించు కోవటానికి భూస్వాములతో తలపడింది. తన భర్తమీద, కొడుకు మీద కుట్రకేసులు పెట్టి జైలులో పెట్టినా, తనతోవచ్చిన సూర్యాపేట విద్యార్థులతోను, పార్టీ వాలంటీర్లతోను, పంటను కోసి, ఇంటికి చేర్చింది. 1945లో ఆంధ్ర మహాసభ

---

1. We will Smash this prison, 1979
Gail Omvedt page 57

నిజాం నిరంకుశ పాలనను, భూస్వామ్య వ్యవస్థను కూలదోయమనే పిలుపునిచ్చింది. 1946లో తెలంగాణా గ్రామాల్లో ఏర్పడిన సాయుధ గ్రామ రక్షణ దళాలు స్త్రీల చైతన్యంతో ముందుకు నడిచాయి. పడమటి జనగామగా వున్న ఆకునూరు గ్రామంలో అన్నదమ్ములు ఉండేవారు. అన్న పోలీసు పటేలు దుర్మార్గుడు. పై అధికారులను ఆశ్రయించి దౌర్జన్యాలు చేసేవాడు. తమ్ముడు శీతల్ సింగ్ అన్నను వ్యతిరేకించే వాడు. అన్ని గ్రామాలలో లాగె ధాన్యం లెవీ వసూలుచేస్తున్నారు. పోలీసు పటేలు దారుణాలకు నిరసనగా రైతులు ధాన్యం ఇవ్వనిరాకరించారు. దానితో తానుచేసేది లేక పోలీసు యస్.ఐ. (అమీను)ను రెవిన్యూఇన్స్పెక్టర్ నిర్దావర్‌ను, కొంత మంది కానిస్టేబుల్స్‌ను తీసుకువచ్చి, ప్రజలను భయపెట్టాడు. రైతులు వారిని ఎదిరించారు. పోలీసులు, రెవిన్యూ ఉద్యోగులు దౌర్జన్యంతో వసూలుచేయ నారంభించారు. రైతులు తిరుగుబాటు చేశారు. పోలీసులు తీవ్రంగా కొట్టారు. రైతులు తీవ్రంగా ప్రతిఘటనచేసి పోలీసులను కొట్టి, పోలీసులు ఏ విధంగా అయితే ఉద్యమ కార్యకర్తలను హింసిస్తారో అదే పద్ధతిలో హింసించారు. పోలీసులు దాహం అడిగితే మూత్రం పోయటం లాంటి పనులతో రైతులు పోలీసులను హింసించారు. ఈ వివరాలు యస్. పి. కి తెలియగానే యస్. పి. రిజర్వు పోలీసును పంపి, గ్రామ ప్రజలపై దౌర్జన్యాలు చేయించాడు. ఈ సంఘటనను దేవులపల్లి ఇలా వివరించారు. "పోలీసులు ఇళ్ళను లూటీ చేశారు. కనపడ్డవారినల్లా దెబ్బలు కొట్టారు. పూరిండ్లను లాగేశారు. కోళ్ళను, గొర్రెలను మేకలను కోసుకు తిన్నారు. స్త్రీలను చెరిచారు. వీరిలో ధనిక రైతు స్త్రీలు మధ్య తరగతి, పేద, వ్యవసాయ కూలీస్త్రీలు వున్నారు. భర్తలను ఇంటి ముందు వుండే పందిరిగుంజకు కట్టేసి వారిముందే భార్యలను, తల్లిదండ్రుల ముందు వారి బిడ్డలను చెరిచారు. అమానుషమైనటువంటి పనులెన్నో చేశారు. మొత్తం 76 లేక 77 మంది స్త్రీలను చెరిచినట్లు రిపోర్టు. కార్యకర్త ప్రయత్నం వల్ల 36 మంది స్త్రీలు జరిగిన దుస్సంఘటన వివరాలు చెప్పటానికి తయారయ్యారు. వారిలో అత్యధిక భాగం వ్యవసాయ కూలీ, పేదరైతు స్త్రీలే తమ భర్తల పేరుకూడా చెప్పారు. ఇలాంటివి చెప్పకుంటే ఆపద వస్తుందేమోనని ముందు చెప్పడానికి భయపడ్డారు. తమకు ఏవిధమైన సామాజిక అన్యాయము జరుగకుండా చూస్తామని హామీ ఇచ్చిన తరువాత పేదకుటుంబాల స్త్రీలు వాస్తవాలు

చెప్పడానికి ముందుకు వచ్చారు. ధనిక రైతు కుటుంబాల స్త్రీలు చెప్పడానికి ధైర్యం చేయలేదు. ఏమీ జరుగనట్లు చూపెంచి సర్దుకోవడానికి ప్రయత్నించారు."[1]

ఇదేకాలంలో మాచిరెడ్డి పల్లిలో కూడా ధాన్య సేకరణకు వ్యతిరేకంగా రైతులు తిరుగుబాటు చేశారు. ఈతిరుగుబాటులో కూడా ప్రముఖంగా స్త్రీలే పాల్గొన్నారు. మాచిరెడ్డిపల్లి కర్నాటక ప్రాంతం గుల్బర్గా జిల్లా సరిహద్దున గల తెలుగు ప్రజల గ్రామం. ఆగ్రామంలో లెవీధాన్యం వసూలు చేయటానికి అధికారులతో తమకు న్యాయమైన ధర రావటం లేదని, ప్రభుత్వం ధాన్యం తీసుకొని ధర ఇవ్వడం లేదని, ధాన్యం ఇవ్వ నిరాకరించి, వివాద పడ్డారు. దాంతో రెవిన్యూ అధికారులు పోలీసులతో నిర్బంధంగా వసూలు చేయ పూనుకున్నారు. పోలీసుల్ని చూసి మగవారంతా పారిపోయారు. స్త్రీలు ఇళ్ళలో వున్నారు. ఇళ్ళల్లో ప్రవేసించ టానికి ప్రయత్నించిన పోలీసులపై చీపుర్లతో, రోకళ్ళతో తిరగబడ్డారు. స్త్రీలు వాళ్ళకళ్ళల్లో కారంకొట్టి ఉద్యోగులను చితక్కొట్టారు. ఈదెబ్బతో బెంబేలెత్తి పరిగెత్తిన పోలీసులు సాయుధులైన పోలీసులను తెచ్చి బీభత్సం సృష్టించారు. ఊరును పోలీసులు స్మశానంగా తయారు చేశారు. ఈపోరాటంలో అద్వితీయ పాత్ర వహించింది స్త్రీలే. మిర్యాలగూడెం తాలూకా ముకుందాపురం గ్రామంలో తన భూమిని నిలుపు కోవటానికి మట్టయ్య పోరాడి మరణించాడు. అతని భార్య రంగంలోకి దూకి, భూ పోరాటానికి గ్రామ ప్రజలను కదిలించి భూమిని నిలుపుకుంది. వాడపల్లిలో ఒక లంబాడీస్త్రీ, కొండ్రిపోల్‌లో ఒక రైతుభార్య, మొద్దుల గుంటలో మరో లంబాడీస్త్రీ తమ భూముల కోసం పోరాటాలుచేసి విజయవంతం అయ్యారు. వీరవరం గ్రామంలో భుస్వామి ఒక లంబాడీ రైతు భూమిని ఆక్రమించుకుంటే ఆరైతు, అతని భార్య తిరుగుబాటు చేశారు. పోలీసులు గర్భవతి అయిన ఆమె పొట్టపై కాలు వేసి చంపుతున్నా ఆమె చివరి శ్వాస వరకు భూమి పోరాటంలోనే నిలబడిపోయింది. ఈవిధంగా తెలంగాణా పోరాట చరిత్రలో భూపోరాటంలో పోలీసు అఘాయిత్యాలకు, దమన కాండలకు గురై అసువులు బాసిన

1. తెలంగాణా ప్రజల సాయుధపోరాట చరిత్ర
దేవులపల్లి వెంకటేశ్వరరావు పేజి—340, 341

స్త్రీలు ఎందరో పోలీసుల క్రౌర్య కృత్యాలకు ఎదురొడ్డి నిలబడి పోరాటం చేసి వీరోచిత చరిత్ర నిర్మాణంలో తమ వంతు పాత్ర నిర్వహించిన స్త్రీలు ఎందరో పోరాట గాథలలోనికి చొరవడి వెలికితీస్తే ఎన్నెన్ని చరిత్ర ఘటనలు, అంశాలు వారు వివరిస్తారో! ఈనాటికి పోరాట వీరులకు ఊపిరి పోస్తారో!

భూమి కోసమే కాకుండా కూలి పెంపుదల కోసం జరిగిన పోరులో కూడా స్త్రీలు అద్వితీయమైన పాత్ర వహించారు. వ్యవసాయ కార్మిక సమ్మెల్లో దొరల గిడ్డంగులలోని ధాన్యాన్ని స్వాధీనం చేసుకునే పోరాటాలలో స్త్రీలు పెద్దఎత్తున పాల్గొన్నారు. రెండు సేర్లుగావున్న కూలిని నాలుగు సేర్లుగా పెంచమని కొంత్రీపల్లి ప్రాంతంలో స్త్రీలు పెద్దఎత్తున పోరాటం చేశారు. గోదావరితీర అడవులలో బీడీఆకు కోతకూలి పెంపుదల కోసం స్త్రీలు ఎలుగెత్తారు. క్రిందిప్రోలు, ఇల్లెందు ప్రాంతాల్లో జరిగిన కూలీలవేతన పెంపు పోరాటంలో స్త్రీలు అగ్రభాగంలో నిలిచారు. పోలీసు నిర్బంధకాండకు వ్యతిరేకంగా సాగిన పోరాటాల్లో మరీ ముఖ్యంగా బాలెముల, పాత సూర్యాపేట, మల్లారెడ్డిగూడెం, దేవరుప్పుల గ్రామాలలో పురుషుల వడిశెలకు రాళ్ళు అందించి, తమ వీరత్వం చాటుకున్నారు.

గోదావరి అడవుల్లో ఉండాల కోయగూడెంలో పోలీసులు మగవాళ్ళను నిర్బంధించి తీసుకెళుతున్నప్పుడు గూడెంనుండి స్త్రీలు తరలివచ్చి పోలీసులను నిలవేసిన ఘట్టం, పోలీసులు మగవాళ్ళను వదిలి వెళ్ళిన సంఘటన చారిత్రకమైనది. ఆ ప్రాంతం కట్టుగూడెం కోయపల్లిపై మిలటరీ దాడి చేసినప్పుడు గూడెంలోని స్త్రీలు, పురుషులు కలసి ప్రతిఘటించారు. సైనికులను, సుబేదారులను చంపి సైన్యం పారిపోయేటట్లు చేసిన పోరాటాలు అద్వితీయమైనవి. రజాకారులు బాధించినా, వేధించినా ఉద్యమకారుల ఆచూకీ చెప్పకుండా అనేక సందర్భాల్లో తెలంగాణా స్త్రీలు వారి ఉద్యమ పటిమను చాటుకున్నారు.

గ్రామ రాజ్యాల నిర్మాణంలోను. వాలంటరీ దళనిర్మాణంలోను స్త్రీలు అద్వితీయమైన పాత్ర నిర్వహించారు. తెలంగాణా పోరాటాలలో అన్ని రంగాలలోను స్త్రీలు పురుషులకు దీటైన పాత్ర నిర్వహించారు. ప్రతి ఘటనలో పాల్గొనటం, వాలంటీర్లుగా పనిచేయుటం, దళాలకు అన్నాలు వండి పెట్టటం, ఆయుధాలు అందించటం, వార్తలు చేరవేయుటం పోరాటా

నికి సంబంధించిన అన్ని రంగాలలోనూ వారిపాత్ర అద్వితీయమైనది. ప్రభుత్వ క్రౌర్యానికి ఎదురొడ్డి స్త్రీలు నిలబడటమేకాక ఎన్నోసార్లు మిలటరీని, పోలీసుల్ని స్త్రీలు తరిమి, తరిమి కొట్టారు. ప్రొద్దుటూరు గ్రామంపై మిలటరీ దాడిచేసి, ప్రజలనుకొట్టి, నల్గురు యువకుల్ని చంపి స్త్రీలను చెరబట్టటానికి ప్రయత్నించినపుడు స్త్రీలు ఎదురు తిరిగి వీరోచితమైన పోరాటం చేశారు. ఆపోరాటాల వలన స్త్రీలకు కలిగిన చైతన్యాన్ని రెంటటి గ్రామానికి చెందిన సోమక్క ఇలా అంది, "మేం కమ్యూనిస్టులకు సాయంచేస్తిమంటే అది మా మంచికే అనుకున్నాం. ప్రజలకు భూమి వచ్చింది, లేనిబాధ తప్పింది. గప్పుడు మేమిట్ల కూకుని మాట్లాడుతుంటిమా? గిప్పుడు మాట్లాడుతున్నాం. కొంచెం మంచిబట్ట గట్టుకుంటే గింతకుంకుంబొట్టు పెట్టుకొని పువ్వులుబెట్టుకుంటే, ఏందే ఏమనుకుంటున్నవ్ అంటుండిరి."[1]

స్త్రీలు ఉద్యమ పోరాటంలో ఇంత సహకరించినా భూమి పంపకంలో స్త్రీలను పరిగణనలోకి తీసికొనలేదు. విధవరాండ్రకు మాత్రం భూమి ఇవ్వడం జరిగింది. రజాకారుల దమనకాండను చాకలి ఐలమ్మ (పాలకుర్తి) తనమాటలతో ఈవిధంగా వివరించింది.

"ఇగ నా బిడ్డను దొరికిచ్చుకున్నారు. నేద్దొరకలేదని నాబిడ్డ న్దొరికిచ్చుకున్నారు. యిగ జీవంజి నర్సయ్య కడ్పుసల్లగుండ వాడ్వట్టించిండు, వట్టిన్నేవో....యిగ తుపాకీమొగల్తాలె గుద్దుతాంటె, తంతాంటె, ఓ....ఒకటె బట్టలుమీద బట్టలిడిసిన. ఆయన పేరేందొవుండె సింహాద్రి, పోలిసోడు బూడుగులాయెనె.... ఆసింహాద్రి. అయనకడ్పు సల్లగుండా యినొచ్చి వాల్లనెంటంటని, ఆపోర్నటని గాలవెట్టిండు. ఆ పోరవ్వాడు సచ్చేదేవుండె. ఒగాగంగాదునీ....బాంచేన్ యేంజెప్పాలె.... ఒక కుంటలేకుంట, ఒక గాబులేకుంట గోలెంలేకుంటెన్ని....వల్లగొట్టింద్రు. వల్లగొట్టి ఇంటికి నిప్పువెట్టింద్రు....తూర్పింటికి నిప్పువెట్టింద్రు. పెద్దోల్లకు ఈ మోతూర్కరమేను కడుపు నిండగనుకున్నడో కనుకోలేదో వొచ్చిండు. గింత యిల్లుగాలిపోతే యెట్ట యితదని వొక్కగొలెంల నీల్లున్నయి. పెంకలతోని దబ్బదబ్బదీసి వోసింద్రు. మీది మీద్కి యెగొట్టి గాలవె

1. మనకు తెలియని మనచరిత్ర Page X VIII

పెట్టిండ్రు. అన్నంబోసి కాలపెట్టిండ్రు. పొయ్యేటప్పుడు ఆయినొచ్చి సల్లార్పిండు.[1]

ఇలమ్మ మాటలలోని సంఘటన ఆనాటి రజాకారుల పాశవిక కృత్యాలను కళ్ళకు కట్టినట్టు చూపిస్తున్నాయి. ఆనాడు మునగాల పరగణాలో జరిగిన వీరోచిత పోరాటాలు గుండెల్ని కుదుపుతాయి. మునగాల పరగణాపై జరిగిన దమనకాండ, దానికి వ్యతిరేకంగా ప్రజల తిరుగుబాటు ఆ తిరుగుబాటులో స్త్రీలపాత్రను ఆపోరాటల్లో భాగస్వామి అయిన తటవర్తి వెంకటేశ్వరరావుగారు కళ్ళకుకట్టినట్టు వివరించారు.

"పోలీసులు ప్రతిరోజు తెల్లవారక ముందే ఏదోఒక గ్రామంవెళ్ళి గ్రామాన్ని చుట్టుముట్టి మగవారందరిని మునగాలకు తీసుకొని వచ్చి కొన్నిగంటలసేపు ప్రజలందరిని లాఠీలతో తీవ్రంగాకొట్టి "కమ్యూనిష్టుతో సంబంధాలు పెట్టుకోవద్దని" హెచ్చరించి వదలి పెట్టేవారు. ఈ హింసాకాండ అనేక రోజులు కొనసాగించారు. అనేకమందికి తీవ్రంగా దెబ్బలు తగిలేవి. దెబ్బలు తగిలినవారు అనేకమాసాలు బాధపడేవారు. అనేక మందివద్ద లంచాలు గుంజేవారు. పోలీసులు గ్రామాలలో ధాన్యం, వేరుశనగకాయలు, ధనం దోపిడిచేసి, తమ స్వగ్రామాలకు పంపేవారు.

కమ్యూనిస్టులు గ్రామాలమీదకు వచ్చి దాడిచేస్తారనే సాకుతో ప్రతిగ్రామానికి నాలుగు పైపుల రాత్రిలయందు కాపలా యేర్పాటు చేశారు. ప్రతిపైపు ఒకగుడిసె. ఆగుడిసెవద్ద లీసులు, హోంగార్డులు, గ్రామంలో యువకులు, మధ్యవయస్సు గలవారు వంతులువారీగా మేల్కొని కాపలా కాశేవారు. ఈకాపలాలవల్ల దాంపత్య జీవితం భగ్నమైంది. అనేకమంది స్త్రీలు పోలీసులవల్ల తమ శీలాన్ని కోల్పోయారు. ఈ గుడిసెల వద్దకు వేళకు రాకపోతే, పోలీసులు ఆలస్యంగా వచ్చినవారిని తీవ్రంగాకొట్టి, జరిమానా వేసేవారు. ఈ నిర్బంధ కాలంలో ప్రజలఇండ్లలోని కూరగాయులు, కోళ్ళు పోలీసులు ఎత్తుకుపోయేవారు.

ఈ కాలంలో పోలీసులు కమ్యూనిస్టుపార్టి, రైతుసంఘ కార్యకర్తలు, నాయకులు, 22మందిని అరెస్టుచేసి మదరాసు జైళ్ళలో డిటెన్యూలుగా నిర్బంధించారు.

---

1. అదేపుస్తకం Page—2

శ్రీమతి సామినేని కనకమ్మ (జగన్నాధపురం), శ్రీమతి చిలుకూరి అనంతరాములమ్మ వీరుయిద్దరు కమ్యూనిస్టు పార్టీకి సానుభూతిపరులని రహస్యంగా కమ్యూనిస్టులకు ఆహారపదార్ధములు సరఫరా చేస్తున్నారని పోలీసులు వారిని పోలీసు స్టేషన్‌కు పిలిపించి, అనేక బండబూతులు తిట్టి తీవ్రంగా హింసించి అనేకరోజులు మునగాల సబ్ జైలులోవుంచి వదిలి పెట్టారు. వీరిని పెట్టిన చిత్రహింసలు వర్ణనాతీతం.[1]

తెలంగాణా పోరాటానికి గుండెగా పనిచేసిన స్త్రీలు పోరాట సాహిత్యాన్ని వెలుగెత్తి చాటారు. సహజంగా స్త్రీలు బాగాపాడతారు. శ్రామికన్నలకు ప్రతి అడుగులో పాట తోడునడుస్తు వుంటుంది. పోరాటంలో ప్రజలనుండి పుట్టినపాటలకు జీవంపోసింది స్త్రీలే. పాటల బృందాల్లో స్త్రీల గొంతులు ప్రముఖంగా వినిపించేవి. ఆనాటి ప్రతిఘటనే పాటగా రూపొందింది. ప్రజల కవి యాదగిరి "సైజాము సర్కారోడ" పాటను తెలంగాణా స్త్రీలు ఉవ్వెత్తున గానం చేశారు.

సైజాము సర్కారోడ! నాజీల మించినోడ!
యమ బాధలుపెడ్తివి కొడకో ! సైజాము సర్కారోడ!
పండీన పంటనంత తిండికైన ఉంచకుండ
తీసుకెళ్ళినావు కొడకో! సైజాము సర్కారోడ!
దున్నాను భూమిలేక పండాను ఇల్లులేక
పరదేశ మెల్తిమి కొడకో: సైజాము సర్కారోడ!
పోలీసు మిల్టిజూసి మేము లొంగి వస్తామని
ఒక ఆశపడ్తివి కొడకో! సైజాము సర్కారోడ!
పోలీసు మిల్టిగాని లాఠీల దెబ్బలుగాని
తూపాకి కాల్పులుగాని మిషీను గన్నులుగాని
తుపాకి బాంబులుగాని నీవెన్ని తెచ్చినగాని
మేం లొంగిరాము కొడకో! సైజాము సర్కారోడ!
కంచారు గొడ్డు లాను లంచగొండి పోలిసోల్ల

---

1. మునగాల పరగణా ప్రజాఉద్యమ చరిత్ర (1981) తోటవర్తి వెంకటేశ్వరరావు పేజి 8

నీవు పెంచినావు కొడకో! సై జాము సర్కరోడ!
చుట్టుపట్టు సూర్యపేట నట్టనడుమ నల్లగొండ
ఆవాల హైద్రాబాదా తర్వాత గోలకొండ
గోలకొండ ఖిల్లకింద
నీ గోరి కడతం కొడకో! సై జాము సర్కరోడ! [1]

అనాటి పోరాట చరిత్రను కనులకుకట్టించే ఈపాట మొదటపాడిన వీరయోధుడు యాదగిరి నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూక ఎల్క పల్లి గ్రామం వాసి. తెలంగాణా పోరాటంలో ఒక విమోచన దళం ముందు నడుస్తున్న ఆవీరుడి గళంనుండి అలలు అలలుగా పెల్లుబికిన గానమిది. యాదగిరి సాయుధ పోరాటంలో స్వయంగా పాల్గొని మిలటరీతో తలపడి కాల్పుల్లో అమరుడయ్యాడు. ఈ అమరవీరుడు పోరాటంలో అమరుడైన తీరును భీమిరెడ్డి నరసింహారెడ్డిగారు స్వయంగాచూసి వివరిస్తున్నారు.

"యాదగిరి మాత్రం శత్రువువెంట పరుగెత్తుతున్నాడు. అక్షణం లోనే ఒకదాని వెంట ఒకటి రెండుు లారీల మిలిటరీ మూకలు ప్రళయంగా కాలుస్తూ అతివేగంగా తిరిగి రానేవచ్చాయి. వీరుడు యాదగిరి వేగంగా మమ్మలనందుకునే ప్రయత్నంలో వెనుకకు కాలుస్తూ మా వైపుకు పరుగెత్తుకొని వస్తున్నాడు. విధి విరామంలేకుండా గుండ్ల వర్షము మా వైపు సాగిపోతూనేవుంది. లారీలు మా వైపే వచ్చాయి. అక్కడున్న టువంటి పొదలను ఆసరా చేసుకొని అడుగడుగునా మెలికలు తిరుగుచూ ఎలాగో పొలాల్లో దూకాము. ఎకరాలకొలది వున్న ఆపచ్చటి పొలాల్లోకి లారీలు దిగలేక పోయాయి. కానీ మరింత అందుబాటులోకి వచ్చిన యాదగిరిని అందుకునే ప్రయత్నం చేశాము. వీరుడు యాదగిరి పాము వలె మెలికలు తిరుగుతూ లారీకి అందకుండా గంతులువేస్తూ చివరిదాక పరుగెత్తాడు. అక్కసుతో వున్న ఆ రజాకారులు అంతటితో వదలలేదు. చివరికి అతి సమీపంలో నుండి గురిపెట్టి కాల్చారు. ఆదెబ్బతో గాయపడిన యాదగిరి వలవలా వంటినిండా రక్తంకారుతున్నా కొనఊపిరితోనే అంద కుండాపోయే ప్రయత్నం చేశాడు. నిలువెల్లా క్షతగాత్రుడైన ఆయోధుడు పరుగెత్తుతూనే వున్నాడు. మెలికలు తిరుగుతూ కాల్చుతూ తనపాట పాడుతూ కమ్యూనిజం జిందాబాద్, ఎర్రజెండా జిందాబాద్, నిజాం

1 తెలంగాణా పోరాట పాటలు రెండవ సంపుటి పేజి నెం. 7

రాజ్యం నశించాలి అనే నినాదాలతో నిప్పులు గ్రక్కుతూ కామ్రేడ్ యాదగిరి నేలకొరిగాడు. ఆ వెంటనే మీదదుమికి యాదగిరిని అందు కున్నాయి ఆ రజాకార్ మృగాలు. ప్రక్కనే మొండ్రాయి క్యాంప్‌కు తీసుకువెళ్లి అప్పటికే కొనవూపిరితోవున్న యాదగిరిని రహస్యాలకోసం అనేక చిత్రహింసలకు గురిచేశారు.

రహస్యాలకు బదులు "ఎర్రజెండా జిందాబాద్, నిజాం నిరంకుశ రాజ్యం నశించాలి" "ప్రజారాజ్యం వర్ధిలాలి" అనే నినాదాలతో నిప్పులు గ్రక్కుతూ కడశ్వాస వదిలాడు అమరుడు యాదగిరి.

ఈ అమరుని వీరగాథ గుండెను కదిలించేదిగా ఉంది. తెలంగాణాలో పోరాట ప్రాంతాలలో మనం ఇప్పటికి ఆనాటి స్త్రీలను పలకరిస్తే వందలు, వేలు కడుపులో దాచుకున్న వి వివరిస్తారు. గుండెను కదలించే చరిత్రలో ఆడవాళ్ళకు గుర్తుండటము సహజము. వారు అనేక సందర్భాలలో నెమరువేసుకుంటారు. యాదగిరి పాట నైజాం నవాబుల గుండెలకు తూటాలా పేలింది. తెలంగాణాలోని పసికందు ఉగ్గుపాలల్లో ఆపాట రంగరించ బడింది. పేద స్త్రీల లాలిపాటల్లో పాట లీనమయ్యింది.

కొన్ని పాటల్లో తెలంగాణా భూస్వాములు స్త్రీలను పీడించిన విధము హృదయ విందారకంగా వర్ణించ బడింది. దేవరుప్పల గ్రామానికి చెందిన బేతు క్రిష్టారెడ్డి కిరాతకుడు. విసునూరి రామచంద్రారెడ్డి పొలంలో స్త్రీలు పొద్దస్తమానం పనిచేశాక రాత్రిళ్ళు పనిచేయడానికి పెద్ద లాంపులు తెప్పించారు. పసిపిల్లల తల్లులు బిడ్డలకు రొమ్ము గుడిపిస్తాం పోనిమ్మంటే పోనీడు. పైగా కుమ్మరి యెంకులను పిలచి నూరు బొడ్డు గిన్నెలు తెప్పించి ఆడవాళ్ళను వాటిలో చనుపాలు పితకమంటాడు.

ఒకరొమ్ము పితికితే వుయ్యాలో
గిన్నె నిండిపోయె వుయ్యాలో
కాటెమ్మ రొమ్ములా వుయ్యాలో
పాలు నిలబారేను వుయ్యాలో—1

ఆ పాలను పొలంలో చల్లిస్తాడు. చల్లిస్తున్న రక్తం స్వేదమల్లా చాలదన్నట్లు పనివిడిచి పోయేవాళ్ళను పొర్లించి కొడతాడు. భూస్వామ్య

1 తెలంగాణా పోరాట పాటలు రెండవ సంపుటి పేజినెం: 13
కె. వి. ఆర్ పీటిక

కౌర్యానికి పాలుపిండిన స్త్రీలు ఈ పాటను అత్యంత చైతన్యంతో ఆలపించారు. "ఖాడిదపట్టి, పెండ్లిపట్టి, సమర్తపట్టిలవంటి మధ్య యుగాల నాడు భూస్వామ్య దోపిడి" ఆహారం పేరుతో స్త్రీకి జరిగే అవమానంపై స్త్రీలే తిరగబడి పోరాడి, పోరాట సంస్కృతిని రూపొందించుకున్నారు. పోరాటమనేది ఒకసంస్కృతి. అది సాహిత్యాన్ని సృష్టిస్తుంది. ఊసులు, బాసలతో పాటలయిలు స్మృతులు ఆపోరాట పద్ధతిలోనే తయారౌతాయి. తెలంగాణా పోరాట గాథల్లో,చరిత్రల్లో, పాటల్లో, మాటలలోనేగాక స్త్రీ దయనీయ పరిస్థితులు, బుర్రకథలలో, డక్కమోతల్లోకూడా వినిపించాయి. స్త్రీ దళాలుకట్టి బుర్రకథలు చెప్పేవారు. "రజాకారు దూతగాను" తెలంగాణా వీరయోధులు అనే బుర్రకథలో తిరునాగరి సీతారామాంజనేయులుఎలా వర్ణిస్తున్నాడో చూద్దాం. "పచ్చివల్లు బాలింతలను పసువుల్లాగా చెరుస్తున్నారు. నెత్తురుముద్దలైన పసిపిల్లలను కత్తులతో తురుముతున్నారు. గుడ్డలువిప్పి శూలాళ్ళ గర్భాలను కత్తులకెర చేస్తున్నారు. వృద్ధులను సజీవంగా గడ్డివాముల్లోవేసి దహిస్తున్నారు. మర్మాంగాలను తినేలాలోనికి తొండలనువదలి లాగులను బిగకట్టుతున్నారు. బ్రతికిన వారిని లారీలకుకట్టి రోడ్లవెంబడి లాగుతున్నారు. చెట్లకు తలక్రిందులుగా కట్టి చర్మాలను వలచివేస్తు చింతబరికలు విరిగేటట్లు వీపులు చిట్లకొడుతున్నారు.

ఈ వర్ణనలు, జన జీవన వాస్తవ పరిస్థితుల నుండి అభివ్యక్తమయ్యాయి ఆడవాళ్ళనోళ్ళలో ఆటీ వుయ్యాల పదాలు, చుట్టు కాముతు పాటలు, గొల్ల సుద్దులు, బుర్రకథల లయలో, కళారూపాన్ని దూసుకుంటూ ముందుకు వచ్చాయి. అణదుందుభులు మోగ్రాయి. ఆనాటి కవులు పాటల్లో

"భళానోయి భళతమ్ముడూ - భళానోయి భళదాదాన
నక్కలు తిరిగే తోటల్లో - నాలుగు స్తంభాల తోటలో
రాకాసిరాజొ కడుండేరా - వాడి గుండె రాబండిరా
వాడిచూపు మద్యాన పెండరా - వాడి నాలుక వాడి కత్తిరా
వాడి రాజ్యపు పొట్ల పాదురా - వాడి ఆశల కంతులేదురా
వాడి పేరు దగాకోరురా - భళానో
భళానోయిా భాయి తమ్ముడు - దేవభళానోయిదాదాన [1]

ఆరుద్ర రాసిన ఈ గేయంలో బుర్రకథ లయ చోటు చేసుకుంది. దాశరథి, కాళోజీ, కుందుర్తి రచనల్లో "తెలంగాణా" "రుద్రవీణ"లు మ్రోగాయి.

సజీవమైన పోరాటం సంస్కృతిని నిర్మిస్తుంది. సాహిత్యాన్ని సృష్టిస్తుంది. చరిత్రను రచిస్తుంది. కళారూపాలను పండిస్తుంది. సంస్కృతికి, సాహిత్యానికి, చరిత్రకు, కళకు, మూలం స్త్రీ యే కాబట్టి ఏపోరాటంలోనైనా స్త్రీలు ప్రధాన పాత్ర వహిస్తే తప్పక ఆ పోరాటానికి సజీవమైన చరిత్రగతి రూపొందుతుంది.

అయితే తెలంగాణా పోరాటంలో స్త్రీ సహకారం ఉన్నంతగా నాయకత్వం పాత్రలేదు. పాతినిధ్యం ఉన్నతంగా ప్రాధాన్యత లేదు. ఏదోఒక మేరకు పురుషులు పోరాటాన్ని పోరాట ఫలితాన్ని ఎక్కువ భాగం స్వాయత్తం చేసుకున్నారు.

తెలంగాణా సాయుధ పోరాటంలో అంతర్లయగా సాగిన సాంస్కృతిక పోరాటం మాములు ధోరణిలో సాగే సంస్కరణోద్యమాలకంటే ఎక్కువ విజయాలు సాధించింది. మామూలుగా స్త్రీలకుండే మూఢాచారాలు ఉద్యమ కార్యక్రమాలవలన, చైతన్యం వలన తగ్గాయి. నాయకత్వం విషయంలో అగ్రకులాలు అగ్రభాగాన నిలవడం జరిగింది.ఈమొత్తం అంశాల ప్రభావం స్త్రీల మీద కూడా ఉంది.

తెలంగాణా ఉద్యమ వైఫల్యాలగురించి గుణపాఠాల గురించి చర్చించడం ఇక్కడకష్టమౌతుంది.తెలంగాణా సాయుధపోరాటం ఆగిపోవటానికి కారకులెవరు? అదినాయకత్వలోపమా? సిద్ధాంతపరమైన అవగాహనలోపమా? తీవ్రమైన అణచివేతే కారణమా? నాయకుల అసమర్థతా? వైరుధ్యాల వ్యూహ రచనలో లోపమా? చర్చించటానికి సందర్భం కాదు. అయితే తెలంగాణా పోరాటం ఆగి పోవటానికి మాత్రం స్త్రీలు కారణంగాదు. ఆగిపోయిన తరువాత ఆవరించిన చీకటి, నిస్పృహ, నిస్త్రాణత, దారిద్ర్యం స్త్రీలనే ఎక్కువ ఆవరించింది మరలా భూస్వామ్య పీడన, సాంఘిక ఆచార దురన్యాయాలు, వెట్టిచాకిరి, అరాచకం, దమన కాండలకు పురుషసమాజం కంటే స్త్రీలే ఎక్కువ గురయ్యారు.

ఒక పోరాటం జరిగేటప్పుడు దానిలో కొన్ని కోణాల నుండి ఎదురైన కష్టాలు, భౌతికమైనవి, మానసికమైనవి. స్త్రీలు ఎదుర్కొన్నంత పురుషులు ఎదుర్కొనడానికి అవకాశంలేదు. ఒకస్త్రీ గర్భవతిగా, బిడ్డ

తల్లిగా, కుటుంబాన్ని సరిదిద్దవలసినదిగా, ఆర్థికమైనవి, హార్దికమైనవి ఎన్నో ఇబ్బందులు ఆమెపడవలసివస్తుంది. తెలంగాణా సాయుధ పోరాటంలో స్త్రీలపాత్రను మనం విశ్లేషిస్తే ఆ ఉద్యమ నిర్మాణంలోను, నాయకత్వంలోనూ, స్త్రీలకు రావలసిన ప్రాతినిధ్యం వచ్చి ఉంటే తెలంగాణా ప్రజల సాయుధ విప్లవం విజయపథంలో ఇంకా ఎంతో ముందుకు గమించి యుండేది. స్త్రీలలో ఉండే పట్టుదల, దీక్ష, త్యాగనిరతి, నిర్మలత్వము, నిర్దుష్టత, చారిత్రక దృక్పథం వారికి విజయ సోపానం అయ్యేది.

అయితే రష్యాలోని బోల్షివిక్ పోరాటం, చైనాలో మావో పోరాటాల్లో స్త్రీలే నాయకత్వంలో ఉన్నారా? పురుషులు సాధించలేదా? అంటే ఆ విజయముయొక్క ఫలితాలు, అనేక సందర్భాల్లో తిరోగమించటానికి ఇంకా స్త్రీలకు రావలసినంత ప్రాధాన్యం రాకపోవడంకూడా ఒకకారణం.

అయితే లెనిన్ "స్త్రీల అణచివేతను అసమానతను, తొలగించడానికి, ప్రపంచంలో ఏ పార్టీ, ఏ విప్లవం పనిచేయనంత నిజాయితీతో, బోల్షివిక్ సోషలిస్టు విప్లవం కృషిచేస్తుంద"ని చెప్పాడు. ఏదేశంలోనైనా భూస్వామ్య సంస్కృతిని, పెట్టుబడిదారీ సంస్కృతిని ఎదిరించి సోషలిస్టు సంస్కృతిని నెలకొల్పడంలో స్త్రీలదే ప్రధానపాత్ర భారత సమాజంలో అత్యంత నీచంగా అణచివేయబడిన దళితులు, స్త్రీలు, పోరాటంలో అగ్రభాగాన నిలచి ఉద్యమాలను నడపనంతవరకు, ఈ ఉద్యమాలు ఎక్కడో ఒకచోట అంతర్లయగా ఉన్న కులవైరుధ్యాలు స్త్రీన్యూనత తత్వం అధైర్యంవలన ఆగిపోక తప్పదు. ఈవైరుధ్యాలకు సరైన పరిష్కారం సరైన వర్గదృక్పథం, స్త్రీలు, దళితులు అగ్రభాగాన నిలబడే చైతన్యంలోనే తొలగింప బడతాయి. భారతీయ సామాజిక వాస్తవాన్ని కేవలం ఆర్థికవాదులు అర్థం చేసుకోలేరు. అర్థం చేసుకోకపోగా స్త్రీ పక్షపాత వాదులనో, దళిత పక్షపాత వాదులనో పెదవి విరిచే ప్రమాదం ముంచుకు వస్తుంది. అట్లుగాక తెలంగాణా సాయుధపోరాట వైఫల్యాలు, గుణపాఠాలగురించి సుందరయ్యగారు, దేవులపల్లిగారు, బసవపున్నయ్యగారు, రావి నారాయణరెడ్డిగారు, చండ్ర పుల్లారెడ్డిగారు ఇంకా మరికొందరి నాయకుల గ్రంథాలను అధ్యయనం చేసినట్లయితే ఆనాయకులు ఎత్తి చూపిన అంశాలలో వైరుధ్యాలు సరిగా అంచనావేస్తే పీడిత వర్గంలో

ప్రధానులైన స్త్రీల దళితుల, నాయకత్వం, నిర్మాణత, ప్రాధాన్యత లోపించడంవల్లనే ఈ ఉద్యమం వైఫల్యం చెందిందనే చారిత్రిక సత్యం మన ముందుకు వస్తుంది.

ఈ సత్యాన్ని అంగీకరించడానికి వెనకాడినంతకాలం సిద్ధాంత పరంగా ఆచార పరంగా తిరోగమనమే మిగులుతుంది. ఏదిఏమైనా భారతీయ సంస్కృతిలో అణచివేతకు మూలభూతురాలైన స్త్రీయే పోరాట సంస్కృతికి ఊపిరి.

పోరాట సంస్కృతితో పాటు మాతృస్వామ్య సంస్కృతి రూపాన్ని మిగుల్చుకున్న భారతీయ గిరిజన స్త్రీనికూడా పరిశీలిద్దాం.



# గిరిజన స్త్రీలు

ప్రాచీన భారతీయులూ, భారతదేశ సంస్కృతికి మూల భూతులు అయినవారు గిరిజనులు. భారతదేశంలో ఆయా కాలాల్లో వచ్చిన పాలక వర్గాలు ఈ (తెగల) గిరిజన వ్యవస్థల శిథిలాలమీద వారిరాజ్యాలు నిర్మించు కున్నారు. భారతదేశ సహజ సంపదలైన కొండ కోనల్లో నివసిస్తూ ప్రాచీన భారత సమాజానికి జీవమైన మాతృస్వామిక వ్యవస్థను సహజ సంపదగా కలిగిన ఈ గిరిజనుల చరిత్రలో స్త్రీలు ప్రధాన పాత్ర కలిగి వున్నారు. గిరిజనుల మొత్తం సంస్కృతిలో స్త్రీలు నిండిపోయి వున్నారు. గిరిజనులనుండి వారిస్త్రీలను వేరుచేసి చూడటానికి వీలు లేనంతగా సమతుల్యంగా స్త్రీలు నిలబడి వున్నారు. అందుకే గిరిజన స్త్రీలను గురించి తెలిసికోవడం అంటే గిరిజనుల వ్యవస్థ మొత్తం గురించి ప్రాచీన భారతీయ సంస్కృతిని గురించి తెలిసికోవడమే అవుతుంది.

గిరిజనస్త్రీ ఒక వ్యవస్థ, ఒక సమాజం, ఒక కళాసంపద, ఒక శ్రమ నిధానం, ఒక సంస్కృతికి నిర్మాత, ఆమెను గూర్చి తెలిసికోవడమంటే భారతీయ సంస్కృతి హృదయాన్ని గూర్చి తెలిసికోవడమే. భారతీయ సంస్కృతి పునాదిని గూర్చి తెలిసికోవడమే.

1971వ సంవత్సరపు అంచనా ప్రకారం రాయ్‌బర్మన్ (Royburman) మన భారతదేశంలో 427 గిరిజన సముదాయాలు ఉన్నట్లు గుర్తించాడు. కాని, "Anthropological Survey of India" (1967) అంచనా ప్రకారం 314 గిరిజన సముదాయాలు ఉన్నట్లు గుర్తించ బడింది.

జనాభా లెక్కల ప్రకారం సంఖ్యారీత్యా (Numerically) ముఖ్యమైన తెగలు—గోండ్ (Gond)లు మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌లలో; భిల్ (Bhil)లు రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో; సంతాల్(Santal)లు బీహార్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్‌లలో ఉన్నాయి. ఈతెగలు ఒక్కొక్కటి 30 లక్షలకు పైగా జనాభా ఉన్నట్లు అంచనా. అన్నిటికంటే సంఖ్య తక్కువగా ఉన్న తెగ అండమానిస్ (Andamanise).

ఐదు లక్షలకు పైగా జనాభాగల తెగలు—ఆది (ADI), బైగా (BAIGA), భుయా (BHUIYA), భుమిజ్ (BHUMIJ), గారో (GARO), కావార్ (KAWAR), ఖరియా (KHARIA), ఖాసి (KHASI,) కొండదొర (KONDA DORA), కొరకు (KORAKU), కోయ (KOYA) లోధ (LODHA), మిజో (MiZO), సవర (SAVARA), ఎరుకల (YERUKALA), యానాది (YANADI).

పది లక్షలకుపైగా జనాభాగల తెగలు – మైనా(MINA), ముండా (MUNDA), ఓరయన్ (ORAON) లు వ్యాపించివున్నారు.

## యానాదులు :

యానాదులు ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో నెల్లూరు, గుంటూరు చిత్తూరు జిల్లాలలోనూ, తమిళనాడు రాష్ట్రంలో చెంగల్‌పట్ జిల్లాలోను నివసిస్తున్నారు. కాళహస్తి, కార్వేటి నగర ప్రాంతాలలోను, పులికాట్ సరస్సు ప్రాంతాలలో నివసించు యానాదులను "అడవి యానాదులు" లేదా "ఇరులవాండ్లు" అనిపిలుస్తున్నారు. విలియా అనుజాతి వాళ్ళను కూడా ఈవిధంగానే పిలుస్తారు. నెల్లూరు జిల్లా యానాదుల్లో చల్ల యానాదులని, మంచియానాదులని రెండు తెగలున్నాయి. మంచి యానాదులు రెడ్ల ఇళ్ళలో పనిచేస్తారు. వ్యవసాయం చేస్తారు, వొడ్లు దంచుతారు. చల్ల యానాదులు ఎంగిలాకుల్లోని అన్నాన్ని తీసుకుంటారు. పాకీపని కూడా చేస్తారు. అడవి యానాదులు కొందరు కప్పలను తినడం వలన వారు "కప్పలయానాదులు" అని కూడా పిలవబడుతున్నారు. ఉభయగోదావరి, విశాఖ జిల్లాలలో "నక్కల యానాదులు" గా పిలువబడుతున్న ఒక తెగఉంది. వీరి జనసంఖ్య సుమారు రెండు లక్షలు ఉండవచ్చు. వీరిలో స్త్రీలు భర్తతో ప్రతిపనికి వెంబడుండటము ఒక ప్రత్యేకత. ఆలుమగలుగా కలిసిఉన్నంత కాలం ఒకరిని ఒకరు విడిచి పెట్టి ఉండరు. ఈయానాదులు వివాహాన్ని చాలా తక్కువ ఖర్చుతో చేసుకుంటారు. వీరు చిన్న చిన్న గుడిసెల్లో ఉంటారు. భర్తను భార్య కాని, భార్యను భర్తగాని ఇష్టం లేకపోతే వదిలి వేయడానికి ఈ జాతిలో ఎక్కువ అవకాశం ఉంది. యానాదులు చేపలు, ఎలుకలు పాములు పట్టడంలో నిపుణులు. ఈ పనులలో స్త్రీలు కూడా మగవారికి

సహకరిస్తుంటారు. అడవుల్లో కట్టెలు కొట్టి,మోపులను గ్రామాలకు తెచ్చి అమ్ముకొని జీవనం చేయడంలో స్త్రీల సహకారం ఎక్కువగా ఉంటుంది. వీరు బియ్యపుగంజి లేక పుల్లనీళ్ళు ఎక్కువగా తాగుతారు. ఆడవాళ్ళు చాలా సామాన్యమైన బట్టలు కట్టుకుంటారు. యానాది స్త్రీలలో విద్య పూర్తిగా లేదనుట ఆశ్చర్యం కాదు. ఆంధ్రప్రదేశ్‌లో సుమారు అన్ని నగరాల్లో అక్కడక్కడ వీరు కనిపిస్తూ ఉంటారు. వీరిలో స్త్రీలకున్న స్వేచ్ఛ హిందూ జాతిలోని స్త్రీలకు లేదు.

## తోడాజాతి :

తోడాజాతి సంచారక పశుపాలకులు. దక్షిణ ఇండియాలో ప్రసిద్ధి చెందిన ఆదిమ జాతుల్లో తోడాజాతి ఒకటి. వీరికి విశిష్టమైన సంస్కృతి ఆచారాలు ఉన్నాయి. తోడాలలో మగవాళ్ళ గడ్డాలు, తలచుట్టూ గుండ్రంగా కత్తిరించబడిన శిరోజాలు పెంచుకుంటారు. స్త్రీల వెంట్రుకలు ఉంగరాలు తిరిగి గిరజాలుగా వేలాడుతూ ఉంటాయి. స్త్రీలు, పురుషులు వేసుకునే బట్టలమీద అల్లికలు కూడ వేస్తారు. వీరు చిన్న చిన్న పల్లెల్లోకూడా ఉంటారు. వీరు మాట్లాడే భాషకు తమిళ, మళయాళ భాషకు దగ్గర సంబంధం ఉంది. 1115 నాటి ఒక శిలాశాసనంలో వారిని గూర్చిన మొదటి ప్రస్తావన ఉంది. తోడాజాతిలో బాల్య వివాహాలు చేయుట పరిపాటి. బహు భర్తృత్వం తోడాజాతిలో ప్రసిద్ధి. వారి ఆచారం ప్రకారం అన్నదమ్ములందరికి ఒక ఉమ్మడి భార్య ఉంటుంది. ఆమె మొదటిసారి గర్భవతి అయినప్పుడు 7వ మాసంలో అన్నదమ్ములలో ఒకడు....సాధారణంగా పెద్దవాడు ఆమెకు నకిలీ విల్లు, బాణం కానుకగా ఇచ్చి న్యాయశాస్త్రరీత్యా తాను తండ్రి అవుతాడు. ఇటీవల ఈ ఆచారానికి స్వస్తి చెప్పి ఒక భర్తతో ఉండడాన్ని ఆచరిస్తున్నారు. పూర్వం తోడాజాతిలో శిశుహత్య లుండేవి. వారికి స్త్రీ సంతాన మంటే ఇష్టంఉండదు. రెండవసారి ఆడపిల్ల పుట్టినట్లయితే....శిశువునకు నవరంధ్రములు మూసిగుడ్డలుచుట్టి భూస్థాపితం చేయుట పరిపాటి. స్త్రీశిశు హత్యల వల్లనే తోడాజాతిలో పురుషుల సంఖ్య ఎక్కువగా కనిపిస్తుంది. తోడాలు మహిష పూజ చేస్తారు. స్త్రీలు సంగీతంలో ఆరితేరినవారు. తోడాల జీవిత విధానంలో రానురాను మార్పు వస్తున్నది.

## భిల్లులు :

గుజరాత్, మహారాష్ట్ర. రాజస్థాన్‌లలో 25 లక్షలకు పైగా భిల్లులు నివసిస్తున్నారు. భారతదేశంలో ఆదిమ జాతుల జనాభాలో వీరు మూడవ స్థానాన్ని ఆక్రమిస్తున్నారు. భిల్లులు కొండజాతుల్లా ఆహార సేకరణ, వేటాడుట వంటి వాటిల్లో సమర్థులు. వీరు కొండ ప్రదేశాలని సాగులోనికి తెచ్చారు. నల్లగా కురచగా ఉండే భిల్లులు దక్షిణాది కొండ జాతుల్లాగే ఉంటారు.

భిల్లుల్లో ఒకప్పుడు కన్య తల్లితండ్రులకు ఊడిగం చేసి వివాహం చేసుకోవలసి ఉండేది. సంతానం లేకుండా సోదరుడు చనిపోతే మరో సోదరుడు అతని భార్యను వివాహమాడుదురు. భార్య చెల్లెండ్రను వివాహమాడుట భిల్లుజాతి ఆచారము.

వీరిలో భూతవైద్యులు మెండు. హిందూ మత ప్రభావం, పితృస్వామిక ప్రభావం మెండుగా ఉంది. స్త్రీలపై హిందూ మతంలో వున్నంత అణచివేతలేదు.

## సవరులు :

సవరులు విశాఖపట్నమునకు తూర్పుదిశగా తూర్పు కనుమల ప్రాంతంలో ఉన్నారు. సవరులు నివసించే అడవి ప్రాంతాలు చాలా అందంగా ఉంటాయి. వీరు పోడువ్యవసాయం చేస్తారు. 17, 18 శతాబ్దాల వరకు వీరు చెట్లు, ఆకులు, పట్టలు మొలకు చుట్టుకునేవారు. కాలక్రమేణా ముతక బట్టలు కట్టుకోవడం నేర్చుకున్నారు. పురుషులు మొలకు గోచి పెట్టుకుంటారు, స్త్రీలు రెండడుగుల వెడల్పు, నాలుగడుగుల పొడవు ఉన్న ముతక బట్టను మొలకు చుట్టుకుంటారు. మోకాళ్ళక్రింద, మొల పైభాగములలో బట్ట ఉండదు. వీరిప్పుడిప్పుడే చీరలు, రవికలు ధరిస్తున్నారు. చెవికి 10నుండి 20వరకు కుట్లుఉంటాయి. ఆ కుట్లకు ఇత్తడి చుట్లు ఉంటాయి. ఆభరణాల బరువుకి ఆ రంధ్రాలు పెద్దవి అవుతాయి. గాజుపూసలు, పగడాలు. గురివింజ పూసలు వీరు మెడలో ధరిస్తారు. వీరి ముఖాలు విశాలంగా, దౌడ ఎముకలు ఎత్తుగా, కండరాలు పుష్టిగా ఉంటాయి. స్త్రీలకు పిల్లలకు పొట్ట ముందుకు వచ్చి ఉంటుంది. వీరిలో బహుభార్యత్వం ఉంది. స్త్రీతన ఇష్టంవచ్చినప్పుడు భర్తను వదలిపెట్టి మరో వ్యక్తిని

వివాహమాడవచ్చు. అనేకమంది భార్యలు ఉన్నప్పుడు వారికి వేర్వేరు ఇళ్ళు ఏర్పాటు చేయబడతాయి. సవర యువతీ యువకులు ప్రత్యేకంగా అలంకరించుకుంటారు. అలంకరణకై పక్షుల ఈకలు, నెమలి ఈకలను ఉపయోగిస్తారు. సవరులు అడ్డాకులు, తేనె, మైనం అమ్ముతుంటారు. వేటాడిన జంతువుల మాంసం, కూరగాయలు, పళ్ళు వీరి ఆహారం. ఆట పాటలల్లో సవరలది అందె వేసినచెయ్యి. సుమారు 24రకాల వాయిద్యాలు ఈ జాతులవారు ఉపయోగిస్తుంటారు.

భర్త చనిపోతే సవరస్త్రీలు మరల వివాహాలు చేసుకుంటారు. మరిది ఉంటే అతనినే వివాహమాడటం సాంప్రదాయం. సవర స్త్రీ మరొక పురుషుడ్ని ప్రేమించి వివాహం చేసుకోదలచినప్పుడు ఆమెను పెండ్లి చేసుకోబోయే వ్యక్తి మొదటి భర్తకు ఒక పోతునో, పందినో ఇవ్వాలి. వారికి ఎప్పుడైనా విడాకులు తీసుకొనే అవకాశం ఉండుట వలన వారిలో వ్యభిచారం చాల తక్కువగా ఉంటుంది.

సవరులకు మూఢనమ్మకాలు ఎక్కువ. వ్యాధి సంబంధమైన భూతాలను వారు కొలుస్తుంటారు. కొందరు ఆడవాళ్ళుకూడా మంత్రాలు చెపుతారు. వైద్యం చేస్తారు. వీరివ్యాధి సంబంధమైన కొన్ని భూతాలు-

1, కన్ని బోజన్:- ఇది అపస్మారక దేవత.ఇది ఆవహించిన వారి వద్దకు బంధువులైనా వెళ్ళడానికి భయపడతారు. ఈభూతమును శాంతింప జేయుటకు పందులను బలివ్వవలెను. మేకలు పనికిరావు. అన్నము, కల్లు ఉపాహరము పెట్టవలెను. ఈభూతము అడవులలో పెద్ద వృక్షములపై వుంటుంది. కనుక దీనికి చేసే పూజలు అడవులలోనే చేయవలెను.

2- 4, సోడంగ, గోసాడ్, ఎర్జానా:- వీటి వలన జ్వరము, వ్రణములు, పైత్యము మొదలైన వ్యాధులు కలుగుతూ వుంటాయి. వీటికి మేకలు, బట్టలు ఉపాహారంగా ఇవ్వవలెను.

5-7, గడేజంగ్, సంద్రడ, బిల్లు :- వీటివల్ల తలపోటు కలుగుతుంది. వీటికి మేకలు, కోళ్ళు, కల్లు, బట్టలు కావలెను.

8, రతూనా, సోనమ్ – పులి భూతము :- ఇది సోడంగ భూతమునకు భార్య. దీని వెంట ఎప్పుడునూ పులి ఆకారముగల కుక్క తిరుగుతూ ఉంటుంది. దీనివల్ల గండమాల (మెడవాపు) మొదలైన రోగములు కలుగుతాయి. దీనికి బలి కావలెను. కల్లు ఉపాహరముగా పెట్టవలెను.

9. గయరయిల్లు :- ఇది స్త్రీలకు ప్రసవము సులభంగా కాకుండా బాధించే భూతము దీనికి మేకలు, కోళ్ళు, అన్నము, కల్లు కావలెను. పంది బట్టలు అక్కరలేదు.

10. ఇల్లా సోనమ్: దీని వల్ల స్త్రీలకు గర్భముపోతూ ఉంటుంది గర్భముపోతుందేమోనన్న భయంతో గర్భవతి అయిన స్త్రీ ఈ భూత మునకు ఊపారము పెడుతూ ఉంటుంది.

11 రోగా-బోజన్: ఇది పెద్దమ్మవారు.దీనికి సవరలు ఎక్కువగా భయపడతారు. అయితే ఈ భూతములన్నీ "ఊహాత్మకమైనవే" వీరి మూఢాచారాల నుండే ఈ భూతాలు పుట్టాయి. సవరలు ఎక్కువగా దేవత లను పూజిస్తారు. వాటి పేర్లు ఇలా ఉన్నాయి.

## సవరల దేవతల పేర్లు

1. అజడజీ-డై యూ
2. అమోజీ-బొన్ని
3. అర్గత్తా
4. అసీబా
5. అల్లాజీ
6. ఇజాడా
7. ఇండో_రాజా
8. ఇల్లా-బోఇ
9. ఎడజా
10. ఎర్నానా
11. బయుజ్సుమ్
12. కంతియార్
13. కన్నిసుమ్
14. కరూఆ
15. కుమరి
16. కినా-సుమ్
17. కులేడజ్
18. కొర్నాన్
19. గడెబాజర్
20. గయరా-బల్లు
21. గర్నాదా
22, గల్ బెడర్
23, గుర్బాడీర్(గుర్బారాజా)
24. గులుసురాజా
25, గుసాడా-ఇడ్
26, జగంతా
27, జల్యా
28, బోడా
29. డకుసీజ్-బోఇ
30, డరమ్మా-బోజన్(డరమ్మా-రాజా)
31, డర్-పెన్నా
32, డరాసిమ్
33, డాలిమ్మ
34, డారులీ
35, దూరి
36. తిప్పరి
37. తుంకరాన్
38. తుమన్నా
39. తెతె
40. తోనెఇ
41. పెడా
42. పెర్పి-బోయి

43. బడోజన్-బిరుసుమ్
44. బిడా-బోజన్
45. బాబూసుమ్
46. బీమా
47. బుర్చుండా
48. బిల్లు
49. మద్యాసుమ్
50. మత్తానుమ్
51. ముంతాగా
52. రతునాసోసుమ్
53. రనా-డైయూ
54. రమా (రామా)
55. రాతుర్
56. రంగే-బోజన్
57. రజ్ - ర్జు
58. రాగా - బోజన్
59. అడసా
60. లబోనుమ్
61. సంక్రి - బోయి
62. సండా్రి
63. సమాంతి
64. సర్దయ
65. సిజ్ - బోజ్
66. సండి-అనర్-జో
67. సుతా్రి-బొయి
68. సుమిన్ని
69. సుర్మల్లో - బోజన్
70. సూర్బిల్బా
71. సురెండా
72. సోడంగా - రాజా

సవరలలో బాల్య వివాహాలు ఎక్కువగా ఉన్నాయి. వివాహవిషయములోనేకాక........ హిందూ సంస్కృతితో పోల్చుకుంటే స్త్రీలకు అన్ని రంగాలలో చాలా స్వేచ్ఛ ఉన్నట్లే కనిపిస్తుంది.

బిడ్డలు లేని సవర స్త్రీలు సంతానం కోసం "కితుంగ్ పుర్పుర్" తన ఇంట్లో చేసుకుంటానని మొక్కుకుంటుంది. అలా బిడ్డపుట్టగానే పంది పిల్లను కోసి ఆ పండుగ చేస్తుంది. సవరలలో ఈవిధమైనఆచార సాంప్రదాయాలు ఎక్కువగా ఉన్నాయి.

సవర స్త్రీలు, పురుషుల పని పాటల్లో సహకరిస్తుంటారు. తెగల సంస్కృతిలో ఇది ప్రత్యేకంగా గుర్తించదగిన అంశం.

సవరలు ఒక విశాఖ జిల్లాలోనే కాక........,ఒరిస్సా, బెంగాల్ మండల్లో, సింగభూమి, సంబర్పూర్, రాయపూర్, పాట్నా, కలహాండి, సారంగర్, రాయగర్ మొదలైన మధ్య పరగణాల్లో కూడా అక్కడక్కడ ఉన్నారు.

భారతీయ వాఙ్మయంలో సవర జాతి ఐతరేయ బ్రాహ్మణ కాలం నుండి కనబడుతుంది. రామాయణంలో "శబరి" శ్రీరామునికి ఆతిధ్యం ఇచ్చినట్లుగా కనిపిస్తుంది. దీనిని బట్టి వీరిప్రాచీనత మనకు తెలుస్తుంది.

సవరలు ఆర్యేతరులనేది-ఐతరేయబ్రాహ్మణంలో శునశ్శేపుని తన జ్యేష్ట భ్రాతగా అంగీకరించినందుకు విశ్వామిత్రుడు తన తనయులను "అనార్యులుగమ్మ"ని శపించాడని – "ఏతే ఆంధ్రాః పుండ్రాః శబరాః పుళిందాః మూతిభాః ఇత్యాదంత్యా బహవో భవంతి వైశ్యామిత్రా దస్యూనామ్ భూయిష్ఠా" అనే శ్లోకాన్ని బట్టి తెలుస్తుంది. అనార్యజాతుల్లో సవరులు కూడా ప్రసిద్ధి చెందినది అనేది స్పష్టమవుతుంది.

అనార్య జాతుల్లో ప్రసిద్ధి చెందిన సవరజాతిలో స్త్రీకి ప్రాధాన్యం వుంది, అయితే రానురాను దోపిడీకి గురయ్యారు. ఈ దోపిడీలో స్త్రీ కూడా భాగస్వామ్యం పొందింది.

## ఎరుకల స్త్రీలు

ఆంధ్రప్రదేశ్‌లో ఎరుకలుగానూ, కర్నాటకలో కొరచలుగానూ తమిళనాడులోని తిరుచునాపల్లి, కోయంబత్తూరు ప్రాంతాలలో కొరవలుగా పిలువ బడుతున్న అందరూ ఎరుకలే. సామాన్యంగా "ఎరుక" అనే పదం సోదె, గద్దె చెబడం నుండి వచ్చింది. ఇప్పటికీ ఎరుక స్త్రీలు సోదె గద్దె చెబుతుంటారు. బియ్యం. డబ్బులు వారికి సోదె చెప్పినందుకు ప్రతిఫలంగా వస్తూ ఉంటాయి. ఎరుకలు మాట్లాడే బాషలో ఎక్కువగా తమిళ శబ్దాలు కనిపిస్తుంటాయి. కాని వాళ్ళు ఏ ప్రాంతంలో జీవిస్తే ఆ ప్రాంతపు పదాలను వారి బాషలో మిశితం చేస్తుంటారు.

తమిళనాడులోని కొరవలు బుట్టలను ఎండు కరేపాకును, వగ్గాలను మొదలైన వాటిని తయారుచేసి అమ్ముతారు. ఈ అమ్మే విషయంలో స్త్రీలు ప్రధానపాత్ర వహిస్తారు.

ఎరుకలు వోలి చెల్లించే వివాహం చేసుకుంటారు. పెండ్లిసమయంలో పెండ్లికుమార్తె మెడలో నల్లపూసలు కడతారు. బియ్యంతో తలంబ్రాలు పోసుకుంటారు. అయితే ఎరుకల స్త్రీలు తమకు భర్త ఇష్టం లేకపోతే.... మరో పురుషుడ్ని చేసుకోవచ్చు. కాని వోలి తిరిగి ఇవ్వవలసి ఉంటుంది. ఎరుకలలో కుల పెద్దలు పెత్తనం

చెలాయిస్తూ ఉంటారు. సాక్షులకంటే కూడా నిప్పులు పట్టుకోవడం, సల సల కాగే నూనెలో చేతులు పెట్టడం వంటి వాటికి ఎక్కువ విలువిస్తారు. ఈ పేరుతో స్త్రీలను ఎక్కువగా బాధిస్తుంటారు. భర్త చనిపోతే స్త్రీ ఒకరి తర్వాత ఒకర్ని ఏడుగురి వరకు వివాహమాడవచ్చు.

ఎరుకలలో గాడిద ఎరుకలు, ఎద్దు ఎరుకలు, కప్పల ఎరుకలు అనే తెగలున్నాయి. అయితే వారి మధ్య వివాహసంబంధాలు ఉండవు. అయితే వివిధ పరిశోధనలలో ఎరుకలు-సవర్ణ హిందువులమధ్య వర్ణాంతర వివాహాలు జరుగుతున్నట్లు ఋజువయ్యాయి. ఒక ఎరుకల గ్రామం (స్టూవర్టుపురం) మీద జరిగిన పరిశోధనలో ఈ క్రింది తొమ్మిది వివాహాలు జరిగినట్లు రుజువయ్యింది.

## ఎరుకలలో వర్ణాంతర వివాహాలు

| స్త్రీ | వృత్తి | పురుషుడు | వృత్తి |
|---|---|---|---|
| 1. ఎరుకల | — | కమ్మ | క్లర్కు |
| 2. ఎరుకల | నర్సు | కాపు | వ్యవసాయం |
| 3. ఎరుకల | టెలిఫోన్ ఆపరేటర్ | మాల | కండక్టర్ |
| 4. సాలి | — | ఎరుకల | కంపెనీ సూపర్‌వైజర్ |
| 5. ఎరుకల | ఎస్.ఎస్. యల్. సి, | మాదిగ | ఎస్,ఎస్. యల్.సి జాబ్ |
| 6. ఎరుకల | ,, | ,, | హైదాాబాద్‌లో ఉద్యోగం |
| 7. ఎరుకల | — | కమ్మ | నేరస్తుడు |
| 8. ఎరుకల | నర్సు | సాలి | వ్యవసాయం |
| 9. యాదవ | — | ఎరుకల | టీచర్ |

(Ex-Criminal tribes of India -- by Y. L. Simhadri
Published in....1979)

దీన్ని బట్టి చదువుకున్న ఎరుకల స్త్రీలలో కొంత చొరవ, చైతన్యం కనిపిస్తుంది. ఎరుకల జాతిలో ఉన్న నేరప్రవృత్తిని పోగొట్టడానికి ఆంధ్రప్రదేశ్ లోని సీతానగరం, స్టూవార్టుపురం, బిట్రగుంట, కావలి గ్రామాల్లో "క్రిమినల్ సెటిల్ మెంట్స్" పెట్టి వారికి కొన్ని వృత్తులు కల్పించడం జరిగింది. ఈ ప్రదేశాలలో ఉన్న ఎరుకలలో విద్యాభివృద్ధి చెందింది. ఈ అభివృద్ధిలో స్త్రీల పాత్ర గణనీయంగావుంది. నేరస్తు

లైన భర్తలు జైల్లో వున్నప్పుడు—స్త్రీలు పోలీసులచే బాధింపబడటం, కోర్టులచుట్టూ తిరగడం వలన అనేక ఇబ్బందులకు గురౌతున్నారు.

## చెంచు స్త్రీలు

ఆంధ్ర దేశంలో ప్రసిద్ధిచెందిన జాతుల్లో చెంచులు కూడావున్నారు. దక్షిణ భూభాగంలో కీకారణ్యాల్లో సంచరించి, జీవన వనరులను సమీకరించే ప్రయాణంలో అడవుల్లో, కొండల్లో, లోయల్లో అపార సంస్కృతిని సంతరించుకున్న వారిలో చెంచులు ఒకరు. 1971వ జనాభా లెక్కల్లో వీరు 18,000 మంది మాత్రమే నమోదయ్యారు ఇప్పటికి వారు లక్షల్లోనే వుండవచ్చు. చెంచులు కృష్ణా నదికి అవల ఈవల వున్న కొండల, అడవుల ప్రాంతాల్లో నివశించుచున్నారు. వీరి ఆకారాన్నిగూర్చి వీరిపై పరిశోధన గావించిన Christoph vone fiirer - Haimendorf ఈవిధంగా అన్నారు

The Chenchus are of short and slender stature with very dark skin, wavy or curly hair, broad faces, flat noses; and a trace of Prognathism.

వీరు, శ్రీలంకలోని - వెడ్డాలు (Veddas) దక్షిణ ఆసియా గిరిజన జాతుల్లో ప్రాచీనులు. వేటలో విల్లంబును అతిప్రాచీన కాలంలో వాడిన వీరిమీద పాశ్చాత్యులు పరిశోధనలుగావించారు.

చెంచులు స్వేచ్ఛాప్రియులు. పురుషులతోపాటు స్త్రీలు కూడా అన్ని విషయాల్లో సమాన ప్రతిపత్తితో వ్యవహరిస్తారు. వారి వివాహ పద్దతుల్లో ఒక గుంపువారు- మరో గుంపువారిని స్వేచ్ఛగా వివాహమడే పద్ధతి వీరిలో వుంది.

" The Chenchus are characterized by a strong sense of independence and personal freedom. None of them feels bound to any Particular locality, and the ability to move from one group to the other allows men and women to choose the companions with whom they wish to share their daily lives. Marriage rules are based on the exogamy of patrilineal clans. As long as they observe the rules of clan exogamy young People are free to marry whomsoever they wish. Spouses can separate without any formality, but the abduction of a woman still living with her husband is disapproved of as immoral" 1

---

1. Tribes of India
   Christoph von fiirer — Haimendorf Page No. 3

చెంచు స్త్రీలు భర్తలతోబాటు అన్నిరంగాల్లో సమాన ప్రతిపత్తిగల్గి వున్నారు. వారి కుటుంబ విధానాన్ని కుటుంబంలో స్త్రీకివున్న స్వేచ్ఛను వివరిస్తూ Christoph von fiirer Haimendorf ఇలా అన్నారు.

"The basic unit of chenchu society is the nuclear family, Consisting of a man, his wife, and their children. For all practical purposes husband and wife are partners with egual rights, and this equality of status means that the family may live with either the husband's or the wife's tribal group, Each such group holds hereditary rights to a tract of land, and within its boundaries its members are free to hunt and collect edible roots and tubers. we shall see that in recent years there has been a change in their diet and ways of subsistence"

ప్రాధమికంగా చెంచు సమాజంలో పరిశీగణం భార్య భర్త పిల్లలతో కలిగిన సమిష్టి కుటుంబం ప్రతి పనిలో భార్య భర్త సమాన ప్రతిపత్తి కలిగి వుంటారు.

సమాన ప్రతిపత్తి అంటే తెగలో భర్తకు సంబంధించిన గుంపులో గాని భార్యకు సంబంధించిన గుంపులోగాని వీరి కుటుంబాలు జీవించ వచ్చు. ప్రతి గుంపుకి వంశపారంపర్య హక్కులు వుంటాయి. భూములు వేటప్రాంతములు, దుంపలు, మూలికలు సమకూర్చే ప్రాంతాలకు సంబంధించిన యీ హక్కులు ఒక తరం నుండి మరొక తరానికి సంక్రమిస్తాయి.

చెంచుల భాషలో తమిళ మాండలిక భాషాపదాలు, కన్నడపదాలు తెలుగు పదాలు కనిపిస్తున్నాయి. దీని వలన చెంచులు ద్రావిడ ఆదిమ జాతులకు సంబంధించినవారు అని తెలుస్తుంది.

19(4 లో ఔరంగజేబు కుమారుడు మహమ్మద్ మౌజుమ్ కర్నూలు మీదగా పోతూ చెంచువారిని చూసినప్పుడు వారు కారు నలుపుగాను, పొడుగాటి జుట్టుతోను, చెట్టు ఆకులతో కూడిన టోపీలతోను ఉన్నారు. వారి చేతుల్లో వేటకోసం విల్లులు, బాణాలు వున్నాయి. వారు చెట్టునీడ

1 Tribes of India
Written by Christoph von Fiirer -- Haimendorf Page No 3

ల్లోను పొరంగాల్లోను నివశించేవారు. యువరాజు వారికి బంగారము వెండిని బహూకరించినపుడు అప్పటికి వాటి విలువను వారుగుర్తించ లేదని పేర్కొన్నారు.[1]

చెంచులు తేనె తీయడంలో కూడా సమర్థులు. చెంచుస్త్రీలు కూడా విల్లంబు పట్టడంలోను తేనెతీయడంలోను మగవాళ్ళకు తీసిపోరు. చెంచు స్త్రీలు గుంపు నాట్యాలు చేస్తారు. వారి పాటల్లో ఎంతో మాధుర్యం వుంటుంది. ప్రకృతి సిద్ధమైన తేనె సేవించడం వలన కూడా వారికి ఈ మాధుర్యం వచ్చివుంటుంది.

వారి పాటల్లో ఒకటి ఎడ్‌గార్ థర్స్టన్ తన పరిశోధనాత్మక గ్రంధంలో ఫోనోగ్రాఫ్ ద్వారా రికార్డు చేసిన పాటను ఉల్లేఖించారు. దానిని ఈ క్రింద ఇస్తున్నాను.

| | |
|---|---|
| ఆవరం చెట్టు ఆకులతో తాళి చేశారు | చెంచుదేవా ! |
| చెట్టు ఆకులతో బాసికం కట్టారు | ,, |
| చింతకాయతో కంకణం చేశారు | ,, |
| పారు చెట్టు ఆకులతో కట్టుగుడ్డ కట్టారు | ,, |
| పన్ను చెట్టు ఆకులతో గుడ్డ చేశారు | ,, |
| కొండపై తిరుగుతూ | ,, |
| దట్టమైన అడవుల్లో సంచరిస్తూ | ,, |
| చేయరాని పనులు చేస్తూ | ,, |
| ఓబలేశు పెళ్ళి జరిగింది | ,, |
| నాలుగు మూలల్ల వేదిక కటారు | ,, |
| బాణాలు గుచ్చారు | ,, |
| వెదురు బియ్యం అక్షింతలు వేశారు | ,, |
| కొబ్బరి చిప్పలు బాణాలపై పెట్టారు | ,, |

పెళ్లి ఈ విధంగా జరిగింది.[2]

---

1. Castes and tribes of Southern India Volume II
Edgar Thurston Page No. 28

2. Castes and tribes in India ... Vol 2
Edgar Thurston Page No. .... 40 41

తప్పెట మోగిస్తూ బృందగానంగా నాట్యంతో పాడిన ఈ పాటలో ఎంతో ప్రాకృతిక జ్ఞానం ఇమిడి ఉంది. పాటల్లో సంస్కృతి, సంఘం ప్రకృతికి సంఘానికి ఉండే అంతస్సంబంధాన్ని వారు ఆలపించేవారు.

ఈ పాటల్లో ప్రాకృతిక సౌందర్యం, లయ, శృతి అన్నీ మేళవించబడి రమణీయకంగా వున్నాయి.

చెంచులు చెంచు దేవతను ప్రధానంగా ఆరాధిస్తారు. అంకాళమ్మ, పోతురాజు, సుంకాలమ్మ, మల్లమ్మ, గురువ్వలను కూడా పూజిస్తారు. వీరి వ్యవస్థ ప్రధానంగా మాతృస్వామ్య బద్ధమైంది. వీరి శక్తిని తెలిసి కొన్ని ఆర్య తెగలు, దశావతారాల్లో ఒకడైన నరసిహుడు చెంచు కన్యను పెండ్లి యాడెనని కథవల్ల వీరితో సంబంధానికి ప్రయత్నించారు.

ఏమైన చెంచులు ఆదిభారతీయ సంస్కృతి ప్రతీకలు. చెంచుస్త్రీ భారత భూమినుండి సంస్కృతి నుండి ఉద్భవించిన అడవి తేనెవంటిది

## లంబాడీ స్త్రీలు

దక్షిణ భారతంలో ప్రసిద్ధి చెందిన గిరిజన జాతుల్లో లంబాడీలు ఒకరు. వీరిని బ్రింజారి, జనజారి, సుగాలి అని కూడా పిలుస్తారు.

స్త్రీలు తలనుండి పాదాలవరకు కొమ్ములతో చేసిన మురుగులను, కడియములను, పూసల దండలను ధరిస్తారు. చెవులకు ముక్కులకు వేళ్ళకు ఇతర నగలను విస్తారంగా ధరిస్తారు. రంగు రంగుల లంగాలను ధరిస్తారు. రవికెలకు అద్దాలు పూసలు కడతారు. జుట్టుకు ఇరువైపులా గవ్వలను అమరుస్తారు. గంటలు కూడా కడతారు.

లంబాడీస్త్రీలు బలిష్ఠులుగావుండి ప్రకృతి సిద్ధమైన సౌందర్యమును కలిగి వుంటారు. పురుషుల కంటే సాహసులుగావుండి నృత్యంలో అద్వితీయ ప్రతిభను అభివ్యక్తం చేస్తారు. వారి పాటల్లో మంచి ఊపు, తూగు వుంటుంది. వారు పాడే పాటలో మాధుర్యం వుంది.

ఓ పిల్లా కలసి నడూ,
పెళ్లి చేసుకోనని మంకుపట్టు పట్టావు
ఇప్పుడు నీకు పెళ్లయ్యింది

నడూ, పిల్లా, నడూ
నీ మంకు పట్టులో మంచేంలేదు
నువ్వు పెళ్లి బువ్వ తిన్నావు
నడూ, పిల్లా నడూ
మంకు పట్టు వదిలెయ్
పెళ్లికొడుకు తొడపైనేసుకొని బల్ల మీద కూర్చున్నావు
నడూ, పిల్లా నడు ! [1]

థర్స్టన్ సేకరించిన ఈ పాట మూలభాషలో ఇంకా లయ బద్ధంగా ఉండి ఉంటుంది. లంబాడీ స్త్రీలలో ఎంతో కళ ఉంది. కాంతి ఉంది. సంస్కృతి ఉంది. లంబాడీల పెళ్లిళ్లలో స్త్రీలదే ప్రధాన పాత్ర అని ఈ పాట తెలుపుతూ వుంది. మాతృస్వామ్య సంస్కృతికి ప్రతీకలైన లంబాడీ స్త్రీలు శ్రమలోను శక్తిలోను నృత్యంలోను నాట్యంలోను కళలోను వారికి వారేసాటి.

బంజారీ మాతను ఆరాధించే లంబాడీలు పోలేరమ్మ, అంకాళమ్మ, పెద్దమ్మ, మారెమ్మలను కూడా పూజిస్తారు. వారు దయనీయమైన పద్ధతిలో అతీత శక్తిని ఆరాధిస్తారు. ఒక కత్తిని కాని కర్రను కాని భూమిలో నాటి స్త్రీలు పురుషులు దాని చుట్టూ గుండ్రంగా ఏర్పడి ఆటవికంగా పాటలు పాడుతూ వంగి తిరుగుతూ వుంటారు. వాళ్ళు చేతులు వూపుకుంటు చప్పట్లు కొడుతూ చివరగా గాలిలో చేతులు పైకెత్తి ప్రార్థిస్తూ అరుస్తారు. ఈ అరుపులు మొత్తం ఒక చిన్న పిల్లవాడు రాత్రిలు వెలుగు కోసం ఏడ్చిన విధంగా వుంటాయి.

ఒక స్థలం నుండి మరొక స్థలానికి వెళ్ళేటపుడు మేకను గాని కోడిని గాని బలిస్తారు. ఆర్యుల యజ్ఞకాండలో స్త్రీకి ప్రవేశం లేదు. భారతీయ జాతులన్నింటిలో గుంపు ఆరాధనలు ప్రధానంగా వుంటాయి.అందులోనూ స్త్రీకి ప్రధాన పాత్ర వుంది.

లంబాడీ స్త్రీలు పచ్చబొట్లు చిత్రించడంలో నిపుణులు చేతులకి, వీపుకి, ముక్కుకి ఎడమ వైపు వేసుకొంటారు. లంబాడీ స్త్రీలకు విచిత్రమైన ఆచారం వుంది. పారే సెలయేటిలో గాని పెద్ద చెరువులో గాని నీళ్ళు తాగరు.

---

1. ibid Vol ... 4 Page ... 223

లంబాడీలలో అన్నింటిలో స్త్రీలకె ప్రత్యేకత వుంది. మగవాడి మెడలో స్త్రీ ముందుగా ఒక కంఠికనువేసి దానికి ఏడుముడులు వేస్తుంది. ఆతరువాత ఆడమనిషికి మగవాడు కడతాడు. ఈవిధముగా లంబాడీ స్త్రీ అన్ని రంగాల్లో అద్వితీయ పాత్రను నిర్వహించింది. ఈనాటికి నిర్వహిస్తూ వుంది.

గిరిజనులుగా పిలువ బడుతున్న ఈ ప్రజలు భాషలో, సంస్కృతిలో జీవన వ్యవస్థలో అక్షరాల భారతీయులు. అనేక పాలక వర్గాలచేత వారు అణచివేయబడ్డారు, ఓడించబడ్డారు. అయినా వారి వ్యక్తిత్వం పోకుండా కాపాడుకో గలిగారు. స్వాతంత్ర్యం వచ్చిందని అనుకున్న తరువాత నల్లదొరల క్రౌర్యమైన అణచివేతలో వారి భూములు వారు పోగొట్టుకున్నారు. దళారీల వడ్డీలకు వారి సంపదను కోల్పోయారు.

మానవతా రహితంగా వారు అనేక సందర్భాల్లో హింసించబడ్డారు. ఈహింసకు వ్యతిరేకంగా అనేక పోరాటాలు వారు నిర్వహించారు. ఆపోరాటాల్లోకూడా స్త్రీలే ప్రధానపాత్ర వహించారు. భారతదేశంలో ప్రసిద్ధి చెందిన జాతి పోరాటాలన్ని గిరిజనులు నడిపినవే, నడిపిస్తున్నవే. తాత్కాలికంగా ప్రభుత్వాలు, వారి పోలీసు బలగాలు అణచినా అంతిమ విజయం ఆదిమజాతులది కాక మానదు.

—O—

# దళితస్త్రీ*

దళితస్త్రీ ఒక సాంఘిక శక్తి. ఒక సంస్కృతీ ప్రతీక. ఒక చారిత్రిక నేపధ్యం. అటువంటి దళితస్త్రీ భారతదేశంలో ఈనాడు ఒక అస్పృశ్యురాలిగా సంక్షుభితమైన జీవన యాత్రలో ప్రయాణం సాగిస్తోంది.

ఏ దళితులు చెట్లను నరికి, అడవులస్థానంలో నివాస యోగ్యమైన భూములను ఏర్పరచారో, ఏ దళితులు ఆనకట్టలు కట్టి బంజరు భూములను పంట భూములుగా సాగుచేశారో ఆ దళితులే "వ్యవసాయ సంస్కృతి" నిర్మాతలు. శ్రామిక సంస్కృతికి నిజమైన సృష్టికర్తలు, వారసులు దళితులే. ఈ దళితులు మాతృస్వామిక వ్యవస్థకు,భౌతికవాదానికి ఆద్యులు. భారతీయ వ్యవసాయక నిర్మాతలైన ఈ దళితులను భారతదేశంపైన దండెత్తిన ఆర్యులు ఓడించి "అంటరానివారిగా" ముద్రవేసి ఆర్య సంస్కృతీ ఆధిపత్యాన్ని నెలకొల్పారు. దళితస్త్రీలు ఈనాడు మొత్తం "సామాజిక శ్రమలో ఎనభై శాతం భారాన్ని మోస్తూ జాతీయ ఆర్థిక రంగాన్ని పరిపుష్టంచేస్తున్నారు. వ్యవసాయిక రంగంలో ప్రముఖపాత్ర వహిస్తున్న దళితస్త్రీలు ఆనకట్టలు. భవనాలు, రోడ్ల నిర్మాణాల్లోకూడా తమ శ్రమను ధారపోస్తున్నారు. బట్టల మిల్లులు, బీడీ పరిశ్రమ, సిమెంటు ఫ్యాక్టరీలు, ఆసుపత్రులు, క్వారీ పనులు.... ఇలా ఎన్నో రంగాల్లో దళిత స్త్రీలు పనిచేస్తున్నారు. ఒక వైపు ఇలా శ్రమిస్తూ కూడా మరోవైపు గృహ జీవనానికి సంబంధించిన పిల్లల పోషణ, సుదూర ప్రాంతాలనుండి కట్టెలు కొట్టి మోసుకురావడం, నీళ్ళు తేవడం వంటిపనులన్ని దళిత స్త్రీలు చేస్తున్నారు. అందువల్లే మొత్తం భారతీయ "శ్రామిక శక్తి" లో దళితస్త్రీలు ప్రధానపాత్ర పోషిస్తున్నారనేది చారిత్రిక సత్యం.

దళితస్త్రీల సాంఘిక శ్రమ ఏ విధంగా భారతదేశ నిర్మాణానికి తోడ్పడుతుందో గమనిస్తే, భారతీయ సమాజం దళిత స్త్రీలకు ఎంతగా ఋణపడి వుంటుందో మనం అర్థం చేసుకోగలం. అప్పుడే దోపిడీ వర్గం ఈ స్త్రీలకు ఎంతగా కృతజ్ఞత చూపాలో కూడా మనకు అవగతమౌతుంది.

---

*దళితులంటే యస్. టి, యస్. సి, బి. సి, మైనారిటీలని అర్థం. అయితే ఇందులో యస్. సి స్త్రీలగురించి మాత్రమే వ్రాశాను. బి. సిస్త్రీల గురించి ప్రత్యేక పరిశోధన చేస్తున్నాను. ఈ భాగం 1990లో ఆంగ్లంలో ప్రచురించాను.

ప్రధానంగా వ్యవసాయకార్మికులైన దళితస్త్రీలు ఊరిబయట పూరి గిడిసెల్లో తమ జీవనాన్ని కొనసాగిస్తున్నారు. పోషకాహార లోపం వల్ల బలహీనులై కనీసం వృద్ధాప్యంలో తమను పోషించటానికి ఒక్కరిడ్డైనా మిగలాలనే ఆశతో అనేక మంది బిడ్డలకు జన్మనిచ్చి రక్తహీనతతో దళిత స్త్రీలు మరింత బలహీనులౌతున్నారు.

పగలంతా చెమటోడ్చి పొలాల్లో పని చేస్తే దళిత స్త్రీలకు కేవలం 5 రూపాయలు కూలి మాత్రమే లభిస్తుంది. నూకలు కొనడానికి కూడా ఆ డబ్బుచాలదు. గంజి బువ్వలో మిరపకాయలు నంచుకొని తినడం వల్లే దళిత స్త్రీలు పోషకాహార లోపానికి గురౌతున్నారు. మాతృహృదయంగల దళిత స్త్రీ భర్తకు పిల్లలకు వడ్డించిన తరువాతే కుండ అడుగునున్న మెతుకులు తింటుంది. కుండలో అన్నంలేక అడుగున అంటుకొని యున్న మాడుచెక్కలను గీకి తినవలసిన పరిస్థితి దళిత స్త్రీకి తరచూ ఎదురౌతూ వుంటుంది. ముతక బట్టలతో అదీ అనేకసార్లు అతుకులు వేసిన చిరిగిపోయిన బట్టలతో ఆమెబతుకీడిస్తూ వుంటుంది.

మండుటెండకు నెర్రెలు విచ్చిన భూమి పగుళ్ళలా ఆమె కాళ్ళు పగిలి వుంటాయి, అన్నంచాలక కరుణార్ద్రితతో ఆమె కళ్ళు గుంటలు పడివుంటాయి. నూనె లేక అట్టలు కట్టిన ఆమె జుట్టు, శ్రమించి కాయలు కాసిన ఆమె చేతులు మానవతా రహితమైన ఈ దేశ అగ్రకులాల కర్కశత్వాన్ని గుర్తు చేస్తాయి.

దళిత స్త్రీ ఒక సృజనాత్మక శక్తి. శారీరక శ్రమచేస్తూ, బాధలు పడుతూ కూడ ఆమె పాటలల్లి పాడుతుంది. తనపూరి గుడిసెను ఎర్రిమట్టితో అలికి సున్నంవేసి దళిత స్త్రీ తీర్చి దిద్దుతుంది. ఇంటి ముందు పేడనీళ్ళ కళ్ళాపిచల్లి కేవలం తన కళాత్మకమైన చేతి కదలికలద్వారా ముగ్గులతో ఇంటిని ఆమె అలంకరిస్తుంది. నులకను మంచానికి అల్లుటలోను, బట్టలు నేయడంలోను, అతుకులు కుట్టడంలోను, తాటాకులతోను, ఈతాకులతోను చాపలు అల్లడంలోను, కళాస్రవంతిగా, సంస్కృతీ భండాగారంగా ఆమె నిరూపించు కొంటుంది. భారతీయ పరిణామ క్రమానికి సంబంధించిన అన్ని క్రమాలను ఆమె తనలో ఇముడ్చుకొంది. వేటకత్తెగా, జాలరిగా, యుద్ధసైనికురాలిగా దళిత స్త్రీ మానవజీవన చరిత్రలో అనేక పాత్రలు పోషించింది. ప్రాచీన భారతీయ పారిశ్రామిక వేత్తఆమె.

తోళ్ళపని, కుట్టు, నేత, కుండల తయారీల వంటి ముఖ్యమైన పను లను ఆమె చేపట్టింది. మొదట గృహాలను నిర్మించింది కూడా స్త్రీలే. ప్రసవంలోను, మాతా శిశు సంరక్షణలోను ఆమె చారిత్రక పూర్వదశల్లో వైద్యుని పాత్ర నిర్వహించింది. గృహ, సమాజ నిర్వహణ కర్తగా దళిత స్త్రీ ఒక ముఖ్య పాత్ర వహించింది. తరతరాలుగా వస్తున్న కళ, సంస్కృతి, పరిశ్రమలను ఆమె సంరక్షించి, పోషించింది.

ఆమె రోజువారీ శ్రమను పరిశీలిస్తే శ్రామిక సంస్కృతిపై ఒక పెద్ద విజ్ఞాన గ్రంథాన్ని తయారు చేయవచ్చు. కోడి కూయకముందేలేచి కసువూడ్చి, కళ్ళాపి చల్లి, బట్టలుతికి, కుండలుతోమి, అన్నంవండి, పిల్ల లకు స్నానం చేయించి అన్నంపెట్టి ఆమె పనిలోకి వెళ్తుంది. ఎర్రటి ఎండలో, భూస్వామి హుంకరింపులతో, రెక్కలు ముక్కలు చేసుకొని పగ లంతా ఆమె పొలాల్లో కష్టపడుతుంది. ప్రక్కనేవున్న చెట్టుకు వ్రేలాడ దీసిన ఉయ్యాలలోని బిడ్డ పాలకై గుక్కపెట్టి ఏడ్చినా రాతిగుండె భూస్వామి ఆమెను ఒక్కక్షణం కూడా పనిలోంచి వెళ్ళనివ్వని దుర్భరమైన పరిస్థితుల్లో ఆమె జీవిస్తోంది. పొలంనుంచి ఆదరా బాదరా తిరిగిరాగానే నీళ్ళు తెచ్చుకొని, కట్టెపుల్లలేరుకొని, కూలిడబ్బుతో నూకలు కొంటుంది. డబ్బులేమైన మిగిలితే మిరపకాయలు కొనగలుగుతుంది. అప్పుడిక వంట ప్రారంభించి పిల్లలకు పెట్టి, బట్టలుతుకుతుంది. తనగుడిసెకు, ప్రక్క నున్న గుడిసెకు మధ్య సందులో చీర అడ్డంకట్టుకొని స్నానంచేస్తుంది.

ఈ పనులన్ని చేస్తూనే మరోవైపు రొమ్ములతో పిల్లవాడికి పాలు కుడుపుతుంది. లేదా, మనసులోమండే మంటలను అణచుకుంటు ఏడ్చే బిడ్డను జోకొడుతుంది. ఆ అమ్మకు ఒకే సమయంలో రెండు పనులు చేయవలసిన పరిస్థితి. పనులన్ని అయిపోయాక కొద్దిగంటలు నిద్రించి మరల తెల్లవారుజామునే రోజువారీ కార్యక్రమాలను ప్రారంభిస్తుంది. రోజుకు 18గంటలు రక్తాన్ని, చెమటను ధారపోసి పనిచేసే దళితస్త్రీ శ్రమ సోమరిభారతీయుల నిర్దయపూరిత శరీరాలను పెంచి పోషిస్తున్నది.

ఈ పనులన్నింటితోపాటు పండుగలకు పెళ్ళిళ్ళకు భూస్వామి ఇంట్లో బియ్యం విసిరి, పిండిచేసి, పిండివంటలు చేస్తుంది. అందరూ తినగా మిగి లిపోయిన ఒకటి, రెండు ముక్కలను అర్ధరాత్రివేళ ఇంటికి తీసుకుపోయి పిల్లలను లేపి, వారికిపెట్టి, వారుతింటుంటే ఆనందిస్తుంది.

బొగ్గుగనుల్లో పనిచేసి నలుపెక్కి, భవనాలకు ఎఱ్ఱమట్టి మోసి ఎరుపెక్కి, పగలంతా రైల్వే లైనుకు కంకరరాళ్ళుసర్ది బూడిదవర్ణపు తెరగమ్మి ఆతల్లి ఇంటికి చేరుతుంది. ఎంతదూరం పనికెళ్ళినా ఇంటికి పరుగెత్తుకు వచ్చి అయమ్మ తనబిడ్డకు పాలుకుడుపుతుంది. ఐదు రూపాయల కూలీకి పగలంతా తనకాళ్ళతో మట్టిని తొక్కి రాత్రికి ఇంటికివచ్చి పడుకుంటే, పోట్లెక్కినా కాలికిరాసుకోవడానికి ఆమెకు చుక్కనూనెకూడ వుండదు.

మూడునెలల పొగాకు సీజన్లో, పొగాకు బేరన్లకు పనికివెళ్ళి, తెల్లవారుజాము రెండుగంటలనుండి అర్ధరాత్రివరకు పనిచేసి తినీ తినక కడుపు మాడ్చుకొని ఆమె మూడువందల రూపాయలు కూడబెడుతుంది. ఇంటికి తిరిగివచ్చే సమయం లో ఆమె భర్త డబ్బులాక్కొని ఒక్కరోజు తాగుడుకు ఖర్చు పెడుతున్నాడు. ఆపరిస్థితుల్లో ఆమె హృదయావేదనను ఎలావర్ణించ గలం.

నాట్ల సమయంలో నెలలు నిండిన గర్భిణీ అయివుండి కూడా వంగి వంగి ఆమెపొలంలో నాట్లేస్తుంది. ఒక్కక్షణం నడుమెత్తి సేదతీర్చుకుందామంటే అజమాయిషీచేసే భూస్వామి బూతులతో ఆమెను తూట్లు పొడుస్తాడు. ఆవేదనతో ఆమె నిశ్శబ్దంగా కన్నీరును కార్చే దృశ్యాన్ని మాటల్లో వర్ణించలేం.

తానుండే గ్రామంలో పనిదొరకనప్పుడు తట్టా బుట్టా నెత్తినపెట్టి రద్దీగా వుండే రైళ్ళల్లో దూరప్రాంతాలకు ప్రయాణించి, రైల్వేప్లాట్ ఫారం మీదే సామానుదింపి, బిడ్డలను కాపలాపెట్టి ప్రక్కనున్న పొలాల్లో పనిచేసి వచ్చేసరికి రైలుక్రిందపడి చచ్చిపోయిన పిల్లలనుచూసిన ఆమె హృదయం ఎంతగా క్షోభిల్లుతుందో మాటలతో చెప్పగలమా !

దళిత స్త్రీల జీవితం, శ్రమ భారతీయ ఆర్థిక సాంఘిక రంగాలకు పునాది. కానీ మన మేధావులు ఈస్త్రీల జీవితాన్ని పరిశీలించడంలేదు. ఈ దళిత స్త్రీల జీవనవిధానాన్ని పరిశోధించనంతకాలం వీరికి భారతదేశ వాస్తవికత అర్థంకాదు. తమ మానవీయ ఔన్నత్యాన్ని కించపరచే సాంఘిక అణచివేతలోను, ఆర్థిక సంక్షోభంలోను ఈనాటి దళితస్త్రీలు ఎంతో సంఘర్షణతో జీవిస్తున్నారు.

ఎంతో మంది గొప్పనాయకులు, మేధావులు వ్యవసాయక విప్లవం గూర్చి ప్రసంగించారు. అయితే దళితస్త్రీలు తీసుకొచ్చిన విప్లవమే వ్యవసాయక విప్లవమని వారు అర్థం చేసుకోలేకపోయారు.

ప్రాచీన కాలంనుండి భారతదేశంలో వ్యవసాయ సంస్కృతికి సంబంధించిన మూలమైన అంశాలన్ని ఈస్త్రీల జీవన విధానంలోనే మనకు ద్యోతకమవుతున్నాయి. విత్తులు నాటేటపుడు, మొక్కలు నాటేటపుడు, కోతలు కోసేటప్పుడు వీరుపాడే పాటల్లో, మాట్లాడే భాషల్లో ఎంతో సంస్కృతి దాగివుంది. భారత దేశానికి మూలభూతమైన భౌతికతత్వ శాస్త్రానికి మూలంవాళ్ళే. సాంఖ్యతత్వ శాస్త్రాన్ని, తాంత్రిక వాదాన్ని ఆచరణలో పెట్టింది దళితస్త్రీలే. కులం పునాదుల్ని పెకలించి కులాతీతంగా మాతృత్వాన్ని అందించిన దళిత స్త్రీలగాధలు పురాణాలనిండా యెన్నో వున్నాయి. వాటిని వక్రీకరించి ప్రచారం చేశారు. దళిత స్త్రీని అణచి వేసిన తర్వాతే భారత దేశంలో తత్వశాస్త్రానికి దారిద్ర్యం వచ్చింది. భారత దేశంలో తరతరాలుగా వచ్చిన తాత్విక శాఖలన్ని హిందూ పితృ స్వామ్య ఆధిపత్యంలో కకావికలైనాయి. ఆది భారతీయులకు మూలమైనభాష, సంస్కృతి, కళలు అన్ని దళిత స్త్రీలోనే నిక్షిప్తమై వున్నాయి. ఆకళలన్ని హిందూ రాజ్యాలు ఆవిర్భవించాక గూడాల్లో, గుడిశల్లో, గుండెల్లో తలదాచుకున్నాయి. మానవత్వం, ధాతృత్వం, సౌజన్యం, సౌహార్ధం దళితస్త్రీకి సహజలక్షణాలు. అందుకే ఆమె ఈదేశంలోని పునాది సంస్కృతిని తన ఔదార్యంతో రక్షిస్తూ వచ్చింది. గుంపు జీవనంలో దాగున్న ఉమ్మడి తత్వాన్ని శిధిలం కాకుండా చూసింది. మాతృత్వంలో దాగున్న అన్ని దశలను యుద్ధంచేసి రక్షించింది. పురిటి నొప్పుల్లోకూడా భూమికి తన చెమటను ధారపోసి తన ఔన్నత్యాన్ని చాటుకొంది. తన భర్త సముద్ర గర్భంలోకి పడవలోవెళ్ళి నాలుగు రోజులైనా తిరిగి రాకపోతే ఆకాశంవంకచూసి బిడ్డను గుండెల్లో పెట్టుకొని తన కన్నిటితో మేఘ సందేశం అంపింది. నదీ నాగరికతను నిర్మించిన దళితస్త్రీ భారత భౌగోళిక వాస్తవికతనుంచి సంస్కృతిని రూపొందించింది. వలలల్లింది, నేత నేసింది, ఊతం వేశింది, యాతం వేసింది, ఉత్పత్తి పరికరాలన్నింట ఆమె చేతిమీదగానే సమాజానికి అందించింది. ప్రకృతిని అనునిత్యం జీవితానికి అన్వయించిన కళాతపస్వి దళితస్త్రీ. ఈదళితస్త్రీని అణగద్రొక్కటమంటే నిజమైన భారతీయ సంస్కృతిని అణగద్రొక్కటమే. అందుకే

హిందూ సాంస్కృతిక వ్యవస్థ దళితస్త్రీని అణగ ద్రొక్కడంమీద ఎక్కువ దృష్టిని కేంద్రీకృతం చేసింది. ఆమె ప్రతిభా వ్యుత్పత్తులకు, కళలకు సామాజిక గౌరవం లేకుండా చేయాలని పెద్దకుట్రచేశారు. అలాగే ఆమె శ్రమకు తక్కువ విలువను చెల్లించి ఆమె జీవన వ్యవస్థమీద గొడ్డలి వేటు వేశారు.

హృదయ సంబంధమైన కళా ప్రపంచానికికూడా స్త్రీదే అధినాయకత్వం. అందునా దళితస్త్రీ అనేక కళలను రూపొందించింది. ప్రాకృతిక సౌందర్యంతోపాటు భావప్రకటనలోకూడ ఆమెదే అద్వితీయ పాత్ర. దళితస్త్రీ తాను అభివ్యక్తం చేయదలచుకొన్న విషయాన్ని వాచక సాత్త్వికాభినయంతోసహా వ్యక్తీకరిస్తుంది. తనకళ్ళు కరుణ రసాన్ని ఎంత ఆర్ద్రంగా కురిపిస్తాయో తనబిడ్డలకు పాలిచ్చి ముద్దాడేటప్పుడు ప్రేమ తత్వాన్ని కూడా అంతలోతుగా అభివ్యక్తం చేయగలుగుతాయి.

పిల్లాడ్ని ముద్దాడేటప్పుడు, ఉగ్గు పోసేటప్పుడు, బుగ్గలువత్తేటప్పుడు, కడుపు సర్దేటప్పుడు, కాళ్ళు లాగేటప్పుడు ఆమె అనుభవించే అనుభూతికి ఏమనోవిజ్ఞానశాస్త్రాలు భాష్యం చెప్పగలవు. అదేసందర్భంలో చంటిబిడ్డకు యేదైన జబ్బుపచ్చి పిల్లాడు వేలాడబడిపోతే ఆమె పడే తపన ఆర్తి ఆమె ఆక్రందన ఇంటిమొత్తాన్ని కదిపి పిల్లాణ్ణి బుజాన వేసుకొని ఆమె పరుగుతీసి డాక్టరుముందు విలపించే సమయంలో ఆమె కళ్ళలోకదిలే కన్నీటికడలి గుండెల్ని కదిలించేస్తుంది.

మానవ సంబంధాలలో ప్రతిసంబంధం దళితస్త్రీలో స్పష్టంగా. చూస్తాం. తేటనీటిలో అద్దం కనబడినట్లు ఆమెలోని ప్రతిస్పందనఅద్భుతమైన రూపాన్ని సంతరిస్తుంది. కళకు ఆమె పుట్టినిల్లు. భారతీయ శిల్పుల చిత్రకారుల చేతుల్లో అభివృద్ధి చెందిన కళలన్ని ప్రాథమికంగా దళితస్త్రీ రూపొందించినవే. సముద్రపు వడ్డులో ఇసుక తిన్నెపై చిత్రాలు గీసింది రాతిని తనకనుగుణమైన శిల్పంగా మలచింది. ప్రకృతి రమణీయకత్వానికి అనుగుణంగా శృతిని, గతిని కలిపి పాటపాడింది. ప్రాథమికంగా దళితస్త్రీయే ఈ కళాసృష్టికి సాహితీ సంగీత శిల్ప సృష్టులకు ఆమె మూల కేంద్రం అవ్వడానికి కారణం ప్రకృతిలో ఆమె మమేకమై జీవించటమే.

ఆమె రూపొందించుకున్న సర్వకళా ప్రపంచానికి ప్రచారం లేకుండా చేసినాఆమె తనసంఘ సంస్కృతిలో వాటిని నిక్షిప్తంగా వుంచుకో గలిగింది. సాహిత్యానికి మూలమైన ప్రజాజీవనంనుండి వచ్చిన పాటలు దళితస్త్రీలే ప్రధానంగా అల్లారు. భాష, భావం,సమకాలీనచరిత్ర అపాటల్లో చోటుచేసుకున్నాయి, సాహిత్యానికి మూలమైన లిపినికూడా దళితస్త్రీయె కనుగొన్నది. లిపికి మూలమైన అంశాల్లో ఒకటైన "పచ్చబొట్టు"ని దళిత స్త్రీలే మొదట ప్రారంభించినట్లు చరిత్ర మనకు చెబుతుంది. 1

సంస్కృతికి చారిత్రక మూలమైన ముగ్గులు, లిపులు, బొమ్మలు అన్ని దళితస్త్రీయే మొదట రూపొందించినది. ఆతరువాత ఆచరిత్రలోను సంస్కృతిలోను ఆమెకు స్థానంలేకుడా చేయాలని ప్రయత్నం చేశారు.

ఇంతటి మహోదాత్తమైన ఆ దళితతల్లి ఈనాడు గర్భవతి అయితే ఆమె కడుపులోవున్న బిడ్డకు జీవాన్నిచ్చేఆహారం పెట్టుకోలేక తనబిడ్డ తన కడుపులోనే మరణించే పరిస్థితులకు అనేక సందర్భాల్లో నెట్టబడుతుందంటే తరతరాలుగా హిందూ అగ్రవర్ణ సమాజం ఏపరిస్థితికి మనస్త్రీని నెట్టి వేసిందో తెలుస్తుంది. ఎంతోమంది దళిత తల్లులకు ప్రాథమిక ఆరోగ్య సౌకర్యంలేదు. కాన్పుకు హాస్పటల్‌కు వెళ్ళలేక మంత్రసానుల కర్కశత్వా నికి బలౌతున్నారు. పుట్టిన పిల్లలకు పోషక ఆహారంలేక బొరకడుపులు, దొడ్డికాళ్ళు వచ్చి చిన్నతనంలోనే సరైన ఆహారంలేక కాళ్ళుసన్నబడి, పోలియోతోనో, ఇంకా బాధాకరమైన అంధత్వంతోనో బాధపడుతుంటే తనబిడ్డల దుస్థితిచూచి వ్యధచెందుతుంది. బిడ్డ పుట్టేటప్పుడేకాకుండా రోజు పురిటి నొప్పులు పడుతుంది.

వీరికి ఊరిలోవుండే చెరువుల్లో నీళ్ళుతెచ్చుకోవడంకూడా ఒకపెద్ద సమస్య అవుతుంది. అగ్రకులాల చెరువుల్లోకి దళితులను రానివ్వరు. ఊనీళ్ళు తీసుకువచ్చే బాధ్యతను మోసేదళితస్త్రీ ఎన్నోఇబ్బందులు ఎదు ర్కొవలసి వస్తుంది. ప్రకాశంజిల్లా కారంచేడులో "మాదిగకుంట" అనే పేరుతోఒక చెరువుంది. అక్కడ కమ్మకులస్తులు ఈచెరువుకువచ్చి నీళ్ళు తీసుకుపెళుతూవుంటారు. ఎండాకాలం వాళ్ళచెరువులోనీళ్ళు వుండవుకాబట్టి వీళ్ళ చెరువుకు వస్తారు. వస్తూవస్తూ మాదిగ కుంటేగదాఅని పసువులను కూడావెంటబెట్టుకొని వచ్చారు. పసువులకు కుడితిబెట్టి మాదిగ కుంటేగదా

1. మన లిపి పుట్టు పూర్వోత్తరాలు – పేజి 25

అని ఆ కుడితిని ఆచెరువులోకి విసిరారు. చెరువునీళ్ళు పాడుచేయటాన్ని దళితస్త్రీ మున్నంగి సువార్త ఎదిరించింది. ఆతిరుగుబాటు ఒక పెద్ద మారణహోమానికి, ఒక పోరాటానికి మూలమైంది. అయితే సంఘంలో అడుగు పెట్టులోఉన్న దళితస్త్రీ నీళ్ళకోసం ఇప్పటికి ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొంటుంది.

తెలంగాణాలో కొన్ని ప్రాంతాల్లో వెట్టిచాకిరి ఈనాటికి కొనసాగుతు ఉంది. అక్కడ దళితస్త్రీ రెండు జొన్నరొట్టెలు మిరపగాయ నంజుకొనితిని కాలంవెళ్ళబుచ్చుతోంది. వెట్టిచాకిరిలో వున్న భర్త ఇరవై నాలుగు గంటలు బానిసత్వంలోనే,ఎప్పుడోకొంత సమయం పెళ్ళాన్ని చూద్దామనిపిస్తె దొర పిలుపు వెంటనే వస్తుంది. ఏశుభానికి నోచుకోకుండా అప్పులఊబిలో కూరుకుపోయి ఈతల్లులు ఎంతవ్యధ చెందుతున్నారో వర్ణించలేము.

ఆంధ్రప్రదేశ్‌లోని మరికొన్ని ప్రాంతాల్లో ముఖ్యంగా నిజామాబాద్ ప్రాంతాల్లో జోగిని వ్యవస్థ దళితస్త్రీలను బాధిస్తూవుంది. ఆదిమజాతులైన దళితులను హిందూ సమాజం అస్పృశ్యులుగా నెట్టివేసిన తరువాత వీరిమీద అనేక దురాచారాలను మూఢవిశ్వాసాలను రుద్దింది. అందులో ఈ అమానుషమైన జోగినీ మాతంగి ఆచారం ఒకటి. చిన్నపిల్లలపుడే దేవాలయాలకు అంకితమివ్వడమనే పేరుతో వారిని "ఊరుమ్మడి" బతుకులుగాచేసి వారిని హింసించి అనుభవించే ఈదుర్మార్గ ఆచారం ఇప్పటికీ ఆచరించబడుతూవుంది.

హిందూమత సంస్కృతి నుండి బయట పడితే దళితులు అస్పృశ్యతనుండి విముక్తి చెందుతారనే అవగాహనతోనే డా॥ బి. ఆర్. అంబేడ్కర్ హిందూమతాన్ని వదలమని చెప్పాడు. మహారాష్ట్రలో ఆయన పిలుపు మీద "మహర్"లు పెక్కురు బౌద్ధాన్ని స్వీకరించారు. ఈ హిందూమత ప్రభావం బౌద్ధం పైకూడా కొనసాగడంతో అస్పృశ్యులుగానే మహర్‌లు కొనసాగుతున్నారు.

మహారాష్ట్రలోని నాగపూర్‌కు బౌద్ధదర్మదీక్ష దినానికి నేను హాజరయినప్పుడు కళ్ళల్లో కాంతిలేని పేదరికంలో మగ్గిపోతున్న ఎందరో దళిత బాలలను నేను చూడటం జరిగింది. డా॥ బి. ఆర్, అంబేడ్కర్ చూపిన బాటలో తరువాత ఉద్యమాలు నడపలేక పోవడంవలన ఈఅర్ధశతాబ్దిలో

గ్రామీణ దళితస్త్రీ జీవన స్థితిలో ఏమీమార్పు రాలేదనేది స్పష్టపడింది. డా॥ బి. ఆర్. అంబేడ్కర్‌ను ఆరాధించటంమీద చూపిన శ్రద్ధను ఆతరువాత మహారాష్ట్ర దళిత ఉద్యమాలు దళితస్త్రీ విముక్తి పోరాటాల్లో చూపలేక పోయారు.

కర్నాటక దళిత సంఘర్షణ సమితి ఆహ్వానం మేరకు 1986 నుండి కర్నాటక రాష్ట్రానికి పెక్కుసార్లు వెల్లడం జరిగింది. కోలార్ చింతామణి, హాసన్ ప్రాంతాలను పర్యటించడం జరిగింది. అక్కడ దళితస్త్రీ పరిస్థితి మరీ దయనీయంగావుంది. అతితక్కువ కూలితో దుర్భరదారిద్యంతో వారు మ్రగ్గిపోతు జీవిస్తున్నారు. బసవడు నడిపిన వీరశైవ ఉద్యమం కుల ఉద్యమంగా మారడంతో లింగాయతులే అక్కడ దళితులమీద దాడులు చేయడం ఒక చారిత్రిక పరిణామం.

తమిళనాడులో అనేక ప్రాంతాల్లో పర్యటించే సందర్భంలో దళిత స్త్రీల పరిస్థితి సమీక్షించడం జరిగింది. దళితస్త్రీలు ఎంతో దయనీయమైన పరిస్థితుల్లో వున్నారు. అతితక్కువకూలికి రోజంతా పనిచేసే ఈ స్త్రీలకు కట్టుకోవడానికి ఒంటినిండా గుడ్డలుకూడాలేవు. పిల్లలు దిగంబరంగా తల్లి రొమ్మున నాలుగు బొట్టుల పాలకోసం యుద్ధంచేయడం కనిపించింది. ఇ. వి. పెరియర్ ఉద్యమం బలంగా నడిచిన తమిళనాడులో పెరియార్ స్ఫూర్తితో వచ్చిన పార్టీలు ఆయన సిద్ధాంతాల దారిలో నడవలేక పోయాయి. కీలన్ వేల్మణి వంటి గ్రామాల్లో దళితులపై జరిగిన మారణ హోమం మనం మరచిపోలేము.

హిందూ సంస్కృతి అరాచకానికి కంచుకోట రాజస్థాన్‌లో 1987లో స్వామి అగ్నివేష్ జరిపిన ఒక సదస్సుకు హాజరయ్యాను. రాజస్థాన్‌లో వున్న దళితస్త్రీ రాచరిక వ్యవస్థ కాలంనాటి రథచక్రాలక్రింద నలిగిన శకలాలను మనకు తలపింప చేస్తుంది. కులాధిపత్యం,మత దురహంకార, సతీ సహగమన మానవ హననం ఇంకా కొనసాగుతున్న రాజస్థాన్‌లో దళితస్త్రీ అంటరాని తనంతో మగ్గుతూవుంది. హిందూదేవాలయాలు తమ నిజస్వరూపాన్ని నిరాఘాటంగా రాజస్థాన్‌లో కొనసాగిస్తున్నాయి. మహాత్మ గాంధీ బూటకపు దేవాలయ ప్రవేశ ఉద్యమంకూడా ఇక్కడకు జేరినట్లులేదు. అగ్రవర్ణ స్త్రీకూడ దళితురాలేఅనే చారిత్రిక సత్యం పితృస్వామిక పెత్తనం క్రింద అణగారుతున్న ఇక్కడ అగ్రవర్ణస్త్రీల స్థితిగతులు రుజువు చేస్తున్నాయి.

సుమారు వెయ్యి సంవత్సరాలుపైగా దళిత జాతులపై అనార్యులు చేసిన యుద్ధపు దాడుల్లో ప్రవహించిన రక్తపుటేరులు గంగా, యమున, సరస్వతి నదుల త్రివేణి సంగమంగా పేర్కొనబడుతున్నాయి. ఈ గంగా యమున మధ్యప్రదేశంలో జీవిస్తున్న దళితస్త్రీ హిందూ సమ్రాజ్యవాద కర్కశత్వానికి గుర్తుగా మనకు కనిపిస్తుంది. బీహార్‌లో అగ్రకుల నర హంతకులు సాయుధ దండులుగా గ్రామాల మీదబడి తరచుగా చేస్తున్న దాడులను ఇటీవల బీహార్ దళితులు త్రిప్పి కొడుతున్నారు. ఈ పోరాల్లో దళితస్త్రీల పాత్రకూడా గణనీయంగా వుంది.

హిందూ సంస్కరణ వాదాలు అన్నీ వీగిపోయి హిందూ అగ్రకుల తత్వమే ఇంకా పశ్చిమబెంగాల్లో రాజ్యమేలు తుందనడానికి నాలుకచాపి నిలబడిన కలకత్తా కాళికాదేవి గుర్తు. కలకత్తాలో 1986 లో జరిగిన ఒక సదస్సులో పశ్చిమబెంగాల్లో దళితస్త్రీ ఆర్థికంగా, సాంఘికంగా ఎంతో అణగారివుందని దోభీఛటర్జీ నివేదించింది. మార్క్సిస్టుపార్టీ పరిపాలనలో కూడా దళితస్త్రీ సామాజిక స్థితి మార్పులేదంటే దళితుల సాంఘిక, ఆర్థిక అంశాలు సమతుల్యంగా చూడటంలో మార్క్సిస్టుల సిద్ధాంతపైఫల్యం మనకు అవగతమవుతుంది.

ఈనాడు మద్రాసు మహానగరంలో ఆంధ్రా దళితస్త్రీలు ఎక్కువ మంది ఊడ్చేవారుగా, పాకీవారుగా పనిచేస్తున్నారు. మద్రాసు ప్రజల శారీరక ఆరోగ్యమంతా వీరిశ్రమ శక్తిపైనే ఆధారపడి ఉంది. కాని ఈ దళితస్త్రీలు నేడు మద్రాసు లో అత్యంత హీనంగా చూడబడుతున్నారు. దుర్భరమైన మురికికూపాల మధ్యన అత్యంత దారిద్ర్యంలో వీరు బ్రతుకుతున్నారు.

ఢిల్లీలో ముసిరే ఈగల మధ్యన భయంకర రోగాలకు కారణమయ్యే దోమలమధ్యన అపరిశుభ్రమైన వీధుల్లో నివసిస్తున్న దళితస్త్రీల దయనీయమైన పరిస్థితిని చూశాను. ఉత్తరప్రదేశ్ నుండి, హర్యానానుండి ఢిల్లీకి వలస వచ్చిన దళితస్త్రీలు కాంట్రాక్టర్ల వద్ద అతితక్కువ కూలికి పనిచేస్తూ, వారి ఏజంట్ల దోపిడికి గురౌతూ కనీసవిద్యా వైద్య సౌకర్యాలు లేక అలమటిస్తున్నారు. ఉత్తరప్రదేశ్, హర్యానాలకు చెందిన బనియాలు (వ్యాపారస్తులు), పంజాబ్ సేట్‌లు మొత్తం ఢిల్లీపై పట్టు సంపాదించు కొని దళితస్త్రీలను మరింత అణగ ద్రొక్కుతున్నారు. ధనస్వాములు

నగరపునడిబొడ్డున నివసిస్తుంటే దేశంలోని అనేక గ్రామాల్లోని "అంట రాని" దళితులవలెనే ఇక్కడ దళితులు కూడ నగరపు చీకటి కోణాల మారుమూలల్లోకి విసిరి వేయబడ్డారు.

ఈదేశంలో జీవితానికి సంబంధించిన ఆర్థిక, రాజకీయ, సాంఘిక కోణాలన్నింటిలోను దళితస్త్రీలు దోపిడీకి బానిసత్వానికి గురౌతున్నారు. వీరి కనీస వేతనం 13 రూ. అని ప్రభుత్వం నిర్ణయించినప్పటికి, దళిత స్త్రీల రక్తాన్ని, స్వేదాన్ని జుర్రుకొంటున్న భూస్వాములు వారి శ్రమకు 5రు. లే ఇస్తున్నారు. ఆవిధంగా రోజుకొక్కరిపై 8రు లు. ఆదాచేసు కొంటున్నారు. ఇలా రోజుకు 8రు.లు చొప్పున సంవత్సరానికి 2,920 రులు ఆమెకు ఈ భూస్వామి బాకీపడుతున్నాడు. ఈవిధంగా కనీస వేతనాన్ని చెల్లించకుండా భూస్వాములు దళితస్త్రీలకు బాకీపడుతున్న మొత్తాన్ని మనం లెక్కవేస్తే ఆమొత్తం సామ్రాజ్యవాద శక్తులకు భారతదేశం ఇవ్వవలసినఅప్పు కంటె ఎక్కువవుతుంది. ఈ అంతర్గత విదేశీఅప్పులన్నీ వ్యక్తిగత ఆస్తిగా మారిధనవంతుల ఇనప్పెట్టెల్లోకి చేరుతున్నాయి. ఈ విధంగా భూస్వాములు చెల్లించవలసిన అంతర్గతఅప్పు దళితస్త్రీలను సూటిగా దెబ్బతీస్తుంటే ఈ ధనవంతులను మరింత సంపన్నం చేసే విదేశీ అప్పు దళితస్త్రీలను వెనుకనుండి దెబ్బతీస్తుంది, (ఉదాహరణకు పెట్రోలుధర పెరగగానే అన్నిరకాల ఆహారధాన్యాల ధరలు పెరగడం) ఈ అప్పులన్నీ చివరకు దళితస్త్రీల జీవనప్రమాణాల్నే దిగజారుస్తు న్నాయి. కనుక ఈవ్యక్తిగత ఆస్తిమూలాన్ని, వ్యక్తిగత ఆస్తిని బలప రుస్తున్న సాంఘికవిచక్షణకు రూపుమాపే ఉద్యమంగా మారినప్పుడే దళితస్త్రీల ఉద్యమం దళితులను విముక్తి చేయగలదు.

తమ ప్రాణాలు పోకుండా కాపాడుకోవడానికి శరీరాన్ని అమ్ము కొంటున్న దళితస్త్రీలను చూస్తుంటే, పేదరికం వారి జీవితంపైన బిగిం చిన ఇనుపపిడికిలే ఇందుకు కారణమన్న విషయం మరింత స్పష్టమౌ తుంది. 'పవిత్ర' గంగాజలాలు ప్రవహిస్తున్న ఈ దేశంలో దళితస్త్రీలకు వాడకానికి 'మురికి' నీరేలభిస్తుంది. పారిశ్రామిక మురికివాడల్లో నివసిస్తున్న దళితస్త్రీల పరిస్థితిమరెంత దారుణంగా ఉంది. ఆపరిశ్రమలు "లాకౌట్" ప్రకటించి మూసివేసినప్పుడు ఆ దళిత తల్లులు 'జీవనానికై చేసే పోరాటాన్ని' ఏ భాషలోను వర్ణించలేము.

దేశంలో అనేక పారిశ్రామిక మురికి వాడలున్నాయి. సిగరెట్లు బీడీలు స్త్రీలే తయారుచేస్తారు. ఈపరిశ్రమల్లో రోజుకు 16గం॥లు పనిచేసి నప్పటికీ ఆస్త్రీలకులభించేది వెన్నునొప్పి, నడుంనొప్పి మాత్రమే.కనీసం ఒళ్ళు కప్పుకోవడానికి చాలినంతగుడ్డ కూడా వారికిలేదు. పొగాకు కంపెనీలు క్రొత్తయంత్రాలను దిగుమతి చేసుకొని వేలాది స్త్రీ కార్మికులను రోడ్డుకునెట్టాయి. కేవలం 3రు లు కూలికోసం వారు ఎంతో దూరం రైళ్ళలో ప్రయాణిస్తారు. అనేకసార్లు ఆడబ్బులుకూడా 'టికెట్టుకలెక్టరు'కు లంచమిచ్చి తిరిగి వట్టిచేతులతో ఇల్లుచేరి రోదిస్తున్న చంటిబిడ్డలను లాలించి నిద్రబుచ్చుతారు.

భారతదేశంలో సంస్కరణ ఉద్యమం మధ్యతరగతి ప్రజలను దాటిశ్రామిక స్త్రీలను చేరలేకపోయింది. చివరకు కమ్యూనిష్టులు కూడా వారి సమస్యల తీవ్రతను అర్థం చేసుకోలేకపోయారు.

దళితులపై జరుగుతున్న అత్యాచారాలను, దోపిడీని ఎదిరించడానికి దళితమహిళలు ముందు భాగాన నిలిచి సింహగర్జన చేయడానికి కారంచేడు సంఘటన నాంది అయ్యింది. తరతరాలుగా అక్కడి దళితుల శ్రమశక్తిని దోచి పంటనంతా అనుభవించి బలిసిన భూస్వాములు కత్తులు, గొడ్డళ్ళు బరిశెలతో దాడిచేసి తల్లులను, బిడ్డలను, భార్యాభర్తలను క్రూరంగా చంపారు. "నీతల్లిలాంటిదాన్నని" ప్రాధేయపడిన స్త్రీలపై భూస్వాములు అత్యాచారంజరిపారు. కులాధిపత్యదాడికి ఎదురుతిరిగిన ఆస్త్రీలనుండే ఈనాడు'దళితవిముక్తి'కై మహోన్నతమైన ఉద్యమం జనించింది. భర్తలశవాలను ఒడిలోపెట్టుకొని ప్రభుత్వం చేయబోయిన ఆర్థికసహాయాన్ని తిరస్కరించిన ఆదళిత తల్లుల త్యాగపూరిత ఆత్మగౌరవమే దళిత ఉద్యమానికి పునాది అయ్యింది.

ఇటువంటి సంఘటనలెన్నో దళితస్త్రీల చైతన్యాన్ని, సంఘటిత శక్తిని రుజువుచేశాయి. 1987, జులై 15న నీరుకొండ దళితులపై దాడి జరిగిన తరువాత అక్కడి దళితస్త్రీలు పోలీసులపై పోరాటం చేశారు. కొల్లిపర ఉద్యమ సమయంలో దళితోద్యమ నాయకులను అరెస్టుచేసి తెనాలి పోలీస్టేషనుకు తీసుకువెళ్ళినపుడు అక్కడిస్త్రీలు కొల్లిపర నుండి శివలూరుకుఊరేగింపు జరిపి దళితనాయకులను విడిపించుకున్నారు.

1985, అక్టోబరు 6న జాతీయభద్రతా చట్టం(నాసా) క్రింద దళిత నాయకులను అరెస్టుచేసినపుడు, దళితస్త్రీలు ముఖ్యమంత్రి ఇంటిముందు ధర్నా జరిపి తమనాయకులను విడిపించుకొన్నారు.

విశాఖపట్నం జిల్లాలోని కొత్తకోటలో భూస్వాములు దళితవాడలో ఒక పెళ్ళిపందిరిపై దాడిచేసి దళితస్త్రీని అమానుషంగా హింసించి ఎదురు తిరిగిన దళితులను కొట్టిన సంఘటనపై నడిచిన దళితఉద్యమంలో స్త్రీలు ప్రముఖ పాత్రనిర్వహించారు.

టంగుటూరులో భూస్వామి దళితయువతిపై అత్యాచారంచేసి కాల్చి చంపినపుడు అక్కడి స్త్రీలు బిడ్డలను చంకనేసుకొని ఉద్యమించి సామాజిక విప్లవశక్తికే ఒక సంకేతకంగా నిలిచారు.

ప॥గో॥జిల్లాలోని పిప్పరలో భూస్వాములకు వ్యతిరేకంగా నడచిన దళితఉద్యమంలో స్త్రీలు ప్రధాన పాత్ర వహించారు. స్త్రీల ఆత్మగౌరవమే ఈ పోరాటాన్ని నిర్వహించింది.

చుండూరు మారణకాండకు వ్యతిరేకంగా చుండూరుస్త్రీలు చేసిన పోరాటం చారిత్రాత్మకమైనది. పోరాటంలోని ప్రతి అడుగులోను స్త్రీలే ముందుండి ఈ పోరాటాన్ని నిర్వహించారు. ముఖ్యమంత్రిని బాయ్‌కాట్ చేసి, ఢిల్లీలో ప్రధానమంత్రిని నిలవేసేవరకు పోరాటాన్ని నిర్వహించి దళితస్త్రీలు విజయాన్ని సాధించారు.

దేశంలోని దళితస్త్రీలందరు ఉద్యమిస్తే వారిబిడ్డలు, భర్తలువారికి సంఘీభావంతో నిలిస్తే దళితవిముక్తిపోరాటం తనలక్ష్యాన్ని తప్పక అందుకొంటుంది.

భారతసమాజంలో అత్యధికపీడనకు, అణచివేతకు గురైన అత్యధిక శ్రామికవర్గం దళితమహిళలు కాబట్టి, దళితమహిళలే ఈ దళితవిముక్తి పోరాటాన్ని ముందుకు తీసుకువెళ్ళగలరు. విజయవంతం చేయగలరు.

## ఈ గ్రంధరచనకు పరిశోధించిన ముఖ్యమైన గ్రంథాలు


1. THE MOTHERS – I – II – III
   A studay of the origins of
   Settlements and institutions

   ROBERT BRIFFAULT
   London : George Allen & Unurin LT3,
   Ruskin house, 40 Masuem Streat, W.C.I.
   New y rk : The macmillan company. 1952

2. INDIAN WOMEN
   THROUGH THE AGES
   P. THOMAS
   Asia publishing house – 1964

3. ANCIENT SOCIETY
   Lewis henry morgan
   K. P. Bagchi & Company
   286 B B Ganguli streat, Calcutta 700 012 - 1982

4. WOMAN IN ANCIENT INDIA
   Moral and Litarary studies
   CLARISSE BAOER
   The chowkhamba sanskrit series office
   Post box - 8 Varanasi-I (India) Phone : 3145, 1964

5. THE CULTURE AND CIVILISATION OF ANCIENT INDIA
   D.D. Kosambi
   Vikas publishing house Pvt. Ltd. - 1977

6. D. D. KOSAMBI ON HISTORY AND SOCIETY : Problems of interpretation Department of history of bombay Publication edited by A. J. Syed.

7. LOKAYATA
   Devi prasad chatopadhaya

8. CASTES AND TRIBES
Of
SOUTHERN INDIA — I to VII Volumes
Edgar thurston
K. Rangachari
Asian Educational services — 1987

9. WOMEN IN THE VEDIC AGE
Sakuntala Rao Sastry

10. AN INTRODUCTION
TO
THE STUDY OF INDIAN
HISTORY
Damodar dharmanand kosambi
Popular prakashan Bombay — 1975

11. Marriage and family in India (1966)
K. M. Kapadia

12. An Introduction to Indian philosophy(1986)
by satish chandra chetterjee
Dhirendra Mohan datta

13. Studies in jainism and Budhism in Mithila
by upendra thakur

14. 'Hindu Ethos and the Challenge of change,
(1972)
Subhaya Dasgapta

15. A HISTORY OF INDIA Volume I (1978)
Romila Thapar

16. BUDDHISM
Sir. M Monier - Williams K.C.I.E.,
Chaukamba Amarbharati prakashan

17. THE CULTURAL HERITAGE OF INDIA
Volume I to v (1975)

18. THE BUDDHA AND HIS DHAMMA
B.R. Ambedkar
Siddharth publication (1974)

19. WOMAN IN INDIA
Mary frances Billington
Amarko Book Agency (1973)

20. MIRROR OF THE YEAR
Sir Ramaswami Mudaliar
Dravidar kazhagam (1927)

21. STATUS OF RURAL WOMEN IN INDIA
Mumtaz ali khan
Noor ayesha
Uppal publishing house (1982)

22. A HISTORY OF INDIA
Romila thapar
Penguine books (1986)

23. INDIAN WOMEN
Prithvi nath tikoo
B.R. Publishing corporation (1985)

24. VIOLENCE AGAINST WOMEN
Gail omvedt (1990)

25. WHAT IS HISTORY
E. H. Carr
Penguine books (1961)

26. THE SEARCH OF ANSWER
Indian womens voices
from Manushi
zed books Ltd (1983)

27. WOMEN IN COLONIAL INDIA

1989

# తెలుగులో ముఖ్యమైన గ్రంథాలు

1. ఋగ్వేద సంహిత
2. ఋగ్వేద ఆర్యులు
3. అథర్వణ వేదం
4. పరాశర స్మృతి
5. మనుస్మృతి
6. గౌతమ ధర్మ సూత్రాలు
7. కౌటిల్యుని అర్థశాస్త్రం
8. సంస్కృతాంధ్ర నిఘంటువులు
9. అప్పకవీయం
10. లింగాభట్టీయం
11. వాత్స్యాయనుని కామసూత్రాలు
12. సంస్కృత వాఙ్మయ చరిత్ర
13. ప్రతాపరుద్ర యశోభూషణం
14. కావ్యాలంకార సంగ్రహం
15. భర్తృహరి సుభాషితాలు
16. కాదంబరి (సంస్కృత గద్యకావ్యం) బాణభట్టు
17. శాకుంతలం (సంస్కృత నాటకం) కాళిదాసు
18. మనుచరిత్ర — అల్లసాని పెద్దన
19. వసుచరిత్ర — భట్టుమూర్తి రామభూషణుడు
20. ఆముక్తమాల్యద — శ్రీకృష్ణ దేవరాయలు
21. విజ్ఞాన సర్వస్వాలు

    **1** నుండి **10** భాగాలు
22. సంస్కృతాంధ్ర పదార్ణవము

    –వికాల శేషాచార్యులు
23. ఆంధ్ర సంస్కృత కోశము

    –పుల్లెల శ్రీరామ చంద్రుడు

    –శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

24. పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు
-తాపీ ధర్మారావు

25. ప్రాచీన భారతదేశంలో ప్రగతి సాంప్రదాయ చరిత్ర
-యస్. జి. సర్దేశాయ్

26. శాస్త్రదాస్యం -కొప్పవరపు సుబ్బారావు

27. శ్రీమదాంధ్ర మహాభారతం

28. శ్రీమదాంధ్ర మహాభాగవతం

29. శృంగార నైషధం

30. వేణుగోపాల శతకం

31. మదన గోపాల శతకం

32. రాహుల్ సాంకృత్యాయన్ రచనలు

33. చరిత్రలో మత తత్వం

34. చరిత్రంటే ఏమిటి?

తెలుగు గ్రంథాలు మూడు వందలకుపైగా చూడడం జరిగింది. వాటి పేర్లన్ని ఇవ్వడం కష్టమౌతుంది. ప్రధానంగా మహాత్మాఫూలే, డా॥ బి.ఆర్.అంబేద్కర్, పెరియార్, వేమన, కందుకూరి వీరేశలింగం, గురజాడ, జాషువా, తాపీ ధర్మరావు, చలం, రంగనాయకమ్మ వీరి గ్రంథాల్లోని దృక్పధం గ్రంథ రచనకు ఎంతో ఉపకరించింది. తెలంగాణా పోరాటానికి సుందరయ్యగారి, దేవులపల్లి గారి, రావి నారాయణరెడ్డిగారి గ్రంథాలు బాగావుపకరించాయి. గిరిజన దళిత పోరాటాలను సమకాలీన ఉద్యమం అనుభము నుండే ఎక్కువవ్రాయడం జరిగింది.

# ఈ రచయిత ఇతరగ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | కులం పునాదులు | (1981) | | తృతీయముద్రణలో |
| 2. | జనగీతం | (1979) | | తృతీయముద్రణలో |
| 3. | హేతువాద సత్యాలు | (1980) | | ద్వితీయముద్రణలో |
| 4. | సాంఘిక విప్లవ రచయితలు | (1983) | | కాపీలులేవు |
| 5. | కులసంఘర్షణలు | (1983) | | **2-00** |
| 6. | Women and Caste In India | (1983) | | 3-00 |
| 7. | జైలుగంటలు | (1986) | | **4-00** |
| 8. | దేశండైరి | (1987) | కాపీలు లేవు | **10-00** |
| 9. | సాంఘిక విప్లవ మూర్తి డా॥ బి.ఆర్. అంబేడ్కర్ | (1990) | | **12-00** |
| 10. | రిజర్వేషన్లు - హిందూమతోన్మాదం | (199 ) | | **8-00** |
| 11. | Social and Philosophical Movements In India | (1991) | | 2-00 |
| 12. | Dalit Women | (1991) | | 3-00 |
| 13. | దళితుల చరిత్ర | (1991) | | **8-00** |
| 14. | చార్వాక దర్శనం | (1991) | | **15-00** |
| 15. | విముక్తిగీతం | (ద్వితీయముద్రణ) (1987) | | **3-00** |
| 16. | రక్తక్షేత్రం | (1992) | | **2-00** |
| 17. | భారతీయ సంస్కృతిలో స్త్రీ | (1993) | | |
| 18. | కుల నిర్మూలనా సిద్ధాంతం | (1993) | | ముద్రణలో |